*PARADA (Telugu)*

# పరదా

మూలం

**మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూదీ (రహ్మ్లై)**

తెలుగురూపం

**యం.డి. ఉస్మాన్‌ఖాన్**

# విషయసూచిక

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# ముందుమాట

'పరదా' అంశంపై నాలుగేళ్ళ క్రితం నేను వ్యాస రచనా పరంపర సాగించాను. ఆ వ్యాసాలు 'తర్జుమానుల్ ఖుర్ఆన్' పత్రికలో ధారావాహికంగా ప్రచురితమయ్యాయి. కాని ఆ వ్యాస పరంపరలో కొన్ని అంశాలను ఉద్దేశపూర్వకంగా ప్రస్తావించలేదు. మరికొన్ని అంశాలను వదిలి వేయవలసి వచ్చింది. ఎందుకంటే అప్పుడు దీనిని ఒక పుస్తకంగా కాకుండా కేవలం వ్యాసాలుగా ఇవ్వడమే ఉద్దేశ్యంగా ఉండింది. ఇప్పుడు వాటన్నింటినీ సంకలనం చేసి అవసరమైన మరింత సమాచారంతోపాటు తగు వ్యాఖ్యానంతో దీనికి ఒక పుస్తక రూపమివ్వడం జరిగింది. అయినప్పటికీ **'పరదా'** అంశంపై ఇదే పరిపూర్ణమైన పుస్తకమని చెప్పలేము. అయితే ఈ అంశాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకోదలిచినవారికి ఇది చాలావరకు సంతృప్తికరమైన సమాచారాన్నిస్తుంది. 'వబిల్లాహి తౌఫీఖ్- వహువముస్తఆన్'

22 ముహర్రమ్-హిజ్రీ 1359

**అబుల్ ఆలా**

కరుణామయుడైన అల్లాహ్ పేరుతో

# నా మాట

మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మాలై) ఉర్దూలో రాసిన ప్రఖ్యాత పుస్తకం 'పరదా'కు ఇది తెలుగు రూపం. మౌలానా రాసిన పరదా పుస్తకం ఉర్దూ భాషలో 1939వ సంవత్సరంలో ప్రచురించబడింది. అప్పటి నుంచి ఈ పుస్తకం అనేకసార్లు పునర్ముద్రణకు నోచుకుని భారత ఉపఖండంలో అసంఖ్యాక మందిని ప్రభావితం చేసింది. ఆలోచించేలా, అర్థం చేసుకునేలా ప్రేరేపించింది. సామాజిక జీవితంలో స్త్రీపురుష సంబంధాల స్వభావాన్ని అవగతం చేసుకోడానికి ఉపకరించింది.

పాశ్చాత్య దేశాల్లో ప్రస్తుతం ఉన్న సామాజిక వ్యవస్థలోని లోపాలు, వాటివల్ల జనించే అసంఖ్యాక సమస్యలను అర్థం చేసుకోడానికి ఈ పుస్తకం తోడ్పడుతుంది. మానవ నాగరికతకు లోపభూయిష్టమైన వ్యవస్థ వల్ల వాటిల్లే అనేక అనర్థాలను ఈ పుస్తకం చాటి చెప్పింది. ముఖ్యమైన విషయమేమిటంటే, కుటుంబ జీవితంలో దైవాభీష్టం, దేవుని ఆదేశాల పాలన పునాదిగా ప్రకృతి సూత్రాలు నియమాలకు అనుగుణమైన వ్యవస్థ మాత్రమే మానవ నాగరికతకు అనుగుణ మైనదని తెలియ జేస్తుంది. శాస్త్రీయ ఆధారాలు, పరిశీలనల నేపథ్యంలో మనిషికి కావలసిన సామాజిక వ్యవస్థను స్వయంగా మనిషి రూపొందించుకోవడం సాధ్యమయ్యే పనికాదు. మనిషికి ఉన్న సహజసిద్ధమైన బలహీనతల కారణంగా తనకు లాభ దాయకమైన వ్యవస్థను మనిషి స్వయంగా నిర్మించుకోలేడు. ఈ విషయంలో మనిషికి దేవుని మార్గదర్శకం ఎంతైనా అవసరం. దైవిక మార్గదర్శనం ద్వారా మాత్రమే మనిషి తన జీవితంలోని సమస్యలను పరిష్కరించుకునే అవకాశం ఉంది.

పరదా పుస్తకం ద్వారా ఇస్లామీయ సామాజిక వ్యవస్థ రూపం స్పష్టంగా పాఠకుల ముందుకు వస్తుంది. ఈ సామాజిక వ్యవస్థ మానవ ప్రవృత్తికి, నైజానికి, ప్రకృతి నియమాలకు అనుగుణమైనది. స్వయంగా దైవం మనిషి కోసం ఎంపిక చేసిన వ్యవస్థ ఇది. మనిషి తన నైజానికి విరుద్ధంగా భూమిపై బతకడం సాధ్యం

కాదు. మానవనైజానికి అనుగుణమైన పద్ధతిలోనే సామాజిక వ్యవస్థను ఏర్పాటు చేసుకోవలసి ఉంది.

మీ చేతుల్లో ఉన్న ఈ పుస్తకం ఈ అంశాలన్నింటితోపాటు పరదా వ్యవస్థకు సంబంధించిన సమస్త విషయాలనూ చర్చించింది. సామాజిక జీవితంలో పరదా ఆవశ్యకతను నొక్కిచెప్పింది. స్త్రీల హక్కులు, రక్షణకు సంబంధించి ధార్మిక ధృక్కోణాన్ని ఆవిష్కరించింది. వివిధ పాశ్చాత్య దేశాల్లోని స్త్రీల స్థితిగతుల్ని, వెర్రితలలు వేస్తున్న అక్కడి అశ్లీలత, విశృంఖలత, దానికి దారితీసిన కారణాలు, దానివల్ల జరిగిన, జరుగుతున్న అనర్థాలను కూలంకషంగా మనముందుంచింది. వివిధ జాతులు, మతధర్మాలు స్త్రీలను ఎలా చిత్రించాయో, ఆయా మత ధర్మాలు స్త్రీలకు ఏపాటి గౌరవ మర్యాదల్ని ప్రసాదించాయో స్త్రీ ఏవిధంగా వినిమయ వస్తువుగా చూడబడిందో సోదాహరణంగా వివరించింది. ప్రఖ్యాత తత్వవేత్త మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూది(ర) ఏడు దశాబ్దా లకు పూర్వం రచించిన ఆణిముత్యం లాంటి ఈ పుస్తకం పాశ్చాత్య సమాజంలో స్త్రీ జాతి చిత్రపటాన్ని కళ్ళకు కట్టింది. ఇస్లాం మహిళా లోకానికి ప్రసాదించిన విలువను, గౌరవాన్ని సాధికారికంగా, ప్రామాణికంగా ప్రపంచం ముందుంచింది. పరదాను గుడ్డిగా వ్యతిరేకించే వారికి అసలు పరదా అంటే ఏమిటో, అది ఎందుకు అవసరమో, దానివల్ల ఒనగూడే సామాజిక ప్రయోజనాలేమిటో ఆధారాలతో సహా నిరూపించింది. ఎట్టిపరిస్థితిలోనూ పరదా ప్రగతికి అవరోధం కాదన్న నగ్నసత్యాన్ని కుండబద్దలు కొట్టింది. సంకుచితత్వానికి, రాగద్వేషాలకు అతీతంగా, మనస్సాక్షిగా ఈ పుస్తకం అధ్యయనం చేసిన వారికెవరికైనా ఈ విషయం తెలుస్తుంది. కళ్ళుండీ చూడలేని, చెవులుండీ వినలేని, మనసుండీ ఆలోచించలేని పిడివాదులకు, హేతుబద్ధతను, తర్కాన్ని, ధర్మాన్ని కాదనే వారికి ఎవరు ఎన్ని చెప్పినా ప్రయోజనం ఉండదు. కనుక విశాల హృదయంతో ఈ పుస్తకాన్ని అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది. మౌలానా దీన్ని ఏడు దశాబ్దాలకు పూర్వం రాసినా, అది ఈనాటి సమాజానికీ ఎంతైనా అవసరమనడంలో ఎంత మాత్రం సందేహంలేదు.

ఇక దీని అనువాదం విషయానికొస్తే- దీన్ని నేను సాధ్యమైనంత మేరకు తెలుగుదనం ఉట్టిపడే విధంగా మలచడానికి ప్రయత్నించాను. మక్కీకి మక్కీకాకుండా స్వేచ్ఛానువాద ప్రక్రియను అవలంభించాను. కొన్నిచోట్ల నాటి అవసరాలను, ఆనాటి నేపథ్యాన్ని దృష్టిలో ఉంచుకొని మౌలానా సుదీర్ఘ వివరణలు ఇచ్చినచోట, మూలానికి, భావానికి అణుమాత్రమైనా హాని కలగకుండా సంక్షిప్తీక రించడానికి ప్రయత్నించాను. తెలియని విషయాలను తెలిసిన పెద్దల వద్ద అడిగి తెలుసుకుంటూ అనువాద ప్రక్రియను కొనసాగించాను. సాధ్యమైనంత వరకు నేటి మన వాడుక భాషకు, భావానికి అనుగుణంగా ఉండాలని తాపత్రయ పడ్డాను. ఈ ప్రయత్నం ఎంతవరకు సఫలమయ్యిందో పాఠకులే చెప్పాలి. ఈ కృషి సత్ఫలితాలనివ్వాలని, సత్సమాజ నిర్మాణంలో ఇతోధిక సహాయకారి కావా లని దైవాన్ని వేడుకుంటున్నాను. ప్రచురణకర్తలకు, టిప్ సిబ్బందికి దైవం ఉత్తమ ప్రతిఫలాన్ని ప్రసాదించాలని మనసారా ప్రార్థిస్తున్నాను. ఈ ప్రక్రియలో తోడ్పాటునందించిన ప్రతి ఒక్కరికీ ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఈ పుస్తకానికి సంబంధించి పాఠకులు తమ అభిప్రాయాలను, సూచనలు, సలహాలను మంచి మనసుతో తెలియజేస్తారని, ఏమైనా లోటుపాట్లు జరిగి ఉంటే మలి ముద్రణలో సరిచేసుకోగలమని విన్నవిస్తూ, దైవం అందరికీ సన్మార్గ భాగ్యం ప్రసాదించాలని వినమ్రంగా వేడుకుంటూ...

మీ

**ముహమ్మద్ ఉస్మాన్‌ఖాన్**

9912580645

05-10-2012

జగన్నాథపురం

అనంత కరుణామయుడు, అపార దయాసాగరుడైన అల్లాహ్ పేరుతో..

## ఒకటవ అధ్యాయం

# ప్రధాన సమస్య

మానవ నాగరికతకు అత్యంత ప్రధానమైనటువంటి చిక్కు సమస్యలు రెండున్నాయి. వీటి సమగ్ర పరిష్కారం పైనే మానవుల సాఫల్యం, ప్రగతీ వికాసాలు ఆధారపడి ఉన్నాయి. అనాదిగా ప్రపంచంలోని పాలకులు, మేధావులందరూ ఈ సమస్యల పరిష్కారానికి విఫలయత్నాలు చేస్తూనే ఉన్నారు. సాంఘిక జీవితంలో స్త్రీ పురుషుల సంబంధాన్ని నెలకొల్పడమెలా? అన్నది మొదటి సమస్య. ఎందుకంటే, నిజానికి ఈ సంబంధమే మానవ నాగరికతకు పునాదిరాయి. పునాది సవ్యంగా ఉంటేనే నిర్మాణం పటిష్టంగా ఉంటుంది. అందులో డొల్లతనం ఏర్పడితే నిర్మాణం లోపభూయిష్టంగా ఉంటుందనడంలో సందేహం లేదు.

రెండవ సమస్య-వ్యక్తికి, సంఘానికి మధ్యఉండే సంబంధం' ఈ పరస్పర బాంధవ్యంలో ఏమాత్రం సమతూకం లోపించినా మానవ సమాజం శతాబ్దాల తరబడి దాని దుష్ఫలితాలను అనుభవించాల్సి ఉంటుంది.

ఒకవైపు ఈ రెండు సమస్యల తీవ్రత ఈ విధంగా ఉంటే, మరో వైపు వీటి చిక్కుముడి కూడా అంతే జటిలంగా ఉంది. ప్రకృతి యదార్థాలపై పరిపూర్ణ అవగాహన లేనంతవరకు వీటి పరిష్కారం అసంభవం. ఎందుకంటే మానవుడే ఒక చిన్న ప్రపంచం. అతని దేహనిర్మాణం, స్వభావ అన్వయం, శక్తి సామర్థ్యాలు, అవసరాలు కోరికలు, భావనలు, భావోద్రేకాలు, అలాగే తన ఉనికికి ఆవల ఉన్నటువంటి అసంఖ్యాక వస్తువుల పట్ల అతని కార్యాచరణ విధానం, ప్రత్యక్ష పరోక్ష సంబంధాలు -ఇవన్నీ ఒక ప్రపంచానికి ప్రపంచమే తమలో ఇముడ్చుకొని ఉన్నాయి. ఇందులోని ఒక్కొక్క అణువూ మనముందు ప్రకాశమానం కానంత వరకూ మానవుణ్ణి అర్థం చేసుకోవడం అసంభవం. మానవుణ్ని సంపూర్ణంగా, సమగ్రంగా అర్థం చేసుకోనంతవరకూ అతని జీవితంలోని మౌలిక సమస్యల పరిష్కారం కూడా సాధ్యం కాదు.

ఈ సమస్య ఈనాటిది కాదు. దీని పరిష్కారానికి జరిగే అన్ని రకాల మేధోపరమైన ప్రయత్నాలను ఇది ఆదినుంచీ అడ్డుకుంటూనే ఉంది. అసలు విషయం

ఏమిటంటే, నేటి వరకూ మానవ మేధకు అందని యదార్థాలు ప్రపంచంలో అనేకమున్నాయి. ఏ రంగంలోనూ పరిపూర్ణ విజ్ఞానం సాధించా మన్న పరిస్థితి లేదు. శాస్త్ర సాంకేతిక రంగాల్లో కొంత ప్రగతి సాధించిన మాట వాస్తవమే అయినప్పటికీ పరిపూర్ణ పరిజ్ఞానం మాత్రం పొందలేక పొయ్యాం. అంటే, విజ్ఞాన శాస్త్రంలో ఎన్ని విభాగాలైతే ఉన్నాయో, వాటన్నిటినీ అవగాహన చేసుకున్నామనిగాని, ఔపోసన పట్టామని గాని చెప్పుకునే పరిస్థితి లేదు. అంతేకాదు, ప్రకాశమానంగా, స్పష్టంగా ముందుకొచ్చిన యదార్థాలను, వాటిలోని విస్తృతిని, సూక్ష్మాలను కూడా తెలుసుకోలేని స్థితిలో మానవుడున్నాడు. ఒక కోణాన్ని తెలుసుకోగలిగాడనుకుంటే, మరో పార్శ్వం మరుగునే ఉండిపోతుంది. ఒకచోట అతడి దృష్టిలోపిస్తే, మరోచోట వ్యక్తిగత ప్రయోజనాలు అడ్డుగోడలుగా నిలుస్తున్నాయి. ఈ ద్విముఖ బలహీనతవల్ల మానవుడు తన జీవిత సమస్యలను పరిష్కరించుకోడానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఎన్ని పథకాలు రచించినా అపజయాలే ఎదురవుతున్నాయి. చివరికి ఈ ప్రయోగాలు అతని ప్రయత్నాల డొల్లతనాన్ని బహిర్గత పరుస్తున్నాయి.

దీనికి సరైన పరిష్కారం కేవలం సమస్య మూలాలను తెలుసుకోవడంపైనే ఆధారపడి ఉంది. దీన్ని తెలుసుకోవాలంటే, అన్ని విషయాల సమగ్ర స్వరూపం కాకపోయినా, కొన్ని యదార్థాలైనా పరిపూర్ణంగా తెలిసి ఉండాలి. అయితే దృశ్యం విస్తారంగా ఉండి, దృష్టి సంకుచితమైనప్పుడు, మనోవాంఛలు, ఇష్టా యిష్టాల మిశ్రమ ఉధృతి వల్ల స్పష్టంగా కనిపించే వస్తువులపై నుండి కూడా దృష్టి దానంతట అదే మరలిపోతుంది. అలాంటప్పుడు మూల బిందువును కనుగొనడం ఎలా సాధ్యం? ఇలాంటి స్థితిలో లభించే పరిష్కారంలో అనవసర గందరగోళం తప్ప మరేమీ ఉండదు. ఉంటే సంకుచితమో, లేదంటే అతిశయమో ఉంటుంది.

పైన ప్రస్తావించిన రెండు సమస్యల్లో, మొదటి సమస్య మాత్రమే ఇప్పుడు మనముందున్న చర్చనీయాంశం. చరిత్రపై దృష్టి సారించినట్లయితే, ఒక విచిత్రమైన గందరగోళ పరిస్థితి మనకు కనిపిస్తుంది. స్త్రీ తల్లిగా మనిషికి జన్మనిస్తుంది. ఇల్లాలిగా జీవితంలోని కష్ట సుఖాల్లో పాలుపంచుకుంటుంది. సహచరిగా అన్ని విషయాల్లో సహాయకారిగా నిలుస్తుంది. సేవకురాలిగా.. కాదు కాదు కట్టు బానిసగానూ చూడబడుతుంది. క్రయవిక్రయాల అంగడి సరుకుగా మారిపోతుంది. ఎటువంటి ఆస్తిహక్కులుగాని, వారసత్వ హక్కులు గాని ఆమెకు ప్రాప్తంకావు. ఆమెకు సమాజంలో సమాన అవకాశాలు గాని, ఎదిగే అవకాశాలు గాని లభించవు. పాపాలకు,

అవమానాలకు ప్రతిరూపంగా ఆమెను భావించడం జరుగుతుంది. అంతేకాదు, అదే స్త్రీని అనైతిక పద్ధతిలో ఆకాశానికెత్తడం, అందలాలెక్కించడం జరుగుతుంది. మనోవాంఛల పరిపూర్తికి ఆమెపావుగా ఉపయోగపడుతోంది. నిజానికి షైతాను ఏజెంటుగా తయారు చేయడం వల్ల, ఆమె స్వేచ్ఛా విహారంలో మానవీయ, నైతిక విలువల పతనం ప్రారంభమైంది.

ఈ రెండు రకాల అతిశయాలు మాత్రమే ఈ గందరగోళ స్థితికి కారణ మని మేము చెప్పడం లేదు, అనుభవాలు కాని వాటి దుష్ఫలితాల సమగ్ర నివేదికను మనముందుంచుతున్నాయి. అందుకే మేము నైతిక పరిభాషలో ఒక రకమైన అతివాదాన్ని సంకుచితమని, రెండవ దాన్ని అతిశయమని అంటున్నాము. మేము సూచన ప్రాయంగా చెప్పిన చారిత్రక నేపథ్యం ద్వారా తెలిసేదేమిటంటే, ఒక జాతి అనాగరికం నుండి బయటపడి నాగరికత వైపు మరలినప్పుడు ఆ సమాజంలోని స్త్రీలు పురుషులకు సేవకులుగా, బానిసలుగానే ఉంటారు. ప్రారంభంలో అనాగరిక ఛాయలు ఎక్కువగా కనిపించినప్పటికీ, నాగరిక అభివృద్ధి ఒక దశకు చేరిన తరువాత, తమలో సగ భాగమైన స్త్రీ జాతిని బానిసత్వంలో ఉంచి ప్రగతి పథంలో పయనించడం అసాధ్యమన్న భావన వారిలో కలుగుతుంది. దీంతో తమ ప్రగతిరథం వేగం పుంజుకోడానికి, సింహభాగమైన స్త్రీ జాతిని కింది వరుసనుండి ముందు వరుసకు తీసుకురావడం అనివార్యమైపోతుంది. ఈ విధంగా, స్త్రీల పట్ల ఇప్పటి వరకూ అనుసరించిన వైఖరిని సరిదిద్దుకుంటూ, లోపాల సవరణకు పూనుకున్నప్పుడు అత్యుత్సాహంతో మితిమీరి వ్యవహరించడం జరుగుతుంది. చివరికి స్త్రీ స్వేచ్ఛ మితిమీరడం వల్ల కుటుంబ వ్యవస్థ ఛిన్నాభిన్నమవుతుంది. స్త్రీ పురుషుల స్వేచ్ఛా కలయిక వల్ల అశ్లీలం సునామీలా విరుచుకుపడుతుంది. మనోవాంఛలు, భోగలాలస మొత్తం సమాజాన్ని, జాతిని నైతిక పతనం వైపు తీసుకుపోతాయి. దీంతోపాటు, శారీరక, మేధోపరమైన శక్తియుక్తులు కూడా ప్రభావితమవుతాయి. అంతిమ ఫలితం సర్వనాశనం తప్ప మరేమీ కాదు.

చారిత్రక ఆధారాలతో సోదాహరణంగా వివరించడానికి ఇక్కడ అవకాశం లేదు. కానీ, విషయ ప్రాధాన్యతను బట్టి కొన్ని ఉదాహరణలు తప్పనిసరి.

### యూనాన్

పురాతన జాతుల్లో గ్రీక్ అన్నిటికన్నా ఎక్కువ నాగరిక జాతిగా పరిగణించ బడేది. ప్రారంభ కాలంలో నైతిక పరంగా, చట్టపరమైన హక్కులు, సామాజిక

సంబంధాల పరంగా ఆ జాతిలో స్త్రీ స్థానం అధఃపాతాళంలో ఉండేది. యూనాన్ జన పథంలోని కల్పిత గాథల్లో (mythology) పాండోరా అనే ఒక ఊహాజనిత స్త్రీని సమస్త మానవుల కష్టనష్టాలకు కారణమని భావించడం జరిగేది. అంతకంటే ముందు ఈ యూద కల్పిత గాథల్లో కూడా మానవజాతి కష్టాలకు హజ్రత్ హవ్వా (అ)ను బాధ్యురాలుగా చేశారు. హజ్రత్ హవ్వా (అ) విషయంలో కల్పించిన తప్పుడు కథల ప్రచారం వల్ల స్త్రీ జాతికి సంబంధించి, యూదులు, క్రైస్తవ సమాజాలపై ఎంత బలమైన ప్రభావం పడిందో, చట్టాలు, సమాజం, నైతికత, ఇంకా అనేక రంగాలు ఎంతగా ప్రభావితమయ్యాయో అందరికీ తెలిసిన విషయమే. దాదాపు ఇలాంటి ప్రభావమే పాండోరాకు సంబధించిన కల్పిత గాథల వల్ల గ్రీకు సమాజంపై, వారి మనో మస్తిష్కాలపై కూడా పడింది. వారి దృష్టిలో స్త్రీ ఎందుకు పనికిరాని ఒక నీచమైన సృష్టి. అందుకని సమాజం లోని అన్ని రంగాల్లో ఆమె అథమ స్థాయిలోనే ఉండాలి. గౌరవప్రదమైన స్థాయి కేవలం పురుషుడికి మాత్రమే ప్రత్యేకం.

నాగరిక ప్రగతి ప్రారంభ క్రమంలో, ఈ విధానం కొద్దిపాటి మార్పులు చేర్పులతో యథాతథంగా కొనసాగింది. విద్య, నాగరికతల ప్రభావం కేవలం స్త్రీల చట్టపరమైన స్థానం యథాతథంగా ఉంచడానికి మాత్రమే పరిమితమైంది. అయితే సమాజంలో కాస్తంత ఔన్నత్యస్థాయి కల్పించబడింది. అంటే, ఆమె తన గృహంలో మహారాణి. ఆమె బాధ్యతలు ఇంటికే పరిమితం. ఆ పరిధిలో మాత్రం ఆమె సర్వస్వ తంత్రురాలు. ఆమెకు ఎంతో విలువనిస్తూ, గౌరవ దృష్టితో చూసేవారు. సాంప్రదాయ కుటుంబాల్లో పరదా ఆచారం కూడా ఉండేది. వారి కుటుంబాల్లో స్త్రీ పురుషులకు ఏర్పాట్లు వేరు వేరుగా ఉండేవి. మిశ్రమ సమావేశాల్లో వారి స్త్రీలు పాల్గొనే వారు కాదు. అందంగా అంకరించుకొని బయటికి వెళ్లేవారు కాదు. వివాహ బంధం ద్వారా ఒక పురుషునితో జీవితం పంచుకోవడాన్నే గౌరవప్రదంగా భావించేవారు. వివాహబంధానికే గౌరవం దక్కేది. వివాహం చేసుకోకుండా ఒంటరిగా ఉంటూ, నచ్చిన వాడితో గడపడం నీచంగా భావించబడేది. ఇది గ్రీకు జాతి శక్తివంతంగా ఉండి, ప్రగతి పథంలో దూసుకుపోతున్నప్పటి స్థితి. ఆ కాలంలో నైతిక రుగ్మతలు లేవనికాదు గాని, ఒక పరిమితిలోనే ఉండేవి. గ్రీకు స్త్రీలు పవిత్రంగా, పరిశుద్ధంగా నైతికతకు లోబడి ఉండాలని కోరుకునే వారు. పురుషులు మాత్రం వీటన్నిటికీ అతీతం. వారు ఎటువంటి విలువల్నీ పాటించేవారు కాదు. వారలా నైతిక విలువలకు కట్టుబడి, పరిశుద్ధ జీవితం గడుపుతారన్న ఆశలు కూడా ఎవరికీ ఉండేవి కావు.

అయితే గ్రీకు సమాజంలో వేశ్యావృత్తిలో కొనసాగే ఒక వర్గం ప్రత్యేకంగా ఉండేది. వారితో ఈ సంప్రదాయ కుటుంబాల పురుషులు సంబంధాలు సాగించే వారు. దాన్నెవరూ తప్పుగానూ భావించేవారు కాదు.

క్రమక్రమంగా గ్రీకులో విషయలోలత్వం, మనోకాంక్షల దాస్యం బలపడడం మొదలైంది. ఆ కాలంలో వేశ్యావృత్తికి మంచి ఆదరణ లభించింది. ఏ స్థాయిలో ఈ వృత్తి వృద్ధిచెందిందంటే, మానవజాతి చరిత్రలో ఎక్కడా అలాంటి ఉదాహరణ లభించదు. వేశ్యావాటికలు ఆ సమాజంలోని అట్టడుగు స్థాయి నుండి అత్యున్నత స్థాయి వ్యక్తులవరకూ కేంద్రస్థానాలుగా మారి పొయ్యాయి. గొప్ప గొప్ప మేధావులు, తత్వవేత్తలు, చరిత్రకారులు, న్యాయ నిపుణులు, కవులు, కళాకారులు, సాహితీవేత్తలు అందరూ వేశ్యాగృహాల్లో సేదతీరేవారు. వారు కేవలం సాంస్కృతిక కార్యక్రమాల్లో సెంటరాఫ్ అట్రాక్షన్‌కు మాత్రమే పరిమితమయ్యేవారు కాదు. కీలకమైన రాజకీయ నిర్ణయాలు కూడా వారి కనుసన్నలలోనే జరిగేవి. జాతి జీవన్మరణ విషయాలతో ముడిపడి ఉన్న వ్యవహారాల్లో సైతం వారు సలహాలిచ్చేవారు. ఒక వ్యక్తి సేవలో రెండు రాత్రులైనా గడిపిన స్త్రీ సలహాకు అధిక ప్రాముఖ్యత ఉండేది.

గ్రీకుల సౌందర్యారాధన వారిలో అశ్లీలతా బడబాగ్నుల్ని రగిల్చింది. వారు తమలోని ఈ సౌందర్య ప్రేమను ఏ నగ్న చిత్రాలు, ప్రతిమల ద్వారా వ్యక్తపరిచేవారో, అవే వారిలోని మనో వాంఛలను, కామోద్రేకాలను మరింత రెచ్చగొట్టేవి. ఫలితంగా వారి పరిస్థితి ఎంతగా దిగజారిందంటే, అసలు స్త్రీ వ్యామోహం, మనోవాంఛల దాస్యంలాంటివేవీ నైతికంగా తప్పు కాదన్న వరకూ వచ్చింది. వారిలోని గొప్ప గొప్ప తత్వవేత్తలు, విలువలు బోధించే పండితులు సైతం వ్యభిచారాన్ని, అశ్లీలతను ఏమంత తప్పుగా భావించకపోవడమే నైతిక విలువల పతనానికి నిలువెత్తు నిదర్శనం. సాధారణంగా యూనాన్ ప్రజలు వివాహాన్ని ఒక అనవసర తంతుగా భావించేవారు. వివాహం చేసుకోకుండానే స్త్రీ పురుషులు సహజీవనం చేయడంలో ఎలాంటి తప్పూ లేదన్నది వారి భావన. అంతేకాదు, ఈ వివాహ రహిత సహజీవన బంధాన్ని గోప్యంగా ఉంచాల్సిన అవసరం కూడా లేదనేవారు. చివరికి వారి మతం కూడా ఈ పైశాచిక కామ చేష్టలకు పచ్చజెండా ఊపింది. దీంతో కామదేవి పూజ గ్రీకు అంతటా వ్యాపించిపోయింది. ఈ విషయం వారి కల్పిత గాథల్లో ఇలా ఉంది :-'ఈమె ఒక దేవుడికి భార్యగా ఉంటూ అదనంగా మరో ముగ్గురు దేవతలకు ప్రియురాలిగా ఉంది. ఈ దేవతలు కాకుండా మరొక మానవుడు కూడా ఆమెతో

సంపర్క సుఖం అనుభవించాడు. ఈ అక్రమ సంబంధం ఫలితంగా కేక్‌పడ్ అనే ప్రేమ దేవత జన్మించాడు'. ఇక ఆలోచించండి! ఇలాంటి దేవి ఆ జాతికి దేవత. ఒకజాతి ఇలాంటి ఆదర్శాన్ని పుణికి పుచ్చుకోవడం మాత్రమే కాకుండా, ఏకంగా ఇలాంటి దేవతనే ఆరాధిస్తే దాని నైతిక పతనం ఏ స్థాయిలో ఉంటుందో ఊహిం చండి. ఇలాంటి అనైతికతా అగాధంలో పడిపోయిన ఏ జాతి అయినా మళ్లీ పైకి రావడమన్నది అసంభవం. భారత దేశంలో బామ్‌మార్గ్, ఈరాన్‌లో మజూకియత్‌లు ఇలాంటి పతన దశలోనే వెలుగులోకొచ్చాయి. బాబిలోనియాలో కూడా ఇలాంటి స్థితిలోనే వేశ్యావృత్తికి మతాదరణ లభించింది. తరువాత బాబిలోనియా పేరును ప్రపంచం పూర్వ గాథగా తప్ప మరే రకంగానూ వినలేదు. గ్రీక్‌లో కామదేవి పూజ ప్రారంభమైనప్పుడు, వేశ్యాగృహాలు ఆరాధనాలయాలుగా మారిపోయాయి. వేశ్యలు దేవదాసీలుగా నియమితులయ్యారు. వ్యభిచారం బాగా వృద్ధిచెంది పవిత్ర మతాచారంగా ప్రాచుర్యం పొందింది.

ఈ ఇంద్రియ సుఖ పరాయణతకు మరో పరాకాష్ట ఏమిటంటే, ఆ జాతిలో స్వలింగ సంపర్కం కూడా ఒక మహమ్మారిలా ప్రబలిపోయింది. వారి మతం దాన్ని కూడా స్వాగతించింది. హూమర్, హస్యూక్‌ల పాలనాకాలంలో ఈ దురాచారం మచ్చుకైనా ఉండేదికాదు, కాని నాగరికత అభివృద్ధి చెందిన తరువాత కళలు (ఆర్ట్), సౌందర్యారాధన (Asthetics) లాంటి అందమైన పేర్లతో నగ్నత్వం, అశ్లీలం, మనో వాంఛల దాస్యంలాంటి అవలక్షణాలు పురుడు పోసుకున్నాయి. దీనివల్ల కామోద్రేకాలు వెల్లువలా విజృంభించి, ప్రకృతిపరమైన సహజసిద్ధ పద్ధతిలో కోరికలు తీర్చుకోవడం వదిలేసి, ప్రకృతి విరుద్ధమైన అసహజ విధానం ద్వారా సంతృప్తి చెందాల్సిన దుస్థితి దాపురించింది. శిల్పకళా నిపుణులు ఈ అసహ్య భావోద్రేకాలను రసరమ్యంగా ప్రతిబింబించారు. మానసిక నిపుణులు, నైతిక శాస్త్రబోధకులు దీన్ని 'పటిష్టమైన స్నేహబంధం'గా అభివర్ణించారు. ఈ విధమైనటువంటి ప్రకృతి విరుద్ధమైన వికృత క్రీడకు అంకురార్పణ చేసి, అసహజ ప్రేమకు నిలువెత్తు నిదర్శనంగా నిలిచిన గ్రీక్ వాసులు హార్మోడిల్స్, ఆరిస్టో గేటన్‌ల విగ్రహాలను ప్రతిష్టించాలనుకున్నారు, వారు తమ దేశం వారు కావడం తమకెంతో గర్వకారణంగా భావించారు. అందుకే వారి విగ్రహాలను మొట్టమొదట గ్రీక్‌లోనే ప్రతిష్టించడం జరిగింది.

దీని తరువాత గ్రీక్ జాతికి జీవన చరిత్రలో మరెప్పుడూ మరో అవకాశం ప్రాప్తం కాలేదనడానికి చరిత్రే సాక్ష్యం.

## రోమ్

గ్రీక్ తరువాత అత్యంత అభివృద్ధి చెందిన జాతి రోమన్ జాతి. ఇక్కడ కూడా మనం ఇప్పటి వరకూ చెప్పుకున్న పాత కథే పునరావృతమవుతుంది. రోమన్లు అజ్ఞాన తిమిరాల నుండి ప్రకాశమాన చరిత్రవైపు వచ్చేనాటికి వారి సామాజిక వ్యవస్థలో పురుషుడు సర్వాధికారిగా ఉండేవాడు. కుటుంబ పెద్దగా భార్యాపిల్లలపై అతనికి అన్ని రకాల యాజమాన్య హక్కులు ఉండేవి. అంతేకాదు కొన్ని సందర్భాల్లో భార్యను హత్యచేసే అధికారం కూడా అతనికి ఉండేది.

కాస్తంత అజ్ఞానం తొలగి, నాగరికత వికసించడంతో రోమన్లు ముందడుగు వేశారు. కుటుంబ వ్యవస్థలో పురాతన ఆచార వ్యవహారాలు యథాతథంగా అమలవుతున్నప్పటికీ, ఆచరణాత్మకంగా ఆ కాఠిన్యం కాస్త తగ్గుముఖం పట్టింది. ఒక పరిధి మేర సమానత్వం కూడా నెలకొందని చెప్పవచ్చు. రోమన్ ప్రజాస్వామ్య వ్యవస్థ ప్రగతి పథంలో ఉన్నప్పుడు గ్రీక్‌లో లాగా పరదా ఆచారమైతే ఉండేది కాదు గాని, స్త్రీలు, యువత కుటుంబ వ్యవస్థకు కట్టుబడి ఉండేలా పటిష్టమైన ఏర్పాట్లు చేయబడ్డాయి. స్త్రీలను అత్యంత గౌరవ దృష్టితో చూసేవారు. ఆ కాలంలో నైతిక విలువలు సమున్నతంగా అలరారేవి. ఒకసారి ఒక రోమన్ సెనేటర్, కూతురు ముందు భార్యను ముద్దాడాడు. దీన్ని అనైతిక చర్యగా బావించిన రోమన్లు సెనేట్‌లో అతనికి వ్యతిరేకంగా తీర్మానాన్ని ఆమోదించారు. స్త్రీ పురుషుల లైంగిక సంబంధాలకు వివాహమే ఉత్తమ మార్గం అని వారు బలంగా నమ్మేవారు. ఒక కుటుంబానికి తల్లిగా ఉన్నప్పుడే (Matron) స్త్రీకి గౌరవం లభించేది. వేశ్యావర్గం ఉన్నప్పటికీ, పురుషులకు కొంత మేర వారితో సంబంధాలు నెరిపే స్వేచ్ఛకూడా ఉన్నప్పటికీ, అత్యధికులు వారిని నీచదృష్టితోనే చూసేవారు. వారితో సంబంధాలు నెరిపే పురుషులను తీవ్రంగా అసహ్యించుకునే వారు.

సభ్యతా సంస్కృతులు, నాగరికతల అభివృద్ధితోపాటు క్రమక్రమంగా స్త్రీల విషయంలో కూడా రోమన్ల దృష్టికోణం మారుతూ పోయింది. వివాహం, విడాకుల చట్టాల్లో, కౌటుంబిక వ్యవస్థ విధివిధానాల్లో మార్పులు పొడసూపాయి. పరిస్థితి గతానికి భిన్నంగా తయారైంది. వివాహం కేవలం ఒక చట్టపరమైన ఒప్పందంగా మాత్రమే మిగిలిపోయింది. ఇరువురి సమ్మతి మేరకు ఏర్పడే వివాహ బంధం, తద్వారా సంక్రమించే దాంపత్య బాధ్యతలకు విలువ లేకుండా పోయింది. స్త్రీలకు వారసత్వం, సంపదలపై పూర్తి హక్కులు లభించాయి. తండ్రి, భర్తల అధికారం,

ఆజమాయిషీ నుండి చట్టాలు వారికి పూర్తి స్వేచ్ఛను ప్రసాదించాయి. దీంతో రోమన్ స్త్రీలు ఆర్థిక స్వాతంత్ర్యంతోపాటు, జాతి సంపద లోని ఓ పెద్ద భాగాన్ని కూడా క్రమంగా తమ స్వాధీనంలోకి తెచ్చుకున్నారు. వారు తమ భర్తలతోనే వడ్డీ లావాదేవీలు జరిపేవారు. ధనవంతులైన స్త్రీల భర్తలు, భార్యలకు సేవకులుగా పడి ఉండేవారు. విడాకులు చాలా సాధారణ మయ్యాయి. చిన్న చిన్న విషయాలకే దాంపత్య బంధాలను తెంచుకునేవారు. ప్రఖ్యాత రోమన్ మేధావి, తత్వవేత్త 'సునైకా' రోమన్ల విచ్చలవిడి విడాకుల పట్ల తీవ్రమైన విచారం వెలిబుచ్చుతూ ఇలా అంటున్నాడు : విడాకులన్నవి ఇప్పుడు రోమ్‌లో ఏమంత సిగ్గుపడే విషయంగా కనబడడం లేదు. స్త్రీలు తమ వయసును బట్టి భర్తల సంఖ్యను పెంచుకుంటూ పోతున్నారు. ఆ కాలంలో ఒక మహిళ ఒకటి తరువాత ఒకటిగా అనేక పెళ్లిళ్లు చేసుకునేది'

మార్షల్ అనే ఆయన ఒక స్త్రీని గురించి ప్రస్తావిస్తూ, ఆమె ఇప్పటి వరకు పది మందిని మనువాడింది' అని చెప్పాడు. జోద్‌నీల్ కూడా ఒక స్త్రీని గురించి రాస్తూ, ఆమె ఐదు సంవత్సరాల్లో ఎనిమిది మందిని పెళ్లాడింది.' అని రాశాడు. సెయింట్ జరూమ్ వీళ్లందరినీ తలదన్ని ఒక విలక్షణమైన మహిళను గురించి ప్రస్తావించాడు. ఆమె చివరిసారిగా చేసుకున్న భర్త ఆమెకు ముప్ఫయ్యవవాడు. తనుకూడా ఆ ముప్ఫయ్యో భర్తకు ఇరవై ఒకటవ భార్య. అంటే అప్పటికే ఈమెకు 29మంది, ఆయనకు 20 మంది అయిపోయారు.

ఆ కాలంలో, వివాహరహిత శృంగారం తప్పు అన్న భావన కూడా అడుగంటి పోయింది. పెద్ద పెద్ద పండితులు, నైతిక విలువలు బోధించే అధ్యాప కులు సైతం వ్యభిచారాన్ని చాలా చిన్న విషయంగా భావించేవారు... రోమ్‌లో మానసిక నిపుణుడిగా ప్రసిద్ధిగాంచిన కావో యుక్త వయస్సులోని తిరుగుబోతు తనం సమర్థనీయమేనని వ్యాఖ్యానించాడు. సస్రూలాంటి పెద్ద మనిషి నైతిక బంధనాల నుండి యువకులకు వెసులుబాటు కల్పించాలని అభిప్రాయపడ్డారు. విలువల పరిరక్షణలో చాలా కఠినంగా వ్యవహరిస్తాడని భావించే యోగశాస్త్ర ప్రవీణుడు (stoics) ఎపిక్‌టీటస్ (epictelis) కూడా, సాధ్యమైనంత వరకు వివాహానికి పూర్వం స్త్రీ సుఖానికి దూరంగా ఉండండి. కాని ఎవరైనా నిగ్రహం కోల్పోయి పక్కదారి పడితే వారిని అవమానించకండి.' అని తన శిష్యులకు బోధించాడు.

నైతిక విలువలు, సామాజిక కట్టుబాట్లలో ఈ విధమైనటువంటి రాయితీలు, వెసులుబాట్లు లభించడం వల్ల రోమ్‌లో అశ్లీలత, నగ్నత్వం ఉప్పెనలా విరుచుకు

పడింది. థియేటర్లలో అశ్లీల నృత్య ప్రదర్శనలు ప్రారంభమయ్యాయి. గృహాల అలంకరణలో అశ్లీల, నగ్న చిత్రాల వాడకం తప్పనిసరి అయిపోయింది. వ్యభిచారానికి గట్టి ఊతం లభించింది. ఖైసర్ టైబర్‌తీస్ (14.m to 37m) కాలంలో గౌరవప్రద కుటుంబాల స్త్రీలు కళాకార వృత్తి చేపట్టకుండా చట్టం చేయాల్సిన అవసరం కూడా ఏర్పడింది. ఆ కాలంలోనే ఫ్లోరా అనే క్రీడ రోమ్‌లో బహుళ ప్రాచుర్యంపొందింది. ఇది నగ్న స్త్రీల పరుగు. స్త్రీలు, పురుషులు సామూహికంగా నగ్నస్నానాలు ఆచరించే దురాచారం కూడా ఆ కాలంలో సర్వసాధారణం. రోమన్ సాహిత్య క్షేత్రంలో అశ్లీల పంటకు కొదవే ఉండేది కాదు. ప్రజలు కూడా అలాంటి పచ్చి అశ్లీలాన్నే అమితంగా ఇష్టపడేవారు.

ఈ విధంగా అనైతికత, అమానవీయత పెచ్చరిల్లడం వల్ల రోమ్ ఘనత, గౌరవమంతా అధఃపాతాళంలోకి దిగజారిపోయింది.

## క్రైస్తవ యూరప్

పాశ్చాత్య ప్రపంచపు ఈ నైతిక పతనాన్ని నిరోధించి, దానికి జవజీవాలు అందించడం కోసం క్రైస్తవం ముందుకొచ్చింది. ప్రారంభ కాలంలో అది చెప్పుకోదగ్గ మంచి సేవలనే అందించింది. అశ్లీలతకు అడ్డుకట్ట వేసింది. జీవితం లోని అన్ని రంగాల నుండి నగ్నత్వాన్ని పారదోలింది. వ్యభిచార నిరోధానికి చర్యలు చేపట్టింది. నర్తకీమణులను, వేశ్యలను తమవృత్తి మానుకునే విధంగా ఒప్పించి, వారితో పశ్చాత్తాప ప్రకటన చేయగలిగింది. మంచి ఆలోచనలను ప్రజల్లో జనింపజేసింది. కాని, స్త్రీలు, లైంగిక సంబంధాల విషయంలో మాత్రం మానవ స్వభావానికి బద్ధ వ్యతిరేకమైన క్రైస్తవ పెద్దల అతివాద విధానాన్నే అనుసరించేది.

'స్త్రీ సమస్త పాపాలకు మాతృక, చెడులకు మూలం' అన్నది క్రైస్తవ మతం మూలసూత్రం. అంతేకాదు ఆమె నరకానికి ద్వారం. మానవజాతి కష్టాలకు మూలకారణం స్త్రీయే. ఆమె వల్లనే మానవాళికి కష్టాలు ప్రారంభ మయ్యాయి. ఆమె తన అవమానానికి స్త్రీగా పుట్టడమొక్కటే చాలు. మరేమీ అవసరం లేదు. ఆమె తన సౌందర్యం గురించి సిగ్గుపడాలి. ఎందుకంటే, అది సైతానుకు అన్నిటికన్నా గొప్ప ఆయుధం. ఆమె ప్రపంచానికి, ప్రపంచ ప్రజలకు ఒక శాపం. వారి కష్టాలకు మూలం. అందుకని ఆమె దానికి జీవి తాంతం మూల్యం చెల్లిస్తూనే ఉండాలి. స్త్రీలకు సంబంధించిన సరైన క్రైస్తవ దృక్పథాన్ని ఆనాటి వారి మత గురువు టర్‌టోలియన్ (Tertullian) ఇలా వ్యక్తీకరించారు. :

'షైతాను ప్రవేశించడానికి స్వాగతం పలకడం ద్వారా దైవాజ్ఞను ఉల్లం ఘించి, దైవ స్వరూపుడైన పురుషుణ్ని నిషిద్ధ వృక్షం వద్దకు తీసుకువెళ్లి అతన్ని సర్వనాశనం చేసింది.'

క్రైసోస్టం అనే ఓ ప్రఖ్యాత క్రైస్తవ మత గురువు స్త్రీని గురించి ఇలా అంటాడు:

'స్త్రీ - ఒక అనివార్యపాపం, దుష్టజననం, అందమైన ఆపద, అంతర్గత ప్రమాదం, మనోహరమైన వినాశనం, కష్టాల ద్వారం.'

వారి మరో దృక్పథం ఏమిటంటే, వివాహం ద్వారా ఏర్పడిన బంధం అయినప్పటికినీ, స్త్రీ పురుషుల శారీరక సంబంధం స్వతహాగా ఒక అపవిత్రమైన, అసహ్యించుకోదగిన పాపకార్యం. ఈ విధమైన ఆలోచనా విధానం, ప్రవర్తనలకు సంబంధించిన ఈ వైరాగ్యభావన యోగశాస్త్ర (Neo-platonism) ప్రభావం వల్ల వారిలో మొదటి నుంచే ఉంది. క్రైస్తవం దాన్ని మరింత పటిష్ట పరిచి పతాక స్థాయికి చేర్చింది. దీంతో బ్రహ్మచర్యం, కన్యాత్వం నైతికతకు కొలమానాలై పోయాయి. దాంపత్య జీవితం నైతికపరంగా నీచమని హీనంగా భావిచబడేది. దాంపత్య సంబంధాలకు దూరంగా ఉండడం దైవభక్తికి, దైవభీతికి, అత్యున్నత నైతిక విలువలకు ప్రమాణాలుగా ప్రజలు భావించేవారు. పరిశుద్ధమైన ధార్మిక జీవితం గడపాలంటే, వివాహమైనా చేసుకోకుండా ఉండాలి. ఒకవేళ చేసుకున్నా భార్యభర్తలు ఎట్టి పరిస్థితిలోనూ దాంపత్య సంబంధాలకు దూరంగా ఉండాలి. చర్చి అధికారులు, మత గురువులు ఏకాంతంలో తమ భార్యలను కలుసుకో కూడదని, బహిరంగ ప్రదేశాల్లో, కనీసం ఇద్దరైనా పరాయి వ్యక్తులు ఉన్న సమయాల్లోనే కలుసుకోవాలని మతపరమైన నిర్ణయాలు చేయబడ్డాయి. భార్యాభర్తల శారీరక సంబంధం అపవిత్రమని, హీనమని అనేక రకాలుగా వారికి నచ్చజెప్పడం జరిగేది. ఉదాహరణకు, చర్చికి సంబంధించిన ఏదైనా వేడుకలో పాల్గొనాలంటే, అంతకు ముందు రోజు భార్యాభర్తలు ఏకాంతంగా గడిపి ఉండకూడదు. అలాంటి వారు మరుసటి రోజు జరిగే ఆ మతపరమైన చర్చి వేడుకలో పాల్గొనడానికి అనర్హులు. అంటే దాంపత్య సంబంధం ద్వారా మలినమైన వారు ఇక ఏ విధమైన మతపరమైన, పవిత్ర కార్యంలో పాలుపంచు కోలేరు. ఈ రకమైన వైరాగ్యభావన మొత్తం కుటుంబ సంబంధాలనే ఛిన్నాభిన్నం చేసివేసింది. చివరికి తల్లీ కొడుకుల సంబంధాల్లో కూడా అవరోధాలు సృష్టించి, వివాహబంధం ఫలితంగా ఏర్పడే ప్రతిబంధుత్వాన్ని, అపవిత్రమైనదిగా, పాపభూయిష్టమైనదిగానే పరిగణించింది.

ఈ రెండు సిద్ధాంతాలూ, దృక్పథాలూ సమాజంలో స్త్రీ స్థాయిని నైతికంగా, సాంఘికంగా అవసరానికి మించి అణగదొక్కాయి. అంతేకాదు సామాజిక చట్టాలను కూడా ఎంతగా ప్రభావితం చేశాయంటే, ఒకవైపు స్త్రీ పురుషులిద్దరికీ దాంపత్య జీవితం పెద్ద ఆపదగా, శాపంగా పరిణమిస్తే, మరోవైపు సమాజంలో స్త్రీ స్థానం అన్ని రకాలుగా దిగజారిపోయింది. క్రైస్తవ ధర్మశాస్త్ర ప్రభావంతో పాశ్చాత్య దేశాల్లో జారీ చేయబడిన ఉత్తరువులు, వాటి ప్రత్యేకతలు ఈ విధంగా ఉన్నాయి.

1) ఆర్థికపరంగా స్త్రీలకు ఎలాంటి హక్కులూ లేకుండా చేసి, ఆమెను పురుషుని అధీనంలో ఉంచడం జరిగింది. వారసత్వంలో ఆమె హక్కులు చాలా పరిమితం. ఆస్తి హక్కులో మరీ అన్యాయం. ఆమె కష్టార్జితంపై కూడా ఆమెకు హక్కులుండేవి కావు. ఆమె ప్రతి వస్తువుకూ యజమాని భర్తే.

2) విడాకుల పరంగానైతే ఆమెకసలు ఎలాంటి అధికారమూ ఉండేది కాదు. దంపతుల మధ్య ఎలాంటి సఖ్యత లేకపోయినా, సంబంధాలు పూర్తిగా చెడిపోయి జీవితం నరకంగా మారినా మతమూ, చట్టాలూ వారిని బలవంతంగా నైనా కలిపే ఉంచేవి తప్ప, విడిపోవడానికి అనుమతినిచ్చేవి కావు. పరిస్థితులు మరీ విషమించితే, ఇక కలిసుండడం అసాధ్యమని తేలిపోతే, వారు విడివిడిగా (Separation) ఉండడా నికి మాత్రమే వెసులుబాటు ఉండేది తప్ప, మరో వివాహం చేసుకోడానికి భార్యా భర్తలిద్దరిలో ఎవరికీ అనుమతి ఉండేది కాదు. ఈ శిక్ష మొదటి శిక్షకన్నా తీవ్రమైనది. ఎందుకంటే, ఇక వారిద్దరూ సర్వసంగ పరిత్యాగుల్లా సన్యాసత్వమన్నా తీసుకోవాలి. లేకపోతే జీవితాంతం వ్యభిచా రాన్నయినా ఆశ్రయించాలి. ఇంతకంటే మరో మార్గంలేదు.

3) భర్తను కోల్పోయిన భార్య కాని, భార్యను కోల్పోయిన భర్త గాని పునర్వివాహం చేసుకోవడం తప్పు మాత్రమే కాదు, మహాపాపం కూడా! ఇది కేవలం మృగతృష్ణ, కామాతురం తప్ప మరేమీ కాదన్నది క్రైస్తవ ఫాదరీల ఉవాచ. వారి మాటల్లో ఇదొక నాగరిక వ్యభిచారం' తప్ప మరొకటి కాదు. చర్చి నియమాల ప్రకారం మత గురువులు పునర్వివాహం చేసుకోవడం దుర్మార్గం. ప్రభుత్వ చట్టాల్లోనైతే కొన్ని చోట్ల దీనికసలు అనుమతే ఉండేది కాదు. చట్టం అనుమతించిన చోట కూడా మత భావనల ప్రభావం వల్ల ప్రజలు దాన్ని అధర్మంగానే పరిగణించేవారు.

## ఆధునిక యూరప్

క్రీ.శ. పద్దెనిమిదవ శతాబ్దంలో యూరప్‌లోని మేధావులు, సంఘ సంస్కర్తలు, తత్వవేత్తలు వ్యక్తిగత హక్కులకోసం గళం విప్పారు. వ్యక్తి స్వేచ్ఛకోసం సమరశంఖం పూరించారు. అప్పుడుకూడా వారి ముందు క్రైస్తవం ప్రసాదించిన నైతిక, సామ్రాజ్య వాదపు దుర్మార్గాల మిశ్రమంతో రూపుదిద్దుకున్న తప్పుడు వ్యవస్థే ఉంది. అది మానవ ఆత్మను, దాని స్వభావ విరుద్ధమైన గొలుసులతో బంధించి, ప్రగతి ద్వారాలను మూసివేసింది. ఈ వ్యవస్థను కూలదోసి, మరో నూతన వ్యవస్థను నిర్మించడం కోసం నవయూరప్ నిర్మాతలు ప్రవేశపెట్టిన సిద్ధాంతాల ఫలితంగా ఫ్రాన్స్ విప్లవం పురుడుపోసుకుంది. తరువాత పాశ్చాత్య నాగరికత, సభ్యతా సంస్కృతుల ప్రగతిరథం పరుగులు తీస్తూ క్రమక్రమంగా నేటి దశకు చేరుకుంది.

ఈ నవశకం ప్రారంభంలో స్త్రీ జాతిని నైచ్యపు అగాధాల్లోంచి పైకిలాగడా నికి చేపట్టిన చర్యలు సామాజిక జీవితంపై మంచి ప్రభావాన్ని చూపి, సత్ఫలితా న్నిచ్చాయి. వివాహం, విడాకుల విషయలో పూర్వపు కఠినత్వం తగ్గిపోయింది. పూర్తిగా హరించబడిన స్త్రీల ఆర్థిక హక్కులు చాలా వరకు పునరుద్ధరించబడ్డాయి. ఏ కారణాల వల్ల స్త్రీ జాతి నీచంగా, హీనంగా చూడబడేదో వాటిని సంస్కరించడం జరిగింది. ఏ సామాజిక నియమాల కారణంగానైతే స్త్రీ బానిసగా చూడ బడిందో వాటిలో కూడా మార్పులు చేయడం జరిగింది. పురుషులకు లాగానే స్త్రీలు కూడా ఉన్నత విద్యనభ్యసించేందుకు అవకాశాలు కల్పించబడ్డాయి. ఈ విధమైనటువంటి విభిన్న సంస్కరణల వల్ల, అప్పటి వరకూ తప్పుడు చట్టాలు, ఆటవిక కట్టుబాట్లు, అజ్ఞానపు ఆలోచనల మూలంగా అణిగిమణిగి ఉన్న స్త్రీల శక్తి సామర్థ్యాలు క్రమక్రమంగా వెలుగులోకొచ్చాయి. వారు తమ గృహాలను సంస్కరించుకున్నారు. సమాజంలో మంచిని పెంపొందిస్తూ, అనేక ప్రయోజనకరమైన కార్యక్రమాలు చేపట్టారు. ప్రజారోగ్య పరిరక్షణ, భావితరాల ఉత్తమ శిక్షణ, వ్యాధిగ్రస్తుల సేవ, గృహిణి బాధ్యతల ప్రాముఖ్యం ఇవన్నీ ఆధునిక సమాజం స్త్రీ జాతికి బహూకరించిన ప్రాథమిక ఫలితాలు. కాని, ఏ సిద్ధాంతాల ప్రాతిపదికన ఈ నూతన ఉద్యమం పురుడు పోసుకుందో, దానిలో ప్రారంభం నుండే కాస్త అతిశయం మిళితమై ఉండేది. పందొమ్మిదో శతాబ్దానికి ఈ మిశ్రమం బాగా ఘనీభవించి, ఇరవయ్యో శతాబ్ది నాటికి పాశ్చాత్య సమాజం అసమతౌల్యపు మరో అంచుకు చేరుకుంది.

ఏ సిద్ధాంతాల ఆధారంగా నవ పాశ్చాత్య సమాజం ఆవిష్కృతమైందో, అందులో మూడు అంశాలున్నాయి :

1) స్త్రీ పురుష సమానత్వం

2) మహిళల ఆర్థిక స్వాతంత్ర్యం

3) స్త్రీ పురుషుల స్వేచ్ఛాయుత కలయిక

ఈ మూడు అంశాల ప్రాతిపదికన సమాజ నిర్మాణం జరిగితే ఏ ఫలితాలు వెలువడాలో, చివరికి అవే ఫలితాలు వెలుగులో కొచ్చాయి.

1, సమానత్వమంటే అర్థం, కేవలం సామాజిక సమానత్వం, మానవ హక్కుల్లో సమానత్వం, నైతిక స్థాయి మాత్రమే కాదు. సామాజిక జీవితంలో పురుషులు చేసే ప్రతిపనీ స్త్రీలు కూడా చేయడం, ప్రవర్తనా నియమావళిలో మొదటి నుండీ పురుషులకు స్వేచ్ఛ ఉన్నట్లే స్త్రీలకూ ఆ వెసులుబాటు కల్పించడమని భావించబడింది. సమానత్వానికి సంబంధించిన ఈ తప్పుడు భావన స్త్రీని తన సహజ బాధ్యతల నుండి ఏమరుపాటుకు, నిర్లక్ష్యానికి గురిచేసింది. నిజానికి ఈ బాధ్యతల సక్రమ నిర్వహణపైనే నాగరికత పునాదులు, మానవ జాతి ఉనికి ఆధారపడి ఉన్నాయి. ఈ మౌలిక బాధ్యతలను విస్మరించి, అదనంగా ఆర్థిక, సామాజిక, రాజకీయ కార్యకలాపాల నిర్వహణ ఆమె వ్యక్తిత్వాన్ని పూర్తిగా హరించివేసింది. ఎన్నికలరంగంలో తలమునకలు కావడం, పరిశ్రమల్లో, కార్యా లయాల్లో ఉద్యోగ, వాణిజ్యరంగాల్లో పురుషులకు ధీటుగా వ్యాపార బాధ్యతల నిర్వహణ, క్రీడలు, సాంస్కృతిక కార్యక్రమాల్లో భాగస్వామ్యం, క్లబ్బులు, పబ్బులు. చిత్రాల్లో నటించడం, నాట్యరంగంలో పాలుపంచు కోవడం ఇంకా ఇలాంటి మరెన్నో కార్యకలాపాలు వారి జీవితంలో అంతర్భాగమై పోయాయి. ఈ కారణంగా దాంపత్య బాధ్యతలు, సంతాన శిక్షణ, వారి ఆలనాపాలన, కుటుంబ నిర్వహణ లాంటి అనేక కార్యక్రమాలకు వారు దూరమైపొయ్యారు. అంతేకాదు, వారు ప్రకృతిపరమైన తమ సహజ సిద్ధ బాధ్యతలను కూడా ఏవగించు కోవడం ప్రారంభించారు. ఫలితంగా పాశ్చాత్య దేశాల్లో సమాజానికి మూలకందమైన కౌటుంబిక వ్యవస్థ ఛిన్నాభిన్నమైపోయింది. కుటుంబ జీవితంలోని శాంతి, సంతృప్తులపై ఆధారపడి ఉన్నటువంటి మానవుల శక్తిసామర్థ్యాలు, వృద్ధీ వికాసాలు అనివార్యంగా నిర్వీర్యమైపొయ్యాయి. సామాజిక సేవకోసం స్త్రీ పురు షుల పరస్పర సహాయ సహకారాలకు సరైన మార్గమైనటువంటి వివాహబంధం సాలెగూడు కంటే బలహీనమైన పోయింది. భావితరాలను నియంత్రించడానికి కుటుంబ నియంత్రణ,

గర్భస్రావాలు, భ్రూణహత్యలు తదితర విధానాలను అవలంబించడం జరుగుతోంది. సమానత్వానికి అన్వయించుకున్న తప్పుడు భావన. స్త్రీ పురుషుల మధ్య అనైతిక విషయాల్లో సమానత్వాన్ని నెలకొల్పింది. ఒకప్పుడు పురుషులు సైతం సిగ్గుతో చితికిపోయిన అశ్లీలత, అనైతికతలు ఇప్పుడు స్త్రీలకు ఏమాత్రం ఎబ్బెట్టుగా కూడా కనిపించడం లేదు.

2. స్త్రీల ఆర్థిక స్థిరత్వం పురుషుల అవసరాన్ని తగ్గించి వేసింది. పురుషుడు సంపాదించాలి. స్త్రీ కుటుంబ నిర్వహణ చూసుకోవాలి. అన్న పాత సాంప్రదాయానికి బదులు, స్త్రీ పురుషులిద్దరూ సంపాదించాలి. కుటుంబ నిర్వహణ బజారుపాలు చేయాలి' అన్న కొత్త విధానం ఉనికిలోకి వచ్చింది. ఈ ఆధునిక విప్లవం ఇద్దరి జీవితాల్లో కేవలం లైంగిక సంబంధం తప్ప మరో సంబంధానికి తావులేకుండా చేసింది. తద్వారా ఇద్దరూ తప్పనిసరిగా కలసి ఉండాలన్న భావన సడలిపోయింది. అలాంటప్పుడు కేవలం శారీరక సంబంధం కోసమే అనవసరంగా ఒక శాశ్వత బంధాన్ని ఏర్పరచుకొని, సంసారం, కుటుంబం లాంటి బాధ్యతలను మోస్తూ కలసి జీవించాల్సిన అవసరం ఏముంది? ఒక స్త్రీ తన ఉపాధి తాను సంపాదించుకుంటూ, తన అవసరాలను తానే తీర్చు కుంటూ. తానే యజమానిగా ఉంటున్నప్పుడు, తన సంరక్షణకు మరొకరిపై ఆధారపడనప్పుడు, కేవలం శారీరక సుఖం కోసమే ఒక పురుషుడి బంధంలో ఉండాల్సిన అవసరం ఏమిటి? అనేక ఆంక్షల మధ్య ఒక కుటుంబానికి బాధ్యత ఎందుకు వహించాలి? ప్రత్యేకించి సాంఘిక సమానత్వ భావన తనకెలాంటి అవరోధాలూ కల్పించనప్పుడు, స్వేచ్ఛగా కోరికలు తీర్చుకునే అవకాశాలు ప్రసాదిస్తున్నప్పుడు. సంతప్తికరమైన, సులువైన, మనోరంజకమైన మార్గాన్ని వదిలి, త్యాగాలు, బాధ్యతలతో కూడిన పాత సాంప్రదాయ మార్గాన్ని ఎందుకు అవలంబించాలి?

పాపభీతి అన్నది ఎలాగూ మతంతో పాటే మాయమైపోయింది. సమాజ భయం అంతకంటే లేదు. ఎందుకంటే, తన అశ్లీలతను గాని, అనైతికతను గాని సమాజం తప్పుపట్టదు. పైగా అద్భుతంగా స్వాగతిస్తుంది. ఇక అక్రమ సంతాన భయం దూరం చేయడానికి గర్భనిరోధక సాధనాలు ఉండనే ఉన్నాయి. అంతకూ గర్భం నిలిచిందే అనుకోండి. గర్భస్రావం చేయించుకోడానికి కూడా ఎలాంటి అవరోధాలూ లేవు. ఈ ప్రయత్నం కూడా విఫలమైతే. శిశువును సునాయాసంగా పీక పిసికి చంపినా అడిగేవాడు లేదు. దురదృష్టవశాత్తు మాతృ ప్రేమ ఈ పని చేయలేకపోతే, అక్రమ సంతానానికి తల్లిగా ఉండటంలో కూడా ఆమెకెలాంటి

ఇబ్బందీ లేదు. ఎందుకంటే 'పెళ్లికాని తల్లులను' 'అక్రమ సంతానాన్ని' తక్కువ దృష్టితో చూసే ధైర్యం ఎవరు చేసినా, వారినే ఆటవికులుగా, అజ్ఞానులుగా చూడడం జరుగుతోంది.

ఈ పరిణామాలు పాశ్చాత్య సమాజ మూలాలను ఒక్క కుదుపు కుదిపాయి. ఈనాడు అన్ని దేశాల్లోనూ లక్షలాది మంది యువతులు ఒంటరి జీవితాన్ని ఇష్టపడుతున్నారు. స్వేచ్ఛా విహంగాల్లా వారి జీవితాలు గడిచిపోతున్నాయి. విశృంఖల జీవితమే వారికి నచ్చిన హాబీ. వీరిలో చాలామంది తాత్కాలిక ప్రేమలో పడి వివాహాలు చేసుకుంటారు. కాని కేవలం శారీరక సంబంధమే తప్ప, స్త్రీ పురుషులను శాశ్వతంగా కలిపి ఉంచగల మరే బంధమూ లేకపోవడం వల్ల, వారి దాంపత్య బంధాల్లో ఎలాంటి మాధుర్యమూ లేకుండా పోయింది. భార్యాభర్తలు ఎవరికి వారు పూర్తి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో జీవితం గడుపుతున్నప్పుడు, వారు తమ పరస్పర సంబంధాల్లో ఏవిధమైనటువంటి సఖ్యతకు సిద్ధంగా ఉండరు. పైపై ఆకర్షణతో ముడిపడే అక్రమసంబంధ భావో ద్రేకాలు తొందరగానే చల్లబడిపోతాయి. ఈ ప్రేమరహిత బంధం వల్ల ఒక్కోసారి చిన్నచిన్న విభేదాలే విడాకులకు దారితీస్తాయి. గర్భనిరోధం, గర్భస్రావం, జననాల రేటు పడిపోవడం, అక్రమ సంతానం పెరగడం -ఇవన్నీ చాలావరకు ఈ పెడధోరణుల దుష్ఫలితాలే. అనైతికత, అశ్లీలతా, సుఖరోగాల పెరుగుదలలో వీటి భాగస్వామ్యం చాలా ఎక్కువ.

3. స్త్రీపురుషుల స్వేచ్ఛాయుత కలివిడి విధానం స్త్రీలలో సౌందర్య ప్రదర్శనాభిలాషను బాగా పెంచేసింది. సహజంగానే స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణ అధికంగా ఉంటుంది. అదికాస్తా ఈ విధమైన స్వేచ్ఛాయుత కలివిడి సంస్కృతి వల్ల పరాకాష్టకు చేరుకుంది. ఇలాంటి మిశ్రమ సమాజంలో సహజంగానే స్త్రీ పురుషుల మధ్య పరస్పర ఆకర్షణల భావోద్రేకాలు జనిస్తాయి. తద్వారా ఎవరికి వారు వీలైనంత అందంగా ఆకర్షణీయంగా తయారవ్వాలన్న పోటీతత్వం పెరుగు తుంది. నైతిక ప్రవర్తనలో మార్పులు సంభవించిన ఫలితంగా 'ఇదితప్పు' అనే భావన కూడా రాదు. అందాల ఆరబోతే ఆకర్షణకు మార్గమని భావించడం వల్ల క్రమక్రమంగా ఇది అన్ని హద్దుల్నీ చెరిపేస్తూ పోయి, చివరికి వలువలు వలిచేసిన తరువాత గానీ శాంతించదు. ఇదే పరిస్థితి ఈనాడు పాశ్చాత్య సంస్కృతిలో ప్రతిబింబిస్తోంది. సూదంటురాయిలా ఆకర్షించాలన్న కాంక్ష మహిళల్లో ఎంతగా

ప్రబలిపోతుందంటే, కురచ దుస్తులతో సహా, ఏ రకమైన అలంకరణ సామాగ్రి కూడా ఆమెను సంతృప్తిపరచలేకపోయింది. చివరికి కొన్ని సందర్భాల్లో ఆ కురచ దుస్తుల జాడ్యాన్ని కూడా వదిలించుకొని, నూలుపోగు కూడా లేకుండా వీరవిహారం చేస్తుంది. ఇక పురుష పుంగవుల నుండి ఇంకా.. ఇంకా.. అన్న డిమాండ్ పెరుగుతుందే తప్ప, అంతటితోనైనా తృప్తి కలగడం లేదు. ఎందుకంటే కాంక్షలకు అంటుకున్న అగ్ని అందాల ఆరబోతతో చల్లారక, మరింతగా రాజుకొని, ఆరని అగ్నిగుండంగా మారుతుంది. హద్దులు మీరిన ఈ కామోద్రేకాల కీలలను చల్లార్చ డానికి రకరకాల పద్ధతులను అనుసరిస్తారు. కొత్త కొత్త సాధనాలను సమకూర్చు కుంటారు. ప్రేమ కథలు, నగ్నచిత్రాలు, అశ్లీల సాహిత్యం, భావోద్రేకాలను రెచ్చగొట్టే బూతు సినిమాలు ఇవన్నీ ఏమిటి? నిజానికి ఇవన్నీ కామాగ్నిని చల్లార్చే- కాదు కాదు-ఎగదోసే సాధనాలు. ప్రజల హృదయాల్లో అశ్లీల బీజాలు నాటిన ఈ పాశ్చాత్య సమాజం తన తప్పును, బలహీనతను కప్పిపుచ్చుకోడానికి దీనికి 'కళ' అని అందమైన పేరు తగిలించింది.

ఈ జాడ్యం చాలా వేగంగా పాశ్చాత్య జాతుల ఆయుః ప్రమాణాన్ని హరించి వేస్తోంది. ఈ జాడ్యం అంటుకున్న ఏ జాతీ సురక్షితంగా ఉన్న దాఖలాలు నేటి వరకూ లేవు. జీవన మనుగడకోసం, ప్రగతీ వికాసాల కోసం ప్రకృతి మానవుడికి ప్రసాదించిన శారీరక, మేధోపరమైన అన్ని సామర్థ్యాలను ఇది హరించి వేస్తుంది. ఎవరైతే అశ్లీల సాహిత్యం ప్రవాహంలో పడికొట్టుకు పోతారో, విషయలోలత్వంలో, కామవాంచల్లో కూరుకుపోతారో, అలాంటి వారికి సృజనాత్మక, నిర్మాణాత్మక విషయాల వైపు దృష్టి సారించడానికి కావలసిన సమయం, మానసిక ప్రశాంతత ఎక్కడ లభిస్తాయి. ప్రత్యేకించి యువతరానికి మేధోపరమైన, నైతిక శక్తి సామర్థ్యాల వికాసానికి కావలసిన శాంతియుతమైన చక్కని వాతావరణం ఎలా సమకూరుతుంది? ఊహ తెలిసిన నాటినుండే ఈ నీచ భావనల పిశాచి వారి నెత్తిన కూర్చొని, తన పైశాచిక, కబంధ హస్తాల్లో బంధించివేస్తే, ఇకవారి నైతిక, మానసిక వికాసం ఎలాసాధ్యం?

ఓ విశాల భూభాగంలో పెనవేసుకొని ఉన్న మూడువేల సంవత్సరాల చారిత్రక ఎగుడు దిగుళ్ల ఈ అంతులేని కథ, గతంలో కూడా రెండు గొప్ప నాగరికతలకు మాతృకగా నిలిచింది. మళ్లీ ఇప్పుడు ప్రపంచంలో దాని ప్రభంజనం కనిపిస్తోంది.

ఈజిప్ట్, బాబిలోనియా, ఈరాన్ తదితర దేశాల కథ కూడా దీనికి భిన్నం కాదు. స్వయంగా మన భారతదేశం కూడా శతాబ్దాల తరబడి ఇలాంటి గందరగోళ స్థితిలోనే చిక్కుకొని ఉంది. ఒకవైపు స్త్రీ దాసిగా ఉంటే పురుషుడు స్వామిగా, పతిదేవుడిగా ఉంటాడు. అంటే, అతడు ఆమెకు యజమాని, ఆరాధ్యుడు అన్నమాట. ఆమె బాల్యంలో తండ్రి, యువ్వనంలో భర్త, వృద్ధాప్యంలో పిల్లల సంరక్షణలో ఉండవలసి వస్తుంది. భర్త చితిపై కాలవలసి వస్తుంది. ఆస్తి, వారసత్వ హక్కులు ఆమెకు కల్పించబడవు. వివాహం విషయంలో ఆమెపై కఠినమైన ఆంక్షలు అమలవుతాయి. ఇష్టాయిష్టాలకు భిన్నంగా, ఆమె ప్రమేయం లేకుండా ఆమెను ఒక పురుషునికి అప్పగించడం జరుగుతుంది. చివరిశ్వాస వరకూ ఇక ఆమె అతడి ఆస్తిగానే ఉండాలితప్ప, ఎట్టిపరిస్థితిలోనూ 'భర్త' అనబడే యజమాని కబంధహస్తాలనుండి బయటపడ లేదు. యూదులు, యూనానీలకు లాగానే ఆమెను పాపాలకు మాతృక అని భావించడం జరిగేది. మరోవైపు, ఆమె ఎంతో ప్రేమగా చూడబడుతూ, పాశవిక కోరికల పరిపూర్తికి ఒక పావుగా ఉపయోగపడేది. ప్రేమాతిశయంలో పురుషుడు ఆమెను నెత్తిపై ఎక్కించుకునేవాడు. ఈ విధంగా ఆమె పురుషుని నెత్తిపై స్వారీ చేస్తూ, స్వయంగా తాను మునుగుతూ, మొత్తం జాతినే ముంచి పారేసేది.

ఈనాడు మనం చూస్తున్న అంగాంగ పూజలు, యోనిపూజ, దేవాలయాలపై బూతు బొమ్మలు, ఆలయాల్లో నర్తిస్తూ ఊరందరికీ ఉమ్మడి భార్యగా ఉండే దేవదాసీలు (జోగిని) (Religious Prostitutes) హోలీకేళీలు, సముద్ర తీరాల్లో నగ్న, అర్ధనగ్న ప్రదర్శనలు ఇవన్నీ దేనికి ప్రతిరూపాలు? బామ్ మార్గ్ ప్రేరణతో పురుడు పోసుకున్న ఈ అనైతిక రుగ్మతలు ఇరాన్, బాబిలోనియా, యూనాన్, రోమన్‌లకు లాగానే, అద్భుతమైన ప్రగతి సాధించిన భారతదేశంలో కూడా ఒక మహమ్మారిలా విజృంభించి, హిందూ జాతిని శతాబ్దాలు గడిచినా సరిదిద్దుకోలేని నైచ్యపు అగాధాల్లోకి నెట్టివేశాయి.

ఈ చారిత్రక గాథను పరిశీలనాత్మక దృష్టితో చూసినట్లయితే, స్త్రీ జాతి విషయంలో న్యాయబద్ధమైన వైఖరి ఏమిటి? దాన్ని అర్థం చేసుకోవడం, స్థిర నిర్ణయాలు కలిగి ఉండడం మనిషికి ఎంత కష్టంగా పరిణమించిందో రుజు వైంది. అసలు స్త్రీ జాతికి సంబంధించి న్యాయమంటే ఏమిటి? స్త్రీలకు తమ వ్యక్తిత్వాన్ని, తమ శక్తి సామర్థ్యాలను వికసింపజేసుకునే అన్ని అవకాశాలు కల్పించాలి. మానవ

సమాజం, సంస్కృతీ సంప్రదాయాల వృద్ధీ వికాసాల్లో వారి భాగస్వామ్యాన్ని ప్రోత్సహించాలి. అయితే నైతిక పతనం, మానవ వినాశానానికి కారణం కాకుండా చూడగలగాలి. స్త్రీల సహకారం పురుషులకు అందే విధంగా ఒక సూత్రబద్ధ విధానాన్ని రూపొందించి, తద్వారా వారి పరస్పర సహకారంతో జరిగే ప్రతి పనీ సమాజానికి మేలు చేసేదిగా, ఒక మంచి ఆరోగ్యకరమైన వాతావరణాన్ని సృజించే విధంగా మలచుకోవాలి. ఇలాంటి ఒక ఉత్తమ విధానం కోసం ప్రపంచం శతాబ్దాలుగా అన్వేషిస్తూనే ఉంది కాని, విజయం సాధించలేకపోయింది. ఒకసారి ఓ అతిశయా నికిపోయి సింహభాగ మైన స్త్రీ జాతిని పూర్తిగా పక్కనపెట్టి పనికి మాలినదిగా భావిస్తుంది. మరోసారి ఇంకో అతిశయాన్ని ఆశ్రయించి స్త్రీ పురుషుల్ని కలగాపులగం చేసి అసలుకే ఎసరు పెడుతుంది.

నిజానికి సమన్యాయం అన్నది అందని ద్రాక్షకాదు. తియ్యని ద్రాక్షే. ఉనికిలో లేనిదికాదు, అందుబాటులో ఉన్నదే. కాని కొన్ని వేల సంవత్సరాలుగా గందరగోళ పరిస్థితుల మధ్య గిరికీలు కొడుతున్న కారణంగా కళ్లు బైర్లు గమ్మి ప్రజలు దాని ఉనికిని గుర్తించలేకపోతున్నారు. కళ్లముందు ప్రత్యక్షమైనా చూపు ఆనని పరిస్థితి. తాము అన్వేషిస్తున్న యదార్థం ఇదే అన్న విషయం వారి బుర్రలకెక్కడం లేదు. దాన్ని చూసి చిర్రుబుర్రులాడుతున్నారు. అవాకులు చవాకులు పేలుతున్నారు. ఎవరి దగ్గరైనా అదికనిపిస్తే వారిని అవమానించే ప్రయత్నం చేస్తున్నారు. వారి వ్యవహారం ఎలా ఉందంటే, బొగ్గు ఉత్పత్తి జరిగే ప్రాంతంలో జన్మించిన శిశువు, అక్కడే పెరిగి పెద్దవాడై, ఆ నల్లని కాలుష్య వాతావరణాన్నే సహజసిద్ధమైన వాతావరణమని భావిస్తాడు. అతణ్ని ఆ వాతావరణం నుండి బయటికి తీసుకు వచ్చినట్లయితే, సహజసిద్ధమైన, స్వచ్ఛమైన నిర్మల వాతావరణాన్ని చూసి కొత్త కొత్తగా అనిపించి కాస్త ఇబ్బంది పడినా చివరికి నిజాన్ని గ్రహిస్తాడు. ఎందుకంటే మానవుడు మానవుడే కదా! స్వచ్ఛమైన నిర్మల వాతావరణానికి, దుమ్ముధూళితో నిండిన నల్లని కాలుష్య పూరిత 'వాతావరణానికి తేడా గ్రహించకుండా ఉండగలడా? స్వచ్ఛమైన నిర్మల వాయువు కాలుష్యపూరిత వాయువుల మధ్య తేడాను అతని ఊపిరితిత్తులు వెంటనే పసిగడతాయి.



## రెండవ అధ్యాయం

# ఆధునిక ముస్లిం

అజ్ఞానంలో, గందరగోళంలో పడి కొట్టుమిట్టాడుతున్న ప్రపంచానికి రుజుమార్గం చూపే శక్తి ఎవరికైనా ఉందీ అంటే, అది కేవలం ఒక్క దైవ విశ్వాసికే ఉంది. సాంఘిక జీవితంలో ఎదురయ్యే అన్ని గడ్డు సమస్యలకూ అతని దగ్గర సరైన పరిష్కారం ఉంది. కాని ఈ ప్రపంచానికి పట్టిన విచిత్రమైన, విచారకరమైన దుస్థితి ఏమిటంటే, ఎవరి దగ్గరైతే అంధకారాన్ని పటాపంచలు చేసే వెలుగు దివ్వె ఉందో, స్వయంగా రేచీకటి అనే రుగ్మతతో ఆ అభాగ్యుడు బాధపడుతున్నాడు. ఇతరులకు దారి చూపడం తరువాత సంగతి, స్వయంగా అతడే అంధకారంలో పడి గుడ్డివాడిలా మార్గవిహీనుల వెనుక తచ్చాడుతున్నాడు.

'పరదా' అన్న పదం ఏ ఆదేశాల సమాహార శీర్షికగా వినియోగించబడుతుందో అది ఇస్లామీయ సామాజిక సూత్రాల్లోని అత్యంత ప్రధానాంశాలను ఆవరించి ఉంది. ఈ సూత్రాలన్నిటినీ దృష్టిలో ఉంచుకొని, ఈ ఆదేశాలను పరిశీలించినట్లయితే, కనీస పరిజ్ఞానమున్న ఏ మనిషైనా ఇంతకంటే న్యాయమైన, ఖచ్చితమైన విధానం మరొకటి ఉండదని తప్పకుండా అంగీకరించి తీరతాడు. వీటిని గనక యథాతథంగా ఆచరించినట్లయితే, వ్యతిరేకత మాట అలా ఉంచి, కష్టాల కడలిలో కొట్టుకుపోతున్న ప్రపంచం శాంతి మార్గం వైపు పరుగులు తీస్తూ వస్తుంది. తన సమస్యలకు, రుగ్మతలకు చక్కని చికిత్స పొందగలుగుతుంది. అయితే ఈ పని ఎవరు చేయాలి? చికిత్స చేయగలవాడు చాలాకాలంగా జబ్బున పడి ఉన్నాడు. రండి! ఒకసారి అతణ్ణి కూడా పరా మర్శిస్తూ ముందుకు పోదాం.

### చారిత్రక నేపథ్యం

పద్దెనిమిదో శతాబ్దం చివరిలో, పందొమ్మిదో శతాబ్ది ప్రారంభకాలంలో పాశ్చాత్య జాతుల రాజ్య విస్తరణాకాంక్ష పెనుతుపానులా ఇస్లామీయ దేశాలపై విరుచుకుపడింది. అప్పటి వరకూ మగత నిద్రలో ఉన్న ముస్లింలు మేల్కొనేలోగానే ఈ తుఫాను తూరుపు నుండి పడమర వరకూ ఉన్న ముస్లిం దేశాలకు ముంచి వేసింది. పందొమ్మిదో శతాబ్దం సగానికి చేరుకునే సరికల్లా అధికశాతం ముస్లిం

దేశాలు యూరపుకు బానిసలైపొయ్యాయి. బానిసలు కానివారు కడా అనివార్యంగా నిస్సహాయ స్థితిలోకి నెట్టబడ్డారు. అంతా ముగిసిన తరువాత ముస్లింలు కళ్లు తెరవడం ప్రారంభించారు. శతాబ్దాల తరబడి ఠీవిగా తలెత్తుకు తిరిగిన జాతి గౌరవ ప్రతిష్టలు అకస్మాత్తుగా మంటగలిసి పొయ్యాయి. పీకలదాకా తాగి మైకంలో జోగుతున్న తాగుబోతుకు బలంగా ఒక్కటి తగిలిస్తే మత్తంతా దిగి, తన అపజయం, ప్రత్యర్థి విజయం పట్ల ఆలోచనలో పడినట్లు తయారైంది పరిస్థితి. మత్తుదిగినా మనసు ఇంకా అధీనంలోకి రాలేదు. సమతూకం నెలకొనలేదు. ఒకవైపు పరాజయపు అవమానం ఈ దుస్థితి నుండి బయటపడి, మార్పు సాధించాలని బలంగా కోరు తుంటే, మరోవైపు శతాబ్దాలుగా అనుభవించిన సుఖసౌఖ్యాలు ఈ దుస్థితిని అధిగ మించడానికి సులభ సాధ్యమైన తరుణోపాయం అన్వేషించాలని కోరుతున్నాయి. ఇంకోవైపు ఏళ్లతరబడి ఎలాంటి శ్రమ లేక తుప్పు పట్టిన శక్తి సామర్థ్యాలు, ఆలోచనా వివేకాలు ఉన్నాయి. వీటన్నిటికీ మించి ప్రతి పరాజిత జాతిపై సహజంగానే అలుముకునే భయాందోళనలూ ఉన్నాయి. ఈ కారణాలన్నీ కలగలసి సంస్కరణాభి లాషులైన ముస్లింలను ఆలోచనాపరంగా, ఆచరణాపరంగా అపమార్గానికి గురి చేశాయి. వీరిలో చాలా మంది తమ పరాజయం, యూరోపియన్ల విజయానికి సంబంధించి అసలు కారణాలేమిటో కూడా గుర్తించలేకపోయారు. గుర్తించిన వారు కూడా ప్రగతి శిఖరాల దుర్భేధ్యమైన మార్గాన్ని అనుసరించడానికి భయపడ్డారు. ఆ మార్గంలో ఎదురయ్యే ప్రతిబంధకాలను ఛేధించే శక్తి సామర్థ్యాలు, త్యాగభావన వారిలో కొరవడింది. ఇందులో రెండు వర్గాలకూ సమాన భాగస్వామ్యం ఉంది. ఈ తప్పుడు ఆలోచనా విధానం వల్ల, వారికి కనిపించిన సులువైన అభివృద్ధి మార్గం ఏమిటంటే, పాశ్చాత్య నాగరికత, సంస్కృతీ సంప్రదాయాల చిత్రపటాన్ని యథా తథంగా తమ జీవితాల్లో ప్రతిష్టించుకోవాలి. నందనవనాలనూ, పచ్చని మైదానాలనూ ప్రతిబింబించే దర్పణంలా తయారు కావాలి. ప్రతిబింబిచినా వాస్తవంగా పచ్చని మైదానాలూ ఉండవు, అందమైన నందనవనాలూ ఉండవు.

**భావదాస్యం**

ఈ తీవ్రత ఏ స్థాయికి చేరిందంటే, వస్త్రధారణ, ఆచారవ్యవహారాలు, మాటా మంచి, కట్టూబొట్టూ సమస్తమూ పాశ్చాత్య విధానాల నుండి అరువు తెచ్చుకోవడం జరిగింది. ముస్లిం సమాజాన్ని పాశ్చాత్య చట్రంలో ఇమడ్చడానికి తీవ్రంగా కృషి

జరిగింది. ఎలాంటి ఆలోచనకు, తర్కానికి తావులేకుండా నాస్తికత్వం, భౌతికవాదం తదితరాలను ఒక ఫ్యాషన్‌గా స్వీకరించడం జరిగింది. తప్పయినా, ఒప్పయినా ప్రతీ పాశ్చాత్య భావనను, విధానాన్ని కిమ్మనకుండా విశ్వసించి దాన్ని నలుగురికీ పంచడం ప్రగతిశీల దృక్పథమని భావించడం జరిగేది. మద్యం, జూదం, మట్కా, లాటరీ, డ్యాన్సుల్లాంటి పాశ్చాత్య సంస్కృతిని ఆప్యాయంగా అక్కున చేర్చుకోవడం జరిగింది. పవిత్రత, పరిశుద్ధతలు, సామాజిక ఆర్థిక విషయాలు, రాజకీయాలు, చట్టాలు, మతపరమైన విశ్వాసాలు, ఆరాధనలు సమస్తమూ పాశ్చాత్య విధానాల ప్రకారం, ఎలాంటి మీమాంసకూ తావులేకుండా, కనీస ఆలోచన కూడా చేయకుండా, దివి నుండి దిగివచ్చిన అరుదైన ఆదేశాలుగా భావించి, జీవితపు మరోమార్గమే లేదన్నంత అపురూపంగా వీటిని శిరసావహించడం జరిగింది.

ఇస్లాంలోని చారిత్రక సంఘటనలు, ఇస్లామీ ధర్మశాస్త్రం, ఖుర్‌ఆన్ హదీసుల ఉపదేశాలు. ఈ విధంగా ఏ విషయాల పట్ల పాత శత్రువులు అనుమానం, అభ్యంతరాలు వ్యక్తం చేశారో, వాటన్నిటి పట్ల ముస్లింలక్కూడా అవమానమే అనిపించింది. ఈ మరకను ఏదో ఒక విధంగా తుడిచేసుకోవడానికీ వారు ప్రయత్నించారు. ఇస్లాం శత్రువులు జిహాద్ పట్ల అభ్యంతరం వ్యక్తం చేస్తే, అయ్యయ్యో! జిహాద్‌కూ మాకూ సంబంధమే లేదని వివరణ ఇచ్చుకున్నారు. వారు బహుభార్యత్వం పట్ల అభ్యంతరం చెబితే ఒక వాక్యాన్నే మినహాయించు కున్నారు. స్త్రీ పురుషుల మధ్య సంపూర్ణ సమానత్వం ఉండాలనీ, ఇద్దరికీ సమాన అధికారాలు ఉండాలని వారు చెబితే, అసలు మా మత విధానమే అదని సంజాయిషీ ఇచ్చుకున్నారు. నికాహ్, తలాఖ్‌ల విషయంలో వారు అభ్యంత రాలు పెడితే, ధర్మశాస్త్ర నియమాలను మార్చుకోడానికీ సిద్ధపడ్డారు. ఇస్లాం కళకు శత్రువుగదా అని వారంటే, అలాంటిదేమీ లేదు, నృత్య, గాన ప్రదర్శనలను, విగ్రహాలు చెక్కే శిల్పకళను ప్రోత్సహిస్తుందని, ఇస్లాం దేనికీ వ్యతిరేకం కాదని వివరణ ఇచ్చుకున్నారు.

## పరదా సమస్య

పరదా గురించిన చర్చ ప్రారంభం కావడం, ముస్లింల చరిత్రలో అన్నిటి కన్నా అవమానకరమైన కాలం. స్త్రీ స్వేచ్ఛ విషయంలో ఇస్లాం నిర్ణయించిన హద్దులేమిటి? అన్నంత వరకే ఈ వివాదం పరిమితమైతే సమస్యే ఉండేది కాదు. దీనికి సమాధానం కూడా సునాయాసంగానే లభించేది. కాకపోతే ముఖం, చేతులు కనబడడం ధర్మ సమ్మతమా, కాదా? అన్న విషయంలోనే భేదాభిప్రాయా లుండేవి,

వచ్చేవి. ఇది ఏమంత ప్రాముఖ్యం కలిగిన బేధాభిప్రాయం కూడా కాదు. కాని ఇక్కడ అసలు వ్యవహారం వేరే ఉంది. ముస్లిముల్లో ఈ సమస్య జనించడానికి కారణం ఏమిటంటే, పవిత్రత, పరిశుద్ధత, పరదా, నిఖాబ్‌లను యూరోప్ సమాజం చాలాహీన దృష్టితో చూసింది. తమ సాహిత్యంలో పరదాను అత్యంత భయానకంగా, అవమానకరంగా చిత్రించింది. 'ఇస్లాంలో స్త్రీ ఇంటి నాలుగు గోడల మధ్య బందీ' అని ఊదరగొట్టింది. ఇదంతా చూసి ముస్లిములు ఎప్పటిలాగే సిగ్గుతో చితికి పొయ్యారు. జిహాద్ విషయంలో, బహుభార్యత్వం విషయంలో, దాస్యం విషయంలో ఎంత నిస్సిగ్గుగా స్పందించారో, ఈ విషయంలో కూడా అంతకంటే భిన్నంగా ఏమీ స్పందించలేకపొయ్యారు. ఈ మరకను చెరిపివేయడానికి, ఖుర్‌ఆన్ హదీసుల్లో, సంఘసంస్కర్తలైన ధార్మిక విద్వాంసుల పరిశోధనల్లో ఏమైనా ఆధారాలు దొరుకు తాయా, లేదా? అనే కోణంలో ప్రయత్నాలు జరిగాయి. కొంతమంది ఇమాములు చేతులు, ముఖం దాచనవసరం లేదని అనుమతినిచ్చారు. అవసరాల నిమిత్తం స్త్రీ ఇంటినుండి బయటకు వెళ్లవచ్చని, యుద్ధ మైదానంలో సైనికులకు వైద్య సేవలు అందిం చడం, నీటి సౌకర్యం కల్పించడం లాంటి సేవలందించడానికి, నమాజు కోసం మస్జిదులకు వెళ్లడానికి, విద్యార్జన చేయడానికి, ప్రసంగాలు చేయడానికి కూడా వెసులుబాటు ఉంది. స్త్రీల గౌరవానికి భంగం కలగని విధంగా అన్ని రకాల వెసులుబాటు ధర్మంలో ఉంది. దీన్ని ఆసరాగా చేసుకుని ఇస్లాంలో స్త్రీలకు సంపూర్ణ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలున్నాయని, పరదా కేవలం ఓ అజ్ఞాన దురాచారం మత్రమేనని, సంకుచిత మనస్కులైన చాందసవాదులు ప్రవక్త మహనీయులు ఇహలోకం వీడిన చాలాకాలం తరువాత తెరమీదికి తెచ్చారు. ఖుర్‌ఆన్ హదీసుల్లో పరదాకు సంబంధించిన ఆదేశాలేలేవు, అందులో కేవలం సిగ్గు బిడియాలు, నైతిక ప్రవర్తన గురించి మాత్రమే చెప్పబడిందని, స్త్రీలు ఇలా మసలుకోవాలి, అలా మసలుకోవాలన్న నిర్ధష్టమైన ఆజ్ఞలు ఆదేశాలు లేవని వాదించడం జరిగింది.

## అసలు ప్రేరణ

మానవుడు తన జీవన వ్యవహారాల్లో ఒక విధానాన్ని అవలంబించాలను కున్నప్పుడు, సాధారణంగా ఆ విధాన ఎంపికలో ప్రప్రథమంగా భావోద్రేకాలే ప్రధాన పాత్రపోషిస్తాయి. ఇది మానవుడి సహజ బలహీనత. తరువాత ఈ వైఖరిని సమర్థించడానికి మనిషి బుద్ధిని, తర్కాన్ని ఆశ్రయిస్తాడు. పరదా విషయంలో కూడా ఇదే జరిగింది. తర్కబద్ధంగానో, ధార్మిక అవసరాల దృష్ట్యానో ఈ వివాదం

ప్రారంభంకాలేదు. నిజానికిది ఇస్లామీయ నాగరికతను, సంస్కృతిని తిట్టిపోస్తూ, ప్రగతిపథంలో దూసుకుపోతున్నామన్న భ్రమను కలిగిస్తూ, సాగిన దుష్ప్రచారానికి ప్రభావితమైన ఫలితమే ఈ సమస్య.

మన సోకాల్డ్ సంస్కరణావాదులు యూరోపియన్ స్త్రీల అందచందాలను, వారి స్వేచ్ఛా విహారాన్ని, యూరప్ సమాజంలో వారి కార్యకలాపాల్ని కళ్లప్పగించి చూస్తూ, అయ్యయ్యో! మన మహిళలు కూడా ఈ విధానాన్నే అనుసరిస్తే, మన సమాజం, మన సంస్కృతి కూడా వీరితో సరితూగేది కదా! అన్నభావన అప్రయత్నంగా వారి మనస్సుల్లో కదలాడింది. అంతేకాదు, స్త్రీ స్వేచ్ఛ, స్త్రీ విద్య, స్త్రీ పురుష సమానత్వం లాంటి ఆధునిక భావాల ఫలితంగా వారిపై వర్షిస్తున్న శక్తివంతమైన సైద్ధాంతిక భాష, సాహిత్యం వైద్య, విజ్ఞాన ప్రగతి కూడా వారిని ప్రభావితం చేసింది. ఈ సాహితీ ప్రకర్ష ముందు వారి విమర్శనా పటిమ శక్తి వెలవెలబోయింది. యూరో పియన్ సిద్ధాంతాన్ని కళ్లు మూసుకుని అంగీకరించి, తమ ప్రసంగాల్లో, రచనల్లో యూరప్ సాహిత్యాన్ని ఉటంకించడం, దాన్ని మనసా, వాచా, కర్మణా ఆచరించడమే ప్రగతి శీలతకు ప్రమాణమన్న భావన వారి అంతరంగాల్లో నాటుకుపోయింది. ఛాందసవాదం, తిరోగమన వాదమన్న అపప్రద నుండి బయట పడాలంటే ఇదొక్కటే మార్గమని కూడా భావించబడింది. హుందాతనం ఉట్టిపడే నిరాడంబర వస్త్రధారణ, పరదా నిఖాబ్ లను అవహేళనచేస్తూ, అవమానకరంగా మాట్లాడుతుంటే, ఈ సోకాల్డ్ సంస్క రణా వాదులు సిగ్గుపడిపొయ్యేవారు. చివరికి ఈ అవమానకరమైన మరకను రూపుమాపడానికి సిద్ధమైపొయ్యారు.

పందొమ్మిదో శతాబ్దం చివరిలో ముస్లింలలో ప్రారంభమైన ఈ స్త్రీ స్వేచ్ఛా ఉద్యమానికి అసలు కారణం ఇలాంటి భావనలే. కొంతమంది తమలో ఇలాంటి ఆలోచనలు ఎందుకు జనించాయో తెలియని స్థితిలో పడిపొయ్యారు. నిజానికి వీరు మనోకాంక్షల మాయలో పడి దాన్ని తెలుసుకోలేకపోతున్నారు. మరికొంత మందికి తమ ఆలోచనలు ఎందుకిలా వక్రమార్గం పట్టాయో పూర్తిగా తెలిసినప్ప టికీ, మనసు మూలాల్లో దాగిన అసలు భావాలను వ్యక్తం చేయడానికి వెనుకంజ వేసేవారు. వీరు ఎలాంటి మాయలో పడకుండా ఒక స్పష్టతతో ఉన్నప్పటికీ, ప్రపంచాన్ని మోసం చేసే ప్రయత్నం చేశారు. మొత్తంమీద ఈ రెండు రకాల వాళ్లూ ఒకే పని చేశారు. తమ ఉద్యమానికి అసలు కారణాలను దాచిపెట్టి, ఏదో ఉద్రేకంలో పుట్టుకొచ్చిన ఉద్యమానికి, ప్రామాణికతను అంటగట్టే ప్రయత్నం చేశారు. స్త్రీ ఆరోగ్యం, వారి వృద్ధీవికాసాలు, వారి హక్కులు, ఆర్థిక ఎదుగుదల, పురుషుల

దౌర్జన్యాల నుండి వారి రక్షణ, సమాజంలో సగభాగ మైన కారణంగా, వారి వృద్ధీ వికాసాల ద్వారానే సమాజ అభివృద్ధి ఆధారపడి ఉందని చెప్పడం, ఈ విధంగా యూరపునుండి దిగుమతి చేసుకున్న అనేక అవలక్షణాలు ఈ ఉద్యమానికి ఊపిరి అని చెప్పడం జరిగింది. నిజానికి అసలు ఉద్దేశ్యం యూరప్‌లో అమల్లో ఉన్న అన్ని విధానాలను అవలంబింపజేసి, ముస్లిం స్త్రీలు కూడా వారిని అనుకరించే విధంగా మలచడం. ఈ నిజాలేవీ వారికి తెలియకుండా భ్రమల్లో ఉంచి, మోసగించడం జరిగింది.

## నయవంచన

ఈ విషయంలో అన్నిటికన్నా పెద్ద మోసం ఏమిటంటే, ఖుర్‌ఆన్ హదీసుల పరంగా ఇది ఇస్లాంకు వ్యతిరేకం కాదు, అనుకూలమేనని నిరూపించే ప్రయ త్నాలు చేయడం. నిజానికి ఇస్లాం, మరియు పాశ్చాత్య సభ్యతా సంస్కృతుల్లో భూమ్యాకాశాల మధ్య ఉన్నంత అంతరం ఉంది. మానవుడి లైంగిక శక్తి సామ ర్థ్యాలను (**Sexual energy**) చెడు తిరుగుళ్లలో, అనైతిక కార్యకలాపాల్లో దుర్వి నియోగం కాకుండా, నైతికతకులోబడి ఒక పవిత్రమైన, పరిశుద్ధమైన సమాజ నిర్మాణానికి ఉపయోగపడా లన్నది అసలు ఇస్లాం ముఖ్య ఉద్దేశం. దీనికి భిన్నంగా పాశ్చాత్య సంస్కృతి ఉద్దేశ్యం ఏమిటంటే, సామాజిక వ్యవహారాలన్నిటిలో స్త్రీ పురుషులిద్దరికీ సమాన భాగస్వామ్యం కల్పించి, భౌతిక ప్రగతిని వేగవంతం చేయడం దీంతోపాటు, లైంగిక భావోద్రేకాలను, జీవన పోరాటంలో ఎదురయ్యే మానసిక ఒత్తిళ్లను అధిగమించదానికి జీవితాన్ని ఆనందమయం చేసుకునే ఒక కళగా సద్వినియోగం చేసుకోవడం. లక్ష్యాలు, ఉద్దేశ్యా ల్లోని ఈ విబేధాల కారణంగా, సామాజిక విధి విధానాల్లో కూడా ఇస్లాం మరియు పాశ్చాత్య సంస్కృ తుల మధ్య మౌలికమైన సైద్ధాంతిక విబేధాలున్నాయి. ఇస్లాం ప్రకారం, సామాజిక వ్యవస్థలో స్త్రీ పురుషుల కార్యనిర్వాహణా పరిధులు చాలావరకు వేరువేరుగానే ఉన్నాయి. స్త్రీ పురుషులు ఒకరి వ్యవహారాల్లో ఒకరు జోక్యం చేసు కోవడం, స్వేచ్ఛగా రాసుకుపూసుకు తిరగడం లాంటి క్రమశిక్షణారాహిత్య వ్యవహా రాలన్నిం టినీ నిరోధించడం జరిగింది. దీనికి వ్యతిరేకంగా పాశ్చాత్య సంస్కృతి స్త్రీ పురుషులిద్దరినీ ఒకే మైదానంలోకి, ఒకే కార్యపరిధిలోకి తీసుకు వచ్చి, వారి స్వేచ్ఛాకలయికకు మధ్య అడ్డుగా ఉన్నటువంటి అన్నిరకాల తెరలను తొలగిం చింది. ఈ విధంగా పరస్పరం ఆకర్షణకులోనై లైంగికానందం పొందే అన్ని అవకాశాలను అందించాలన్నది పాశ్చాత్య సంస్కృతి అసలు ఉద్దేశం.

ఎవరైతే, పాశ్చాత్య సంస్కృతిని అనుసరించాలని ఆరాటపడుతూ, ఇస్లామీ సామాజిక వ్యవస్థ చట్టాలను తమ అభిమతానికి, తమ వాదానికి ఆధారాలుగా వాడుకుంటారో, అలాంటివారు ఎంత భ్రమలో ఉన్నారో, ఇతరుల్ని ఎంతగా వంచిస్తున్నారో, విజ్ఞులైన ప్రతి ఒక్కరూ అర్థం చేసుకోవాలి. ఇస్లాంలో స్త్రీలు తమ అవసరాలకనుగుణంగా ముఖం, చేతులు కనబడే విధంగా వస్త్రధారణ చేయవచ్చు. ఇంటి నుండి బయటికీ వెళ్లవచ్చు. ఇది ఇస్లాం వారికి కల్పించిన చివరి అవకాశం. అంటే అనవసరంగా ఇల్లొదిలి తిరగడం, నిఖాబ్ లేకుండా తిరగడం ధర్మం కాదు. కాని ప్రజలు అత్యవసర పరిస్థితుల్లో వినియోగించుకునే ఈ చివరి అవకాశాన్ని, ప్రారంభ సూచికగా తలపోస్తున్నారు. ధర్మం ఆగిపొమ్మన్న దగ్గరే వీరు ప్రారంభిస్తున్నారు. చివరికి సిగ్గూ శరమూ అన్నీ విడిచేస్తున్నారు. ముఖమూ చేతులేకాదు, తలపైని పాపిడి, అందమైన మెడ, విశాలమైన బాహువులు, వక్షస్థలం కూడా సగం వరకూ కనబడే విధంగా తేరగా ప్రదర్శించడం జరుగుతుంది. మిగతా శరీర అవయవాలు కూడా ఉల్లిపొరల్లాంటి పల్చని వస్త్రాలతో, లోపలి అందాలు బయటికి తన్నుకొచ్చి, పురుషుల మనో వాంఛల్ని సంతృప్తిపరచగలిగేలా అలంకరించడం జరుగుతోంది. ఈ విధమైనటువంటి వస్త్రధారణతో, అలంకరణలతో పర పురుషుల ముందుకు వెళ్లడం, పురుషులు తమ స్త్రీలను అంటే భార్య, కూతుళ్లు, చెల్లెళ్లు తదితరులను పార్టీలకు తీసుకు వెళ్లడం, వారు పరాయి వారితో చనువుగా కలిసిపోవడం, ఇకఇకలు, పకపకలు, సరదాలు, అన్నిరకాల స్వేచ్ఛాయుత వాతావరణాన్ని కల్పించడం, ఒకరకంగా ముస్లిం స్త్రీ తన తోబుట్టువులతో కూడా మసలుకోలేనంత చనువు కల్పించడం జరుగుతోంది. అవసరార్థం నిండు వస్త్రధారణతో, గౌరవప్రదంగా ఇంటినుండి బయటికి వెళ్లే అనుమతిని అవహేళన చేస్తూ, కళ్లు చెదిరే చీరలు, సగం వక్ష స్థలం, మెడ, వీపు, నడుము ఒంపుసొంపులు కనిపించే విధంగా జాకెట్లు (రవికెలు) ధరించి ఏమాత్రం జంకూగొంకూ లేకుండా బజార్లు, పార్కులు, హోటళ్లు, సినిమా హాళ్లలో తిరగడానికి దుర్వినియోగం చేయడం జరుగుతోంది. గృహబాధ్యతలకు అదనంగా ఇతర కార్యరంగాల్లో పాలుపంచుకోడానికి ఇస్లాం, స్త్రీలకు కొన్ని షరతులతో కూడిన అనుమతినిచ్చింది. ఇందులో ఎలాంటి సందేహంలేదు. అయితే దీన్ని ఆసరాగా చేసుకొని ముస్లిం స్త్రీలు కూడా యూరోపియన్ స్త్రీ జీవన విధానం అవలంబించాలని, వారు తమ కుటుంబ నిర్వహణా బాధ్యతలను తుంగలో తొక్కి, రాజకీయ, ఆర్థిక వ్యవహారాల్లో నాయకత్వం స్వీకరించి, అన్నిరంగాల్లో పురుషులకు దీటుగా శ్రమించాలని వాదించడం, వాంఛించడం మాత్రం అభిలషణీయం కాదు.

భారతదేశంలో వ్యవహారం ఇక్కడితోనే ఆగిపోయింది. కాని, ఈజిప్ట్, టర్కీ ఈరాన్ దేశాల్లో రాజకీయ స్వేచ్ఛ కలిగిన కొంతమంది భావదాస్యప్రియులు మరో పదడుగులు ముందుకు వేశారు. అక్కడి స్త్రీలు సరిగ్గా యూరోపియన్ స్త్రీలు ధరించే వస్త్రాలే ధరించడం ప్రారంభించారు. ఇంతకంటే శోచనీయమైన విషయం ఏమిటంటే, లోదుస్తుల్లో సముద్రతీర స్నానాలు చేస్తున్న టర్కీ స్త్రీల ఫోటోలు కూడా ప్రపంచం చూడాల్సిన దుస్థితి దాపురించింది.

ఇంతటి నీచమైన, సిగ్గుమాలిన జీవన విధానాన్ని సమర్థించుకోడానికి, ఖురాన్ హదీసుల్లో ఆధారాలను అన్వేషించాలనుకోవడం ఎంతటి దుస్సాహసం. ఆ విధానమే మీకంతగా నచ్చితే, మేము ఇస్లాంను, దాని చట్టాలను వ్యతిరేకిస్తు న్నాము. అని స్పష్టంగా ప్రకటించేసి నిరభ్యంతరంగా వెళ్ళిపోవచ్చు. అంతేకాని, ఖురాన్ నిషేధించిన ఒక్కొక్క విషయాన్ని నిస్సిగ్గుగా అవలంబిస్తూ, దానికి కూడా ఖుర్ఆన్ పేరునే మళ్ళీ వాడుకోవడం ఏ విధమైన నైతికం. అంటే ప్రారంభంలోనే ఖుర్ఆన్ పేరెత్తితే మీరు అవలంబించే మార్గం సరైందని ప్రజలు భావిస్తారనా?

## మనమేం చేయాలి?

ఇదీ 'ఆధునిక ముస్లిం' దుస్థితి. ఈ పరిస్థితిలో మన ముందు రెండు చర్చనీయాంశాలున్నాయి. వీటిపై దృష్టిసారించడానికే ఈ గ్రంథ ప్రయత్నం.

మొట్టమొదట మనం మానవాళికంతటికీ, ఇస్లామీయ సామాజిక వ్యవస్థ స్వరూప స్వభావాలను వివరించాల్సిన అవసరం ఉంది. ముస్లింలు, ముస్లిమే తరులు అన్న తారతమ్య లేకుండా అందరికీ 'పరదా'కు సంబంధించిన ఆదేశా లనూ తెలియజేయాలి.

రెండవ విషయం ఏమిటంటే, ఈ ఆధునిక ముస్లింలకు ఖుర్ఆన్, హదీసుల హితోపదేశాలు, పాశ్చాత్య సమాజం వారి సంస్కృతిలోని విధానాలు, వాటి దుష్ఫలితాలను ఒకదాంతో ఒకటి పోల్చుతూ అసలు నిజాన్ని అవగత పరచాలి. ఈ విధంగానైనా వారు, తాము అవలంభిస్తున్న కాపట్య వైఖరిని విడనాడి, నిజాయితీగా తమ ముందున్నటువంటి రెండు మార్గాల్లో ఉత్తమ మార్గాన్ని అవలంబించగలుగుతారు. అంటే, ముస్లింలుగా ఉండదలచుకుంటే ఇస్లాం చూపే మంచి మార్గంపై నిలకడగా ఉంటూ, దాని ఆజ్ఞలను శిరసావహిం చాలి. అలా కాదనుకుంటే, పాశ్చాత్య సంస్కృతినే అవలంబిస్తూ, వక్రమార్గంవైపే, వినాశంవైపే వెళ్ళాలనుకుంటే, ఇస్లాంతో తెగతెంపులు చేసుకుని వెళితే మంచిది.



## మూడవ అధ్యాయం

# దృక్పథాలు

పరదా వ్యతిరేకతకు అనేక కారణాలున్నాయి. దాన్ని రూపుమాపడమొక్కటే అసలు కారణం కాదు. స్త్రీలు కేవలం పరదా కారణంగా ఇళ్లలోంచి బయటికి రాలేక బందీల్లా ఉండవలసి వస్తోంది కాబట్టి దాన్ని నిర్మూలించాలన్నది వారి అభిమతం కానేకాదు. అసలు విషయం ఏమిటంటే, స్త్రీల జీవన విధానానికి, వారి నడవడికకు సంబంధించి వారి మనసులో వేరే ఆలోచన ఉంది. స్త్రీ పురుష సంబంధాల విషయంలో కూడా వారొక అభిప్రాయం కలిగి ఉన్నారు. స్త్రీలు ఇలా కాదు, 'మరోలా' ఉండాలి అన్నది వారి అభిలాష. కాని, పరదా పాటించే స్త్రీలు తమ జీవన విధానంలో మార్పులు చేసుకోవడంగాని, వారనుకునే విధంగా 'మరోలా' ఉండడం కాని సాధ్యమయ్యే పనికాదు. అదీ పరదాపట్ల వారి వ్యతిరేకతకు అసలు కారణం.

ఇప్పుడు మనం ఆ 'మరోలా' అన్న విషయం ఏమిటో, దాని వెనుక ఉన్నటు వంటి కారణాలు, సూత్రాలేమిటో, అది ఎంతవరకు సమంజసమో, దాని ఆచరణాత్మక ఫలితాలెలా ఉంటాయో తెలుసుకోవాలి. ఒకవేళ వారి విధానాలనే యథాతథంగా అంగీకరించినట్లయితే, సామాజిక వ్యవస్థలో భాగమైన 'పరదా' నిజంగానే ఒక తప్పుడు ఆచారమవుతుంది. కాని ఏవిధమైన పరిశీలన చేయకుండా, అనాలోచితంగా, కళ్లుమూసుకొని ఎలా అంగీకరించగలం? కేవలం ఆధునికత కారణంగా, లేక లోకంపోకడ అలానే ఉండడం వల్ల, ప్రపంచమంతటా ఒక విషయం బాగా ప్రాచుర్య పొందింది కాబట్టి, మరో ఆలోచనకు తావు లేకుండా, వెనుకా ముందూ ఆలోచించ కుండా, గుడ్డిగా ఎలా అనుసరించగలం?

### స్వేచ్ఛాభావన

పద్ధెనిమిదవ శతాబ్దపు సామాజిక వ్యవస్థలో రకరకాల అవలక్షణాలు, అవరోధాలు ఉండేవి. ఎంతమాత్రం ఆమోదయోగ్యం కాని దురాచారాలు, కరుడు గట్టిన సిద్ధాంతాలు, బుద్ధికందని, ప్రకృతికి విరుద్ధమైన అనేక విషయాలుండేవి. అలాంటి వ్యవస్థలో సంస్కరణలు తీసుకురావాలని తత్వవేత్తలు, సామాజిక కార్యకర్తలు,

రచయితలు, కళాకారులు కృషిచేశారు. ఒకవైపు నూతన ఆలోచన, ఆచరణా విధానం జనసామాన్యాన్ని జాగృతం చేస్తూ, స్వయం కృషితో ముందుకు సాగడానికి శక్తివంచన లేని ప్రోత్సాహం అందిస్తుంటే, మరోవైపు నాయకులు, మత గురువుల వర్గం వారిని తమ అదుపాజ్ఞల్లో  ఉంచుకొని మతాచారాలు, కట్టుబాట్ల ఆంక్షలు విధించడంలో లీనమైపోయింది.  చర్చి మొదలు సైన్యం, న్యాయ వ్యవస్థ అధికారాల వరకు, రాజదర్బారు మొదలు వ్యాపార, వ్యవసాయ సముదాయాల వరకు వ్యక్తిగత, సామాజిక జీవితంలోని అన్ని రంగాల్లోనూ మొదటినుండీ అమల్లో ఉన్న హక్కులను ఆధారంగా చేసుకొని కొన్ని ప్రత్యేక వర్గాలు ఇప్పుడిప్పుడే పుంజుకుంటున్న సామాన్య వర్గ ప్రజల శ్రమను, శక్తి సామర్థ్యాలను దోచుకునేవారు. ఈ పరిస్థితుల్ని చక్కదిద్దడానికి చేసే ప్రతి ప్రయత్నమూ అధికార వర్గ స్వార్థం వల్ల, అజ్ఞానం వల్ల విఫలమై పొయ్యేది. ఈ కారణాల వల్ల సంస్కరణ కోసం కృషి చేసేవారిలో, అభిలషించే వారిలో నిరాశా వాదం ప్రబలి, అదికాస్తా తిరుగుబాటుకు దారితీసింది. ఈ విధంగా మొత్తం సామాజిక వ్యవస్థ, అందులోని సమస్త రంగాలకు వ్యతిరేకంగా విద్రోహ భావనలు తలెత్తాయి. వ్యక్తి స్వేచ్ఛ అనే ఒకరకమైన అతివాద ధోరణి ప్రబలింది. దీని ఉద్దేశ్యం, సామూహికత, సామాజికతకు బదులు, ప్రతి ఒక్కరికీ వ్యక్తిగత స్వేచ్ఛతోపాటు స్వేచ్ఛను ప్రసాదించడం. అంటే ఒకవ్యక్తి సర్వ స్వతం త్రంగా, తన ఇష్టానుసారం ఏ పనినైనా చేయడానికి, లేక తిరస్కరించడానికి సంపూర్ణ హక్కు, స్వేచ్ఛ ఉండాలి. అతని వ్యక్తి గత స్వేచ్ఛను హరించే హక్కుగాని, అధికారంగాని సమాజానికి ఉండకూడదు. ఈ వ్యక్తి స్వేచ్ఛను పరిరక్షించే బాధ్యత ప్రభుత్వానిదే. సామాజిక సంస్థలు కేవలం అతనికి సహాయ సహకారాలు అందించడానికి మాత్రమే పరిమితం కావాలి. వ్యక్తిగత స్వేచ్ఛలో జోక్యం చేసుకునే అధికారం వాటికి ఉండరాదు.

అతిశయాలతో, అత్యంత ప్రమాదకరమైన క్రిములతో నిండి ఉన్న ఈ స్వేచ్ఛాభావన నిజానికి  ఒక  దుర్మార్గ పూరితమైన, సామాజిక వ్యవస్థకు వ్యతిరేకంగా ఉనికిలోకి వచ్చింది మాత్రమే. దీన్ని ప్రారంభించిన వారికి సైతం ఈ విషయంలో పూర్తి సైద్ధాంతిక అవగాహనలేదు. దీని భయానక ఫలితాలు గనక తెలిసిఉంటే, వారి ఆత్మలు కూడా గజగజ వణికిపొయ్యేవి. ఏ విధమైన నియంత్రణలేని, స్వార్థంతో కూడుకున్న స్వేచ్ఛ ప్రతిఫలిస్తుందనుకుంటే వారు నిజంగానే భీతిల్లిపోయ్యేవారు. వారు కేవలం, భరింపశక్యం కాని ఎంతమాత్రం ఆమోద యోగ్యం  కాని  బంధనాలను తెంచి పారేయడం కోసం ఆ కాలపు సమాజంలో అందుబాటులో ఉన్న సాధనాలను

ఆయుధంగా వాడుకోవాలను కున్నారు. కాని చివరికి ఈ భావన పాశ్చాత్య మనో మస్తిష్కాల్లో వేళ్లూనుకొని ఏపుగా పెరగడం ప్రారంభించింది.

## పందొమ్మిదో శతాబ్దపు మార్పులు

ఫ్రాన్స్ విప్లవం ఈ స్వేచ్ఛా భావనల స్ఫూర్తితోనే ఊపిరిపోసుకుంది. దీని కారణంగా అనేక సనాతన సంప్రదాయాలను, సంస్కృతీ సభ్యతలను, నైతిక కట్టుబాట్లను అపహాస్యం చేయడం జరిగింది. ఇలా చేయడం ప్రగతీ వికాసాలకు ఆధారమని రుజువైనందున విప్లవ ప్రేమికులు అనాదిగా చలామణిలో ఉన్న అన్ని ఆచార వ్యవహారాలూ ప్రగతికి అవరోధమనే నిర్ణయాని కొచ్చేశారు. వీటిని రూపుమాపనంతవరకూ ముందుకు సాగడం కష్టసాధ్య మన్నారు. ఫలితంగా క్రైస్తవం బోధించే తప్పుడు విధానాలను తుదముట్టించిన తరువాత, వారి విమర్శనా కరవాలం మానవ విలువల మూల భావాల వైపుకు మరలింది. అసలీ పవిత్రత, ప్రాతివత్యాలేమిటి? నవయవ్వనంపై ఈ భయభీతుల భారమేమిటి? ప్రేమంచే హక్కును హరించి వేయడానికి, వివాహం కాగానే మానవ హృదయం ఏమైనా మాయమై పోతుందా? ఎవరు ఎవరినైనా ప్రేమిస్తే ఏమైనా కొంపలంటుకుపోతాయా? ఈ విధమైనటువంటి అనేక ప్రశ్నలు ఆ సరికొత్త సమాజంలో అన్ని వైపుల నుండి దూసుకురావడం ప్రారంభమైంది. ప్రత్యేకంగా ఊహలపల్లకిలో ఊరేగే ఒక వర్గం ఈ భావాలను బాగా వంటబట్టిం చుకుంది. పందొమ్మిదో శతాబ్ద ప్రారంభంలో జోర్జ్‌సాన్ అనే మహిళ ఈ వర్గానికి నాయకురాలు. అనాదిగా మానవ నాగరికతకు, సభ్యతా సంస్కృతులకు పునాదిగా ప్రత్యేకించి స్త్రీ జాతి గౌరవ మర్యాదలకు ప్రాణపదంగా ఉన్న అన్ని నైతిక, మానవీయ విలువలను ఈమె తుంగలో తొక్కింది. ఒకరికి భార్యగా ఉంటూనే స్వేచ్ఛగా అనేక మందితో లైంగిక సంబంధాలు కొనసాగిం చింది. చివరికి భర్తను పూర్తిగా వదిలేసి, సంవత్సరానికొక స్నేహితుణ్ని (బోయ్‌ఫ్రెండ్) మార్చుతూ పోయింది. ఎవరితోనూ ఒకటీ, రెండేళ్లకు మించి బంధాన్ని కొనసాగించలేకపోయింది. ఆమె బహిరంగంగా సంబంధాలు కొనసాగించిన వారి పేర్లు కనీసం ఆరు మనకు అందుబాటులో ఉన్నాయి. ఈ ఆరుగురు ప్రియుల్లో ఒకరు ఆమెను ఇలా పరిచయం చేస్తున్నారు.

జోర్జ్‌సాన్ మొట్టమొదట ఒక అందమైన చిలుకను (ప్రియుణ్ని) పట్టుకొని, దాన్ని రంగుపూల పంజరంలో బంధిస్తుంది. ఇది ఆమె వలపుల దశ. రెండవ దశలో, ఆమె దానిపై ప్రేమ ఒలకబోస్తూనే తీవ్రంగా హింసిస్తుంది. పాపం ఆ

చిలక బాధతో గిలగిలా కొట్టుకుంటుంది. అప్పుడామె ఎంతగానో ఆనందిస్తుంది. ఇది ఆమెలోని స్వార్ధపూరిత నిర్దయ దశ. ఇక చివరి దశలో దాని రెక్కలు కత్తిరించి, ముక్కలు చేసి, మాజీ జాబితాలో పడేసి, ఆ పాత్రను తన నవలలకు హీరోపాత్రల కోసం వాడుకుంటుంది.

ఆల్‌ఫ్రెడ్ మోసె అనే ఫ్రాన్స్ కవి కూడా ఆమెకున్నటువంటి అనేకమంది ప్రియుల్లో ఒకడు. ఇతను కూడా ఆమె విశ్వాసఘాతుకానికి విరక్తిచెంది, చరమదశలో, తన మరణానంతరం శవాన్ని చూడడానికి కూడా ఆమె రావడానికి వీల్లేదని విల్లు రాశాడు. దాదాపు ముప్ఫయ్యేళ్లపాటు సంచలనాత్మకమైన అశ్లీల సాహిత్యంతో ఫ్రాన్స్ యువతరాన్ని అనైతిక కార్యకలాపాల్లో ఉర్రూతలూగించిన జోర్జ్‌సాన్ వ్యక్తిత్వం ఇది. ఈమె లీలియో అనే తన నవలలో ఇలా రాస్తుంది:-

"ఈ ప్రపంచాన్ని చూసే అవకాశం నాకు విస్తారంగా లభించింది. ఈ క్రమంలో ప్రేమకు సంబంధించి మన యువకుల అభిప్రాయాలు ఎంత తప్పో నేను గమనించాను. ప్రేమ కేవలం ఒక్కరికే పరిమితం కావాలి. పూర్తి అధికారం ఒక్కరికే ఉండాలి, అది కూడా శాశ్వతంగా ఉండాలి అన్న భావన పూర్తిగా అర్థం లేనిది. సరే, ఎవరి అభిప్రాయాలు వారివి. అందరి అభిప్రాయాలనూ గౌరవించాల్సిందే. కొంతమంది జీవులకు దాంపత్య జీవితంలో విధేయత పాటించే హక్కు ఉంటుంది. నేను దీన్ని అంగీకరిస్తాను. కాని, ఎక్కువ శాతం కొన్ని ఇతర అవసరాలు, అర్హతలు కలిగి ఉంటారు. అందుకని ఆలుమగలు పరస్పరం స్వేచ్ఛను ఇచ్చి పుచ్చుకొంటూ, ప్రేమతో ముందుకు సాగాల్సిన అవసరం ఉంది. రాగద్వేషాలకు తావు కలిగించే స్వార్థాన్ని విడనాడాలి. 'ప్రేమ'- అది ఏ రూపంలో ఉన్నా సరైనదే. భావోద్రేక పూరితమైనదైనా, అశాశ్వత మైనదైనా, ప్రజల్ని ఆత్మహత్యల వైపుకు ప్రేరేపించేదైనా, మజాను, మాధుర్యాన్ని పంచిపెట్టేదైనా. ఈ అన్ని రూపాలూ సరైనవే. వీటన్నిటినీ నేను సమర్ధిస్తాను.

తన మరో నవల 'జాక్స్' (Joacues)లో ఆదర్శ భర్త ఎలా ఉంటాడో చెబుతూ తనతో ఆచరణాత్మకంగా అలా మసలుకున్న మాజీ భర్త పాత్రను అందులో చిత్రీకరించింది. జాక్ ఆ నవల హీరో. అతని భార్య మరోపురుషునికి తనను తాను సమర్పించుకుంటుంది. కాని విశాల హృదయుడైన తను ఆమెను ఎంతమాత్రం తప్పుపట్టడు. పైగా తను భార్యను ఎందుకు అసహ్యించుకోడో చెబుతూ, ఒక పువ్వు నాకు బదులు మరొకరికి తన పరిమళాన్ని పంచుతున్నప్పుడు, దాన్ని నలిపి వేసే

హక్కు నాకు ఎలా ఉంటుంది? అని ప్రశ్నిస్తాడు. మరికాస్త ముందుకు వెళితే ఇదే నవలలో రచయిత్రి జాక్ నోట అతని భావాలను ఇలా వ్యక్తీకరింపజేస్తుంది. "నేను నా అభిప్రాయాన్ని మార్చుకోలేదు. సమాజంతో ఎలాంటి ఒప్పందమూ చేసుకో లేదు. సమాజంలో అమలవుతున్న అన్ని పద్ధతుల్లోనూ, వివాహం ఒక అమానవీయ విధానమన్నది నా అభిప్రాయం. ఏదో ఒకనాడు ఈ విధానం అంతమైపోతుందని నేను నమ్ముతున్నాను. మానవ సమాజం బుద్ధి బలాన్నుపయోగించి గనక ఆలోచించి నట్లయితే, 'వివాహబంధం' కంటే ఉత్తమమైన, అత్యున్నత మానవీయ విధానం ఉనికిలోకొస్తుంది. అప్పుడు స్త్రీ పురుషులు ఒకరిపై ఒకరు ఏ విధమైన ఆంక్షలు, కట్టుబాట్లు విధించుకో కుండా, స్వేచ్ఛగా ముందుకు సాగుతారు. ప్రస్తుతానికైతే, పురుషుల్లో స్వార్థం, పిరికితనం కనబడుతోంది. వీరిలో ఏ ఒక్కరూ ప్రస్తుతం చలామణిలో ఉన్న చట్టాలకంటే ఉత్తమ చట్టాల కోసం డిమాండ్ చేయడం లేదు. అయితే, ఆలోచనాపరుల్ని, న్యాయప్రేమికుల్ని మాత్రం పటిష్టమైన బంధనాల్లో బిగించి ఉంచడమే మంచిది.

ఇవి దాదాపు క్రీ.శ. 1833 నాటి కాలంలో వ్యక్తమైన అభిప్రాయాలు, ఆలోచనలు. జార్జ్‌సాన్ ఇంతవరకే వెళ్లగలిగింది. ఈ భావాలకు సైద్ధాంతిక రూపం కల్పించి ఫలితాలు రాబట్టే సాహసం మాత్రం చేయలేకపోయింది. ఎందుకంటే, ఎంత విశృంఖల భావాలున్నప్పటికీ, ఎంతోకొంత సనాతన ఆచారాల ప్రభావమూ ఆమెపై లేకపోలేదు. అనంతరం ముప్ఫయి, ముప్ఫై ఐదు సంవత్సరాల తరువాత ఫ్రాన్స్‌లో రంగస్థల కళాకారులు, కవులు తత్వ వేత్తలతో కూడిన మరో వర్గం ఉనికిలోకి వచ్చింది. అలెక్సాండర్ (Alexander Dumos) ఆల్‌ఫ్రెడ్‌నాకేల్ ((Alfred Naquet) దీనికి సారథులు. స్వేచ్ఛగా జీవన మాధుర్యాన్ని గ్రోలడం మానవుల జన్మహక్కు. అంతే కాదు, దీన్ని హరించడం, దీనిపై నైతిక, సామాజిక ఆంక్షలు విధించడం వ్యక్తిస్వేచ్ఛ పై సమాజం జరిపే దౌర్జన్యం అని వారు ఉధృతంగా ప్రచారం చేశారు. దీనికి ముందు కేవలం ప్రేమ పేరుతో మాత్రమే వ్యక్తిగత స్వేచ్ఛకావాలన్న డిమాండ్ ఉండేది. కాని తరువాత వారికి మాత్రం ఇది బలహీనమైన పునాదిగా కనిపించ సాగింది. అందుకని వ్యక్తిగత స్వేచ్ఛ, తిరుగుబోతుతనం, ఆంక్షలు లేని వెసులుబాటుకు బుద్ధీ వివేకాలను జోడించి పటిష్ట పునాదులు నిర్మించే ప్రయత్నాలు ప్రారంభించారు. తద్వారా స్త్రీ పురుషులు తాము ఏమి చేయ దలచినా, ఎలాంటి సంకోచం లేకుండా, పరిపూర్ణ స్వేచ్ఛతో, సంతృప్తిగా చేసుకునే అవకాశం లభించాలి.

సమాజం వీరి స్వేచ్ఛను, విశృంఖలత్వాన్ని చూసి గుండెలు బాదుకునే బదులు, నైతికంగా దాన్ని ఆమోదించి, ధర్మ సమ్మతమేనని భావించాలి.

పందొమ్మిదో శతాబ్దం చివరి కాలంలో పౌల్ఆడం (Paul Adam), హెన్రీ, బటాలియో (Henry Batalle), పెర్‌లూయిస్ (Perrreluis) లాంటి అనేక మంది ఇతర కళాకారులు తమ పూర్తి శక్తి సామర్థ్యాలు యువతను వక్రమార్గం పట్టించడానికి, వారిలో విచ్చలవిడి తనాన్ని ప్రోత్సహించడానికే వెచ్చించారు. సనాతన సాంప్రదాయ భావనల ప్రభావం వల్ల, వారిలో కొద్దో గొప్పో మిగిలి ఉన్న జంకును, భయాన్ని పారద్రోలి ఎలాంటి భయభక్తులు లేనివారుగా తయారు చేయడం వీరి ఉద్దేశ్యం. పౌల్ఆడం Lamoral de L more అనే తన పుస్తకంలో, యువత అజ్ఞానాన్ని, వారి అహంకారాన్ని అవహేళన చేస్తూ, తాను ప్రేమిస్తున్న అమ్మాయి (లేక అబ్బాయి) తనంటే పడిచస్తుందని (పడిచస్తాడని) మనస్ఫూర్తిగా తననే ప్రేమిస్తుందని, (ప్రేమిస్తున్నా డని) ఆమె ఎప్పటికీ తనదేనని, తన ప్రేమ శాశ్వతమని', పచ్చి అబద్ధాలు చెప్పి ప్రజల్ని నమ్మించడానికి ప్రయత్నిస్తారని తీవ్రంగా అవమానిస్తారు.

ఇంకా ఇలా రాస్తున్నాడు:- 'ఇలా ఎందుకు జరుగుతుందంటే, - ప్రతి మనిషిలోనూ లైంగికానందాన్ని పొందాలన్న కోరిక సహజంగానే ఉంటుంది. ఇందులో ఎలాంటి తప్పుగాని, పాపంకాని లేదు. కాని ఛాందస భావాల కారణంగా దీన్ని తప్పుగా భావించడం జరుగుతోంది. అందుకని మనిషి అనవసరంగా అబద్ధపు పరదాల చాటున దీన్ని దాచడానికి ప్రయత్నం చేస్తాడు లాటిన్ జాతుల్లో ఉన్న పెద్ద బలహీనత ఏమిటంటే, ఆయా జాతుల్లోని ప్రేమ జంటలు, పరస్పర సంగమం ద్వారా తాము లైంగికానందానుభూతిని పొందు తున్నామని చెప్పడానికి కూడా వెనుకంజ వేస్తారు.'... తరువాత యువతరానికి సలహాలిస్తూ :-

'సభ్యతగల మంచి మనిషిగా రూపొందండి. మనోవాంఛలు, మాధుర్యాల బానిసలను ఆరాధ్యులుగా చేసుకోకండి. ప్రేమ మందిరాన్ని నిర్మించి, అందులో ఒకే దేవతను పూజించేవాడు పరమ అమాయకుడు. మాధుర్యానుభూతుల ప్రతి క్షణంలో ఒక కొత్త అతిధిని ఎంచుకోవాలి.' అంటాడు.

Pierraluis అందరికన్నా నాలుగడుగులు ముందుకేసి, 'నైతిక కట్టుబాట్లు మానవుల మేధో వికాసానికి, శక్తి సామర్థ్యాలకు ప్రధాన అవరోధం' ఈ శృంఖలాలను తెంచనంతవరకూ మానవుడు స్వేచ్ఛగా శారీరక మాధుర్యా నుభూతుల్ని పొందలేడు.'

అని విస్పష్టంగా ప్రకటించేశాడు. అంతేకాదు, ఏ విధమైన బుద్ధీజ్ఞానాల, భౌతిక, ఆధ్యాత్మిక పరమైన వృద్ధీ వికాసాలూ సాధ్యం కావని తేల్చేశాడు. బాబిలోనియా, అలెగ్జాండ్రియా, ఏథెన్స్, రోమ్, వెనిస్‌లతో పాటు అనేక నాగరిక, సాంస్కృతిక కేంద్రాలన్నీ అత్యంత వైభవోపేతంగా, ప్రగతి శిఖరాలకు ఎదగడానికి కారణం, అక్కడ హద్దులు మీరిన స్వేచ్ఛ, విచ్చలవిడితనం, మనోవాంఛల దాస్యం (Licentiu-suesss) తదితర విషయాలు జోరుగా కొనసాగడమే. ఎప్పుడైతే అక్కడ మానవుల స్వేచ్ఛపై, వారి మనోవాంఛ లపై నైతిక కట్టుబాట్లు విధించడం జరిగిందో, అప్పుడే వారి ఆత్మకూడా ఆ బంధనాల్లో చిక్కుకుపోయిందని రుజువు చేయడానికి అతడు **Aphrodite** అనే తన గ్రంథంలో తీవ్రంగా ప్రయత్నించాడు.

Pierreluis అనేవాడు ఆ కాలంలో ఫ్రాన్స్‌లో గొప్పకవి, సాహితీవేత్త. ఓ ప్రఖ్యాత సంగీత కళాశాల వ్యవస్థాపకుడు, నిర్వాహకుడు. ఇతని సారథ్యంలో, ఇతని భావజాలాన్ని ప్రచారం చేయడానికి కథకులు, కవులు, రంగస్థల నటులు, సాహితీ కారుల ఓ బృందం ఉండేది. అతడు తన సాహితీ ప్రకర్షణనంతా అశ్లీలతను, విశృంఖలత్వాన్ని ప్రచారం చేయడానికే వినియోగించాడు. పైన పేర్కొన్నటువంటి Aphrodite అనే పుస్తకంలో యూనాన్‌లోని ఆ కాలాన్ని ప్రశంసిస్తూ ఇలా రాస్తాడు:-

మానవ దిగంబరత్వం – దీని సంపూర్ణ స్వరూపాన్ని మనం ఊహించ గలం. దైవం స్వయంగా తన రూపంలో దీన్ని సృజించాడని మత పెద్దలు మనలో విశ్వాసం కలిగించారు. ఇదొక పవిత్ర వేశ్య రూపంలో 20వేల మంది వీక్షకుల ముందు తనను తాను ప్రదర్శించవచ్చు. కామ ప్రేమకు ఇదొక పరాకాష్ట – ఆ పవిత్ర, ఆకాశ ప్రేమ ద్వారానే మనమంతా జన్మించాము. ఇది పాపం కాని, సిగ్గుకాని, అసహ్యం కాని, నీచం కాని కాదు.

అంతేకాదు, అన్ని రకాల సాహిత్య తెరలనూ తొలగించి అతడింకా ఇలా అన్నాడు:- ప్రభావశీలమైన నైతిక బోధనల ద్వారా ఈ అవాంఛనీయ భావనను దూరం చేయాలి. స్త్రీ తల్లి కావడం ఎట్టి పరిస్థితిలోనూ సిగ్గుపడే విషయం కాని, అధర్మం కాని, అనైతికం కాని కాదు.

**ఇరవయ్యో శతాబ్దపు ప్రగతి**

పందొమ్మిదో శతాబ్దిలోనే భావాలు, ఆలోచనలు బాగా వృద్ధి చెందాయి. ఇరవయ్యో శతాబ్దికి అవి మరిన్ని కొత్త రెక్కలు తొడిగి శక్తికి మించి ఎగిరే ప్రయత్నాలు

ప్రారంభించాయి. క్రీ.శ. 1908లో పిర్రే వోల్ఫ్ (Pierrewolf), గ్యాస్టోన్ లెరాక్స్ (Gaston Leroux)లు లాలీస్ (Lalys) అనే ఓ నాటకాన్ని రూపొందించారు. అందులో ఇద్దరమ్మాయిలు తమ సోదరుడి సమక్షంలోనే తండ్రితో ఇలా చర్చిస్తుంటారు : "తమకు ఏ విధంగా స్వేచ్ఛగా ప్రేమించుకునే హక్కు ఉందో, రసహీనంగా జీవితం గడపడం ఒక యుక్త వయసు అమ్మాయికి ఎంతటి నరకమో ఆ అమ్మాయిలు తండ్రికి వివరిస్తుంటారు. అదీ సోదరుని సమక్షంలో. అలాగే, ఒక యువకునితో అక్రమ సంబంధం నెరపుతున్న కూతుర్ని మందలించిన తండ్రికి ఆ కూతురు ఇలా సమాధానమిస్తుంది ఒక సన్నివేశంలో:

'నాన్నా! నేను ఎలా చెబితే నీకు అర్థమవుతుంది? ఏవ్యక్తికీ, ఏ అమ్మాయినీ- ఆమె అతని కూతురైనా కావచ్చు, చెల్లెలైనా కావచ్చు. ప్రేమించవద్దని గాని అలాగే ముసలిదానివైపొమ్మని చెప్పే హక్కుగాని ఉండదు' ఈ విషయాన్ని నువ్వు అర్థం చేసుకోవాలి.'

ప్రపంచ యుద్ధం ఈ స్వేచ్ఛా ఉద్యమానికి మరింత ఊతమిచ్చి ముందుకు తీసుకువెళ్లింది. గర్భనిరోధ భావజాల ప్రభావం అన్నిటికన్నా ఎక్కువగా ఫ్రాన్స్‌పై పడింది. వరుసగా నలభయ్యేళ్ల నుండి ఫ్రాన్స్‌లో జననాల రేటు బాగా పడి పోయింది. అక్కడి 87 జిల్లాల్లో కేవలం 20 జిల్లాల్లో మాత్రమే మరణాల కంటే జననాల రేటు కాస్త ఆశాజనకంగా ఉంది. మిగతా 67 జిల్లాల్లో జననాల కంటే మరణాల సంఖ్యే అధికంగా ఉండేది. నియంత్రణ పాటించే కొన్ని దేశాల్లో నైతే ప్రతి వంద జననాలకు 130,140,160 వరకు మరణాలు ఉండేవంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు.

యుద్ధం రాజుకుంటే ఫ్రాన్స్‌కు జీవన్మరణ సమస్య జాతికోసం, దేశం కోసం పోరాడే సత్తా కల యువకుల సంఖ్య చాలా తక్కువగా ఉన్నదని ఫ్రాన్స్‌లోని మేధావి వర్గం గుర్తించింది. దీంతో ఒక్కసారిగా ఫ్రాన్స్‌లో జననాల సంఖ్య పెంచుకోవాలన్న ఉన్మాదం మొగ్గ తొడిగింది. కవులు, కళాకారులు, రచయితలు, మత పెద్దలు, రాజకీయ నాయకులతో సహా అన్ని వర్గాలవారు ముక్తకంఠంతో, అధికంగా సంతానాన్ని కనమని, ఇతరులను ప్రోత్సహించమని ప్రజలకు పిలుపునిచ్చారు. దీనికోసం వివాహ బంధంలాంటి కట్టుబాట్లు, సాంప్రదాయాలను పట్టించుకోనవసరం లేదని, దేశం కోసం శీలాన్ని ఏమాత్రం ఖాతరు చేయని యువతులను, వితంతువులను

నీచ దృష్టితో కాకుండా గౌరవ దృష్టితో చూడాలని సెలవిచ్చారు. విశృంఖలత్వాన్ని ఇష్టపడేవారికి ఆ కాలంలో సహజంగానే పెద్దరికం లభించింది. దీన్ని అదునుగా తీసుకున్న ఆ పెద్ద మనుషులు రకరకాల పైశాచిక, అశ్లీల భావజాలాన్ని, విచ్చల విడితనాన్ని విపరీతంగా ప్రచారం చేశారు.

ఆ కాలంలోనే లాల్‌మోన్ రిపబ్లికన్ (Lalyon Republican) అనే పత్రికకు సంపాదకుడిగా ఉన్న ఒక ప్రముఖుడు 'అత్యాచారం దౌర్జన్యమెలా అవుతుంది.' అన్న అంశంపై ఏకంగా చర్చనే ప్రారంభించి తన అభిప్రాయాన్ని ఇలా వెల్లడించాడు:-

'పేదవారు ఆకలిని తాళలేక గత్యంతరం లేని స్థితిలో దోపడి దొంగ తనానికి పాల్పడినట్లయితే, వారి తిండి అవసరాలు తీర్చి, వారి పేదరికాన్ని దూరం చేస్తే దొంగతనాలు వాటంతట అవే ఆగిపోతాయని అంటారు. కాని విచిత్రం ఏమిటంటే, సహజ సిద్ధమైన శారీరక అవసరాలు తీర్చుకునే విషయంలో మాత్రం ద్వంద్వ వైఖరిని అవలంబిస్తారు. సంకుచితంగా వ్యవహరిస్తారు. ఆకలితో బాధపడే వ్యక్తి పట్ల మనసులో జనించే ప్రేమ సానుభూతులు, అలాంటిదే మరో రకమైన సహజావసరం కలిగిన వ్యక్తి పట్ల ఎందుకు వ్యక్తం కావు? సాధారణంగా దొంగ తనమనేది ఆకలి బాధను తట్టుకోలేకనో, ఇతర ఆర్థిక అవసరాలను తీర్చుకోడానికో చేసే ఒక పని. అదేవిధంగా అత్యాచారమైనా, ఒక్కోసారి హత్య అయినా ఆకలిదప్పుల కంటే ఏమాత్రం తక్కువ కాని ఒకానొక తీవ్రమైన అనివార్య అవసరం కారణంగా సంభవించే చర్య. ఒక ఆకలిగొన్న వాడు, వచ్చేవారం భోజనం లభిస్తుందన్న ఆశతో తన ఆకలిని ఎలా వాయిదా వేసుకోలేడో, అలాగే ఒక ఆరోగ్యవంతుడైన వ్యక్తి కూడా తన శారీరక అవసరాన్ని అదుపులో ఉంచుకోలేడు, వాయిదావేసుకోలేడు. ఈనాడు మన నగరాల్లో అన్ని రకాలుగా కావలసినన్ని సౌకర్యాలున్నాయి. దేనికీ కొరతలేదు. ఈ అవకాశాలను వినియోగించుకొని, ఒక ఆకలిగొన్నవాడి క్షుద్బాధ తీర్చిన విధంగానే, ఒక యువకుడి శారీరక వాంఛకూడా తీర్చుకునే విధంగా అవకాశాలు కల్పించక పోవడం ఎంతవరకు సమంజసం? అందుకని, ఏవిధంగానైతే ఆకలితో బాధపడే వారికి అన్నదానం చేసి పుణ్యం కట్టుకుంటున్నారో అదేవిధంగా మరో రకమైన ఆకలితో చస్తున్నవారికి కూడా ఏదో ఒక సంతృప్తికరమైన ఏర్పాట్లు చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది."

Lalyon Republican లో ప్రచురితమైన ఈ వ్యాసం ఏదో ఉబుసుపోక, వినోదం కోసం రాసింది కాదు. చాలా సీరియస్‌గా రాసింది. ఫ్రాన్స్‌లో దీన్ని అంతే సీరియస్‌గా అధ్యయనం చేయడం జరిగింది.

పద్దెనిమిదో శతాబ్దం చివరిలో మాధ్యులస్ (Malthus) అనే ఓ సామాజిక నిపుణుడు రోజురోజుకూ పెరిగిపోతున్న జనాభాను నియంత్రించడానికి గర్భ నిరోధక విధానాన్ని ప్రతిపాదించాడు. అతడి ఈ ప్రతిపాదన బహుశా ఒక శతాబ్దం తరువాత అశ్లీలం, వ్యభిచారాల వ్యాప్తిలో ప్రముఖ పాత్ర పోషిస్తుం దని కనీసం అతడు కలలోనైనా ఊహించి ఉండడు. జనాభా పెరుగుదలను నిరోధించడానికి అతడు మనోనిగ్రహం పాటించాలని, లేటు వయసులో వివాహాలు చేసుకోవాలని సలహాలిచ్చాడు. కాని 19వ శతాబ్ది చివరిలో మాల్థ్యూస్ ఉద్యమం (Neo-Mathusion Moement) ప్రారంభమైంది. పై సలహాకు భిన్నంగా, మనోవాంఛల్ని స్వేచ్ఛగా తీర్చుకోవడం, దాని ఫలితంగా కలిగే సంతానాన్ని శాస్త్రీయ పద్ధతుల్లో నిరోధించుకోవాలన్నది దాని మౌలిక సూత్రం. కానీ ఇది విశృంఖల అక్రమ సంబంధాల మార్గంలో ఉన్నటువంటి చివరి అవరోధాన్నీ తొలగించి మార్గం సుగమం చేసింది. ఇప్పుడు ఒక స్త్రీ ఎలాంటి సంకోచం లేకుండా నిర్భయంగా ఒక పురుషునికి తననుతాను సమర్పించుకోవచ్చు. అతని ద్వారా సంతానం కలుగు తుందేమోననిగాని, ఆ బాధ్యత తనపై పడుతుందేమోనని గాని భయం ఆమెకుండదు. ఈ విషయాన్ని గురించి విస్తృతంగా చర్చించడానికి ఇక్కడ అవకాశం లేదు. కేవలం గర్భ నిరోధానికి సంబంధించిన ఈ భావజాలాన్ని సాహిత్యంలో ఎలా జొప్పించి, విస్తృత ప్రచారం కల్పించారో చెప్పడానికి మాత్రమే మేము ప్రయత్నించదలి చాము.

ఈ సాహిత్యంలో నియోమాథ్యులస్ భూమికను ప్రామాణికంగా చూపు తుంటారు. దాని సారాంశం టూకీగా ఇది:-

ప్రతి మనిషి సహజసిద్ధంగా మూడు ప్రధాన సమస్యలను ఎదుర్కోవలసి ఉంటుంది. ఒకటి:- ఆహార సమస్య. రెండు : విశ్రాంతి. మూడు : కోరిక, వాంఛ. ప్రకృతి ఈ మూడింటిని చాలా బలంగా, అత్యంత ప్రభావశీలంగా మానవుడిలో ప్రవేశపెట్టింది, వీటి పరిపూర్తిలో ఓ ప్రత్యేక మాధుర్యాన్నుంచింది. ఇవి తీరగానే మనిషి సంతోషాన్ని సంతృప్తిని అనుభవిస్తాడు. బుద్ధిజ్ఞానాలు కోరేదేమిటంటే,

మానవుడు వీటిని నెరవేర్చుకునేందుకు కృషిచేయాలి. మొదటి రెండు విషయాల పట్ల అతని వైఖరి సరిగానే ఉంది. ఆహారం కోసం, విశ్రాంతి కోసం బాగానే ప్రయత్నిస్తున్నాడు. సాధించుకుంటున్నాడు. కాని, విచిత్రం ఏమిటంటే, మూడవదాని విషయంలో అతని ప్రవర్తన భిన్నంగా ఉంది. వివాహ బంధానికి లోబడి మాత్రమే మనో వాంఛల్ని తీర్చుకోవాలన్న సామాజిక కట్టుబాట్లు, నైతిక నిబంధనలు స్త్రీ పురుషులిద్దరికీ మిగతా బంధాన్ని గౌరవిం చడం తప్పనిసరి చేశాయి. అంతేకాదు సంతానాన్ని నియంత్రిచవద్దన్న అదనపు షరతూ విధించడం జరిగింది. ఇవన్నీ పనికిమాలిన బుద్ధీజ్ఞానాలకు వ్యతిరేకమైన విషయాలు. సహజత్వానికి, మానవత్వానికి భిన్నమైన చేదు ఫలితాలను మిగిల్చేవే తప్ప మరేమీ కాదు."

ఇలాంటి భావజాల పునాదులపై నిర్మితమయ్యే కట్టడం ఏవిధంగా ఉంటుందో దాన్ని కూడా ఒకసారి పరిశీలిద్దాం.

జర్మనీలోని సోషల్ డెమోక్రటిక్ పార్టీ నాయకుడు బాబీల్ (Babeel) నిస్సంకోచంగా ఇలా రాస్తున్నాడు: "నిజానికి స్త్రీ పురుషులనే వాళ్లు కూడా ప్రాణులే కదా! మరి ప్రకృతిలో ఇతర ఏ ప్రాణుల్లో నైనా వివాహమనే బంధం- అదీగాక శాశ్వతంగా ఒకే జంటగా కలిసుండాలనే - నిబంధన ఏదైనా ఉందా? డా॥ డ్రైస్‌డేయల్ (Drysdale) ఇలా రాస్తున్నాడు :

"వివాహ రహిత ప్రేమను, దాంపత్య సంబంధాన్ని ఒక పవిత్ర కార్యంగా పరిగణించేలా మనం వ్యూహాలు, పథకాలు రచించవలసిన అవసరం ఉంది. విడాకుల సౌలభ్యం వివాహ బంధాన్ని, దాని విధానాన్ని క్రమక్రమంగా అంతం చేస్తోంది. ఇది చాలా సంతోషకరమైన పరిణామం. ఎందుకంటే ఇప్పుడు వివాహ మన్నది ఇద్దరి మధ్య కలసి జీవించడానికి చేసుకునే ఓ ఒప్పందం. ఈ ఒప్పం దాన్ని వారు తాము కోరుకున్నప్పుడు తెంచుకోనూవచ్చు. ఇది పరస్పర మానవ సంబంధాలకు, స్నేహబంధాలకు సరైన విధానం."

ఫ్రాన్స్‌కు చెందిన ప్రముఖ నియోమాల్థ్యూస్ నాయకుడు పౌలారాబిన్ (PaulRobin) ఇలా రాస్తున్నాడు :

"మొదటి పాతికేళ్లలో మేము అక్రమ సంతానాన్ని దాదాపు సక్రమ సంతానంగా

మార్చుడానికి చేసిన కృషిలో విజయం సాధించగలిగాము. ఇక ఇప్పుడు మిగిలిందేమిటంటే, కేవలం మొదటి రకం సంతానానికి మాత్రమే జన్మనిచ్చే విధంగా మార్పును తీసుకురావాలి. దీనివల్ల ఈ రెండింటి (అక్రమ-సక్రమ) మధ్య ఉన్నటు వంటి వ్యత్యాసం తొలిగిపోతుంది."

"మిల్ అనే ఒక ప్రముఖ ఆంగ్ల తత్వవేత్త 'స్వేచ్ఛ' అనే తన పుస్తకంలో, 'తాము జీవితం గడపడానికి తగిన అవకాశాలూ, వనరులూ ఉన్నాయని నిరూపించు కోనంతవరకు ప్రజల వివాహానికి చట్టపరమైన ఆంక్షలు విధించాలని చాలా బలంగా చెప్పాడు. కాని ఎప్పుడైతే వ్యభిచారాన్ని నిరోధించాలన్న (Prostitution) వాదన తలెత్తిందో అప్పుడు, ఇదే పెద్ద మనిషి దాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. ఇది వ్యక్తి స్వేచ్ఛకు భంగమని, సెక్స్‌వర్కర్లను అవమా నించడ మేనని వాదించాడు.

వ్యక్తి స్వేచ్ఛకు ఇంతటి పెద్దపీట ఎందుకో ఒక్కసారి ఆలోచించండి. ఈ స్వేచ్ఛ ముసుగులో నిరాటంకంగా వ్యభిచారం కొనసాగించవచ్చన్న దుష్ట ఆలోచన దీని వెనుక ఉంది. కాని 'అదే వ్యక్తి స్వేచ్ఛను సద్వినియోగం చేసు కుంటూ ఎవరైనా వివాహం చేసుకుంటామంటే మాత్రం అతని వ్యక్తి స్వేచ్ఛను హరించడం జరుగు తోంది. తన స్వేచ్ఛను పరిరక్షించుకోడానికి అతడు అర్హుడు కాకుండా పోతాడు. ఇక్కడ నైతిక విధానం ఎలాంటి విప్లవాత్మక మలుపు తిరుగుతుందంటే, పాపమను కున్నది పుణ్యకార్యంగా, పుణ్యమనుకున్నది కాస్తా పాప కార్యంగా మారిపోతుంది.



## నాల్గవ అధ్యాయం

# ఫలితాలు

సాహిత్యం ముందడుగు వేస్తుంటే, ప్రజాభిప్రాయం దానివెంట నడుస్తుంది. చివర్లో సాంఘిక ప్రవర్తన, సామాజిక కట్టుబాట్లు, ప్రభుత్వ చట్టాలు తలా ఓ చెయ్యివేస్తూ పోతాయి. దాదాపు నూటయాభై సంవత్సరాలపాటు తత్వశాస్త్రం, చరిత్ర, నైతికత, కథలు, నాటకాలు, లలితకళల ద్వారా మేథస్సును సానబట్టి, దాన్ని తనకనుకూలంగా మలచుకోడానికి, ఒక భావజాలాన్ని మానవుల మస్తిష్కాల్లో జొప్పించడానికి అన్ని రకాల సాధనాల ద్వారా ప్రయత్నించినప్పుడు, ఆ సామూహిక శక్తి భావజాలానికి ప్రభావితం కాకుండా ఉండడం దాదాపు అసంభవం. ఎక్కడైతే ప్రభుత్వంతోపాటు, అన్ని సామాజిక, ప్రజా సంఘాల పునాదులు లౌకిక సూత్రాలపై ఆధారపడి ఉంటాయో అక్కడ ప్రజాభిప్రాయ మార్పులతోపాటు, చట్టాల్లో కూడా వైరుధ్యం రాకుండా ఉండడం అసాధ్యం.

### పారిశ్రామిక విప్లవం, దాని ప్రభావాలు

ఖచ్చితంగా ఇదే సమయంలో ఇతర సామాజిక కారణాలు కూడా కాకతాళీయంగా అనుకూలించాయి. ఆ కాలంలోనే పారిశ్రామిక విప్లవం ఉద్భవించింది. తద్వారా సాంఘిక జీవితంలో సంభవించిన మార్పులు, సామాజిక జీవితంపై పడిన ప్రచారం, ఇవన్నీ కలగలసి పరిస్థితుల దిశను ఆ విప్లవ సాహిత్యం ఎటుతిప్పితే అటువైపు తిరగడానికి సమాయత్తం చేశాయి. వ్యక్తి స్వేచ్ఛకు సంబంధించిన ఏ భావనల పైనేతే పెట్టుబడిదారీ వ్యవస్థ నిర్మించబడిందో, దానికి యంత్రాల నిర్వహణ, అధిక దిగుబడులు (Mass production), అవకాశాలు అసాధారణ శక్తినిచ్చాయి. సామ్రాజ్యవాద వర్గాలు పెద్దపెద్ద వాణిజ్య సంస్థలను ప్రారంభించాయి. ఈ పారిశ్రామిక సముదా యాలున్న ప్రదేశాలు క్రమక్రమంగా గొప్ప పట్టణాలుగా, నగరాలుగా రూపొందాయి. పల్లె ప్రాంతాలనుండి లక్షలు, కోట్ల సంఖ్యలో ప్రజలు నిస్సహాయ స్థితిలో ఈ నగరాలకు వలసవెళ్లారు. జీవితం చాలా ప్రియమై పోయింది. కూడు, గూడు, గుడ్డ లాంటి నిత్యావసరాలు చుక్కలనంటాయి. కొంత నాగరిక

ప్రగతి, కొంత సామ్రాజ్యవాద భావజాల ప్రభావం కారణంగా విలాసవంతమైన వస్తువులు కూడా నిత్యావసరాల జాబితాలో చేరిపోయాయి.

కాని పెట్టుబడిదారీ వ్యవస్థ జీవన ప్రమాణాలకు తగినట్లుగా సంపద పంపకంలో సమతుల్యం పాటించలేక పోయింది. భోగవిలాసాలను జీవితావసరాల్లో జొప్పించినంత తేలిగ్గా, వాటిని పొందే అవకాశాలను, మార్గాలను ఆ స్థాయిలో ప్రజలకు కల్పించలేకపోయింది. స్థాయి సంగతి తరువాత, పల్లె ప్రాంతాలనుండి పట్టణాలకు తరలించబడ్డ పేద ప్రజల కనీస అవసరాలైన తిండి, బట్ట, నివాస సౌకర్యం కూడా లేని దుస్థితి ఏర్పడింది. ఫలితంగా భర్తకు భార్య, తండ్రికి సంతానం భారమైపోయారు. ఎవరి అవసరాలు వారు చూసుకోవడమే కష్టమైపోయింది. ఇక ఇతర సంబంధీకుల భారం మోసే శక్తి వారికెక్కడిది? ఆర్థిక పరిస్థితులు ప్రతి ఒక్కరిని సంపాదించే విధంగా నిర్బంధం చేశాయి. యువతీయువకులు, వివాహితులు, వితంతువులు అందరూ సంపాదనకోసం (ఉపాధికోసం) రోడ్డెక్కాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఈ విధంగా ఉపాధి అన్వేషణలో అందరూ బయటికి రావడం వల్ల మిశ్రమ సంస్కృతి పెరిగి, దాని సహజ ఫలితాలు బహిర్గతమయ్యాయి. ఈ నేపథ్యంలో వ్యక్తి స్వేచ్ఛ భావజాలంతోపాటు కొత్త కొత్త సిద్ధాంతాలు, విధానాలు ముందుకొచ్చి, తండ్రీకూతుళ్లు అన్నాచెల్లెళ్లు, భార్యాభర్తలు ఇలా అందరినీ సముదాయిస్తూ, కంగారుపడాల్సిన అవసరం లేదని, జరిగేదంతా మనమంచికేనని ఊరడించాయి, భరోసానిచ్చాయి. ఇది పతనం కాదు ప్రగతి అని, (Emancipation), అనైతికంకాదు సహజసిద్ధమైన జీవన మాధుర్యమని, సామ్రాజ్యవాద వ్యవస్థ మిమ్మల్ని పడదోస్తున్న ఈ పాతాళం నరకం కాదు స్వర్గమని ఊదరగొట్టాయి.

## సామ్రాజ్యవాద స్వార్థం

వ్యవహారం ఇంతటితో ఆగిపోలేదు. ఏ భావజాల పునాదులపై ఈ వ్యవస్థ నిర్మించబడిందో అది అన్ని విధాలా, నిస్సంకోచంగా, అపరిమితంగా ధనం సంపాదించమని మనిషిని ప్రోత్సహించింది. ఈ నూతన నైతిక విధానం అన్ని రకాల సంపాదనలకు పచ్చజెండా ఊపింది. ధర్మం, అధర్మం అన్న ఊగిసలాటలకు తావులేకుండా అన్ని విధాల సంపాదనా ధర్మసమ్మతమేనని తేల్చింది. ఒక వ్యక్తి ధనవంతుడు కావడానికి ఎంత మందిని ముంచినా తప్పులేదని చెప్పింది. సంఘానికి వ్యతిరేకంగా అన్ని కోణాల్లో వ్యక్తిని సమర్థించడం జరిగింది. ఈ విధంగా, ఈ సామాజిక వ్యవస్థ

విధివిధానాలు రూపొం దాయి. వ్యక్తి స్వార్థానికి వ్యతిరేకంగా సంఘ సంరక్షణకు ఎలాంటి అవకాశాలూ లేకపోవడం వల్ల, సమాజాన్ని ప్రభావితం చేసే స్వార్థపరులకు మార్గం సుగమమైపోయింది. వీరు మానవ బలహీనతలన్నిటినీ వెతికి, వెతికితీసి వాటిని తమ ప్రయోజనాల కోసం ఉపయోగించుకోడానికి (Exploit) కొత్త కొత్త విధానాలను అవలంబించడం ప్రారంభించారు.

ఒకడు తన జేబు నింపుకోవడానికి ప్రజల్ని మద్యపానం మత్తులో ముంచెత్తుతాడు. కాని ఆ మద్యంమహమ్మారి నుండి ప్రజల్ని రక్షించడానికి, దాన్ని సమాజంపై వదిలిన ఆ దుర్మార్గుణ్ణి శిక్షించడానికి ఎవరూ ఉండరు. మరొకడు 'వడ్డీ' అనే వలను సమాజంపైకి విసురుతాడు. ఈ విషయవలయం నుండి రక్షించి ప్రజల రక్తమాంసాలను పీల్చి పిప్పిచేసే ఈ జలగ నుండి సమాజాన్ని రక్షించేవారు ఎవరూ ఉండరు. ఇంకొకడు జూద సంబంధమైన వివిధ విచిత్ర విధానాలను ప్రవేశపెడతాడు. చివరికి వ్యాపార రంగంలో కూడా జూదం ఉండి తీరవలసిందే. ఈ మాయ రోగాన్నుండి మానవుల ఆర్థిక జీవనాన్ని కాపాడేవారు ఎవరూ ఉండరు. పైగా చట్టాలన్నీ ఈ దుర్మార్గులను రక్షించడానికే దోహదపడ్డాయి తప్ప ప్రజలకు ఏమాత్రం ఆసరాగా నిలవలేదు. దీంతో మరికాస్త రెచ్చిపోయిన స్వార్థపరులు పరుల మనోభావాలను కలుషితం చేసి వీలైనంత ఎక్కువగా ప్రయోజనాలు పొందే ప్రయత్నం చేశారు. థియేటర్లు, రంగస్థలాలతో పాటు, వ్యాపార ప్రయోజనాలకూ అందమైన అమ్మాయిల సేవలను వినియోగించుకుంటూ, వారిని సాధ్యమైనంత ఎక్కువ అశ్లీలంగా చూపెడుతూ ప్రజల మనోవాంఛల దాహార్తిని పెంచి, వారి జేబులు కొల్లగొట్టడం జరిగింది. మరి కొంతమంది వ్యభిచారాన్ని పెంచి పోషించి, దాన్నొక అంతర్జాతీయ వ్యాపారంగా అభివృద్ధి చేశారు. ఇంకొంతమంది చిత్రవిచిత్రమైన సౌందర్య సాధనాలను కనిపెట్టారు. వాటిని విస్తృతంగా ప్రచారం చేసి స్త్రీలలో ఒక విధమైన ఆసక్తిని, ఆకర్షణను జనింపజేశారు. స్త్రీలు పుట్టుకతోనే వాటిని వినియోగించడం ప్రారం భించకపోతే జీవితం వ్యర్థమనే స్థితికి తీసుకువచ్చారు. ఈ విధంగా సౌందర్య సాధనాల వ్యామోహంలోకి –కాదు, ఉన్మాదంలోకి స్త్రీ జాతిని నెట్టివేసి, డబ్బు దండుకునే మార్గాన్ని సుగమం చేసుకున్నారు.

ఇంకా మరికొంత మంది ఫ్యాషన్ పేరుతో, అశ్లీలత ఉట్టిపడే రకరకాల డిజైన్ దుస్తులకు రూపకల్పన జేశారు. అందమైన అమ్మాయిలకు డబ్బు ఎరచూపి 'మోడలింగ్' పేరుతో వ్యాపారాభివృద్ధికి శ్రీకారం చుట్టారు. ఇంకొందరు అశ్లీల

చిత్రాలు, రచనలను డబ్బుగడించే మార్గంగా ఎంచుకున్నారు. క్రమక్రమంగా పరిస్థితి ఎంతగా దిగజారి పోయిందంటే, స్త్రీల అంగాంగ ప్రదర్శన లేని వ్యాపారం నడవడమే కష్టమై పోయింది. స్త్రీల నగ్న, అర్ధనగ్న ప్రదర్శన వ్యాపారా నికి విజయ చిహ్నంగా మారిపోయింది.

అశ్లీల స్త్రీ రూపంలేని ఏ వ్యాపార ప్రకటననూ మనం కనీసం ఊహించ లేము.

## ప్రజాస్వామ్య రాజకీయం

ఈ జాడ్యం ఇంతటితోనూ వదల్లేదు. భావ ప్రకటనా స్వేచ్ఛ మరింతగా విస్తరించి పాశ్చాత్య ప్రపంచంలో ఔత్సిక వ్యవస్థకు బీజంవేసింది. ఈ నూతన ప్రజాస్వామ్య వ్యవస్థ యొక్క మౌలిక సూత్రం ఏమిటంటే, ప్రజలు తామే ప్రభువులు. తమ చట్టాలకు తామే రూపకర్తలు. తమకెలంటి చట్టాలు కావాలో వాటిని స్వయంగా రూపొందించుకుంటూ, నచ్చని వాటిని తమ భావాలకను గుణంగా మార్పులు చేర్పులు చేసుకునే అధికారం కలిగి ఉంటారు. వారిని నియంత్రించే, పర్యవేక్షించే, మార్గదర్శనం చేసే, మానవ బలహీనతలకు అతీతమైన ఏశక్తీ వారిపై ఉండదు. సురక్షితమైన, మానవ రచనకు అతీతమైన చట్టాలు శాసనాలు వారివద్ద లేవు. వారి మనసుకు నచ్చిందే చట్టం, వారు రాసిందే, చేసిందే శాసనం. ఈ విధమైన నూతన ప్రజాస్వామ్య సిద్ధాంతం మానవుణ్ని స్వార్థపరుడిగా, బాధ్యతారహితుడిగా, తయారు చేసి, నీకు నువ్వే మార్గదర్శివని, ప్రజాభిప్రాయమే చట్టాల రూపకల్పనకు పునాది అని చెప్పింది.

ఇప్పుడు మనకు స్పష్టంగా అర్థమయ్యేదేమిటంటే, ఎక్కడైతే, సామాజిక జీవితంలోని చట్టాలన్నీ ప్రజాభిప్రాయానికి అనుగుణంగా ఉంటాయో, ఈ విధానాన్నే ప్రభుత్వాలు శిరోధార్యమని భావిస్తాయో, అక్కడి చట్టశాసనాలు గాని, రాజకీయ శక్తిగాని సమాజాన్ని నైతిక పతనం నుండి రక్షించజాలవు. పైగా పతనానికి మరింతగా ఉపకరిస్తాయి. ప్రజాభిప్రాయం జరిపిన ప్రతిసారీ చట్టాలు మారుతూ ఉంటాయి. ప్రజల అభిప్రాయాలూ, అభిమతాలకనుగుణంగా చట్టాల్లో కూడా మార్పులు చేర్పులు చోటుచేసుకోవడం అనివార్యం. సత్యం, సదాచారం, సంస్కరణా విధానాలకు ఓటే ప్రామాణికం అవుతుంది. ఒక్క ఓటు తేడాతో సత్యాసత్యాల్లో భూమ్యాకాశాలంత తేడా సంభవిస్తుంది. నూటికి యాభై ఒక్క ఓట్లు సాధిస్తే అది ఆమోదయోగ్యమూ

అయి పోతుంది. ఇంతేకాదు అది ప్రతిపాదన స్థాయినుండి చట్టరూపం కూడా సంతరించుకోవడానికి కూడా ఎలాంటి అవరోధాలుండవు. ఏ శక్తీ ఆ ప్రతిపాదనను చట్టరూపం దాల్చకుండా అడ్డుకోజాలదు. నీచత్వానికి పరాకాష్ట అయిన ఓ ఉదాహరణ చూడండి. ఇది నాజీల కంటే ముందు జర్మనీలో సంభవించింది. అక్కడ మాగ్నస్ హిర్చ్ ఫీల్డ్ (Maguus hirschfield) అనే ఒక డాక్టర్ ఉండేవాడు. అతడు జాతీయ లైంగిక సంస్కరణల సంఘం అధ్యక్షుడు. స్వలింగ సంపర్కాన్ని చట్టబద్ధం చేయాలని ఆరేళ్లపాటు పోరాటం చేశాడు. చివరికి నాటి ప్రజాస్వామ్య ప్రభుత్వం ఆ దుష్ట కార్యాన్ని చట్టబద్ధం చేయడానికి అంగీకరించింది. జర్మన్ పార్లమెంటు అధిక శాతం మెజారిటితో స్వలింగ సంపర్కాన్ని చట్టబద్ధం చేసింది. అయితే ఈ కార్యం ఇరువురి పరస్పర ఆమోదంతో జరగాలని, ప్రాజ్ఞతరానివారైతే సంరక్షకుల అనుమతి తీసుకోవాలని చెప్పింది.

చట్టం ఈ ప్రజాస్వామ్య ప్రభుత్వ విధేయతలో కాస్తంత అలసత్వ వైఖరి ప్రదర్శించింది. దాని ఆదేశాలను పాటించడంలో నిర్లక్ష్యంగా వ్యవహరించింది. పరిపూర్ణ విధేయతలో మిగిలిపోయిన ఈ లోపం ప్రభుత్వ వ్యవస్థపై ప్రభావం చూపింది. ఎవరైతే ఈ ప్రజాస్వామ్య ప్రభుత్వాలను నడుపుతున్నారో, వారు చట్టం కంటే ముందు తమ చుట్టూ విస్తరించి ఉన్న సాహిత్యం, వాతావరణ ప్రభావానికిలోనై పోతారు. ఫలితంగా చలామణిలో ఉన్న అన్ని దురాచారాలు, అనైతిక కార్యకలాపాలన్నిటినీ చట్టపరంగా అంగీకరిస్తారు. స్వీకరిస్తారు. అప్పటి వరకూ చట్టపరంగా నిషేధంలో ఉండి, పోలీసు, న్యాయ వ్యవస్థల జోక్యం ఉంటుందో అవన్నీ ఈ విధంగా ధర్మ సమ్మత జాబితాలో చేరిపోతాయి.

ఉదాహరణకు, గర్భస్రావాన్నే తీసుకోండి. పాశ్చాత్య చట్టాల్లో గర్భస్రావం ఇప్పటికీ నిషిద్ధమే. కాని బహిరంగంగా, అధికశాతం మంది ఈ దుర్మార్గానికి పాల్పడని దేశమంటూ ఏదీలేదు. ఒక అంచనా ప్రకారం ఆ దేశాల్లో ప్రతి సంవత్సరం కనీసం 90 వేల గర్భస్రావాలు జరుగుతున్నాయి. వివాహిత మహిళలల్లో అధమపక్షం ఇరవై ఐదు శాతం మంది మహిళలు తామే స్వయంగా గర్భస్రావం చేసుకుంటున్నారు. లేక అనుభవం ఉన్న మంత్రసానుల సహాయం తీసుకుంటున్నారు. అవివాహిత మహిళల్లో ఈ శాతం ఇంతకు రెట్టింపు ఉంది. కొన్ని ప్రాంతాల్లో ప్రత్యేకంగా గర్భస్రావ కేంద్రాలు కూడా ఏర్పాటు చేశారు. మహిళలు ఈ కేంద్రాల్లో సభ్యత్వం తీసుకుని నెలనెలా ఫీజులు కూడా చెల్లిస్తుంటారు. దీనిద్వారా అవసరం ఏర్పడినప్పుడు

నిపుణుల సహాయం సునాయాసంగా పొందవచ్చు. లండన్‌లో ఇలాంటి నర్సింగ్ హోమ్‌లు అనేక మున్నాయి. ఇక్కడికొచ్చే పేషెంట్లంతా అధికశాతం గర్భస్రావం చేయించుకొనే వారే అయి ఉంటారు. ఇంత జరుగుతున్నా పాశ్చాత్య దేశ రాజ్యాంగం ప్రకారం గర్భస్రావం ఇప్పటికీ నిషిద్ధమే. (ఈ వివరాలన్నీ, ఇటీవలనే ప్రచురితమైన Guide to modernwickedness అనే గ్రంథంలో ఉన్నాయి. దీన్ని ప్రొఫెసర్ జూడ్ రచించారు.)

## సత్యాలు - సాక్ష్యాలు

ఇప్పుడు నేను ఈ మూడు విషయాలను గురించి, అంటే,'ఆధునిక నైతిక సిద్ధాంతం', 'సామ్రాజ్యవాద సామాజిక వ్యవస్థ', 'ప్రజాస్వామ్య రాజకీయ వ్యవస్థ'లు ఏ విధంగా కలగాపులగమై సామాజిక విలువలను, స్త్రీ పురుష సంబంధాలను ప్రభావితం చేస్తున్నాయో వివరిస్తాను.

## నైతిక పతనం

వెనుకటి అధ్యాయంలో ప్రస్తావించబడిన సిద్ధాంత ప్రభావం వల్ల, స్త్రీ పురుష సంబంధాల విషయంలో ప్రజల నైతిక ప్రవర్తనకు పక్షవాతం సోకినట్ల యింది. సిగ్గు, బిడియం సౌశీల్యం రోజురోజుకూ దిగజారి పోయింది. వివాహ బంధానికున్న గౌరవం మనసులోనుండి తుడిచిపెట్టుకుపోయింది. వ్యభిచారం చాలా మామూలు వ్యవహారంగా మారి పోయింది. తప్పు, పాపం అన్న పదాలు ఏమిటో తెలియనంతగా అపరిచితమైపోయాయి.

పందొమ్మిదో శతాబ్దం చివరి వరకూ సాధారణ ఫ్రాన్స్ ప్రజానీకం పురుష వ్యభిచారాన్ని చాలా మామూలు విషయమని, అది వారి సహజ నైజమనే భావించే వారు. తల్లిదండ్రులు తమ కుమారుల విచ్చలవిడి తిరుగుళ్లను సంతోషంగా ఆమోదించేవారు. (సుఖవ్యాధులు, కోర్టుకేసుల భయం లేనంతవరకు) దీనివల్ల భౌతిక పరంగా ప్రయోజనం చేకూరితే మరింతగా సంతోషించేవారు. వారి దృష్టిలో ఒక పురుషుడు మరొక స్త్రీతో వివాహేతర సంబంధం కొనసాగించడం ఎంతమాత్రం తప్పుకాదు. సంపద, అధికారం కలిగిన స్త్రీలతో సంబంధంపెట్టుకొని ఆర్థికంగా తమ భవిష్యత్తును తీర్చిదిద్దు కొమ్మని కూడా తమ సంతానానికి సలహాలిచ్చి ప్రోత్సహించిన తల్లిదండ్రుల ఉదాహరణలు కూడా మనముందున్నాయి. అయినప్పటికీ మహిళల గౌరవ మర్యాదను అమూల్యంగానే చూడడం జరిగేది. ఏ తల్లిదండ్రులైతే తమ కొడుకులు

అడ్డదారి తొక్కితే అది యవ్వనప్రాయంలోని ప్రభావం అని సమర్థించుకొనేవారో, వారే ఈడొచ్చిన ఆడ పిల్లలపై ఎలాంటి మచ్చరాకూడదని కోరుకునేవారు. దుర్నడత కలిగిన పురుషుణ్ని చూసిన విధంగా స్త్రీని మాత్రం చూసే వారు కాదు. పురుషుడు ఎన్ని అక్రమ సంబంధాలు కలిగి ఉన్నా సచ్ఛీలుడే, కాని స్త్రీని మాత్రం వంచిత అని ముద్ర వేసేవారు. వేశ్యను గురించి ఎంతో నీచంగా, అసహ్యంగా చెప్పుకునేవారు కాదు. ఇదే విధంగా దాంపత్య సంబంధాల్లో కూడా ఈ అసమానత కొట్టవచ్చినట్లు కనబడేది. భర్త దుర్నడతను కళ్లుమూసుకొని వదిలేసి, భార్య కాస్త కాలుజారితే అత్యంత నీచంగా చూడడం జరిగేది.

ఇరవయ్యో శతాబ్దం ప్రారంభానికల్లా ఈ పరిస్థితి మారిపోయింది. స్త్రీ స్వేచ్ఛా ఉద్యమ ప్రభావంతో దుర్నడత కలిగిన పురుషుణ్ని నిర్దోషిగా చూసినట్లే ప్రజలు చెడునడత కలిగిన స్త్రీని కూడా నిరపరాధిగా చూడడం ప్రారంభించారు. ఇక స్త్రీ కూడా వివాహేతర సంబంధం కలిగి ఉండడం ఎంతమాత్రం తప్పుకాదు. దీనివల్ల గౌరవమర్యాదలకు వాటిల్లే నష్టమేమీ ఉండదు. పౌల్‌బ్యూర్ ఇలా రాస్తున్నాడు:

"పెద్ద పెద్ద నగరాల్లోనే కాకుండా ఫ్రాన్స్‌లోని చిన్న చిన్న పల్లెటూళ్లలో సైతం ఇప్పటి యువకులు, మేము పవిత్రంగా లేనప్పుడు, మా భాగస్వామి పవిత్రంగా, కన్యగా ఉండాలని కోరుకునే హక్కు మాకు లేదు' అన్న విషయాన్ని అంగీకరిస్తున్నారు. బర్గండీ, బూన్ తదితర ప్రాంతాల్లో, ఒక యువతి వివాహానికి ముందు అనేక మందితో సంబంధాలు కలిగి ఉండడం చాలా సాధారణ విషయం. పెళ్లికి ముందు కాబోయే భర్తతో తన గత జీవితానికి సంబంధించిన విషయాలు రహస్యంగా ఉంచే అవసరం కూడా ఉండదామెకు. అమ్మాయి సమీప బంధువులకు సైతం ఆమె దుర్నడత పట్ల ఎలాంటి అభ్యంతరాలూ ఉండవు. తను గతంలో ఎవరెవరితో ఎలాంటి సంబంధాలు నెరిపిందీ చాలా సాధారణంగా, ఏవో క్రీడా విషయాలు చర్చించినట్లు కుటుంబ సభ్యులతో చర్చిస్తుందామె. కాబోయే వరుడు కూడా తన కాబోయే భార్య గతంతోపాటు, ఆమెతో సంబంధాలు నెరిపి లైంగికానందం పొందిన మాజీ ప్రియులను గురించి కూడా తెలుసుకుంటాడు. వారితో కూడా పరిచయం పెంచుకుంటాడు. ఈ విధంగా, తన భార్య వ్యక్తిగత వ్యవహారాల్లో, ఆమె స్వేచ్ఛకు ఎలాంటి విఘాతం కలిగించబోనని నిరూపించుకుంటాడు." (పే. 94)

ఇంకా ఇలా రాస్తున్నాడు : "ఫ్రాన్స్‌లోని మధ్యతరగతి విద్యావంతుల వర్గంలో ఇప్పుడొక విషయం సర్వసాధారణమైపోయింది. అదేమిటంటే, ఒక మంచి కుటుంబానికి చెందిన విద్యావంతురాలైన యువతి ఉద్యోగంచేస్తూ, ఒక యువకుడితో ప్రేమలో పడి, అతనితో కలిసి ఉంటే, వారు వివాహం చేసుకోవడం తప్పనిసరేమీ కాదు. కలిసున్నంత కాలం ఉండి మనసు మరొకరివైపు లాగితే, విడిపోయి అక్కడ సుఖాన్ని పొందడం కోసం మాత్రమే వివాహం చేసుకోకుండా ఉండవచ్చు. వారి మధ్య ఉన్న సంబంధమేమిటో సమాజానికి తెలిసే ఉంటుంది. ఉన్నత వర్గాల్లో ఇద్దరూ కలిసే తిరుగుతారు. స్వయంగా వారు కూడా తమ సంబంధాన్ని దాచుకోరు. ఇతరులు కూడా వారి జీవితాన్ని తప్పుపట్టరు. ఈ విధమైనటువంటి వైఖరి మొదట కార్మిక వర్గంలో ప్రారంభమైనప్పుడు, దాన్ని చాలా తప్పుగా అనైతికంగా పరిగణించేవారు. కాని ఇప్పుడది ఉన్నత వర్గాల్లో సైతం సర్వ సాధారణమైపోయింది. సమాజంలో కూడా వివాహబంధానికి లాగానే దీనికి ఆదరణ లభించింది." (పే. 94,96)

ఈ విధంగా వివాహం చేసుకోకుండానే స్త్రీ పురుషులు కలిసుండే విధానాన్ని ఇప్పుడు నిరాటంకంగా, నిరభ్యంతరంగా అంగీకరించడం జరుగుతోంది. మూసి మో బర్త్ హెలమీ (M Berthelamy) అనే పీర్స్ యూనివర్శిటీ నీతి శాస్త్ర అధ్యాపకుడు ఇలా రాస్తున్నాడు: "రాను రాను ఉంపుడు కత్తెలకు కూడా గతంలో భార్యలకు లభించినట్లుగానే, చట్టపరమైన గుర్తింపు లభిస్తోంది. చట్ట సభల్లో కూడా వీరి ప్రస్తావన వస్తోంది. ప్రభుత్వాలు కూడా వీరి ప్రయోజనాల పరిరక్షణ కోసం తగినటువంటి చర్యలు చేపడుతున్నాయి. ఒక సైనికుడి భార్యకు ఎంత భరణం లభిస్తుందో, అతని ఉంపుడుగత్తెక్కూడా అంత భరణం లభిస్తోంది. ఒకవేళ సైనికుడు మరణిస్తే అతని భార్యకు లభించినట్లుగానే అతను ఉంచుకున్న ఆమెక్కూడా పెన్షన్ లభిస్తుంది.

ఫ్రాన్స్ ప్రవర్తనావళిలో వ్యభిచారం ఏ విధంగా తప్పుకాదో ఈ సంఘటనల ద్వారా మనం అర్థం చేసుకోవచ్చు. 1918లో ఒక పాఠశాలలో పనిచేస్తున్న అవివాహిత టీచరమ్మ గర్భం దాల్చింది. అప్పుడు పాఠశాల పాలకవర్గంలో ఉన్న కొంతమంది ఉపాధ్యాయులు దీన్ని తప్పు పట్టారు. దీంతో ఈ వ్యవహారాన్ని

చక్కదిద్దడానికి రంగంలోకి దిగిన ఓ మేధావుల బృందం ఇదేమంత పెద్ద నేరం కాదని అభిప్రాయపడింది. ఈ సందర్భంలో ఆ మేధావుల బృందం కన్య గర్భం దాల్చడాన్ని తప్పుపట్టిన వారికి కొన్ని ప్రశ్నలు వేసింది. ఒకటి : ఒకరి వ్యక్తిగత జీవితంలోకి తొంగిచూడడం ఇతరులకు అవసరమా? రెండు : ఇంతకు ఆ అమ్మాయి అంత ఘోరమైన తప్పు ఏం చేసింది? మూడు: పెళ్లి కాకుండా తల్లికావడం ప్రజాస్వామ్య విధానానికి, దాని విశాల దృక్పథానికి తార్కాణం కాదా? అని ప్రశ్నించింది.

ఫ్రాన్స్ సైన్యాధిపతులు తమ సైన్యానికి కొన్ని ప్రత్యేక అంశాలపై అత్యవసరమైన విషయాలు బోధిస్తుంటారు. సైనికపరంగా అవి అత్యంత ప్రాధాన్యం కలిగినవై ఉంటాయి. వాటిలో సుఖరోగాల నుండి సురక్షితంగా ఉండడం, గర్భనిరోధ మెళకువలు ప్రధానమైనవి. ఎందుకంటే ప్రతి సిపాయి తప్పనిసరిగా వ్యభిచారం చేస్తాడన్నది అక్కడ అంగీకృతమైన విషయం. 1919మే, మూడవ తేదీన 127వ డివిజన్‌కు సంబంధించిన బెటాలియన్ కమాండర్ సిపాయిల పేర ఒక ప్రకటన వెలువరించాడు. అందులో ఏముందో చూడండి.

"వేశ్యావాటికలను సాయుధ సైనికులే ఆక్రమించుకోవడం వల్ల సాధారణ ప్రజలకే కాకుండా, మన పదాతి దళ సభ్యులకు కూడా అవకాశాలు దక్కడం లేదని మాకు విరివిగా ఫిర్యాదులు అందుతున్నాయి. వేశ్యావాటికల్లో మహిళల సంఖ్యను పెంచడానికి మేము చర్యలు చేపడుతున్నాం. అప్పటి వరకూ మీరు ఎక్కువ సమయం అక్కడే తిష్టవేయకుండా, పని ముగించుకొని వెళ్లిపోతే ఇతరులక్కూడా అవకాశం ఇచ్చినవారవుతారు. పై అధికారులు అక్కడ మహిళల సంఖ్య పెంచేవరకు మీరు కాస్త ఓపికపట్టవలసిందిగా ఈ ప్రకటన ద్వారా మీకు సూచిస్తున్నాము."

కాస్త ఆలోచించండి! ఈ ప్రకటన అత్యంత నాగరిక ప్రభుత్వ సైనికులకు వారి అధికారులు ప్రభుత్వం తరపున అధికారికంగా విడుదల చేశారు. అంటే వ్యభిచారం తప్పు అన్న విషయం వారి మనో మస్తిష్కాల్లో ఏ కోశానా లేదనే కదా దీనర్థం. సమాజం, చట్టం, ప్రభుత్వం ఎక్కడా ఈ భావన మచ్చుకైనా లేదన్నమాట.[1]

*1) ఇంతటి అనైతిక ప్రవర్తన కలిగిన సైన్యం ఇతర రాజ్యాలను జయించి విజయ గర్వంతో ఆ రాజ్యంలో ప్రవేశించినప్పుడు, ఆ పరాజయ జాతిపట్ల ఎంత క్రూరంగా, నీచంగా, అనైతికంగా ప్రవర్తిస్తుందో ఒకసారి ఊహించండి. సైనికుల ప్రవర్తనకు సంబంధించి ఇదొక కోణం. మరో కోణాన్ని ఖుర్‌ఆన్ ఇలా ఆవిష్కరిస్తోంది.*

ప్రపంచ యుద్ధానికి కాస్తముందు ఫ్రాన్స్‌లో ఒక ఏజెన్సీ ప్రారంభించబడింది. ఎలాంటి మహిళనైనా ఆమె ఆలోచనలు అలవాట్లు, ఆర్థిక స్థితి, నైతిక ప్రవర్తన ఏదిఏమైనప్పటికీ ఆ మహిళను ఒక కొత్త అనుభవం కోసం ఒప్పించడం ఆ ఏజెన్సీ మూల సూత్రం. ఒక వ్యక్తి ఏ మహిళలతోనైనా సంబంధం పెట్టుకోవాలనుకుంటే, ఆమె చిరునామాను తెలుపుతూ 25 ఫ్రాంక్‌ల ఫీజును అడ్వాన్సుగా చెల్లిస్తే సరిపోతుంది. అతను ఈ కొద్దిపాటి శ్రమ తీసుకుంటే, మిగతా వ్యవహారమంతా అంటే, ఆమెను ఒప్పించే బాధ్యత ఏజెన్సీ చూసుకుంటుంది. ఫ్రెంచ్ సమాజంలోని ఏ వర్గమూ అత్యధిక శాతం ఆ ఏజెన్సీతో వ్యాపార కార్యక్రమాలు నిర్వహించకుండా లేదని ఏజెన్సీ రిజిస్టర్ మనకు తెలుపుతోంది. అంతేకాదు ఈ వ్యవహారం ప్రభుత్వానికి సైతం తెలిసిన బహిరంగ రహస్యమే. (పౌల్ బ్యూరో - పేజీ 16)

## ఈ నైతిక పతనానికి పరాకాష్ట ఏమిటంటే

"ఫ్రాన్స్‌లోని కొన్ని జిల్లాల్లో, పెద్ద పెద్ద నగరాల్లో, ఎక్కువ జనాభా కలిగిన ప్రాంతాల్లో సమీప బంధువులేకాదు, తండ్రీ కూతుళ్లు, అన్నాచెల్లెళ్ల మధ్య లైంగిక సంబంధాలు కొనసాగడం ఇప్పుడక్కడ పెద్ద అపరాధమేమీ కాకుండా పోయింది."

## ఉధృతమైన అశ్లీలత

యుద్ధానికి పూర్వం మోసియోబ్యూలో (M.Bulot) అనే ఫ్రాన్స్ దేశపు అటార్నీ జనరల్ తన నివేదికలో తమ శరీరాన్ని అమ్ముకుంటున్న స్త్రీల సంఖ్య ఐదు లక్షలని తెలిపాడు. అయితే అక్కడి వ్యభిచారానికి, భారత దేశంలో జరిగే అశ్లీల వ్యాపారానికి పోలిక పెట్టవద్దు. ఎందుకంటే, అది నాగరిక దేశం. అది ఏ పని చేసినా అత్యంత నాగరికంగా, హుందాగా, వ్యవస్థీకృతంగా ఉన్నత స్థాయిలో ఉంటుంది. అక్కడ ప్రకటనల ద్వారా ఈ వృత్తికి ప్రచారం కల్పించబడుతుంది. పత్రికలు, కళాకారులు, చిత్రకారులు, పోస్టు కార్డులు, టెలిఫోన్లు, వ్యక్తిగత ప్రచారం లాంటి అన్ని రకాల

---

*అల్లజీన ఇమ్మక్కన్నాకుం ఫిల్ అర్జి అఖాముస్సలాత, వఆతుజ్జకాత, వ అమరూ బిల్ మారూఫి, వ అన్‌హౌ అనిల్ మున్కర్.*

*ఒక సిపాయి భువిపై అచ్చోసిన ఆంబోతులా, మానవత్వం లేని మృగంగా విర్రవీగుతూ తిరిగితే, మరో సిపాయి మానవ విలువల పరిరక్షణకు తల అరచేతిలో పట్టుకొని ప్రపంచానికి పవిత్రతా పాఠాలు నేర్పుతాడు. ఈ ఇద్దరి మధ్య వ్యత్యాసం చూడలేనంత గుడ్డివాడా మానవుడు!*

నాగరిక పద్ధతులను ప్రజలను ఆకర్షించడానికి వినియోగించడం జరుగుతుంది. ప్రజల మనసు కూడా దీన్నేమీ వ్యతిరేకించదు. అవమానమనీ భావించదు. అంతేకాదు ఈ వృత్తిలో ఆరితేరిన అదృష్టవంతురాలైన మహిళలు కొన్ని సందర్భాల్లో దేశ రాజకీయాల్లో, ఆర్థిక, న్యాయ వ్యవహారాల్లో చక్రం తిప్పుతూ అధికారాలను కూడా అనుభవించే అవకాశం ఉంటుంది. ఒకప్పుడు నాగరిక యూనాన్ దేశంలో కూడా ఈ వర్గం మహిళలకు ఇలాంటి అవకాశాలు లభ్యమైనాయి.

ఫ్రెంచ్‌సెనేట్‌లోని మూసియో ఫెర్డినెండ్ డ్రెఫ్యూస్ (M.Ferdinand Dreyfus) అనే సభ్యుడు కొన్నాళ్ల క్రితం ఇలా అన్నాడు: 'వేశ్యావృత్తి ఇప్పుడిక వ్యక్తిగతమేమీ కాదు. ఆ ఏజెన్సీల ద్వారా అద్భుతమైన ఆర్థిక ప్రయోజనాలు ఒనగూడుతున్నాయి. దానివల్ల అదొక లాభసాటి వ్యాపారంగా, ఒక వ్యవస్థీకృత పరిశ్రమగా (Organised Industry) తయారైంది. దీనికోసం 'ముడి సరుకును' అందించే ఏజెంట్లు ప్రత్యేకంగా ఉన్నారు. వాటికి సంబంధించిన ప్రత్యేక కేంద్రాలున్నాయి. పిన్నవయసు, యుక్తవయసు అమ్మాయిలు అక్కడ విక్రయ వస్తువులు. ఏ వయస్సు వారు కావాలంటే అక్కడ ఆ వయసువారు దొరుకుతారు. పదేళ్లలోపు అమ్మాయిలకు భారీ డిమాండు ఉంది.

## పాల్‌బ్యూరో ఇలా రాస్తున్నాడు

'ఇదొక పెద్ద వ్యవస్థ. అత్యంత పటిష్టంగా నడుస్తోంది. మంచి వేతనాలతో అనుభవజ్ఞులైన అధికారులు, సిబ్బందితో సమర్థవంతంగా నడుస్తోంది. రచయితలు, పబ్లిషర్లు **(Publicist)** వక్తలు, యువకులు, విద్యార్థులు, నిపుణులు సంచార వ్యాపారులు ఇందులో అధికారికంగా ఉద్యోగాలు చేస్తుంటారు. ప్రకటనలు, పోస్టర్లలాంటి వినూత్న విధానాలతో కస్టమర్లను ఆకర్షిస్తారు.

ఈ కేంద్రాల్లో కాకుండా, హోటళ్లు, టీ బంకులు, ధాబాలు, నర్తనశాలల్లో కూడా బహిరంగంగా వ్యభిచారం సాగుతూ ఉంటుంది. కొన్ని సందర్భాల్లో వేశ్యలపట్ల చాలా క్రూరంగా దౌర్జన్యాలు కూడా జరుగుతాయి. 1912లో ఒకసారి పశ్చిమ ఫ్రాన్స్‌లోని ఒక యువతి 47 మందితో శరీరాన్ని పంచుకోవాల్సివచ్చింది. ఇంకా అనేకమంది విటులు ఆమెతో పొందుకు సిద్ధంగా ఉన్నారు. అప్పుడు నగర మేయర్ కల్పించుకొని ఆ యువతి ప్రాణాలు కాపాడాల్సి వచ్చింది.

వేశ్యావృత్తిని వ్యాపారంగా నిర్వహించడమే కాకుండా, స్వచ్ఛందంగా వేశ్యాగృహాలను నడిపే కొత్త విధానాన్ని ప్రవేశపెట్టిన ఘనత ప్రపంచ యుద్ధానికే దక్కింది. యుద్ధకాలంలో ఫ్రాన్స్ భూభాగాన్ని రక్షించుకోవడం కోసం పోరాడుతున్న యోధులకు దేశభక్తులైన ఆ దేశ మహిళలు అలాంటి 'సేవ' లందించారు. వారి సేవలకు ప్రతిఫలంగా తండ్రిలేని సంతానం వారికి కానుకగా లభించారు. వారికి (ఆ సంతానానికి) 'War - God - MotherÑ అన్న గౌరవ బిరుదు ప్రదానం చెయ్యబడింది. ఈ కొత్త పదాన్ని అనువదించడానికి మాకు భాష లభ్యం కావడం లేదు. ఈ మహిళలు నిరాటంకంగా వారికి ఎలాంటి లోటు రాకుండా వ్యభిచారం నిర్వహించేవారు. వీరికి సహాయసహకారాలు అందించడం వ్యాపార వర్గాల నైతిక బాధ్యత అయిపోయింది. ప్రముఖ దినపత్రికలు ప్రత్యేకించి ఫ్రాన్స్‌లోని ఫన్‌టాషియో (Fatasio) లారీపారీజయా (Lavie Parisienne) అనే రెండు అధికార పత్రికలు వారి తరపున పెద్ద ఎత్తున ప్రచార సేవలు అందించాయి. 1917 ప్రారంభంలో ఈ పత్రికలు ఒకే సంచికలో 199 మహిళల చిత్రాలు ప్రచురించాయంటే వీటి సేవను మనం అర్థం చేసుకోవచ్చు.

## అసభ్యత, అశ్లీలతల హోరు

అశ్లీలతల ఈ హోరు, జన సామాన్యంలో దాని ఆమోదం, కామోద్రేకాల ఈ జ్వలనం ఇదంతా అశ్లీల సాహిత్యం, బూతు చిత్రాలు, అశ్లీల నృత్యాలు, నగ్నత్వం లాంటి చెడులు ఎలాంటి ఆటంకం లేకుండా జనసామాన్యంలో ప్రచారం కావడమే అసలు కారణం.

స్వార్థ పరులైన కొంతమంది సామ్రాజ్యవాదుల వర్గం. ఏదో ఒక విధంగా ప్రజల భావోద్రేకాలను రెచ్చగొట్టి తమ వ్యాపార పబ్బం గడుపుకుంటున్నాయి. దిన, వార పత్రికలు, పక్ష పత్రికలు, మాసపత్రికలు సమస్తమూ అత్యంత నీచంగా అశ్లీల వ్యాసాలను, కథలు సీరియల్స్‌ను ప్రచురిస్తున్నాయి. సర్క్యులేషన్‌ను పెంచుకోడానికి ఇంతకంటే మంచి సాధనం లేదని అవి భావిస్తున్నాయి. అంతేకాకుండా స్త్రీ పురుష సంబంధాలను కథలు, పుస్తకాలు, నవలలుగా కూడా ముద్రిస్తారు. ఒక్కొక్క ఎడిషన్ యాభయ్యేసి వేల ప్రింట్లు వేస్తారంటే వీటి అమ్మకాలు ఏ స్థాయిలో ఉన్నాయో అర్థం చేసుకోవచ్చు. ఒక్కోసారి అరవయి ఎడిషన్లు ప్రింటవుతాయంటే పరిస్థితిని అంచనా వేయవచ్చు.

కొంతమంది పబ్లిషర్స్, కొన్ని ప్రింటింగ్ ప్రెస్‌లు ప్రత్యేకించి ఇలాంటి సాహిత్యాన్ని ప్రింట్ చేయడానికే స్థాపించబడ్డాయి. కొంతమంది రచయితలు కూడా ఇలాంటి పుస్తకాలు రాసే ప్రఖ్యాతలు గడించారు. అశ్లీల పుస్తకాలు రాయడం ఇప్పుడెవరికీ సిగ్గుకాని, అవమానం గాని కాదు. ఒకవేళ పుస్తకం ప్రజాదరణ పొందితే ఫ్రెంచ్ అకాడమీ సభ్యుడిగా నియమితులయ్యారు. లేకపోతే కనీసం క్రోయిక్స్ ఢోనియర్ (Croix Dhonneur) కైనా అర్హత సంపాదిస్తారు.

ప్రభుత్వం ఇలాంటి అశ్లీల రచయితలను, ప్రజల భావోద్రేకాలను రెచ్చగొట్టే వారిని చూసీచూడనట్లు వదిలేస్తుంది. ఎప్పుడైనా చాలా తీవ్రమైన, నీచమైన అశ్లీలతను గుప్పించినప్పుడు మాత్రమే నామమాత్రంగా స్పందిస్తుంది. అయినా న్యాయస్థానాల ఆసనాలపై కూర్చున్నవారు ఇలాంటి దౌర్జన్యకారులను ఉపేక్షించి ఉదారంగా వ్యవహరిస్తారు. నామమాత్రంగా ఒక వార్నింగ్ ఇచ్చి వదిలేస్తారు. ఎందుకంటే ఒకవేళ గట్టిగా స్పందిస్తే పెద్ద పెద్ద రచయితలు, కళాకారులు ఏకమై భావప్రకటనా స్వేచ్ఛ అంటూ గొంతులు చించుకుంటారు. సాహిత్యం, కళలకు స్వేచ్ఛా వాతావరణం కావాలని వాళ్ల పత్రికల్లో పుంఖాను పుంఖాలుగా వ్యాసాలు రాస్తారు. కళను చిదిమేస్తున్నారని, గగ్గోలు పెడతారు. మధ్యయుగ భావాలకనుగుణంగా ఆంక్షలు విధించడం అంటే శృంగార రచనను కళను గొంతునులమడమేనని గోల చేస్తారు.

నిజానికి ఈ విధమైన శృంగార రచనలు, సాహిత్యం ఎలా వృద్ధిచెందుతాయో చూద్దాం. పెద్ద సంఖ్యలో నగ్న చిత్రాలు ప్రచారంలోకి తెచ్చి, లక్షల సంఖ్యలో ఆల్బంలు తయారు చేస్తారు. వాటిని బజార్లు, హోటళ్లు, ధాబాల్లోనే కాకుండా, పాఠశాలలు,కళాశాలల వరకూ విస్తరిస్తారు. ఎమోల్ పౌరసీ (Emile Pourcisy) అనే సామాజిక కార్యకర్త అశ్లీల నిరోధ వేదిక రెండవ వార్షికోత్సవ సమావేశంలో ఒక నివేదిక ప్రవేశపెట్టారు. ఆ నివేదికలో అతను ఇలా రాశాడు :

"ఈ అశ్లీల చిత్రాలు ప్రజల బుద్ధిని హరించి, విచక్షణ కోల్పోయేలా చేస్తాయి. అభాగ్యులను తీవ్రమైన దుర్మార్గాల వైపు ఉసిగొల్పుతాయి. ఆ దుర్మార్గాల ఊహకే రోమాలు నిక్కబొడుచుకుంటాయి. యువతీ యువకులపై ఎంత వినాశకర ప్రభావం పడుతుందో మాటల్లో చెప్పలేము. అనేక పాఠశాలలు, కళాశాలలు వీటి దుష్ప్రభావాల కారణంగానే నైతికంగా భౌతికంగా, పతనమయ్యాయి. ప్రత్యేకించి యువతులను

ఇంతకంటే ఎక్కువ నాశనం చేసే వస్తువు మరొకటి లేదు."

ఈ శృంగార భరిత సాహిత్య సేవకు సినిమాహాళ్లు, నర్తనశాలలు, వేశ్యా వాటికలు, క్లబ్బులు, పబ్బులు వేదికలుగా, కేంద్రాలుగా భాసిల్లుతున్నాయి. ఇలాంటి నాటికలను ఫ్రెంచ్ సమాజంలోని ఉన్నతస్థాయి ప్రజలు చాలా ఆసక్తిగా వీక్షిస్తారు. అలాంటి నాటక రచయితలు, నటులపై ప్రేమాభిమానాల పూలు కురిపిస్తారు. ఎలాంటి తారతమ్యం లేకుండా అందరూ కామోద్రేకాల జడివానలో తడిసి ముద్దవుతారు. వారి ప్రత్యేకత ఏమిటంటే, నైతికంగా పరమచండాలమైన, అత్యంత నీచమైన కారెక్టర్‌ను హీరోగా, మార్గదర్శక పాత్రగా చూపిస్తారు. పాల్‌బ్యూరో ప్రకారం: "ముప్ఫయి, నలభై ఏళ్లుగా మన నటులు ఏ జీవన విధాన్నయితే చూపిస్తున్నారో, తమ పాత్రల ద్వారా ఎలాంటి జీవితాన్ని ఆవిష్కరిస్తున్నారో, దాన్ని చూసి ఎవరైనా మన నాగరిక జీవితాన్ని అంచనా వేయదలచుకుంటే, వారికి తెలిసే దేమిటంటే, మన సమాజంలో ఉన్నటువంటి వివాహిత జంటలు పరస్పర అనుమానాలతో, ప్రేమరహిత దాంపత్య జీవితాన్ని గడిపినవారేనని నిర్ధారణకొస్తారు. భర్త అయితే మూర్ఖుడన్నా అవుతాడు. లేకపోతే భార్యప్రాణాలు హరించే కసాయి అన్నా అవుతాడు. భార్య సుగుణం ఏదన్నా ఉందంటే, అనుక్షణం భర్తపట్ల విరక్తిపెంచుకొని నిరాశచెంది మనసును ఇతర మార్గాల్లోకి మళ్లించుకోవడమే అయి ఉంటుంది.

ఉన్నత వర్గాల ప్రజలు విహరించే, వీక్షించే నర్తన శాలలు, విహార ప్రదేశాల పరిస్థితే ఇలా ఉంటే, ఇక సాధారణ ప్రజల థియేటర్లు, విహార ప్రదేశాల పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించవచ్చు. నీచమైన, తిరుగుబోతు ప్రవృత్తి కలిగిన ప్రజలు ఎంత అశ్లీల భాషను, నగ్న దృశ్యాలను ఇష్టపడతారో వాటిని ఎలాంటి సిగ్గుశరమూ లేకుండా అక్కడ ప్రదర్శిస్తారు. మీ కామతృష్ణ కోరేదంతా ఇక్కడ సిద్ధంగా ఉందని ప్రకటనల ద్వారా ప్రజలకు విశ్వాసం కల్పించడం జరుగుతుంది. మా వేదిక ఎలాంటి ఇబ్బందులకూ తావులేని అహ్లాదకరమైన యదార్థ వేదిక (Realistic) అని ఆకర్షిస్తూ ఉంటారు.

అమీల్ పూరైసీ తన నివేదికలో ఇలాంటి అనేక రుజువులు ఉదహరించాడు. ఎన్నో విహార కేంద్రాలను సందర్శించి రూపొందించిన ఈ నివేదికలో వాటి అసలు పేర్లకు బీజాక్షరాల ముసుగు తగిలించాడు :

ఇందులో నటీనటుల గేయాలు, సంభాషణ, నర్తన తీవ్రమైన అశ్లీలం కలిగి ఉండేది. తెరపై ప్రదర్శించే దృశ్యాలు అశ్లీలం చివరి అంచుల వరకూ చేరేవి. వెయ్యిమంది కంటే ఎక్కువ సంఖ్యలో ఉన్న వీక్షకుల్లో మర్యాదస్తులు కూడా కనిపించేవారు. అందరూ ఆనందపారవశ్యంలో వివశులై కరతాళ ధ్వనులలో వారిని ప్రశంసించేవారు.

ఇందులో చిన్న చిన్న గీతాల మధ్యలో సరస సంభాషణలు, దానికి తగిన అశ్లీల నృత్యాలు ఉండేవి. ఇందులో సిగ్గు, బిడియం అన్నవి మచ్చుకైనా కనబడేవి కావు. పిల్లలు యువకులు తల్లిదండ్రులతో కలిసి ఈ అశ్లీల నృత్యాలను చూస్తూ, అశ్లీలం తారా స్థాయికి చెందిన దృశ్యాలను చూసినప్పుడు కరతాళ ధ్వనులు చేసేవారు.

ఎల్. ఈ రకంలో సభికులు ఐదుసార్లు కేకలు కేరింతలు కొట్టి తమ హర్ష ధ్వానాల మధ్య ఒక నటిని వేదికపైకి ఆహ్వానిస్తారు. ఈమె అశ్లీలతకే మాతృకలాంటి ఒక పాటను పాడి, ఆడి ప్రేక్షకులను ముగ్ధులను చేస్తుంది.

ఆర్. ఇందులో కూడా ప్రేక్షకులు ఒక నటితో పదే పదే అశ్లీలతను చేయించారు. అయినా ప్రేక్షకులు ఇంకా ఇంకా అంటూ ఉండగా ఆ నటి చిర్రెత్తిపోయి : 'మీకు మరీ సిగ్గులేకుండా పోయింది. హాల్లో పిల్లలు కూడా ఉన్నారని ఆలోచించరే' అంటూ వాటి మధ్యలోనే నిష్క్రమించింది. చూడండి : అశ్లీలం ఎంత శృతిమించిందంటే, అశ్లీలతే వృత్తిగా జీవిస్తున్న నటి కూడా దాన్ని సహించలేకపోయింది.'

జె. 'ఇందులో షో ముగిసిన తరువాత నటీనటుల పేర లాటరీ తీస్తారు. లాటరీ టికెట్లు స్వయంగా నటీమణులే రెండేసి రూపాయలకు విక్రయిస్తారు. ఏ నటి పేరు లాటరీలో ఎవరికి తగులుతుందో ఆమె ఆ రాత్రి అతడితో గడుపుతుంది.

పౌల్‌బ్యూరో ఇలా రాస్తున్నాడు : ఒక్కోసారి వేదికపై స్త్రీలు ఒంటిపై నూలు పోగు కూడా లేకుండా నగ్న ప్రదర్శనలు చేసేవారు. ఒకసారి అడాల్ఫ్ బ్రయాసోన్ (Adolphe Briason) ఫ్రాన్స్‌లోని ప్రముఖ పత్రిక 'టామ్స్' (tamps)లో ప్రదర్శనను నిరసిస్తూ, 'ఇక వేదికపై సంభోగ క్రియ ఒక్కటే మిగిలిపోయింది' అని రాస్తూ, నిజంగా 'కళ' సంపూర్ణ మయ్యేది కూడా అప్పుడే కదా : అంటూ వ్యంగ్యంగా వ్యాఖ్యానించాడు.

గర్భనిరోధక ఉద్యమాలు, వివిధ (Sexualscience) అనామక లైంగిక, విజ్ఞాన సాహిత్యం కూడా అశ్లీలత విస్తరించడానికి, ప్రజల నైతిక ప్రవర్తనను వికృతం

చేయడంలో తనవంతు పాత్ర నిర్వహిస్తోంది. బహిరంగ సభల్లో ఉపన్యాసాల ద్వారా, కళారూపాల ద్వారా, పత్రికా ప్రకటనల ద్వారా, వివరణాత్మక బుక్‌లెట్ల, కరపత్రాల ద్వారా గర్భనిరోధక పద్ధతులు ఎలా అవలంబించాలన్న దానిపై అవసరానికి మించి వివరణలు ఇవ్వబడతాయి. ఇక దాచుకోడానికి ఏమీ లేదన్నంత విపులంగా లైంగిక సంబంధాల విషయాలు పూసగుచ్చినట్లు వివరించబడతాయి. ఇదే విధంగా సామాజిక శాస్త్ర పుస్తకాల్లో కూడా దేహంలోని ప్రతి అవయవాన్ని గురించి దేన్నీ వదలకుండా వివరించడం జరుగుతుంది. దీనిపై వ్యతిరేకత రాకుండా ఉండడానికి గాను భౌతికంగా దీనిపై సైన్స్ పరదా కప్పుతారు. అంతేకాదు, శాస్త్రీయత పేరుతో ఇంకా ముందుకెళ్లి సామాజిక సేవ పేరుతో కూడా దీన్ని వృద్ధి చేయడం జరుగుతుంది. శారీరకంగా, ఆరోగ్యపరంగా, లైంగికపరంగా మేము ప్రజలను విజ్ఞానవంతులను చేస్తున్నామని చెప్పుకుంటారు. కాని వాస్తవమేమిటంటే, ఈ సాహిత్యం, ఈ విజ్ఞాన విస్తరణ స్త్రీ పురుషులు, యువకులు చిన్నపిల్లల్లో సైతం విశృంఖలతను, అశ్లీలతను విపరీతంగా పెంచిపోషిస్తోంది. దీని కారణంగా పాఠశాలలో చదివే ప్రాజ్ఞత కూడా రాని ఒక అమ్మాయి, పెళ్లయిన మహిళలక్కూడా తెలియని లైంగిక విజ్ఞానాన్ని కలిగి ఉంటుంది. యుక్తవయసుకు రాని యువకుల పరిస్థితి కూడా ఇదే. సమయానికి ముందే వారి భావోద్రేకాలు చంచలమవుతున్నాయి. అనుభవం కోస వెంపర్లాట ప్రారంభమవుతోంది. యుక్త వయసుకు రాకపూర్వమే వారు తమను తాము మనోకాంక్షల విషకౌగిలిలో సమర్పించుకుంటున్నారు. వివాహానికి మాత్రం వయసు నిర్ణయించడం జరిగింది. కాని అనుభవానికి మాత్రం నిర్ణీత వయసుతో నిమిత్తం లేదు. 12, 13 ఏళ్ల వయసునుండే ఈ వ్యవహారం ప్రారంభమైపోతుంది. ఏమిటీ వైపరీత్యం.

**జాతి వినాశన సూచనలు**

అనైతికత, మనో కాంక్షలు, కోరికల దాస్యం, తీవ్రస్థాయికి చేరి స్త్రీలు పురుషులు, యువకులు, వృద్ధులు అందరూ భోగవిలాసాల్లో పీకలదాకా మునిగి, కామోద్రేకాలు తారాస్థాయికి చేరినచోట జాతి వినాశనం అంచులకు చేరిందని చెప్పవచ్చు. ప్రజలు ఇలాంటి నీచ జాతుల వృద్ధీ వికాసాలను చూసినప్పుడు, వారి భోగ విలాసాలు, వారి కోరికల దాస్యం వారి ప్రగతికి అవరోధంగా మారలేదని, వారికి సహాయకారిగా నిలచాయని భావిస్తారు. ఒకజాతి ప్రగతి పథంలో వేగంగా పయనిస్తున్నప్పుడు దాని భోగలాలసలు, దాని కోరికల వేగం కూడా తారాస్థాయిలోనే

ఉంటుంది. కాని ఇదొక భ్రమమాత్రమే. ఎక్కడైతే నిర్మాణం విచ్ఛిన్నం రెండూ కలిసీ పనిచేస్తుంటాయో, మొత్తంగా నిర్మాణం కోసం దృఢంగా కనిపిస్తుందో, అక్కడ విచ్ఛిన్నశక్తిని కూడా నిర్మాణ వస్తువుగా పరిగణించడం కేవలం బుద్ధిలేనివాడు చేసే పనిమాత్రమే.

ఉదాహరణకు ఒక తెలివైన వ్యాపారి తన శ్రమ, తెలివితేటల ద్వారా లక్షలు సంపాదిస్తున్నాడు. దాంతోపాటు సారాయి, జూదం లాంటి వ్యసనాలకూ బానిసైపోతాడు. ఇలాంటి స్థితిలో అతని జీవితంలోని ఈ రెండు కోణాలను సంతోషమూ, ప్రగతికోణాలే అని భావిస్తే మీరు తప్పు చేస్తున్నట్లే. నిజానికి అతని గుణాల్లోని మొదటి నిర్మాణం ప్రగతికి పునాది అయితే, రెండవది అతని వినాశనానికి నాంది పలుకుతోంది. మొదటి దాని శక్తితో కట్టడం (నిర్మాణం) నిర్మితమైనా, వినాశనానికి దారితీసే రెండవ కోణం తన ప్రభావాన్ని చూపదని భావించడం అవివేకమవుతుంది. వాస్తవాన్ని నిశితంగా పరిశీలిస్తే ఈ వినాశకరశక్తులు అతడి మేధో, శారీరక శక్తి యుక్తుల్ని తప్పకుండా హరించివేస్తున్నాయి. అతను ఎంతో శ్రమతో సంపాదించిన ధనాన్ని కొల్లగొడుతున్నాయి. అతణ్ని క్రమంగా నాశనం చేయడంతోపాటు, ఒకే వేటుతో తుదముట్టించే అవకాశం ఎప్పుడొస్తుందా అని అనుక్షణం ఎదురుచూస్తున్నాయి. జూదమనే షైతాన్ ఏదో ఒక దుర్ఘడియలో అతని జీవితకాల సంపదను బుగ్గిపాలు చేయాలని కాచుకొని కూర్చున్నాడు. మద్యపాన పిశాచి ఏదో ఒక క్షణాన అతణ్ని చిత్తుగా మత్తులో ముంచి నిత్యదరిద్రుణ్ని చేయాలని అదును కోసం వేచిచూస్తున్నది. చెడులు అనైతికతా పిశాచికూడా హత్యో ఆత్మహత్యో లేక మరేదైనా ఆకస్మిక విపత్తులో పడేయడానికి కాచుక్కూచున్నాయి. ఒకవేళ అతడు ఈ షైతానుల కబంధ హస్తాల్లో గనక చిక్కుకొని ఉండకపోతే అతడి ప్రగతీ వికాసాల గురించి మీరు ఊహించనైనా ఊహించలేరు. ఇదే సూత్రం ఒక జాతికి కూడా వర్తిస్తుంది. అది నిర్మాణాత్మక శక్తుల ద్వారా ప్రగతి సాధిస్తుంది. కాని సరైన మార్గదర్శకత్వం లభించని కారణంగా ప్రగతి వైపుకు కొన్ని అడుగులు వేసి స్వయంగా తన వినాశానికి కావలసిన ఏర్పాట్లు చేసుకుంటుంది. కొద్దికాలం వరకు నిర్మాణాత్మక శక్తులు తమ శక్తి సామర్థ్యాలతో దాన్ని ముందుకు తీసుకు వెళ్లినప్పటికీ, దాంతోపాటే, వినాశకర శక్తులు కూడా దాని జీవశక్తిని లోలోన చెదలా మేసేస్తూ ఉంటాయి. చివరికి ఒట్టిబోలు మాత్రమే మిగులుతుంది. ఏదో ఒక ఆపద, లేక విపత్తు దాన్ని

నేలమట్టం చేస్తుంది. చివరికి బూడిద కూడా మిగలదు. మేమిక్కడ కేవలం ఫ్రెంచ్ సామాజిక వ్యవస్థ రూపొందించిన కొన్ని పెద్ద పెద్ద వినాశకర హేతువుల్ని మాత్రమే సంక్షిప్తంగా పేర్కొంటున్నాము.

## శారీరక శక్తుల తగ్గుదల

కోరికలకు బానిసలైన కారణంగా ఫ్రాన్స్ వాసులకు మొట్టమొదట జరిగిన నష్టం ఏమిటంటే, వారిలో క్రమక్రమంగా శారీరక శక్తి సన్నగిల్లింది. నిరంతర కోరికలు, ఉద్రేకాల వల్ల నరాల బలహీనత చోటుచేసుకుంది. కోరికల దాస్యం వల్ల వారిలో నిగ్రహశక్తి, సహనశక్తి క్షీణించి పోయాయి. సుఖవ్యాధులు వారి ఆరోగ్యంపై తీవ్రమైన దుష్ప్రభావాన్ని చూపాయి. ఫ్రాన్స్‌లోని సైన్యాధిపతులు కొన్ని సంవత్సరాల తరువాత కొత్త సిపాయిలను రిక్రూట్ చేసుకునేటప్పుడు శారీరక దారుఢ్యానికి సంబంధించిన నిబంధనలను సడలించాల్సిన దుస్థితి 20వ శతాబ్దం ప్రారంభం నుండే తలెత్తింది. ఎందుకంటే, ఏ అర్హతా ప్రమాణాలు మొదట్లో ఉండేవో ఆ స్థాయి ప్రమాణాలకు సరితూగే యువకులు ఫ్రాన్స్‌లో క్రమక్రమంగా తగ్గిపోయారు.

ఇదొక బలమైన కొలమానం. ఫ్రెంచ్‌జాతి శారీరక శక్తియుక్తులు ఎంతవేగంగా నాశనమైపోయాయో, బలహీనమై పోయాయో ధర్మామీటరులా చెప్పే సాధనం ఈ పతన కారణాల్లో సుఖ్యవ్యాధులు ప్రధానమైనవి. ప్రపంచ యుద్ధం తొలి రెండేళ్లలో ఒక విధమైన వేడి రోగం (మేహరోగం) కారణంగా సెలవులపై అస్పత్రులకు పంపిన సిపాయిల సంఖ్య 75000 అంటే పరిస్థితిని అంచనా వేయవచ్చు. ఒక మామూలు సైనిక శిబిరంలో ఏకకాలంలో 242 మంది సిపాయిలు ఈ వ్యాధితో బాధపడ్డారు. ఒకవైపు ఫ్రాన్స్ జాతి జీవన్మరణ సమస్యలాంటి సున్నిత సందర్భంలో, దాని ఉనికిని కాపాడుకోవడం కోసం ఒక్కొక్క సిపాయి ఎంతో అవసరం, అమూల్యం, సమయం, శక్తియుక్తులు సాధనా సంపత్తులు జాతి రక్షణ కోసం అవసరమైన స్థితిలో ఆ జాతి యువకులు వేల సంఖ్యలో భోగలాలసతల కారణంగా కొన్ని నెలల దాకా కోలుకోలేని పరిస్థితిలో ఉండి, జాతి సంపద కూడా ఇలాంటి విపత్కర పరిస్థితిలో జాతికి కాకుండా తమ వైద్యం కోసం వెచ్చించాల్సిన పరిస్థితి ఏర్పడింది.

ఒక ఫ్రాన్స్ మేధావి డాక్టర్ లారిడ్ (Dr.Laridde) ఇలా అంటున్నాడు : ఫ్రాన్స్‌లో ప్రతి సంవత్సరం కేవలం మేహవ్యాధితో, దానికి సంబంధించిన వ్యాధుల కారణంగా 30వేల ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోతున్నాయి. క్షయ తరువాత

అన్నిటికన్నా ప్రాణాంతకమైన వ్యాధి ఇదే. ఇది కేవలం ఒక ఉదాహరణ. ఇది ఒక్కటే కాకుండా ఇంకా ఈ సుఖరోగాల జాబితా చాలా పెద్దది. ఈ ఒక్కదానికే ఇది పరిమితం కాదు.

## కుటుంబ వ్యవస్థ ఛిన్నాభిన్నం

అడ్డూ అదుపూ లేని ఈ విశృంఖలత్వం, సర్వసాధారణమైన తిరుగుమోతుతనం ఫ్రాన్స్ నాగరిక వ్యవస్థను ముఖ్యంగా కుటుంబ వ్యవస్థను సర్వనాశనం చేసింది. కుటుంబ వ్యవస్థ స్త్రీ పురుషుల శాశ్వత సంబంధం ద్వారా ఏర్పడుతుంది. దానిపేరే నికాహ్ లేక వివాహం. ఈ సంబంధం కారణంగా వ్యక్తుల జీవితాల్లో శాంతి, సంతృప్తి, నిలకడ దృఢత్వం ఏర్పడతాయి. ఇదే వారి వ్యక్తిగతాన్ని సామూహికతలోకి మార్చివేస్తుంది. గందరగోళం, విచ్ఛిన్నతలను అణిచివేసి, సంఘసేవకులుగా చేస్తుంది. ఈ వ్యవస్థలోనే ప్రేమ, శాంతి, త్యాగం లాంటి సుగుణాల సుందర వాతావరణం నెలకొంటుంది. ఈ వ్యవస్థలో నవతరాలు సరైన నైతిక శిక్షణలో మంచి వ్యక్తిత్వంతో పరిఢవిల్లుతాయి కాని ఎక్కడతే స్త్రీ పురుషుల మనో మస్తిష్కాల నుండి వివాహం, దాని ఉద్దేశ్యం యొక్క భావనలే సెలవుతీసుకుంటాయో, మరియు స్త్రీ పురుషుల సంబంధాల ఉద్దేశ్యం కేవలం ప్రజలదృష్టిలో కామవాంఛ మాత్రమే తీర్చుకోవడం అయిఉంటుందో, ఎక్కడైతే రసికులు, రసికురాళ్లు అధిక సంఖ్యలో తేనెటీగల్లా ప్రతి పవ్వు పరిమళాన్ని పీల్చి పిప్పిచేస్తూ తిరుగుతుంటారో, అలాంటి చోట ఈ వ్యవస్థ ఏర్పడదు, ఏర్పడినా నిలబడదు. అలాంటి (అక్కడి) స్త్రీ పురుషుల్లో దాంపత్య బాధ్యతలను, విధులను నిర్వర్తించే, హక్కులను నెరవేర్చే శక్తి సామర్ధ్యాలే ఉండవు. వారి ఈ మేధోపరమైన నైతిక పరమైన దుష్ప్రభావం వల్ల తరువాతి తరాల శిక్షణ సంస్కరణ మొదటి తరంకన్నా అధ్వాన్నంగా ఉంటుంది. వ్యక్తుల్లో స్వార్థం, స్వలాభాలు ఎంతగా పెరిగిపోతాయంటే, దానివల్ల సభ్యత సంస్కారాల పునాదులే కదలి పోతాయి. మనస్సులో చపలత్వం విపరీతంగా పెరిగి జాతీయ రాజకీయాలు, అంతర్జాతీయ వైఖరుల్లో కూడా స్థిరత్వం, నిలకడ ప్రాప్తంకాదు.

కుటుంబంలో శాంతి కొరవడిన కారణంగా వ్యక్తుల జీవితాలు అశాంతికి నిలయాలుగా మారిపోతాయి. సుదీర్ఘమైన, అంతులేని వ్యాకులత ఏరోజూ వారిని స్థిమితంగా ఊపిరిపీల్చుకోనివ్వదు. ఇది ప్రపంచంలోనే నిత్యనరకం. దీన్ని మానవుడు

తన పొగరుబోతు తనం కారణంగా, మనోవాంఛల కోరికల పరిపూర్తికి బహుమానంగా చేజేతులా కొనుక్కుంటాడు.

ఫ్రాన్స్‌లో సాలీనా కేవలం ఏడెనిమిది వేలమంది మాత్రమే వివాహ బంధంతో ఒక్కటవుతారు. ఫ్రాన్స్ జనాభా రేటుతో పోల్చుకుంటే ఈ ఏడెనిమిది వేలు ఎంతచిన్న సంఖ్యో మనకు అర్థమవుతోంది. మిగతా దేశ జనాభా అంతా పెళ్లి పెటాకులు ఏమీ లేకుండానే సహజీవనం చేస్తుంటారు. అయితే వివాహం చేసుకున్నా సంఖ్యలో కూడా ఆ వివాహబంధాన్ని గౌరవించి, నైతిక విలువలకు కట్టుబడి ఉండేవారు అతిస్వల్పం. ఈ ఒక్క ఉద్దేశ్యం తప్ప వీలైనన్ని ఇతర ఉద్దేశ్యాలన్నీ వారి దృష్టిలో ఉంటాయి. చివరికి అందరూ కలసి ఉండే ఈ సాధారణ ఉద్దేశ్యంలో మరొక మాటేమింటే, వివాహానికి ముందు ఒక స్త్రీ అక్రమ సంతానాన్ని కంటే, వివాహం ద్వారా అక్రమ సంతానానికి చట్టబద్ధత కల్పించాలనేది మరో ఉద్దేశ్యం. పాల్‌బ్యూరో ఇలా రాస్తున్నాడు:

ఫ్రాన్స్‌లోని శ్రామిక వర్గం (Working classes) ప్రజల్లో ఒక సాధారణ రివాజు ఉంది. అదేమిటంటే వివాహానికి పూర్వం స్త్రీ తన కాబోయే భర్తతో ఈ సంతానాన్ని తన సంతానంగా అంగీకరిస్తానని వాగ్దానం తీసుకుంటుంది. 1917లో సీన్ (Siece) న్యాయస్థానం ముందు ఒక స్త్రీ ఇలా చెప్పింది :

నేను వివాహ సమయంలోనే నా భర్తకు ఈ విషయం తెలియజేశాను. మన వివాహానికి పూర్వం కలిగిన సంతానాన్ని సక్రమ సంతానంగా, చట్టబద్దత కల్పించు కోవడమే ఈ వివాహం అసలు ఉద్దేశ్యం.' ఇక నేను అతని భార్యగా ఉండడ మనే విషయం ఆరోజూ నా మనసులో లేదు. ఈ రోజూ లేదు. ఈ కారణంగానే వివాహం జరిగిన రోజు 5.30గంటలకే నేను నా భర్తనుండి వేరైపోయాను. ఈ నాటి వరకూ మళ్లీ అతనితో కలవలేదు. ఎందుకంటే దాంపత్యబంధాన్ని నిలుపుకోవాలన్న ఉద్దేశ్యమే అసలు నాకు లేదు."

పియర్స్‌లోని ప్రఖ్యాత కళాశాల ఆచార్యుడు బ్యూరోతో ఇలా అన్నాడు:

సాధారణంగా యువకులు వివాహం ద్వారా ఒక స్త్రీని సేవకురాలిగా పొంద వచ్చనే ఉద్దేశ్యాన్ని కలిగి ఉంటారు. పది పదిహేనేళ్ల వరకు వారు రకరకాల రుచులు చవిచూస్తారు. చివరికి ఒక సమయం వచ్చాక విశృంఖల జీవితం పట్ల విరక్తిచెందిన

ఒక స్త్రీని వివాహం చేసుకుంటారు. ఎందుకంటే కుటుంబంలో శాంతీ నెలకొనాలి. మరియు స్వేచ్ఛగా కోరికలూ తీరాలి.

ఫ్రాన్స్‌లో వివాహితులు వ్యభిచారం చేయడం ఏ విధంగానూ తప్పుకాదు. దాన్నెవరూ అవమానంగా భావించరు. ఎవరైనా భార్యకాకుండా మరొక స్త్రీని ఉంచుకుంటే అతనా విషయాన్ని రహస్యంగా ఉంచాల్సిన అవసరమేం లేదు. సమాజం ఈ చర్యను చాలా సాధారణంగానే పరిగణిస్తుంది తప్ప ఏమాత్రం పట్టించుకోదు.

ఈ పరిస్థితుల్లో వివాహబంధం చాలాడొల్లగా మారిపోయి చీటికీమాటికీ ఆ బంధం పుటుక్కున తెగిపొయ్యేది. కొన్ని సందర్భాల్లో పాపం ఈ బంధం కేవలం కొన్ని గంటలకు మించి ఉండేదికాదు. అనేకసార్లు ఫ్రాన్స్‌లో మంత్రిగా పని చేసిన ఓ గొప్పవ్యక్తి పెళ్లిచేసుకున్న 5గంటలకే తన భార్యనుండి విడాకులు అందుకున్నాడు. చిన్న చిన్న విషయాలే విడాకులకు కారణమవుతాయి. వీటి గురించి వింటే ఎవరికైనా నవ్వు వస్తుంది. ఉదా॥ నిద్రలో గురకపెట్టడం వల్ల, కుక్క పిల్ల నచ్చకపోవడం ఇలాంటివీ విడాకులకు దారితీసే కారణాలు. ఒకసారి సీన్ న్యాయస్థానం ఒకేరోజు 294 వివాహాలను రద్దు చేసింది. అన్నీ ఇలాంటి చిన్న చిన్న కారణాలే. 1844లో విడాకులచట్టం పాసైనప్పుడు 400 విడాకుల కేసులు సంభవిస్తే 1900లో ఈ సంఖ్య 7,500కు చేరుకుంది. 1913లో 16,500 1931లో 21వేలకు చేరుకుంది.

## సంతాన హత్య

పిల్లల ఆలనాపాలన ఒక ఉత్తమ శ్రేణికి చెందిన నైతిక కార్యం. మనోవాంఛల్ని, కోరికల్ని త్యాగం చేయడం, బాధలు, కష్టాలు సహించడం, ధనప్రాణాల త్యాగం ఇందులో ఉంటుంది. స్వార్థపరులు స్వలాభాపేక్ష కలిగినవారు దీనికి ఎంతమాత్రం పనికిరారు.

60,70 ఏళ్లనుండి గర్భనిరోధక ఉద్యమం ఫ్రాన్స్‌లో బహుళ ప్రచారం పొందుతోంది. ఈ ఉద్యమం ఫలితంగా ఫ్రాన్స్ భూభాగంలోని ఒక్కొక్క మహిళకు, పురుషునికి లైంగికానందం పొందడంతోపాటు పిల్లల్ని కనకుండా ఎలాంటి విధానా లను అనుసరించాలన్న దానిపై లైంగిక విజ్ఞానం చేరవేయబడింది. స్త్రీ పురుషులు అమితమైన లైంగికానందం పొందడంతోపాటు, దాని ఫలితంగా కలిగే సంతానాన్ని ఎలా ఉనికిలోకి రాకుండా చేయాలన్న దానిపై వారిలో అవగాహన కల్పించబడింది.

ఊరు, వాడ, పట్నం, నగరం అన్ని చోట్లా గర్భనిరోధక మందులు, సాధనాలు సునాయాసంగా అందేలా ఏర్పాట్లు చేయబడ్డాయి. ప్రతిఒక్కరూ వాటిని ఎలాంటి శ్రమలేకుండా పొందవచ్చు. ఫలితంగా విచ్చలవిడి వ్యభిచారానికి పాల్పడేవారే కాకుండా, వివాహిత జంటలు కూడా అత్యధికంగా వీటిని వినియోగిస్తున్నారు. ప్రతి స్త్రీ పురుషుడు తమ ఏకాంత సంతోషాన్ని భగ్నం చేసే సంతానం తమ మధ్య అవరోధంగా ఉండడాన్ని కోరుకోవడం లేదు. ఫ్రాన్స్‌లో పడిపోతున్న జననాల రేటు చూసి నిపుణులు మహమ్మారిలా విస్తరించిన ఈ గర్భనిరోధక విధానాల వల్ల కనీసం 6లక్షల మానవ జననాలను నిరోధించడం జరిగిందని అంచనావేశారు.

ఇన్ని ప్రయత్నాలు చేసినా నిలిచిన గర్భాలను గర్భవిచ్ఛిత్తి ద్వారా (అబార్షన్) తొలగించడం జరుగుతుంది. ఈ విధంగా మరో మూడు నాలుగు లక్షలమంది మానవులను ఈ లోకంలోకి రకుండా నిరోధిస్తున్నారు. ఈ అబార్షన్‌లను అవివాహిత స్త్రీలు మాత్రమే కాదు, వివాహిత స్త్రీలు కూడా వారికి పోటీగా చేయించుకుంటారు. ఈ చర్య నైతికంగా ఉత్తమమే కాకుండా, అది స్త్రీల హక్కు అని భావిస్తారు. రాజ్యాంగంలో ఈ చర్య నేటికీ నిషేధమే అయినప్పటికీ ఈ విషయంలో చట్టం మాత్రం కళ్ళుమూసుకుంది. అయితే పేరుకుమాత్రం 300కేసుల్లో ఒక కేసుకు జరిమానా విధిస్తారు. వాటిలోనూ కూడా 75% కేసులు న్యాయస్థానాల్లో రుజువుల్లే కుండా పోతాయి. గర్భవిచ్ఛిత్తికి సంబంధించిన విధానాలు ఎంత సులభతరం చెయ్యబడ్డాయంటే, చాలామంది మహిళలు స్వయంగానే గర్భవిచ్ఛిత్తి చేసుకుంటారు. ఎవరైనా భయపడి వెనకంజవేస్తే వారికి సహకరించి ఆపని కాస్తా చేసి పెట్టేవాళ్లు అడుగడుగునా అందుబాటులో ఉంటారు. కడుపులో బిడ్డను కాటికి పంపడం వారికి ఎంత ఈజీ అంటే నొప్పితో బాధపెడుతున్న పన్నును తొలగించుకోవడం ఎంత తేలికో, గర్భవిచ్ఛిత్తి వారికంత తేలిక.

ఈ విధమైనటువంటి ఆలోచనా విధానం ప్రకృతిసిద్ధమైన మాతృప్రేమకే మచ్చుతెచ్చింది. ప్రపంచం మహోన్నతం, పవిత్రం అని ఘనంగా కీర్తించిన మాతృప్రేమ నేడు తన సంతానం పట్ల వైరాన్ని, ఏహ్యాభావాన్ని ప్రదర్శిస్తోంది. గర్భనిరోధం, విచ్ఛిత్తుల నుండి తప్పించుకొని సురక్షితంగా బయటపడినా, ఒకవేళ ఈ సంతానం వారిపట్ల అత్యంత క్రూరంగా ప్రవర్తించడం జరుగుతోంది. ఈ హృదయ విదారకరమైన యదార్థాన్ని పౌల్‌బ్యూరో ఇలా వర్ణిస్తున్నాడు :

"కన్నతల్లిదండ్రుల దుర్మార్గానికి, క్రూరత్వానికి గురైన పిల్లల బాధామయ గాధలు ప్రతిరోజూ పత్రికల్లో ప్రచురితమవుతూనే ఉంటాయి. పత్రికల్లో కేవలం కొన్ని అసాధారణ సంఘటనల ప్రస్తావన మాత్రమే వస్తుంది. కాని సాధారణ పిల్లలు- అమాయక పసికందుల పట్ల ఎంత కాఠిన్యంగా, దుర్మార్గంగా వ్యవహరిస్తారో ప్రస్తావించరు. కేవలం వారి తల్లిదండ్రులు తమ సంతోషానికి అడ్డొచ్చారన్న కారణంతో ఇలా వ్యవహరిస్తారు. గర్భవిచ్ఛిత్తికి ప్రయత్నించలేని అధైర్యంవల్ల అమాయక పసికందులు వెలుగు చూడగలుగుతున్నారు. అయితే ఈ ప్రపంచంలో కళ్లు తెరిచిన తరువాత దానికి తగిన మూల్యం వారు అనుభవించవలసి వస్తోంది." (పే. 74)

"ఈ దుర్మార్గం ఎంతవరకూ వెళ్లిందంటే, ఒకసారి ఆరు నెలల పసికందు మరణిస్తే ఆతల్లి పసికందు శవం ముందు సంతోషంగా చిందులేసింది. ఒళ్ళు తెలియని ఆనందంలో ఆడిపాడింది. చుట్టుపక్కల వారందరితో "ఇకమేము మరో శిశువు జననానికి అవకాశం ఇవ్వం" అని సంతోషంగా చెప్పింది. నాకు, నా భర్తకు ఈ పిల్లవాడి మరణం అమితమైన ఆనందం కలిగించింది. మాకు మనశ్శాంతి లభించింది. అసలీ పిల్లవాడి విలువెంత? చీటికిమాటికీ రోదిస్తూ, ఒంటికి రెంటికి పోస్తుంటాడు. ఇక మనుషులకు దీన్నుండి విముక్తి ఎప్పుడు?" (పే. 75)

ఇంతకన్నా విచారకరమైన విషయం ఏమిటంటే, పిల్లలను హత్యచేసే రోగం విపరీతంగా ప్రబలుతోంది. ఫ్రాన్స్ ప్రభుత్వం, అక్కడి న్యాయస్థానాలు గర్భవిచ్ఛిత్తి కేసుల లాగానే, క్రూరత్వం పట్ల కూడా చూసీచూడనట్లు నిద్రనటిస్తున్నాయి. ఉదా॥ 1918 ఫిబ్రవరిలో లోయర్ (Loire) న్యాయస్థానంలో ఇద్దరు యువతులు తమ సంతానాన్ని చంపిన నేరం కింద హాజరు పరచబడ్డారు.

కాని ఇద్దరూ దోష విముక్తులయ్యారు. ఇందులో ఒక యువతి తన పిల్లవాణ్ని నీటిలో ముంచి చంపేసింది. అప్పటికే ఒక పిల్లవాణ్ని ఆ యువతి బంధువులు పెంచుతున్నారు. ఈ రెండవ సంతానాన్ని సంరక్షించడానికి కూడా వారు సిద్ధంగా ఉన్నారు. అయినా ఆమె ఆ పసిప్రాణాన్ని సజీవంగా ఉంచదలచుకోలేదు. న్యాయస్థానం ఈమె చేసిన నేరం క్షమించదగినదేనని అభిప్రాయపడింది. రెండవ యువతి తన పిల్లవాణ్ని గొంతు పిసికి చంపింది. పీకపిసికినా ప్రాణం

పోకపొయ్యేసరికి, గోడకేసికొట్టి ఆ పసిప్రాణం తీసింది. ఈ యువతి కూడా ఫ్రాన్స్ న్యాయమూర్తులు, జ్యూరీ సభ్యుల దృష్టిలో శిక్ష అనుభవించదగ్గ నేరస్తురాలిగా కనిపించలేదు. 1918 మార్చిలో సీన్ న్యాయస్థానం ముందు ఒక రాక్షస స్త్రీ ప్రవేశ పెట్టబడింది. ఈమె తన పిల్లవాడి నాలుకను గొంతునుండి లాగడానికి ప్రయత్నించింది. ఆ శిశువు తల పగలగొట్టి వాడి పీకనులిమి చంపింది. ఈ స్త్రీ కూడా శిక్షార్హురాలు కాదని న్యాయమూర్తులు, జ్యూరీ సభ్యులు అభిప్రాయపడ్డారు.

ఏ జాతి అయితే తన సంతానం పట్ల వైరాన్ని శత్రుత్వాన్ని ఈ స్థాయిలో పెంచుకుంటూoందో ఇక ప్రపంచంలోని ఏశక్తీ దాన్ని వినాశనం నుండి కాపాడలేదు. ఒకజాతి ఉనికి స్థిరంగా ఉండాలంటే కొత్త తరం అత్యంత అవసరం. ఏదైనా జాతి తన సంతానం పట్ల శత్రుత్వం కలిగి ఉంటే, నిజానికది తనకు తానే శత్రువనుకోవాలి. ఆత్మవంచన చేసుకుంటున్నట్లు భావించాలి. బయటి శత్రువు లేకపోయినా తానే తన అస్తిత్వాన్ని, ఉనికిని అంతం చేసుకోవడానికి సరిపోతుంది. నేను ఇంతకుముందే విన్నవించినట్లు, ఫ్రాన్స్‌లో జననాల రేటు గత 60 (అరవై) సంవత్సరాల నుండి క్షీణిస్తూ పోతోంది. ఒక సంవత్సరం మరణాల రేటు జననాలకు మించిపోతే, ఒక సంవత్సరం సమానమవుతుంటుంది. మరోసారి జననాల సంఖ్య మరణాల సంఖ్యతో పోల్చుకుంటే బహుకష్టంగా ఒకవెయ్యి ఎక్కువగా ఉంటుంది. మరోవైపు ఫ్రాన్స్ భూభాగంలో విదేశీ వలసలు రోజురోజుకూ పెరిగి పోతున్నాయి. 1931లో 4కోట్ల 18 లక్షల ఫ్రాన్స్ జనాభాలో 28లక్షల 90వేల మంది ఫ్రాన్సేతరులే ఉన్నారు. ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే, 20వ శతాబ్దం చివరికల్లా ఫ్రాన్స్ జాతి స్వదేశంలోనే అల్పసంఖ్యాక వర్గంలో చేరిపోయినా ఆశ్చర్యం లేదు. ఇవీ 19వ శతాబ్దంలో స్త్రీ స్వేచ్ఛ, స్త్రీ హక్కుల పేరిట ప్రారంభమైన ఉద్యమాల ఫలితాలు.



## 5వ అధ్యాయం

# మరికొన్ని ఉదాహరణలు

మేము, చారిత్రక కోణంలోని క్రమాన్ని కాపాడడానికి మాత్రమే ఫ్రాన్స్ వైఖరిని, దాని సిద్ధాంత ఫలితాలను మీముందుంచాము. అంతమాత్రాన ఈ వ్యవహారానికి సంబంధించి ఫ్రాన్స్ ఒక్కటే దుర్మార్గమైదని, మిగతా దేశాల్లో ఎలాంటి లోపాలు లేవని అర్థంకాదు. నిజానికి ఈ నైతిక విధానాలను, అసమతుల్య వైఖరిని అనుసరించే అన్ని దేశాలూ దాదాపు ఇదే స్థితిలోకి లోనై ఉన్నాయి. ఈ విషయాన్ని మేము ఇంతకు ముందు పుటల్లోనే ప్రస్తావించాము. ఉదాహరణకు అమెరికా సంయుక్త రాష్ట్రాలనే తీసుకోండి. అక్కడ ఈ విధమైన సామాజిక వ్యవస్థ, ఈ జీవన విధానం ఇప్పుడు మంచి ఊపుమీదుంది.

### పిల్లలపై విశృంఖల వాతావారణ ప్రభావం

బెన్‌లిండ్ సే అనే ఓ ప్రముఖుడు డెన్‌వర్ లో బాల నేరస్తుల న్యాయస్థానం (Juvencilecuort) అధ్యక్షుడిగా పనిచేశాడు. అందువల్ల అమెరికా యువకుల నైతిక స్థితగతులను గురించి సంపూర్ణంగా తెలుసుకునే అవకాశం ఆయనకు లభించింది. revolt Opmodern youth అనే పుస్తకంలో ఆయన ఇలా రాస్తున్నాడు:

"అమెరికాలోని పిల్లలు వయసుకు ముందే ప్రాజ్ఞతకు చేరుకుంటున్నారు. చాలా లేత వయసులోనే వారిలో లైంగిక భావాలు జనిస్తున్నాయి." బెన్‌లిండ్‌సే 312 మంది యువతులను శాంపిల్‌గా తీసుకొని ఒక అధ్యయనం జరిపాడు. అయితే వారిలో 255 మంది 11, 13 ఏళ్ల మధ్యలో పుష్పవతులయ్యారు. వారిలో కామోద్రేకాల స్థాయి సెక్స్ డిమాండ్ 18ఏళ్లు, ఇంకా అంతకంటే ఎక్కువ వయస్సు వారిలో ఉండవలసిన స్థాయిలో ఉన్నట్లు కనుగొన్నాడు.

డా॥ ఎడిట్ హోకర్ ఈజీ. EdithHowoker 'Laws of sex అనే పుస్తకంలో ఇలా రాస్తున్నాడు :

అత్యంత సంపన్న, సాంప్రదాయ వర్గాల్లో కూడా ఏడెనిమిదేళ్ల వయస్సున్న అమ్మాయిలు తమ సమవయస్సు అబ్బాయిలతో ప్రేమలో పడడం అసాధారణ

విషయమేమీ కాదు. ఒక్కోసారి ఈ ఏడెనిమిదేళ్ల పిల్లలే సెక్స్‌లో కూడా పాల్గొంటారు. డాక్టర్ వోకర్ ఇంకా ఇలా రాస్తున్నాడు :

సాంప్రదాయ కుటుంబానికి చెందిన ఒక ఏడేళ్ల బాలిక ఆ కుటుంబానికి ఎంతో ప్రాణప్రదమైన గారాలపట్టి. ఆ ఇంటిదీపం. స్వయనా తోబుట్టువుతోపాటు మరికొందరు స్నేహితులతో సెక్స్ సంబంధం పెట్టుకుంది. మరో సంఘటన చూడండి. ఇద్దరు మగపిల్లలు, ముగ్గురు ఆడ పిల్లలతో కూడిన ఐదుగురు సభ్యుల బృందం వీరి ఇళ్లు పక్కపక్కనే ఉన్నాయి. వీరు పరస్పరం సెక్స్ సంబంధాలు నెరపుతున్నారు. అంతేకాదు వారు తమ సమవయస్కులైన పిల్లల్ని కూడా ఈ చర్యకు ప్రోత్సహిస్తున్నారు. వీరిలో అందరికంటే పెద్దవాడి వయసు 10ఏళ్లు. తొమ్మిదేళ్ల ఓ అమ్మాయిది మరో కథ. ఎంతో క్రమశిక్షణతో పెంచబడిందీమె. ఈ అమ్మాయి ఎంత ఎక్కువ మంది ప్రేమికులుంటే అంత గర్వంగా ఫీలయ్యేది. (పే. 328)

'బాల్టిమోర్ (Baltimore)కు చెందిన ఒక డాక్టర్ నివేదిక ఇలా ఉంది : ఒక సంవత్సరంలోనే ఆ డాక్టర్ గారి ఊరిలో 12ఏళ్ల కంటే తక్కువ వయసు కలిగిన అమ్మాయిలు సెక్స్‌లో పాల్గొన్న సంఘటనలు వెయ్యికంటే ఎక్కువే జరిగాయి.' (పే. 177)

అన్నిరకాలుగా భావోద్రేకాలను రెచ్చగొట్టి, విశృంఖలత్వాన్ని, నగ్నత్వాన్ని ప్రచారం చేస్తున్న కారణంగా లభించిన తొలి ఫలితం ఇది. అమెరికాకు చెందిన ఒక ప్రఖ్యాత రచయిత ఇలా రాస్తున్నాడు :-

మా జనాభాలో అత్యధికభాగం ప్రజలు చాలా అసహజంగా, ప్రకృతికి విరుద్ధమైన స్థితుల్లో జీవితం గడుపుతున్నారు. పది, పదిహేనేళ్ల వయసులోనే వారు పరస్పరం ప్రేమలో పడిపోతారు. ఈ విధంగా వయసుకు ముందే లైంగికాకర్షణకు లోను కావడం వల్ల అనేక అనర్థాలు జరుగుతున్నాయి. చాలా లేత వయసు అమ్మాయిలు అబ్బాయిలతో లేచిపోతున్నారు. లేక చిన్న వయసులోనే పెళ్లి చేసుకుంటున్నారు. ప్రేమ విఫలమైతే ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు.'

## విద్య

ఈ విధంగా వయసుకంటే ముందే లైంగిక భావనలు జనించే పిల్లలకు మొదటి ప్రయోగశాల పాఠశాలే అవుతోంది. పాఠశాలల్లో రెండు రకాలున్నాయి. ఒక రకంలో కేవలం బాలురు, లేక బాలికలు. రెండో రకం బాలబాలికలకు కలిపి

ఉంటోంది. మొదటి రకం పాఠశాలల్లో స్వలింగ సంపర్కం (Homosexuality) హస్తప్రయోగం, (Masturbataion) ప్రబలుతున్నాయి. ఎందుకంటే పసితనంలోనే ఉద్రేకాలను రెచ్చగొట్టి, వాటిని తీర్చుకునే సాధనాలు కూడా సమకూర్చబడు తున్నప్పుడు, వాటిని చల్లబరచుకోడానికి ఏదో ఒక మార్గం అన్వేషించడం తప్ప గత్యంతరం లేని పరిస్థితి ఏర్పడుతోంది. డాక్టర్ వోకర్ ఇలా రాస్తున్నాడు :

"ఈ విధమైనటువంటి పాఠశాలలు, కళాశాలలు, నర్సింగ్ ట్రైనింగ్ సెంటర్‌లు, మతవిద్య బోధించే పాఠశాలల్లో ఎప్పుడూ ఇలాంటి సంఘటనలే సంభవిస్తూ ఉంటాయి. ఇలాంటి చోట అమ్మాయిలైనా, అబ్బాయిలైనా స్వలింగ సంబంధం కలిగి ఉంటారు. స్త్రీలపట్ల పురుషులకు, పురుషులపట్ల స్త్రీలకు ఎంతమాత్రం ఆసక్తి ఉండదు.' (పే. 331)

ఈ విషయానికి సంబంధించి ఆయన అనేక సంఘటనలు వెల్లడించారు. ఇందులో అమ్మాయిలు, అమ్మాయిలతో, అబ్బాయిలు అబ్బాయిలతో లైంగిక సంబంధాలు పెట్టుకొని, భయంకరమైన ఫలితాలను చవిచూశారు. మరికొన్ని ఇతర పుస్తకాల ద్వారా తెలిసేదేమిటంటే, ఈ స్వలింగ సంపర్క జాడ్యం ఎంతగా ప్రబలిందో డాక్టర్ లోరి Herself అనే తన పుస్తకంలో రాశాడు :

'ఒకసారి ఓ స్కూల్ హెడ్ మాస్టర్ 40మంది పేరెంట్స్‌కి రహస్యంగా సమాచారం అందించాడు. మీ పిల్లలను ఇక స్కూల్లో ఉంచడం సాధ్యంకాదు. ఎందుకంటే, వారిలో భయంకరమైన ఓ అనైతిక వాతావరణం ప్రబలిపోయింది.' (పే. 179)

ఇక రెండవరకం పాఠశాలలు. ఈ పాఠశాలల్లో బాలబాలికలు కలిసే విద్యనభ్యసిస్తారు. అక్కడకూడా భావోద్రేకాలను రెచ్చగొట్టే, వాటిని చల్లబరిచే, సంతృప్తిపరిచే సాధనాలు ఉంటాయి. పసితనంలో ఎలాంటి భావోద్రేకాలు అంకురించాయో, ఇక్కడ చేరిన తరువాత అవి పరిపక్వం చెందుతాయి. పిల్లలు చదివే అశ్లీలసాహిత్యం, ప్రేమకథలు, నగ్న అర్ధనగ్న చిత్రపటాలు, మ్యాగజైన్లు లైంగిక విజ్ఞానం పేరుతో బూతుపుస్తకాలు, గర్భనిరోధక చిట్కాలు తెలిపే పుస్తకాలు వ్యాసాలు ఇవన్నీ కళాశాలల్లో విద్యనభ్యసిస్తున్న యుక్తవయసు విద్యార్థినీ విద్యార్థుల భావోద్రేకాలను రెచ్చగొట్టి మంచీ చెడుల జ్ఞానాన్ని హరించివేస్తున్నాయి. ప్రఖ్యాత అమెరికన్ రచయిత హెంద్రిబ్ ఫాన్‌లూన్ ఇలా అంటున్నారు :

అసభ్యత, అశ్లీలత, నగ్నత్వ సాహిత్యానికి అమెరికన్ యూనివర్శిటీల్లో దేనికీ

లేనంత డిమాండ్ ఉంది. ఇంతటి అశ్లీలం ఇంతకు ముందెన్నడూ ఇంత పబ్లిగ్గా ప్రజలవద్దకు చేరలేదు. ఈ సాహిత్యం ద్వారా తెలుసుకున్న విషయాల గురించి, అమ్మాయిలు అబ్బాయిలూ స్వేచ్ఛగా ఎలాంటి అడ్డూఅదుపూ, జంకూగొంకూ లేకుండా చర్చించుకుంటారు. తరువాత ఆచరణ వైపునకు అడుగులు వాటంతటఅవే పడిపోతాయి. అమ్మాయిలు, అబ్బాయిలూ కలసి పెట్టింగ్ పార్టీలకు వెళ్లిపోతారు. పార్టీల్లో ధూమపానం, మద్యపానం, నృత్యగానం అన్నీ స్వేచ్ఛగా జరిగిపోతాయి. ఆనందంలో మునిగితేలుతారు. (How I can get Married P. 172 (1)

లిండ్‌సే అంచనా ప్రకారం : హైస్కూల్ విద్య ముగిసేనాటికే కనీసం 45% అమ్మాయిలు చెడిపోతారు. తరువాతి విద్యాకాలంలో ఈ శాతం సగానికి దాటి పోతుంది.'

'హైస్కూల్ బాలికలతో పోల్చుకుంటే హైస్కూల్ అబ్బాయిలు భావోద్రేకాల పరంగా చాలా వెనుకబడే ఉన్నారు. సాధారణంగా ఈ విషయాల్లో అమ్మాయిలే చొరవతీసుకుంటారు. అబ్బాయి ఆమె కనుసన్నల్లో నర్తిస్తూ ఉంటాడు.'

## మూడు ప్రధాన కారణాలు

పాఠశాలలు, కళాశాలల్లో ఎంతలేదన్నా కొంతయినా క్రమశిక్షణ ఉంటుంది. మితిమీరిన స్వేచ్ఛా ప్రియత్వానికి అది కాస్త అడ్డుకట్ట వేస్తుంది. కాని యువకులు విద్యాలయాలనుండి ఉప్పొంగే ఉద్రేకాలతో, అనైతిక అలవాట్లతో జీవన రంగంలో అడుగుపెడుతూనే వారి విచ్చలవిడితనానికి అడ్డుఅదుపూ లేకుండా పోతుంది. ఇక్కడ వారి ఉద్రేకాలను రెచ్చగొట్టడానికి నిండుగా మండించే అగ్నిగుండం సిద్ధంగా ఉంటుంది. దాంతోపాటు జ్వలించే ఉద్రేకాలను చల్లబరిచే అన్నిరకాల సాధనాలు కూడా ఎలాంటి ఆటంకం లేకుండా అందుబాటులో ఉంటాయి.

ఒక అమెరికన్ మాగ్జయిన్ అక్కడ పెరుగుతున్న అనైతికతకు కారణాలు చెబుతూ ఇలా రాసింది.

"మూడు పైశాచిక శక్తుల త్రయం ఈనాడు మన ప్రపంచాన్ని ఆవరించింది. ఈ మూడు ఒక నరకాన్ని సృష్టించడంలో నిమగ్నమై ఉన్నాయి. ప్రపంచయుద్ధం తరువాత అశ్లీలసాహిత్యం ఆశ్చర్యకరంగా, నిస్సిగ్గుగా నిరాటంకంగా పెద్దమొత్తంలో విస్తరిస్తోంది. పైశాచిక భావోద్రేకాలను రెచ్చగొట్టే చలన చిత్రాలు అంతటితో ఆగక ఆచరణాత్మకంగా అశ్లీలపాఠాలు బోధిస్తున్నాయి. కురచ దుస్తులు, నగ్న, అర్ధనగ్న

వస్త్ర ధారణతో ధూమపానం, మద్యపాన సేవనలతో, పురుషులతో అడ్డూఅదుపూలేని సంబంధాలతో మహిళలు కూడా కనీస నైతిక విలువలను తుంగలో తొక్కుతున్నారు. ఈ మూడు మనదగ్గర విపరీతంగా పెరిగిపోతున్నాయి. దీని ఫలితంగా క్రైస్తవ సామాజిక జీవన వ్యవస్థ పతనమయ్యే అవకాశం ఉంది. ఒకవేళ వీటిని గనక ఆపకపోతే, మన చరిత్ర కూడా రోమ్, మరియు ఇతర జాతుల ఉదాహరణగానే మిగిలిపోతుంది. ఆ జాతులను కూడా ఇవే మనోకాంక్షల, దాస్యం విశృంఖల జీవన విధానం, మద్యపానం, స్త్రీల నగ్న అర్ధనగ్న నృత్యాలే వినాశపు అగాధంలోకి నెట్టివేశాయి.'

సంస్కృతీ నాగరికతల, సామాజిక వ్యవస్థనంతా కప్పేసిన ఈ మూడు కారణాలు యువతీయువకుల భావోద్రేకాల్లో ఒకవిధమైన కదలికను, ప్రకంపనను పుట్టిస్తుంది. శరీరంలో ఏ కాస్త ఉడుకు రక్తమున్నా అశ్లీలతా ప్రభావం అలాంటి ప్రకంపనాలను పుట్టించడం అనివార్యం.

## మితిమీరిన అశ్లీలత

శాశ్వతంగా వ్యభిచార వృత్తిలో కొనసాగే వారి సంఖ్య అమెరికాలో కనీసం నాలుగు నుంచి ఐదు లక్షల వరకు ఉండవచ్చని ఒక అంచనా. (Prostitution in the united states P. No.138 -9(1)) కాని అమెరికా వేశ్యకు, భారత వేశ్యకు తేడా ఉంది. అక్కడి వేశ్య వారసత్వంగా వృత్తిని కొనసాగించే వేశ్యకాదు. అక్కడి స్త్రీ నిన్నటివరకూ ఒక స్వేచ్ఛాయుతమైన వృత్తిలో కొనసాగింది. చెడు స్నేహాలు చేసి వేశ్యాగృహం పాలైంది. కొన్నేళ్లు అక్కడ గడిపి ఆ వృత్తిని వదిలేసి ఏదో ఒక ఆఫీసులో, పరిశ్రమలోనో ఉద్యోగంలోనో చేరిపోతుంది. పరిశీలన, అధ్యయనం వల్ల తెలిసిందేమిటంటే, అమెరికాలోని 50% వేశ్య గృహాలు ఉద్యోగాలు చేసే వారితోనే (domestic Servents) భర్తీ అవుతాయి. మిగతా యాభైశాతం అస్పత్రులు, కార్యాలయాలు, వ్యాపారాలు ఉద్యోగాలు వదులుకొని వస్తారు. సాధారణంగా 15,20 సంవత్సరాల నుండి ఈ వృత్తి ప్రారంభించి, పాతిక ముప్ఫయి సంవత్సరాల తరువాత వేశ్యాగృహాన్ని వదిలేసి నిన్నటి వరకూ వేశ్యగా కొనసాగిన ఆ మహిళ మరో వృత్తిలోకి వెళ్లిపోతుంది. (Prostitution in the United states P.No.64-69 (2) అంటే, అమెరికాలో నాలుగైదు లక్షలమంది వేశ్యల అసలు అర్థమేమిటో దీన్ని బట్టి మనం అంచనా వేయవచ్చు.

ఇంతకు ముందు అధ్యాయాల్లో చెప్పుకున్నట్లు పాశ్చాత్య దేశాల్లో అశ్లీలత

ఒక వ్యవస్థీకృతమైన అంతర్జాతీయ వృత్తిగా గుర్తింపు పొందింది. వృత్తిస్థాయిని కలిగి ఉంది. అమెరికాలోని న్యూయార్క్ రిమోడీజెర్సీ, బ్యూనిస్‌ఐరిస్‌లు ఈ వృత్తికి ప్రధాన కేంద్రాలు. న్యూయార్క్‌లోని రెండు పెద్ద పెద్ద వ్యాపార కేంద్రాల్లో విడివిడిగా రెండు నిర్వాహణా కౌన్సిళ్లు ఉన్నాయి. వీటికి అధ్యక్ష కార్యదర్శుల ఎంపిక అధికారికంగా జరుగుతుంది. ప్రతిదానికీ ఒక లీగల్ సెల్ కూడా ఉంటుంది. ఎందుకంటే ఏవైనా న్యాయపరమైన చిక్కులు ఎదురైన పక్షంలో ఆదుకునే ఉద్దేశ్యంతో, వారి హక్కులను పరిరక్షించడం కోసం ఈ ఏర్పాటు యువతులకు, మాయమాటలు చెప్పి ఆకర్షించడం కోసం, అవసరమైతే అపహరించి తీసుకురావడం కోసం బ్రోకర్లు (దళారులను) నియమిస్తారు. వీరు అమ్మాయిల వేటలోనే తిరుగుతూ ఉంటారు. చికాగో విదేశాంగ మంత్రి ఒకసారి విదేశీయులకు సంబంధించిన 15నెలల నివేదికను తెప్పించుకొని అధ్యయనం చేశారు. అప్పుడు బహిర్గతమైన వాస్తవం ఏమిటంటే, ఈ పదిహేను నెలలకాలంలో 72,000 మంది యువతుల ఉత్తరాలు లీగ్ కార్యాలయానికి అందాయి. అందులో వారు రాసిందేమీటంటే, చికాగోకు బయలుదేరిన వారిలో కేవలం 1700మంది మాత్రమే గమ్యానికి చేరుకోగలిగారు. మిగతా వారిజాడ తెలియకుండా పోయింది. అంటే అమ్మాయిల అపహరణలో దళారుల పాత్ర ఎంతకీలకమో అంచనా వేయచ్చు.

వేశ్యాగృహాలు మాత్రమే కాకుండా అతిథిగృహాలు (Assignation Houses), Call Houses కూడా అసంఖ్యాకంగా ఉన్నాయి. గొప్పింటి స్త్రీ పురుషులు, సంప్రదాయ కుటుంబాల వారు పరస్పరం కలుసుకోవాలనుకుంటే అలాంటి వారి కలయికకు అనుకూలంగా వీటిని ఏర్పాటు చేశారు.

ఒక నగరంలో ఇలాంటి గృహాలు 87 ఉంటే, మరో పట్నంలో 43, మరో నగరంలో 33 ఉన్నాయని పరిశీలనలో తేలింది. ఈ గృహాల్లో కేవలం అవివాహిత స్త్రీలు మాత్రమే కాకుండా వివాహిత స్త్రీలు కూడా అధిక సంఖ్యలో వస్తుంటారు. (1bid P.38 (1) 1Bid P.36 (2))

ఒక ప్రఖ్యాత ఆరోగ్య కార్యకర్త ఇలా అంటున్నారు

న్యూయార్క్‌లోని మొత్తం వివాహితుల్లో సగం భాగం శారీరకంగా, మానసికంగా దాంపత్య బాధ్యతలను కూడా నెరవేర్చే పరిస్థితిలో లేరు. దేశంలోని ఇతర ప్రాంతాలకన్నా న్యూయార్క్ పరిస్థితి ఏమంత భిన్నంగా లేదు. (Herself P.No.116)

అమెరికాలో (Committee of Fourteen పేరుతో ఓ ప్రఖ్యాత మానసిక నిపుణుల బృందం ఉండేది. ఈ బృందం ఆధ్వర్యంలో అనైతిక కార్యకలాపాల కేంద్రాల అన్వేషణ దేశ నైతిక స్థితిగతుల పరిశీలన, సంస్కరణలకు సంబంధించిన కార్యక్ర మాలు పెద్ద ఎత్తున జరుగుతుండేవి. ఈ కమిటీ నివేదిక ప్రకారం : అమెరికాలోని నర్తనశాలలు, నైట్‌క్లబ్‌లు, బ్యూటీపార్లర్లు, మ్యానిక్యూర్‌షాపులు (చేతులను అందంగా తయారు చేసే షాపులు) మసాజ్ సెంటర్లు, కేశ సౌందర్య కేంద్రాలు అన్నిటికన్నీ బాజాప్తా వ్యభిచారగృహాలుగా మారి పోయాయి. అంతేకాదు ఇంకా అంతకంటే నీచమైన కార్యకలాపాలు కూడా అక్కడ జరుగుతుండేవి.

## భయంకర వ్యాధులు

అశ్లీలత ఈ విధంగా పెరిగిపోవడం వల్ల అనివార్యంగా భయానక వ్యాధులు కూడా ప్రబలుతున్నాయి. ఒక అంచనా ప్రకారం, అమెరికా జనాభాలో దాదాపు 90% ప్రజలు ఈ వ్యాధుల ప్రభావానికి గురవుతున్నారు. ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా ప్రకారం అక్కడి ప్రభుత్వాసుపత్రుల్లో సాలీనా దాదాపు 2లక్షల మంది ప్రజలు మేహ వ్యాధితో, లక్షా 60వేల మంది కుసుమ రోగంతో బాధపడుతూ చికిత్స పొందుతున్నారు. 65 ఆసుపత్రులు ప్రత్యేకించి వీటికోసమే ఉన్నాయి. కాని ప్రభుత్వాసుపత్రులకంటే ప్రైవేటు డాక్టర్ల వద్దకు వచ్చేవారి సంఖ్యే అధికం. ప్రైవేటు వైద్యుల వద్దకు మేహరోగ వ్యాధిగ్రస్తులు 61శాతం, కుసుమ వ్యాధిగ్రస్తులు 89శాతం వస్తున్నారు. (23వ సంపుటం 45వ పేజి)

30 నుండి 40వేల వరకు సంభవించే శిశు మరణాలు కేవలం వారసత్వంగా వచ్చే మేహరోగం ద్వారానే సంభవిస్తున్నాయి. క్షయతప్ప మిగతా రోగాల వల్ల సంభవించే మరణాలన్నీ దాదాపు మేహరోగాల ద్వారా సంభవించే గనేరియా (నైట్‌డిశ్చార్జ్)కు సంబంధించినదని నిపుణుల అంచనా. 60శాతం మంది యుక్త వయస్కులు ఈ రోగం బారిన పడి ఉన్నారు. ఇందులో వివాహితులు, అవివాహితులు అందరూ ఉన్నారు. స్త్రీ వ్యాధి నిపుణుల ఏకాభిప్రాయం ఏమిటంటే, వివాహిత స్త్రీ అవయవాలకు చేసే శస్త్ర చికిత్సల్లో 75% వైట్ డిశ్చార్జ్ ప్రభావం తప్పకుండా కనబడుతోంది. (Laws of sex P 204 (1)

## విడాకులు

ఇలాంటి పరిస్థితుల నేపథ్యంలో కుటుంబ వ్యవస్థగాని, పవిత్రమైన దాంపత్య

బంధంగాని, సురక్షితంగా, స్థిరంగా ఎలా ఉండగలుగుతుంది? స్వేచ్ఛగా తమ ఉపాధిని సంపాదించుకోగలిగే మహిళలకు కేవలం శారీరక వాంఛ తీర్చుకోడానికి తప్ప. జీవితంలోని మరేరంగంలోనూ పురుషుని అవసరం లేదు. ఇలాంటి వారికి వివాహబంధం జోలికి పోకుండానే అతి సునాయాసంగా పురుషులు లభిస్తున్నపుడు అనవసరంగా వైవాహిక బంధంలో చిక్కుకొని వ్యయ ప్రయాసలు కొనితెచ్చుకోవడ మెందుకన్న భావన నెలకొంది. ఆధునిక, భౌతికపరమైన ఆలోచనలు ఒక పురుషునితో వివాహేతర సంబంధం కలిగి ఉండటం తప్పు, పాపం అన్న విచక్షణను కూడా హరించివేశాయి. ఇలాంటి అక్రమ సంబంధాలు కలిగిన స్త్రీలను సమాజం కూడా అవమానకర దృష్టితో చూసే పరిస్థితి లేకుండా సమాజ వాతావరణం కూడా దానికి అలవాటు పడిపోయింది. జస్టిస్ లిండ్సే అమెరికాలోని సాధారణ అమ్మాయిల ఆలోచనలను ఇలా అనువదిస్తున్నాడు :-

'అసలు నేను పెళ్లెందుకు చేసుకోవాలి? గత రెండేళ్ల కాలంలో పెళ్ళిళ్లు చేసుకున్న అమ్మాయిల్లో ప్రతి పదిమందికి ఐదుగురు విడాకులే తీసుకున్నారు. ఈ నాడు ప్రతి అమ్మాయి ప్రేమ విషయంలో సహజసిద్ధమైన స్వేచ్ఛా భావనల హక్కును కలిగి ఉందన్నది నా అభిప్రాయం. గర్భనిరోధాలకు సంబంధించి మాకు చాలా విషయాలు, పద్ధతులు తెలుసు.

దీనిద్వారా అక్రమ సంతానం వల్ల తలెత్తే చిక్కు సమస్యలనుండి బయటపడగలమన్న ధైర్యం కడా కలిగింది. ఈ సాంప్రదాయ విధానాలు, ఆచారాల నుండి బయటపడి ఆధునిక విధానాలను అనుసరించాలని నేను బలంగా కోరుకుంటున్నాను.

నిస్సిగ్గుగా, నిస్సంకోచంగా ఇలాంటి అభిప్రాయాలను వ్యక్తం చేసే మహిళలను వివాహానికి అంగీకరింపజేసే విషయం ఏదన్నా ఉందీ అంటే అది ప్రేమ అన్నభావన మాత్రమే. అంటే దాదాపుగా ఈ భావన కూడా హృదయాంతరాళాల్లో నుండి పుట్టుకురాదు. కేవలం ఓ తాత్కాలిక ఆకర్షణ ఫలితం మాత్రమే. కోరికల మత్తు వదిలిన తరువాత దంపతుల్లో దాంపత్య బంధంలో ఎలాంటి మాధుర్యం ఉండదు. చిన్న చిన్న అభిప్రాయబేధాలే వారి మధ్య ఇనుప గోడలుగా తయారవుతాయి. చివరికి విడాకుల కోసం కోర్టు మెట్లెక్కవలసి వస్తుంది. లిండ్సే ఇలా రాస్తున్నాడు:-

'1922లో డన్వర్‌లో ప్రతి వివాహంతోపాటు, ఇక విడిగా ఉంటామన్న కూడా కేసు వచ్చేది. ప్రతి రెండు వివాహాలకు ఒక విడాకుల వివాదం ముందుకు

వచ్చింది. ఈ పరిస్థితి ఒక్క డన్వర్‌కే పరిమితం కాదు. అమెరికా అంతా దాదాపు ఇదే పర్థితి.

ఇంకా ఇలా రాస్తున్నాడు :- 'విడాకులకు సంబంధించిన సంఘటనలు ఊహిస్తున్నట్లుగా ఇలాగే పెరిగిపోతే దాదాపు దేశంలోని ఓ పెద్ద భాగంలో ఎన్ని వివాహాలకు లైసెన్సులివ్వడం జరుగుతుందో, అన్నే విడాకుల కేసులూ ముందుకొస్తాయి.' (Revoltof Modren youth) (పే. 211, 14)

కొన్నాళ్ల క్రితం డెట్‌రాయిట్ (detroit)లోని 'ఫ్రీప్రెస్' అనే పత్రిక ఈ విషయాలకు సంబంధించి ఒక వ్యాసం ప్రచురించింది. అందులో : 'వివాహాల తగ్గుదల, విడాకుల పెరుగుదల, అసలు వివాహం చేసుకోకుండానే శాశ్వతంగా లేక తాత్కాలికంగా అక్రమ సంబంధాలు కలిగి ఉండే ధోరణి పెరిగిపోవడం అంటే మనం పశుప్రవృత్తివైపు తిరోగమనం చెందుతున్నామని అర్థం. సహజసిద్ధమైన, ప్రకృతి సిద్ధమైన సంతాన కాంక్ష సన్నగిల్లుతోంది. జన్మించిన పిల్లల పట్ల నిర్లక్ష్యం పెరిగిపోతోంది. కుటుంబాలు, గృహ సంస్కృతీ సాంప్రదాయాలు, స్వేచ్ఛాయుత వాతావరణానికి, స్వేచ్ఛాధికారాల మనుగడకు అవసరమన్న స్పృహ కూడా లేకుండా పోయింది. దీనికి భిన్నంగా సంస్కృతీ నాగరికతలు, అధికారాలు ఒక నిర్భయమైన, జంకూగొంకూలేని వాతావరణాన్ని సృష్టిస్తున్నాయి.

శరవేగంతో పెరిగిపోతున్న ఈ విడాకులు, విభజనలను అడ్డుకోడానికి Compassionate Marriages అంటే 'పరీక్ష వివాహాల పద్ధతిని ప్రవేశపెట్టడం జరిగింది. కాని ఈ చికిత్స అసలు వ్యాధికన్నా ప్రమాదకరంగా మారింది. పరీక్ష వివాహాలంటే, సాంప్రదాయ వివాహ విధానానికి వ్యతిరేకంగా, పెళ్లి చేసుకోకుండానే స్త్రీ పురుషులు కొంతకాలంపాటు కలిసుండి ఒకర్నొకరు పరీక్షించుకుంటారు. ఒకర్ని గురించి ఒకరు తెలుసుకోడానికి ప్రయత్నిస్తారు. ఈ క్రమంలో మనసులు కలిసి ప్రేమచిగురిస్తే అప్పుడు పెళ్లి చేసుకుంటారు. లేదంటే తమ తాత్కాలిక బంధానికి స్వస్తిపలికి మరోచోట తమ అదృష్టాన్ని పరీక్షించుకుంటారు. ఈ కలిసున్న కాలంలో సంతానం కలగకుండా చూసుకోవడం తప్పనిసరి. ఎందుకంటే, పిల్లలు పుట్టినట్లయితే వారు అధికారికంగా పెళ్లిచేసుకోవడం తప్పనిసరి అయిపోతుంది. దీన్నే రష్యాలో 'స్వేచ్ఛాయుత ప్రేమ' (Free Love) అంటారు.

## జాతి ఆత్మహత్య

కోరికల దాస్యం, దాంపత్య బాధ్యతలనుండి పలాయనం, కౌటుంబిక జీవితం పట్ల విసుగు, దాంపత్య సంబంధాల పట్ల అసంతృప్తి స్త్రీలోని సహజసిద్ధమైన, పవిత్రమైన, అత్యుత్తమైన మాతృత్వ మాధురానుభూతులను దాదాపుగా అణచివేశాయి. నిజానికి ఈ మధురానుభూతుల మనుగడపైనే మానవ నాగరికత, సభ్యత సంస్కారాలు మానవ ఉనికే ఆధారపడి ఉంది. గర్భనిరోధం గర్భవిచ్ఛిత్తి, భ్రూణహత్యలు లాంటివన్నీ ఈ పవిత్ర భావనలు భావోద్రేకాలు నశించిన ఫలితంగా పుట్టుకొచ్చాయి. గర్భనిరోధానికి సంబంధించిన అన్ని విషయాలూ, ఎన్నిరకాల చట్ట నిషేధాలున్నప్పటికీ అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోని ప్రతి యువతీ యువకునికి సంపూర్ణంగా తెలుసు. గర్భనిరోధక మాత్రలు, ఇతర సాధనాలన్నీ ఎలాంటి ఆటంకం లేకుండా అక్కడి షాపుల్లో లభ్యమవుతాయి. స్వేచ్ఛగా విహరించే సంగతి అలా ఉంచి, హైస్కూల్, కాలేజీల విద్యార్థినులు కూడా ట్యాబ్లెట్స్, కండోమ్స్ లాంటి సాధనాలను ఎప్పుడు తమవెంట ఉంచుకుంటారు. ఎందుకంటే ఒకవేళ తన బాయ్‌ఫ్రెండ్ కండోమ్ మరిచిపోయి వచ్చినట్లయితే అనవసరంగా అకారణంగా ఒక మధురానుభూతిని కోల్పోయే పరిస్థితి తలెత్తుతుందని భావించి అమ్మాయిలు ముందు జాగ్రత్తగా ఇలాంటి సాధనాలను ఎప్పుడూ తమవెంట ఉంచుకుంటారు.

జస్టిస్ లిండ్సే ఇలా రాస్తున్నాడు : 'హైస్కూల్లో విద్యనభ్యసించే 495 మంది అమ్మాయిలు తమకు అబ్బాయిలతో లైంగిక సంబంధాలున్నాయని స్వయంగా చెప్పారు. వీరి వయసు కూడా చాలా తక్కువే. వీరిలో కేవలం 25మందికి మాత్రమే గర్భం నిలిచింది. మిగతా వాళ్లకు యాదృచ్ఛికంగానే గర్భం నిలవలేదు. అయితే వీరిలో అత్యధికులకు గర్భనిరోధక విధానాలు పూర్తిగాతెలుసు. ఈ విషయాలు వీరికి ఇంత బాగా తెలుసని ప్రజలకు తెలియదు.'

అవివాహిత యువతులు తమ విశృంఖల విహారానికి అంతరాయం కలగకూడదనే ఉద్దేశ్యంతో ఈ గర్భనిరోధక విధానాలను అనుసరిస్తుంటే, వివాహిత మహిళలు సంతానం కలగడం వల్ల వారి ఆలనా పాలనా భారంతోపాటు, భర్తకు విడాకులివ్వాలనుకున్నప్పుడు అదొక అడ్డంకిగా పరిణమిస్తుందని ఈ సాధనాలను వినియోగిస్తున్నారు. మొత్తానికి జీవితంలో ఆనందం అనుభవించాలంటే ఈ పిల్లల బాదరబందీనుండి దూరంగా ఉండడమే మార్గమని, అంతేగాక పిల్లల్ని కనడంవల్ల

అందం కూడా తగ్గిపోతుందనే ఉద్దేశ్యంతో సంతానాన్ని అసహ్యించుకుంటున్నారు. (Macfado in Manhoodaud Marriage - P.No.82)

మొత్తానికి విధానాలేవైనా, స్త్రీ పురుష సంబంధాలు 95% ఎలా ఉన్నాయంటే, ఈ సంబంధాల వల్ల కలిగే ప్రకృతిసిద్ధమైన ఫలితాలను గర్భనిరోధక విధానాల ద్వారా నిరోధించడం జరుగుతుంది. ఇక యాదృచ్ఛికంగా నిలిచే 5% సంఘటనలను నిరోధించడానికి గర్భవిచ్ఛిత్తి, భ్రూణహత్యల విధానం ఉండనే ఉంది. జస్టిస్ లిండ్సు ఇలా వివరిస్తున్నాడు. అమెరికాలో ప్రతియేటా కనీసం 5లక్షల గర్భవిచ్ఛిత్తులు జరుగుతాయి. వేలాది శిశువులు జన్మించిన తరువాత హత్యచేయబడతారు. (220)

ఈ హృదయవిదారకమైన వివరాలను లోతుగా విశ్లేషించడం నా అభిమతం కాదు కాని, ఈ చర్చలో, జార్జ్ రాయి స్కోట్ రాసిన ప్రఖ్యాత చారిత్రక గ్రంథం A History of Prostitution నుండి కొన్ని విషయాలు ఉటంకించకుండా ముగించడం సముచితం కాదని భావిస్తున్నాను. ఈ గ్రంథ రచయిత ఒక ఆంగ్లేయుడు. ఇతడు అత్యధికంగా తన దేశానికి సంబంధించిన నైతిక పరిస్థితిని విశ్లేషిస్తూ ఆ చిత్రాన్ని ఆవిష్కరించాడు.

'కొంతమంది మహిళలు ఒళ్లమ్ముకొని జీవనోపాధిపొందుతారు. వారికదొక్కటే మార్గం. అదే వారి ఉపాధికి ఏకైక సంపాదనా మార్గం. కాని వీరు కాకుండా తమ జీవిత అవసరాల పరిపూర్తికి ఇతర అవకాశాలు, మార్గాలు ఉన్న మహిళలు కూడా అధిక సంఖ్యలో (ఈ సంఖ్య రోజురోజుకూ పెరుగుతోంది) దానికి అనుబంధంగా అదనపు ఆదాయం కోసం ఇతర అనైతిక కార్యకలాపాలు కూడా చేపడుతున్నారు. వీరు వృత్తిపరమైన వేశ్యలకన్నా తక్కువేమీ కాదు. కాని వారిని వేశ్యలు అనే పేరుతో సంబోధించలేము. వారిని amateur Prostitutes అంటే వృత్తిపరంగా వేశ్యలు కాని వారు అనవచ్చు.'

వృత్తిపరంగా వేశ్యలు కాకపోయినా, విశృంఖలంగా జీవితం గడుపుతున్న మహిళల సంఖ్య గతంలో ఎన్నడూ లేనంతగా పెరిగిపోతోంది. సమాజంలో కింది తరగతి నుండి ఉన్నతస్థాయి వరకు అన్ని వర్గాల వారిలోనూ ఈ ధోరణి కనిపిస్తోంది. మాటవరసకైనా ఎవరైనా వీరిని వేశ్యలంటే మాత్రం అగ్గిమీద గుగ్గిలం అయిపోతారు. కాని వారు అంగీకరించినా అంగీకరించకపోయినా, ఆగ్రహించినా యదార్థమైతే మారిపోదు కదా! వాస్తవం ఏమిటంటే, వారికీ, వృత్తిపరంగా, విచ్చలవిడిగా బరితెగిం

చిన వేశ్యకూ ఎలాంటి తేడా లేదు. ఇక విశృంఖలత్వం, అనైతిక వ్యవహారాలన్నీ ఇప్పుడు ఫ్యాషన్‌గా మారిపోతున్నాయి. సిగరెట్లు తాగడం, మద్యం సేవించడం, లిప్‌స్టిక్‌లు రాసుకోవడం, కురచ దుస్తులు ధరించడం, లైంగిక విషయాలు మాట్లాడడం, అశ్లీల సాహిత్యం చదవడం, అశ్లీల విషయాలు చర్చించుకోవడం ఇవన్నీ ఫ్యాషన్‌లో ఒక భాగమై పోయాయి. ఇలాంటి యువతులు, మహిళల సంఖ్య కూడా రోజురోజుకూ పెరిగిపోయింది. పెళ్లికి ముందే లైంగిక సంబంధాలు కలిగి ఉండే యువతులు మహిళల సంఖ్య కూడా రోజురోజుకూ పెరిగిపోతోంది. ఇలాంటి వారంతా ఇంకా కన్యలుగానే పరిగణించబడుతున్నారు. క్రీస్తు మందిరంలో ప్రభువు ముందు అధికారికంగా వివాహం చేసుకున్నప్పుడే వీరు శ్రీమతిగా మారతారు. అప్పటివరకూ కన్యలే. ఇంతగా భ్రష్టు పట్టడానికి గల కారణాలను విశ్లేషిస్తూ రచయిత ఇలా రాస్తున్నాడు:

మొట్టమొదట అలంకారం విషయాన్నే తీసుకోండి. దీనివల్ల యువతుల్లో రకరకాల అందమైన దుస్తులు, విభిన్న వినూత్న సౌందర్య సాధనాల పట్ల విపరీతమైన మోజు పెరిగిపోయింది. విస్తృతంగా పెరిగిపోయిన అశ్లీలత, విశృంఖలతలకు ఇదొక ప్రధాన కారణం. రోజూ వేలాది మంది అమ్మాయిలు అత్యంత ఖరీదైన దుస్తులు ధరించి కనబడుతుంటే, అంతటి ఖరీదైన వస్త్రాలు ధర్మబద్ధ సంపాదన ద్వారా సమకూర్చుకున్న వేనంటే ఎంతమాత్రం బుద్ధి కందే విషయం కాదు.

వందలాది, వేలాదిమంది అమ్మాయిలు అతి ఖరీదైన దుస్తులు ధరించి రోజూ కళ్ల ముందు తిరుగుతుంటే, కళ్లుండి చూడగలిగేవారెవరైనా ధర్మబద్ధమైన సంపాదన ద్వారా సమకూర్చుకున్నవి కావని ఎవరికైనా తెలుస్తుంది. అందుకని పురుషులే వారికి దుస్తులు కొంటారని అర్ధశతాబ్దం క్రితం మనం అనుకున్న మాటలు నేటికీ వర్తిస్తాయి. తేడా ఏమిటంటే, అప్పట్లో వారికి దుస్తులు కొనే పురుషులు వారి తండ్రులో, అన్నలో, భర్తలో అయి ఉండేవారు. ఇప్పుడు వారికి బదులు (వారి స్థానంలో) ఇతర పురుషులు కొంటున్నారు. అదొక్కటే తేడా!

మితిమీరిన స్త్రీ స్వేచ్ఛ కూడా ఇలాంటి పరిస్థితులు ఉత్పన్నం కావడానికి మరో కారణం. గత కొన్నేళ్లుగా అమ్మాయిల పట్ల తల్లిదండ్రుల పర్యవేక్షణ కొరవడింది. ఎంతగా అంటే, ఒక ముప్ఫయి నలభయ్యేళ్ల క్రితం ఈనాడు అమ్మాయిలకున్నంత స్వేచ్ఛ అబ్బాయిలక్కూడ ఉండేది కాదు.

మరో ప్రధాన కారణం ఏమిటంటే, సమాజంలో స్త్రీ పురుషుల ఉమ్మడి కార్యకలాపాలు విస్తృతస్థాయిలో పెరిగి, రాసుకుపూసుకు తిరిగే సంస్కృతి బాగా ప్రబలింది. స్త్రీలు ప్రతినిత్యం ఉద్యోగ, వ్యాపార కార్యకలాపాల్లో అధిక సంఖ్యలో చేరుతున్నారు. అక్కడ అనుక్షణం స్త్రీలు పురుషులతో కలిసిమెలసి పనిచేయవలసి వస్తోంది. దీనివల్ల స్త్రీ పురుషుల మధ్య చనువు బాగా పెరిగిపోయి నైతిక ప్రమాణాల స్థాయి పడిపోతోంది. పురుషుల ధైర్యం, చొరవలకు భిన్నంగా స్త్రీల శక్తిసామర్థ్యాలు చాలా తక్కువైపోతున్నాయి. ఇరువురి మనోభావ సంబంధాలు నైతిక బంధనాలకు దూరం కావడం వల్ల నేటి యువకులకు పెళ్లి, పవిత్రతలతో కూడిన జీవితం అన్న ఆలోచనే రావడం లేదు. ఎలాంటి అడ్డూ అదుపులేని స్వేచ్ఛా ప్రియులైన అదృష్టవంతుల కోసం ఒకప్పుడు తిరుగు బోతులు, ఆవారాగాళ్లు అయిన పురుషులు అన్వేషించేవారు. కాని ఈనాడు ప్రతి యువతీ అదే వెదుకులాటలో ఉంటుంది. నిజానికి కన్యత్వం ఒక పవిత్ర భావన, అమూల్య సంపద. అయితే ఈనాటి ఆధునిక యువతి దాన్నొక ఉపద్రవంగా భావిస్తోంది. ఆమె దృష్టిలో యుక్తవయసులోనే మనోవాంఛలను తీర్చుకుంటూ తనవితీరా జీవన మాధుర్యాన్ని జుర్రుకోవాలి. అందుకే నైట్‌క్లబ్బులు, స్టార్ హోటళ్లు, వేశ్యాగృహాల వెంట పరుగులు తీస్తోంది. ఈ ప్రయత్నంలోనే అపరిచిత పురుషులతో సైతం విహారయాత్రలకు సిద్ధమవుతోంది. మరోవిధంగా చెప్పాలంటే, తెలిసి, కావాలనీ, తన ఇష్టప్రకారమే ఆమె లైంగికోద్రేకాలు రెచ్చగొట్టబడే వాతావరణంలోకి వెళ్లిపోతోంది. దాని ఫలితంగా సంభవించే ప్రకృతి సహజ పర్యవసానాలకూ ఆమె భయపడకుండా, వాటికి స్వాగతం పలుకుతోంది.



## 6వ అధ్యాయం

# పరిష్కారం

మన దేశంతోపాటు, ఇతర పశ్చిమ దేశాల్లో కూడా ఎవరైతే పరదాను వ్యతిరేకిస్తున్నారో నిజానికి వారి దృష్టిలో జీవితానికి సంబంధించిన ఇదే జీవనపటం ఉంది. ఈ జీవితంలోని ప్రకాశమాన దృశ్యాలు వారి బుద్ధి జ్ఞానాలను ప్రభావితం చేశాయి. ఈ సిద్ధాంతాలు, ఈ నైతిక సూత్రాలు, ఈ భౌతిక ప్రయోజనాలు, లాభాల ప్రకాశమాన కోణం వారి మనో మస్తిష్కాలపై ముద్రించబడిఉంది. వారు పరదాను వ్యతిరేకించడానికి, తిరస్కరించడానికి కారణం ఏమిటంటే, దాని పునాది, దాని మూలజ్ఞానం, మూలతత్వం నైతికతతో కూడుకొని పాశ్చాత్య తత్వానికి పూర్తి భిన్నంగా ఉంది. పాశ్చాత్యతత్వ నైతికతకు వ్యతిరేకంగా ఉంది. దేన్నైతే వారు విశ్వసించారో దానికి భిన్నంగా ఉంది. ఏ ప్రయోజనాలనైతే వారు ఆశించారో, వాటినే ధ్యేయంగా పెట్టుకున్నారో, వాటికి అవరోధంగా ఉంది. అయితే ఈ జీవన విధానంలోని చీకటి కోణాన్ని, దాని ఆచరణాత్మక ఫలితాలను కూడా వీరు స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నారా? లేదా అన్నది ఇప్పుడు ఉదయించే ప్రశ్న. ఈ విషయంలో కూడా వీరి మధ్య ఏకాభిప్రాయం లేదు.

ఒకవర్గం ఈ పర్యవసానాలను గుర్తించి, వాటిని స్వీకరించడానికి సిద్ధంగా ఉంది. వాస్తవానికి ఈ వర్గం దృష్టిలో ఇది కూడా పాశ్చాత్య జీవితంలోని ఒక వెలుగు కోణమే. చీకటికోణం మాత్రం కాదు.

మరోవర్గం దీన్ని చీకటి కోణంగా భావిస్తోంది. దీని ఫలితాలను పర్యవసానా లనూ అంగీకరించడానికి అది సిద్ధంగా లేదు. ఈ జీవన విధానంతో ముడిపడి ఉన్న ప్రయోజనాలన్నీ మోసపూరితమైనవిగా భావిస్తుంది.

ఇక మూడవ వర్గం ఈ సిద్ధాంతాలు, విధానాలనూ గుర్తించలేదు. వాటి ఫలితాలు, పర్యవసానాలపై దానికి అవగాహన లేదు. ఈ విషయాన్ని గురించి ఆలోచించాలనీ అది అనుకోవడం లేదు. ఈ సిద్ధాంతాలూ, దాని ఫలితాలకు మధ్య ఉన్న సంబంధమేమిటన్న విషయమై శ్రమపడాల్సిన అవసరమే లేదని భావిస్తోంది. ప్రపంచమంతా ఏది చేస్తే తామూ అదే చేస్తేపోలా అన్నది దాని భావన.

ఈ మూడు వర్గాలూ పరస్పరం ఎలా కలగూరగంప (సమ్మిళితం)గా మిళితమయ్యాయంటే, వీరితో మాట్లాడుతున్నప్పుడు, ఎదుటి మనిషి ఏ వర్గానికి చెందిన వాడో గుర్తించడం కష్టమైపోతుంది. ఈ గందరగోళం వల్ల సాధారణంగా తీవ్రమైన అస్పష్టత ఎదుర్కోవలసి వస్తుంది. అందుకని ఈ వర్గాలను వేటికవి విడదీసి, ప్రతి వర్గంతోనూ వారి స్థాయిని బట్టి విడివిడిగా మాట్లాడవలసి ఉంటుంది.

మొదటి వర్గం ప్రజలు పాశ్చాత్య సంస్కృతీ నాగరికతల పునాదిగా ఉనికిలోకొచ్చిన తత్వాన్ని, సిద్ధాంతాలను మనసా వాచా కర్మణా అంగీకరించారు. అందుకని వారు ఆ బుర్రతోనే ఆలోచిస్తారు. జీవన సమస్యలనూ ఆ దృష్టితోనే చూస్తారు. ఆధునిక యూరప్ నిర్మాతల ఆలోచనా విధానంతో ఆలోచిస్తూ, వారి దృష్టికోణంలోనే చూస్తూ, తమ తమ దేశాల సంస్కృతీ నాగరికతల జీవన విధానాన్ని కూడా అదే పాశ్చాత్య చిత్రపటం ఆధారంగా నిర్మించాలనుకుంటున్నారు. స్త్రీలు విద్యనభ్యసించే ప్రధాన ఉద్దేశం వారి దృష్టిలో కేవలం సంపాదనా సామర్థ్యాన్ని పెంచుకోడానికే. దాంతోపాటు మనోల్లాసం కలిగించే కళ కూడా వంటబట్టాలన్నది కూడా వారి కోరిక. కుటుంబంలో స్త్రీలు కూడా పురుషులతో సమానంగా సంపాదించే వారు కావాలి. కుటుంబ ఖర్చుల్లో వారూ తమ వాటా సమానంగా పెట్టి, పురుషులతో సమాన పాత్రపోషించాలి. వారి అభిప్రాయం ప్రకారం సమాజంలో స్త్రీల స్థానం ఏమిటంటే, వారు తమ అందచందాల, అలంకరణల ప్రదర్శన ద్వారా సామాజిక జీవితంలో రసజ్ఞతను పెంపొందించాలి. సరస సంభాషణ చాతుర్యంతో గుండెల్లో వేడి పుట్టించాలి. తమ కమ్మని గానం ద్వారా కర్ణానందం కలిగించాలి. తన నర్తన ద్వారా ఆత్మలను ఉర్రూతలూగించి, ఆనంద పారవశ్యంలో ముంచెత్తాలి. చిందులు వేస్తూ శరీర ఒంపుసొంపులను పురుషపుంగవుల ముందు ఆరబోయాలి. ఈ అందాల ఆరబోతతో పురుష జాతి సంతోషంతో ఉప్పొంగిపోవాలి. వారి దృష్టి అందాలను ఆస్వాదించాలి. అప్పటి వరకూ చలన రహితంగా ఉన్నవారి శరీరం కాస్తంత వేడిని పుంజుకోవాలి. జీవన రంగంలో స్త్రీలు సామాజిక సేవచేస్తూ తిరగాలన్నదే వారి కోరిక. మున్సిపాలిటీలు, కౌన్సిళ్లు, సభలు, సమావేశాలు, రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొంటూ, సమాజంలోని సమస్యలు తీరుస్తూ తన శక్తి సామర్థ్యాలన్నీ అందులోనే వెచ్చించాలి. శరీర సౌష్టవ పోటీలలో, క్రీడల్లో పాల్గొంటూ, పరుగుపందెం, దూకుడు పందాల్లో రికార్డులు బద్దలు కొట్టాలి. మొత్తానికి ఇంటి పనులను పక్కనబెట్టి, బయట జరిగే ప్రతి కార్యక్రమంలోనూ ఈమె ముందుండాలి. ఇలాంటి జీవితాన్నే వారు

ఆదర్శవంతమైన జీవితంగా భావిస్తారు. వారి దృష్టిలో ప్రాపంచిక ప్రగతికి ఇదే సరైన నిదర్శనం. ఈ మార్గంలో వారికి అవరోధంగా నిలిచే నీతి నియమాలు, నైతిక సూత్రాలన్నీ వారి దృష్టిలో అనవసరమైనవి. అర్థంలేనివి. మూర్ఖత్వంతో కూడుకున్నవి. ఈ కొత్త జీవితం కోసం పాత విలువలను యూరోపియన్లు మార్చివేసిన విధంగా వీరు కూడా విలువలను మార్చి వేశారు. భౌతిక ప్రయోజనాలు, భౌతిక శారీరక రుచులు వారి దృష్టిలో అన్నిటికన్నా ఎక్కువ. అంతేకాదు. అవే అసలు విలువైనవి. వాటితో పోల్చుకుంటే, సిగ్గుబిడియం, పవిత్రత, నైతికత దాంపత్య జీవితంలోని అనురాగం, వంశ సంరక్షణ, ఇలాంటి అనేక విషయాలు విలువలేనివే కాకుండా, అజ్ఞానానికి, ఆటవికతకు నిదర్శనాలు. వీటిని అంతం చేయనిదే ప్రగతి పథంలో ముందుకు సాగడం అసంభవం.

నిజానికి వీళ్లు పాశ్చాత్య ధర్మ విశ్వాసులు, దాని ధ్వజవాహకులు. వీరు తాము నమ్మిన సిద్ధాంతాన్ని, గతంలో యూరప్ అనుసరించిన విధంగా, ఆ సమస్త ఎత్తుగడలనూ అనుసరించి ప్రాగ్దేశాల్లో కూడా విస్తరించడానికి కృషిచేస్తున్నారు.

## వినూత్న సాహిత్యం

మొట్టమొదట మనోమస్తిష్కాలపై తీవ్ర ప్రభావం వేసి, దాన్ని ఎలా అంటే అలా మలచడంలో శక్తివంతమైన పాత్రను పోషించే వారి సాహిత్యాన్నే తీసుకోండి. నిజానికిది పరమచెత్త సాహిత్యం. దీని ద్వారా ఈ కొత్త తత్వాన్ని మనోహరంగా మలచి వారి ముందుంచుతూ, సాంప్రదాయ నైతిక విధానాన్ని, మానవీయ విలువలను వారి మనోమస్తిష్కాలనుండి పూర్తిగా తొలగించే ప్రయత్నం చేయబడింది. ఉదాహరణకు, నేను ఉర్దూ సాహిత్యంలోని కొన్ని కొత్త కోణాలను మీముందుం చుతాను.

భారత దేశంలోని ఓ ప్రముఖ మాసపత్రికలో 'తీయని పాఠం' శీర్షికన ఓ వ్యాసం ప్రచురితమైంది. సాహిత్యపరంగా ఆ పత్రికకు గొప్ప పేరు ప్రఖ్యాతులే ఉన్నాయి. వ్యాసకర్త విద్యాధికుడు, గొప్ప సాహితీవేత్త. ఒక పెద్ద హోదాలో కూడా ఉన్నాడు. వ్యాస సారాంశం ఏమిటంటే, ఒక గొప్పింటి యువతి తన గురువు దగ్గర పాఠం చెప్పించుకుంటూ ఉంటుంది. పాఠం మధ్యలో ఆ అమ్మాయి తన స్నేహితుడు రాసిన ప్రేమలేఖను గురించి మాష్టారుకు వివరించి సలహా కోరుతుంది. ఆ ప్రేమికుడితో ఒక హోటల్‌లో పరిచయమైందని, ఒక మహిళ తమను పరస్పరం

పరిచయం చేసిందని, ఆ రోజునుండి కలుసుకోవడం, ఉత్తరాలు రాసుకోవడం ప్రారంభమైందని చెప్పింది. అప్పుడా యువతి మాస్టారుని తన ప్రియుడు రాసిన ప్రేమ లేఖకు సమాధానం రాయడం నేర్పమని కోరుతుంది. అయితే ఆ మాస్టారు ఆ యువతిని ఈ ప్రేమ దోమలాంటి వాటినుండి తప్పించి చదువు వైపు మనసు మళ్లించడానికి ప్రయత్నిస్తాడు.

అప్పుడు అమ్మాయి ఇలా అంటుంది. :

'నాకు చదువుకోవాలనే ఉంది. కాని ఆ చదువు నా కోరికల పరిపూర్తిలో, నా కలల సాకారంలో సహాయ కారి కాగలగాలి. అంతేగాని, ఆ చదువు నన్ను వృద్ధురాలిగా మార్చకూడదు.'

అప్పుడు ఆ గురువు గారు : 'నీకా ఒక్క స్నేహితుడేనా, ఇంకా మగ స్నేహితులెవరైనా ఉన్నారా?' అని ప్రశ్నించాడు.

'ఒక్కడే ఏమిటి? ఇంకా చాలామంది ఉన్నారు. కాని ఇతనిలో ఉన్న ప్రత్యేకత ఏమిటంటే, ఎవరిలోనూ లేని రసికత ఇతనిలో ఉంది.' అంటుందా అమ్మాయి.

'ఒకవేళ మీ నాన్నకు ఈ ప్రేమలేఖ విషయం తెలిస్తే?'

'వయసులో ఉన్నప్పుడు నాన్నమాత్రం ఇలాంటి ఉత్తరాలు రాయకుండానే ఉంటాడా? మా నాన్న కూడా మంచి ఫ్యాషన్ మనిషే. ఇప్పటికీ ఇంకా రాస్తున్నా ఆశ్చర్యం లేదు. అదృష్టవశాత్తు ఇంకా ముసలివాడు కాలేదులెండి.'

'ఒక యాభైయ్యేళ్ల క్రితమైతే, ఒక గొప్పింటి అమ్మాయికి ప్రేమలేఖ రాయడాన్ని అసలు ఊహించనేలేము. కాని ఈనాడు...? అన్నాడు మాస్టారు.

'ఏమిటీ? ఆ కాలంలో ప్రజలు కేవలం నీచజాతి ప్రజలనే ప్రేమించేవారా? భలే సుఖభోగాల్లో ఉన్నారు. ఆ కాలం తక్కువజాతి వాళ్లు. పెద్ద బద్మాషీలు నాటి గొప్పింటి వాళ్లు.' అన్నదా యువతి.

ఈ'తియ్యని' పాఠంలోని చివరి పదాలను వ్యాసకర్త తన సాహితీ పాండిత్యంతో ఇలా అభివర్ణించాడు :

'ఇప్పుడు మన పై రెండు బాధ్యతలున్నాయి. (అంటే యువతరంపై) ఏమిటంటే, ఏ మధురానుభూతులనైతే మన పెద్దలు కోల్పోయారో వాటిని బతికించుకోవాలి. అలాగే ఆగ్రహం, అసత్యం లాంటి సజీవ ఆచారాలను ఖననం చేయాలి.'

ఏడాదిన్నర క్రితం కూడా ఓ అనామక పత్రికలో ఇలాంటి ఓ చిన్నకథ 'పశ్చాత్తాపం' పేరుతో అచ్చయింది. స్థూలంగా దాని సారాంశం ఇలా ఉంది :

ఒక సాంప్రదాయ కుటుంబానికి చెందిన అవివాహిత యువతి ఓ వ్యక్తి ప్రేమలో పడుతుంది. తల్లి దండ్రులను బోల్తా కొట్టించి అతనితో అక్రమ సంబంధం పెట్టుకుంటుంది. గర్భం దాల్చిన తరువాత తన చర్యను సమర్థించుకోడానికి మనసులోనే ఇలా మల్లగుల్లాలు పడుతుంది:

'ఏమిటీ నాకెందుకీ ఆందోళన? ఎందుకు నాలో ఈ అలజడి? నా మనసు ఎందుకిలా నన్ను నిలదీస్తోంది? ఏమిటి! నేను నా బలహీనతకు సిగ్గుపడుతున్నానా? అవునేమో! కాని.. కాని.. ఆ పండు వెన్నెల రాత్రిని నేనెలా మరిచిపోగలను? ఆ మధురానుభూతులను మూటగట్టుకొన్న ఆ రాత్రి నా జీవిత పుస్తకంలో సువర్ణాక్షరాలతో లిఖించబడింది. మత్తెక్కిన యవ్వనపు ఆ క్షణాలు జ్ఞాపకాలు ఇప్పటికీ, ఎప్పటికీ మరువరాని మధురానుభూతులే. నా జ్ఞాపకాల ఖజానాలో మరుపురాని ఆణిముత్యాలు. ఆ క్షణాలను తిరిగి తెచ్చుకోడానికి నేను నా సర్వసాన్ని త్యాగం చేయడానికి సిద్ధంగా లేనా? మరి నా గుండె ఎందుకు కొట్టుకుంటోంది? తప్పు చేశానన్న పశ్చాత్తాపమా? భయమా? నేను నిజంగానే తప్పుచేశానా? తప్పు చేయడమేమిటి? నేను తప్పు చేయడం వల్ల ఎవరైనా నష్టపోయారా? నేను చేసింది తప్పు కాదు, త్యాగం. ఈ త్యాగం అతనికోసం. అయ్యో! నేనా పని కోసం మరిన్ని త్యాగాలు చేయవలసింది. తప్పుకు నేను భయపడేది లేదు. కాని నేను ఈ దుష్ట సమాజానికి భయపడుతున్నాను. దాని ద్వంద్వార్థాలు, అవమానపు చూపులు నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.'

'అయినా నేను ఈ సమాజానికి ఎందుకు భయపడాలి? తప్పు చేసినందుకా? అసలు నేను చేసిన తప్పేమిటి? నేను చేసినట్లు సమాజంలో మరే యువతీ చేయలేదా? మనోహరమైన, ఆనాటి వెచ్చని రేయి, ఆ ఏకాంతం, ఆహా ఎంతటి మధురానందం! ఎంత రమణీయ దృశ్యకావ్యం? ఆ నులివెచ్చని స్పర్శ, ఆ ముద్దుల గిలిగింత, ఆ మధుర కౌగిలింత, మైకం కమ్మిన ఆ మదన మోహనుని ఆలింగనం ఎలా గువ్వ పిట్టలా ఒదిగిపోయాను! నా సర్వసాన్నీ మైమరిచి, ఆ మధుర క్షణాల్లో నేను మమేకమైపొయ్యానే! మరేమైంది? ఎవరైనా ఏం చేస్తారు? ప్రపంచంలోని ఏ ఆడదైనా అలాంటి క్షణాన ఆ మధురానుభూతిని తృణీకరించగలదా?

'ఇక తప్పా? హూఁ...! నేనసలు తప్పే చేయలేదు. సిగ్గుపడాల్సిన అవసరమే లేదు. నేను మళ్లీ మళ్లీ అలా చేయడానికి సిద్ధంగా ఉన్నాను. పవిత్రత! పాతివ్రత్యం! హూఁ.. అంటే? కేవలం కన్యగా ఉండడమా? దీనికి నేనెందుకు బెదిరిపోవాలి. ముఖమెందుకు మాడ్చుకోవాలి? నేను చేసింది కరక్టేనని నా మనసు చెబుతోంది. ఇది నిజం. నేను చేసింది సరైనదే, మంచిదే. అలాంటప్పుడు ఎందుకు భయపడాలి? నేను చేసింది కరెక్టేనని ఎలుగెత్తి నినదించడంలో నాకెందుకు అభ్యంతరం? అవును నూటికి నూరుపాళ్లూ నేను కరెక్టే. ఈ విషయం ఎలుగెత్తి చాటుతాను.'

ఈ విధమైనటువంటి ఆలోచనా విధానాన్ని, తర్కవైఖరిని మన నవ సాహితీకారులు, వ్యాసకర్తలు, కథకులు, యువతులకు- స్వయంగా తమ అక్క చెల్లెల్లు, కూతుళ్లకూ - బోధిస్తున్నారు. వెన్నెల రేయిలో వెచ్చని చెలికాడు లభిస్తే అతణ్ని అల్లుకు పోవాలని, చెబుతున్నారు. ఆ పరిస్థితిలో ఏ ఆడదైనా ఏమీ చేయలేదని, ఆనందాన్ని జుర్రుకోవడమే సరైన విధానమన్నది ఆ ఉపదేశాల సారాంశం. అంతేనా? అదసలు తప్పే కాదు. పాపం కాదు. ఇదొక త్యాగం. దీనివల్ల పవిత్రతకు ఎలాంటి మచ్చరాదు. ఆలోచనలు పవిత్రంగా ఉన్నప్పుడు కన్యాత్వాన్ని త్యాగం చేయడం వల్ల పవిత్రత ప్రమాదంలో పడుతుందా? ఎంత విచిత్రం! నిజానికి దీనివల్ల పవిత్రతకు పాతివ్రత్యానికి మరింత గౌరవం పెరుగుతుంది. అంతేకాదు ఇదెంతటి అద్భుతమైన కార్యం అంటే ఒక స్త్రీ జీవితంలో ఈ అధ్యాయాన్ని సువర్ణాక్షరాలతో లిఖించుకోవాలి. అంతేకాదు ఆమె ఇలాంటి జీవిత చరిత్రను బంగారు అక్షరాలతో రాయడానికి తప్పనిసరిగా ప్రయత్నించాలి. ఈ ధైర్యం, ఈ అదృష్టం అంగళ్లలో కూర్చునే వేశ్యలకు కూడా పాపం ఏనాడూ దక్కలేదు. ఎందుకంటే, ఆ అభాగినుల వద్ద పాపకార్యాన్ని పుణ్యంగా, పుణ్యకార్యాన్ని పాపకార్యంగా మార్చగల తర్కశాస్త్రం, అలాంటి విద్యావిధానం లేకపోయింది. నాటి వేశ్యలు తమ పవిత్రతనూ, పాతివ్రత్యాన్ని అమ్ముకొని, పాపం చేశామని భావించేవారు. తమను తాము నీచమైన పనిచేసిన వారిగా పరిగణించుకునేవారు. కాని ఈ నాటి నూతన సాహిత్యం ప్రతి ఇంటిలోని కూతుళ్లు, కోడళ్లను నాటి వేశ్యల కన్నా పదడుగులు ముందుకు తీసుకుపోవడానికి ప్రయత్నిస్తోంది.

ఎందుకంటే, ఈ దుర్మార్గాన్ని సమర్థించుకుంటూ అశ్లీలతను విస్తరింపజేయ డానికి ఓ కొత్త ప్రవర్తనా నియమావళికి ఊపిరిపోస్తోంది.

మన దేశంలోని సాహితీ వర్గంలో బహుళ ఆదరణ కలిగిన మరో పత్రికలో 'మరిది' పేరుతో ఓ కథ అచ్చయింది. ఈ రచయిత తండ్రి స్త్రీల కోసం ఉన్నత విలువలు గల అద్భుతమైన సాహిత్యాన్ని సృష్టించారు. భారతదేశంలోని ఉర్దూ తెలిసిన మహిళాలోకం ఆయన లేకపోయినా ఆయన సేవలను ఎప్పుడూ స్మరించుకుంటూ ఉంటారు. అలాంటి ఉత్తమ తండ్రి కడుపున చెడబుట్టిన ఈ ఈ రచయిత ఒక యువతి పాత్రను మనోహరంగా చిత్రించి తన సోదరీమణులైన మహిళాలోకానికి ఆదర్శంగా చూపించాడు. ఈ పాత్ర వివాహానికి ముందే తన 'మరిది' వయసులోని ఉద్రేకాలను, వేడిని దృష్టిలో పెట్టుకుని తన శరీరంలో వేడిని, అలజడిని పంచుకుం టుంది. యుక్తవయసుకు రాకముందునుండే, 'వయసు' నిశ్శబ్దంగా, చలన రహితంగా గడిచిపోతే, యవ్వనానికి, వృద్ధాప్యానికి తేడా ఏమి ఉండదన్నది ఆమె అభిప్రాయం. తన దృష్టిలో వయసంటే జ్వలనం, అలజడి తప్పనిసరిగా ఉండాలి. అసలు దాని మూలమే అందం, జ్వాలనం, ప్రేమ. ఈ వైఖరి, ఇలాంటి ఆలోచనలు, భావాలు గల యువతి పెళ్లి చేసుకుని అత్తారింటికి వెళ్లినప్పుడు, చిరుగడ్డంలో ఉన్న భర్తను చూసి ఆమెలోని భావోద్రేకాలన్నీ చల్లబడ్డాయి. అదీగాక ఆమెలో మొదటినుండే ఉన్న భావాలప్రకారం, భర్త సోదరుడైన మరిదితో సంబంధం పెట్టుకోవాలని నిర్ణయించుకుంటుంది. అనుకున్నట్లు తొందరలోనే ఆ అవకాశం రానే వచ్చింది. భర్తగారు ఉన్నత చదువుల నిమిత్తం విదేశాలకు వెళ్లాడు. భర్త లేని సమయాన వదినా మరుదులు తనివితీరా మధురానుభూతుల్ని జుర్రుకున్నారు. రచయిత ఈ ఘనకార్యాన్ని స్వయంగా అనైతిక కార్యానికి పాల్పడ్డ అపరాధితోనే రాయించాడు. ఆమె అవివాహితురాలైన తన స్నేహితురాలికి తన ఘన కార్యాలన్నీ పూసగుచ్చినట్లు రాస్తుంది. వదినా మరుదులు లైంగికంగా ఒకటైన చివరి ఘట్టం వరకూ, మొదటి నుండీ సంభవించిన పరిణమాలన్నీ వివరంగా, రసవత్తరంగా స్నేహితురాలికి తెలుపుతుంది.

మనసులో మొలకెత్తిన ఊహలనుండి, శారీరకంగా తాము అనుభవించిన ప్రతి అనుభవాన్ని కళ్లకు కట్టినట్లుగా వర్ణిస్తుంది. కేవలం మిగిలిందల్లా సంభోగ దృశ్యమొక్కటే. బహుశా పాఠకులు తమ బుర్రకు పదునుపెట్టి ఆ దృశ్యాన్ని ఊహించుకోవడంలోనే ఆనందం ఉంటుందని దాన్ని వదిలేసి ఉండవచ్చు.

ఈ కొత్త సాహిత్యాన్ని, మేము ఇంతకు ముందు వివరించిన ఫ్రాన్స్ సాహిత్యంతో పోల్చినప్పుడు మనకు స్పష్టంగా అర్థమయ్యేదేమిటంటే, ఈ వర్గం,

ఈ బిడారు కూడా అదే మార్గాన అదే గమ్యం వైపుకు వేగంగా వెళుతుందని మనకు తెలుస్తోంది. అదే జీవన విధానం వైపు పురోగమించడానికి మనో మస్తిష్కాలకు సానబెట్టడం జరుగుతోంది. ప్రధానంగా మహిళలపై దృష్టిపెట్టి, వారిలో కనీస స్థాయి సిగ్గూ బిడియాలు కూడా లేకుండా చేయాలన్నది ప్రధానాంశం.

## నవనాగరికత

ఈ ఆలోచనా విధానం, ఈ నైతిక ప్రవర్తనావళి, ఈ తత్వశాస్త్రం రంగంలో ఏకాకిగా లేదు. సామ్రాజ్యవాద నాగరికత విధానం పెట్టుబడి దారీ సంస్కృతీ వ్యవస్థ పాశ్చాత్య ప్రజాస్వామ్య మూడు సూత్రాలు కూడా దీనికి నీడగా ఉన్నాయి. ఈ మూడు శక్తులు కలిసి పాశ్చాత్య దేశాల్లో నిర్మితమైన జీవన విధానాన్నే రూపొందిస్తున్నాయి. స్త్రీ పురుష సంబంధాలపై పరమ అశ్లీల సాహిత్యం ప్రచురణ అవుతోంది. ఈ సాహిత్యం హైస్కూల్, కళాశాల విద్యార్థినీ విద్యార్థుల వరకు విరివిగా, సునాయాసంగా చేరవేయడం జరుగుతోంది. నగ్న, అర్ధనగ్న, చిత్రాలు ప్రతి రోజూ దిన, వారపత్రికల్లో ప్రతి ఇంట్లో ప్రతి షాపులో,ప్రతి కార్యాలయంలో దర్శనమిస్తుంటాయి. అందాలు ఆరబోసే మహిళల ఫోటోలు గృహాలంకరణ వస్తువులుగా మారి పోతున్నాయి. ప్రతిచోటా, ప్రతి నిత్యం అశ్లీల పాటలు ద్వందార్థ డైలాగులతో చెవులు చిల్లులు పడేలా అదరగొడుతున్నారు. ఇక సినిమా పరిశ్రమ అయితే పూర్తిగా అశ్లీలత, నగ్నత్వాల పైనే ఆధారపడి నడుస్తోంది.

ప్రతీరోజూ తెరపై రమణీయంగా చూపించే కొత్త కొత్త ఫ్యాషన్లు, హింస, అశ్లీలాలను చూసేవారు ఆదర్శంగా తీసుకుంటున్నారు. ఆయా పాత్రల్లో నటించే హీరో, హీరోయిన్లు యువతీ యువకులకు ఆదర్శంగా నిలుస్తున్నారు. ఈ మనో వాంఛలను రెచ్చగొట్టే దృశ్యాలను చూస్తున్న స్త్రీ, పురుషులు, తమలో సుడులు తిరిగే భావోద్రేకాల పరిపూర్తికి, ప్రేమను, రోమాన్స్‌ను వెదుకుతున్నారు. ఇవన్నీ సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీవాద విధానాల విభిన్న రూపాలు. ఈ సామ్రాజ్యవాద విధానాల ఫలితంగా పెద్ద పెద్ద నగరాలలో స్త్రీలు ఉపాధి అన్వేషణకు బయటికి వెళ్లక తప్పని పరిస్థితులు తలెత్తుతున్నాయి. ఈ దుర్మార్గ వ్యవస్థ సహకారంతోనే గర్భనిరోధక ప్రచారం కూడా అన్ని రకాల సాధనాల ద్వారా జోరందుకుంది.

ఈ నూతన నాగరిక వ్యవస్థ శుభాలు అత్యధికంగా ఇంగ్లండ్, ఫ్రాన్స్ దేశాల మాధ్యమంగా తూర్పు దేశాల వరకూ పాకి ఒకవైపు రాజకీయ, సామాజిక

కార్యకలాపాల కోసం ద్వారాలు తెరచి, మరో వైపు స్త్రీలు పురుషులు తప్పకుండా కలిసి ఉండాల్సిన పరిస్థితుల్ని కల్పించే సంస్థలు స్థాపించబడ్డాయి. మూడోవైపు చట్ట నిబంధనలు ఎంత డొల్లగా రూపొందించబడ్డాయంటే, అశ్లీలతను ప్రదర్శించడమే కాదు, అలాంటి ఆచరణాత్మక చేష్టలు కూడా చాలా సందర్భాల్లో తప్పుగా పరిగణించబడవు.

ఈ పరిస్థితిలో ఎవరైతే హృదయపూర్వకంగా ఈ మార్గాన్ని ఎంచుకున్నారో, వారి ఆలోచనా విధానంలో, వారి నైతిక, సామాజిక విధానంలో దాదాపుగా సంపూర్ణ విప్లవం వచ్చేసినట్లే. వారి స్త్రీలు ఇప్పుడు సినీతారల్లాంటి వస్త్రాల్లో బయటికి వెళుతున్నారు. ఏ విధమైన సంకోచం ఉండడంలేదు. రకరకాల ఫ్యాషన్ల అలంకారాలతో పురుషుల్ని ఆకర్షించడమే వారి ప్రధాన ఉద్దేశమన్నట్లు తయారవు తుంటారు. ఈ బరితెగింపు ఎంతవరకు చేరిందంటే స్నానపు దుస్తుల్లో పురుషులతో కలిసి జలకాలాడడం, ఆ డ్రస్సులోనే ఫోటోలకు పోజులివ్వడం, వాటిని పత్రికల్లో ప్రచురించడం, లాంటివి కూడా ఈ మహిళలకు అవమానం ఎంతమాత్రం కాదు. అసలా పరిస్థితిలో సిగ్గు, అవమానం అన్న ప్రశ్నే తలెత్తదు. ఆధునిక ఆలోచనా విధానం ప్రకారం, మానవ దేహంలోని అన్ని అవయవాలూ సమానమే. అరచేతులు, అరికాళ్లు బహిర్గతమైనప్పుడు లేని అభ్యంతరం లోతొడలు, వక్షస్థలం బహిర్గతమైతే ఎందుకు? జీవితంలోని మధురానుభూతులే నిజానికి కళ అది వారి దృష్టిలో అన్ని రకాల నైతిక సూత్రాలకు అతీతమైనది. అంతేకాదు అది స్వయంగా ఒక నైతిక ప్రమాణం. ఈ కారణంగానే తండ్రి కాని, సోదరుడు కాని, తమ కూతురు, సోదరి వేదికపై తన నృత్యగాన ప్రదర్శనతో ఆహుతులను ఆకర్షించి, వారి హర్షధ్వానాలు అందుకుంటూ ఉంటే ఆ దృశ్యాన్ని తిలకించి ఆనంద పారవశ్యంలో మునిగి పోతారు. భౌతిక విజయానికి మారుపేరైన జీవితాశయం వారి దృష్టిలో అన్నిరకాల విలువైన వస్తువుల్ని త్యాగం చేసి సాధించేదే. ఏ యువతి అయితే తన ఈ ఆశయ సాధనకు అర్హత, సమాజంలో గుర్తింపు తెచ్చుకుంటుందో, ఒకవేళ ఆ యువతి ఆ క్రమంలో తన శీలాన్ని కోల్పోయినా ఏమీ లేదు. ఆశయం ముఖ్యం. దాని ముందు శీలం ఏపాటి? అందుకని అన్నీ సాదించినట్లే. ఈ కారణాల వల్ల ఒక అమ్మాయి అబ్బాయితో కళాశాలలో కలిసి ఉండడం యూరపుదేశాలకు పరాయి యువకులతో వెళ్లడమైనా తప్పుకాదన్న భావన వల్లనే వారికి అసలు అర్థం కావడం లేదు.

ఇలాంటి వారే అందరికంటే ఎక్కువగా పరదాపై అభ్యంతరాలు వ్యక్తం చేస్తారు. వారి దృష్టిలో పరదా ఒక దుష్ట సంప్రదాయం. దాన్ని పరిహసించడం, అవమానించడం, ఎగతాళి చేయడమే దాని తిరస్కరణకు ఒక ఉదాహరణ. కాని ఈ వైఖరి ఎలా ఉందంటే, ఒక వ్యక్తి ముఖంపై ముక్కు అవసరాన్నే గుర్తించకుండా– తాను దాన్ని గుర్తించడం లేదు కాబట్టి– ముక్కున్న ప్రతివాణ్ణీ హేయంగా చూడడం అవమానించడం, హేళన చేయడం లాంటిది. ఇలాంటి అజ్ఞాని మాటలకు అజ్ఞానులు మాత్రమే ఆకర్షితులవుతారు. ఒక వేళ వారిలో ఏమాత్రం ఔచిత్యం ఉన్నా, వారికి మాకు మధ్య నిజానికి విలువల పునాది పైనే వైరుధ్యం ఉంది, తప్ప మరొకటి కాదని గుర్తించాలి. వేటినైతే మేము అమూల్యమైనవిగా భావిస్తున్నామో, అలాంటి వాటికి వారి దృష్టిలో విలువలేదు. ప్రామాణికత ఆధారంగా ఏ ఆచరణా విధానాన్ని మేము తప్పనిసరి అంటున్నామో, అది వారి దృష్టిలో అనవసరమైనదే కాదు, పూర్తిగా పనికిమాలిందే కావచ్చు. కాని మూల సూత్రాలపైన్నే అభిప్రాయ భేదమున్నప్పుడు అసలు మూలాలపై చర్చించకుండా, చిన్నచిన్న శాఖలపై దాడి చేసేవారిని అజ్ఞానులుగా భావించవలసి ఉంటుంది. మానవ విలువల నిర్ణయంలో నిర్మాణాత్మకమైనవి ఏవన్నా న్యాయమైనవంటే అవి ఖచ్చితంగా దైవిక చట్టాలే. ఈ దైవిక చట్టాలపరంగా మానవ నిర్మాణం దేని ఆధారంగా జరిగిందో, ఏ విషయాలు మానవుడికి మేలునూ సాఫల్యాన్ని ప్రసాదించగలవో నిజానికి అవే గౌరవించదగ్గవి, ఆదరించదగ్గవి. రండి! ఈ విలువల్ని గౌరవించడంలోగాని, వ్యతిరేకించడంలోగాని సత్యం పక్షాన ఎవరున్నారో గీటురాయిపై పరికించి చూసుకుందాం. మీరు న్యాయం పక్షాన ఉన్నారా, మేమున్నామా తేల్చుకుందాం. ఆచరణాత్మక ఆధారాలు మీ దగ్గరున్నవి మీరు తీసుకురండి. మా దగ్గరున్నవి మేము ప్రవేశపెడతాం. ఏది న్యాయమో ఆలోచించండి. ఈ విధంగా మేము గనక విలువల ప్రమాణాలను యదార్థమని (రుజువు) నిరూపించగలిగితే, వాటిని అనుసరించడం అనుసరించక పోవడం ఇక మీ ఇష్టం. జ్ఞానం ఆధారంగా, విలువల ఆధారంగా అంగీకరించడానికి, లేక ఎలాంటి ఆధారంలేని, జ్ఞానం పునాదులు కూడా లేని మీ వాదనకే కట్టుబడి ఉండడానికీ మీకు అనుమతి ఉంది. కాని రెండవ పద్ధతిలో మీరు మాత్రం ఇక మా విధానాన్ని విమర్శించే, హేళన చేసే నైతిక హక్కును కోల్పోతారు. ఆ విమర్శలు, అవహేళనలన్నీ ఇకపై మీకే వర్తిస్తాయి.

## మరోవర్గం

వీరి తరువాత మరో వర్గం మనముందు కొస్తుంది. మొదటి వర్గంలో ముస్లిమేతరులు, నామమాత్రపు ముస్లింలు పాత్రధారులు. కాని ఈ రెండవ వర్గంలో ముస్లింలందరూ ఉంటారు. వీరిలో ఈనాడు అటూఇటూకాని, అనే విచిత్రమైన సగం పరదా సంప్రదాయం వాడుకలో ఉంది. ముజబ్ జబీన... అన్న వాక్యానికి వీరు సరిగ్గా సరిపోతారు. "వారు ఎటూకాకుండా మధ్యలోనే ఊగిసలాడుతున్నారు. పూర్తిగా అటూ ఉండరు, పూర్తిగా ఇటూ ఉండరు. అల్లాహ్ ఎవరినైతే అపమార్గంపాలు చేస్తాడో వారికోసం నీవు ఏ మార్గాన్నీ కనుగొనలేవు.' (4-143) ఇలాంటి వారు ఈ ఖుర్‌ఆన్ వాక్యానికి సరిగ్గా సరిపోతారు. ఒకవైపు వీరు ఇస్లామీ ఆలోచనలు కలిగి ఉంటారు. ఇస్లాం ప్రవచించిన నైతికత, నాగరికత, సంస్కృతి సంప్రదాయాలు, మంచి నడవడికలను అంగీకరిస్తారు, ఆమోదిస్తారు. తమ స్త్రీలను సిగ్గు, సౌశీల్యం గౌరవ మ్యదలు, తమ గృహాలను అన్నిరకాల అనైతికతల నుండి కాపాడుకోవాలని తాపత్రయపడతారు. అలాగే పాశ్చాత్య సంస్కృతి, నాగరికతలను అనుసరించడవల్ల తలెత్తే, లేక తలెత్తబోయే పర్యవసానాలను లేక ఫలితాలను అంగీకరించడానికి సిద్ధంగా ఉండరు. కాని మరోవైపు ఇస్లామీయ సామాజిక వ్యవస్థ సూత్రాలను ఉల్లంఘిస్తే కాస్తంత జంకుతారు. ఊగిసలాడుతూనే ఆ మార్గంలో తమ భార్యలను, కూతుళ్లను, సోదరీమణులను తీసుకు వెళుతుంటారు. పాశ్చాత్య సంస్కృతి బాటలోనే ముందుకు సాగుతుంటారు. వీరి అపోహ ఏమిటంటే, సగం పాశ్చాత్య సంస్కృతిని, సగం ఇస్లామీయ సంస్కృతిని మేళవించి, ఈ రెండు సంస్కృతుల ప్రయోజనాలు పొందాలన్నది వీరి ఉద్దేశ్యం. అంటే, వారి గృహాల్లో ఇస్లామీయ విలువలు సురక్షితంగా ఉండాలి. వారి కౌటుంబిక క్రమశిక్షణా యధాతథంగా ఉండాలి. దీంతోపాటు వారిసమాజంలో పాశ్చాత్య సమాజంలోని చెడులు కాకుండా, కేవలం దాని మనోల్లాసాలు, మాధుర్యాలు అలాగే దాని భౌతికప్రయోజనాలు మాత్రమే అనుభవించాలి. కాని మొదటి విషయం ఏమిటంటే, రెండు విభిన్న భావాలు, ఆలోచనలు, సిద్ధాంతాలు, సంస్కృతులు నాగరికతలను రెండు ముక్కలుగా విడగొట్టి అతుకు వెయ్యాలనుకోవడమే అవివేకం. ఎందుకంటే, ఈ విధమైనటువంటి వైరుధ్యపూరితమైన అతకని మిశ్రమం ఇరుపక్షాలప్రయోజనాలను కాపాడేబదులు,

ఇరువురికీ నష్టాలను కలిగించడానికే ఎక్కువ అవకాశం ఉంది. మరో విషయం ఏమిటంటే, పటిష్టమైన ఇస్లామీయ నైతికవ్యవస్థలోని కట్టుబాట్లు ఒకసారి సడలించి, మనసుకు (ఆత్మకు) చట్ట ఉల్లంఘన మాధుర్యం రుచి చూపించిన తరువాత, ఇకమీరు ఈ పరంపరను ఆపగలమని ఎలా అనుకుంటున్నారు? ఈ అర్ధనగ్న వస్త్రధారణ ఆచారం, ఈ అలంకార కాంక్ష, జంకూగొంకూ లేకుండా పార్టీలకు వగైరా వెళితే పరవాలేదన్న ప్రారంభ పాఠాలు, ఈ సినిమాలు, సీరియళ్లు, నగ్నదృశ్యాలు, ప్రేమ కహానీలు వీటిపై పెరుగుతున్న ఆసక్తి, పాశ్చాత్య తరహాలో అమ్మాయిల విద్యాబోధన ఇవన్నీ వెంటనే ప్రభావాన్ని చూపలేకపోయినా, నవతరం యువత మాత్రం వాటి దుష్ప్రభావం నుండి సురక్షితంగా ఉండడం అసాధ్యం. ఒకవేళ ప్రస్తుత యువతరం సురక్షితంగా ఉన్నప్పటికీ రాబోవు తరాలు మాత్రం సురక్షితంగా ఉంటాయన్న నమ్మకం లేదు. అలా భావించడం అవివేకం తప్ప మరేమీ కాదు.

ఏ సంస్కృతిలో అయినా సమాజంలో అయినా ప్రతి దురాచారమూ చాలా అమాయకంగా, సాధుస్వరూపంలోనే ప్రారంభమవుతుంది. కాని ఒక తరం నుండి రెండో తరం మూడో తరం వరకూ చేరుతూ చేరుతూ ఒక భయానక రూపాన్ని సంతరించుకుంటుంది. స్వయానా యూరప్, అమెరికాల్లో కూడా ఏ చెడుల పునాదుల పైనైతే సమాజ నవనిర్మాణం జరిగిందో అప్పుడు కూడా దాని పర్యవసానాలు వెంటనే బహిర్గతం కాలేదు. ఇప్పుడు మూడోతరం, నాలుగోతరం సంతతి దాని దుష్పరిణామాల విశ్వరూపాన్ని దర్శిస్తోంది. కనుక ఈ పాశ్చాత్య, ఇస్లామీయ విధానాల మిశ్రమ కలయిక, ఈ సగం పరదా సంస్కృతి నిజానికి ఎలాంటి శాశ్వతమైన ప్రయోజనం చేకూర్చ జాలదు. వాస్తవానికి దీని సహజ పోకడ, మొగ్గు పాశ్చాత్యంవైపే ఉంది. ఎవరైతే ఈ విధానాన్ని అనుసరిస్తున్నారో, వారు తెలుసుకోవాల్సింది ఏమిటంటే ప్రస్తుతానికి వారు ఈ ప్రయాణాన్నైతే ప్రారంభించారు. చివరి గమ్యం వరకూ వారు చేరుకోలేక పోయినా వారి సంతానమో, లేక వారి సంతానమో తప్పక చేరుకోగలుగుతుంది.

## నిర్దిష్ట సమస్య

ఇలాంటి పరిస్థితుల నేపథ్యంలో కీలక సమస్యను గురించి నిర్ణయం తీసుకునే ముందు బాగా ఆలోచించుకొని మరీ ముందడుగు వేయవలసి ఉంటుంది. ఆ

కీలక, లేక మౌలిక సమస్య క్లుప్తంగా ఏమిటంటే:-

అమెరికా, యూరప్ దేశాల్లో ఉత్పన్నమైన పాశ్చాత్య సంస్కృతి పర్యవసానాలను ఆమోదించడానికి మీరు సిద్ధంగా ఉన్నారా? మీ సమాజంలో కూడా అదే విశృంఖలత్వం, మనోవాంఛల దాస్య వాతావరణాన్ని మీరు ఇష్టపడతారా? మీ జాతిలో కూడా అదే విధమైనటువంటి నిర్లజ్జ, అశ్లీలతలు ప్రబలడాన్ని మీరు సహించగలరా? సుఖవ్యాధులు ప్రబలడం, కుటుంబ వ్యవస్థ ఛిన్నాభిన్నమవ్వడం, విడాకులు, పెడాకుల సమస్య తలెత్తడం, యువతీ యువకులు విచ్చలవిడిగా తిరగడం, ప్రేమాయణాలు నడపడం, వక్రమార్గాల్లో పయనించడం మీకు సమ్మతమేనా? గర్భ నిరోధాలు, భ్రూణహత్యలు, శిశుహత్యలు, యువతీ యువకులు విశృంఖలత్వానికి అలవాటుపడి, తమ అమూల్యమైన యవ్వనాన్ని, మేధాశక్తిని నిర్వీర్యం చేసుకుంటూ, హద్దుల్ని అతిక్రమించి ఆరోగ్యాలను కూడా నాశనం చేసుకోవడం మీకు ఇష్టమేనా? చిన్నపిల్లలు వయసుకు ముందే లైంగిక సంబంధాల్లో చిక్కుకోవడం వల్ల వారిలో అనేక ఆరోగ్య సమస్యలు తలెత్తి బుద్ధిమాంద్యతకు దారితీయడం మీకు సమ్మతమేనా?

ఒకవేళ మీరు భౌతిక ప్రయోజనాలు, ఇంద్రియ సుఖాలను ఆశించి వీటన్నింటినీ సహించడానికి సిద్ధంగా ఉన్నట్లయితే, నిస్సంకోచంగా మీరు పాశ్చాత్య రహదారిపై దర్జాగా వెళ్లండి. ఇస్లాం పేరును మాత్రం ఉచ్చరించకండి. అంతేకాదు మీరా మార్గాన్ని ఎంచుకునే ముందే ఇస్లాంలో తెగదెంపులు చేసుకున్నట్లు బహిరంగంగా ప్రకటించవలసి ఉంటుంది. ఎందుకంటే తరువాత మీరు ఇస్లాం పేరును ఉపయోగించుకొని ఇతరులను మోసం చేయకూడదు. అలాంటి అవకాశం మీకు దక్కకూడదు. మీకు లభించే పరాభవాలు, ఛీత్కారాలవల్ల ఇస్లాం, ముస్లింల గౌరవానికి ఎలాంటి భంగం వాటిల్లకూడదు.

కాని ఒకవేళ మీరు ఈ పర్యవసానాలను అంగీకరించడానికి, ఆమోదించడానికి సిద్ధంగా లేనట్లయితే, మంచితనం, మానవత్వం, నైతికత పరిఢవిల్లే, మానవుడికి మానసికమైన, మేధోపరమైన, ఆత్మీయమైన ప్రగతీ వికాసాలకు ఒక శాంతియుతమైన వాతావరణం లభించే, స్త్రీ పురుషులు పశుప్రవృత్తి గల వాంఛల నుండి సురక్షితంగా ఉంటూ, తమ తమ శక్తి సామర్థ్యాల ప్రకారం, తమ సామాజిక బాధ్యతలను నిర్వర్తించగలిగే సంస్కృతీ నాగరికతల యొక్క పునాది, అంటే పటిష్టమైన

కౌటుంబిక వ్యవస్థతో, సంతానం సురక్షితంగా, ఎలాంటి అసమానతలు లేకుండా, మానసిక వ్యక్తిగత జీవితం శాంతివంతంగా, సంతోషవంతంగా, ఒక స్వర్గంలా సంతానానికి ఒక చక్కటి శిక్షణశాలగా, కుటుంబ సభ్యులందరూ ఒకరికి ఒకరుగా, ఆ కుటుంబం ఒక నందనవనంలా వర్ధిల్లాలనుకుంటే, మీరు ఈ లక్ష్య సాధనలో పాశ్చాత్య సమాజం ముఖం కూడా చూడకూడదు. ఆ మార్గం వైపు కన్నెత్తి కూడా చూడకూడదు. ఎందుకంటే ఆ మార్గం పూర్తిగా వ్యతిరేక దశకే పోతుంది. పశ్చిమదిశగా పయనం సాగిస్తూ, తూరుపు దిశగా సాగిపోతున్నామని భావించడం బుద్ధిజ్ఞానాలకు అందే విషయం కాదు. కనుక మీ ఉద్దేశాలు, లక్ష్యాలు ఇవే అయితే మీరు ఇస్లాం మార్గం అనుసరించవలసి ఉంటుంది. అయితే ఈ మార్గంలో అడుగుపెట్టేముందు మీ మనస్సుల్లోంచి, అసమానతలు, అమానవీయతను, భౌతిక లాభాలు, ఇంద్రియలోలత్వాల పూర్తిగా తొలగించుకోవలసి ఉంటుంది. పాశ్చాత్య నాగరికతలోని సుఖభోగాలప్రదర్శనను చూసి మీకు మనసులో జనించిన అనేక అవాంఛనీయాలను త్యజించవలసి ఉంటుంది. యూరప్ దేశాలనుండి అరువు తెచ్చుకున్న సిద్ధాంతాలు, ఆలోచనలను కూడా మీ మస్తిష్కాలనుండి తుడిచిపెట్టాల్సి ఉంటుంది. పాశ్చాత్య సంస్కృతి, సమాజంలో వాడుకలో ఉన్న అన్ని ఆచార వ్యవహారాలకూ విడాకులివ్వాల్సి ఉంటుంది. ఇస్లాం తనకంటూ కొన్ని సిద్ధాంతాలు, లక్ష్యాలు కలిగి ఉంది. ఇవి ఎన్నటికీ మారని, మార్పు చెందని శాశ్వత జీవితకాల సిద్ధాంతాలు, లక్ష్యాలు. అది వాటి కనుగుణంగా ఒక సామాజికవ్యవస్థను రూపొందించింది. ఈ సామాజిక వ్యవస్థ సంరక్షణ ఒకప్రత్యేక డిసిప్లిన్ (క్రమశిక్షణ), ప్రత్యేక విధానం ద్వారా చేస్తుంది. ఈ క్రమంలో అనంతమైన విజ్ఞాన వివేకాలను మానవుల మానసిక స్థితిగతుల్ని, భావోద్రేకాల్ని పరిగణనలోకి తీసుకోవడం జరిగింది. ఇలా చేయకపోతే సామాజిక వ్యవస్థ విచ్ఛిన్నత నుండి సురక్షితంగా ఉండజాలదు. ఇది నియంతృత్వ ప్రజాస్వామ్యంలాగా ఊహాజనిత, భ్రమల వ్యవస్థ కాదు. 1400 సంవత్సరాల కఠిన పరీక్షల్లో ఘనంగా ఉత్తీర్ణత సాధించింది. ఈ సుదీర్ఘ ప్రస్థానంలో ఏ దేశంలోగాని, ఏ జాతిలో గాని దీని ప్రభావం వల్ల ఏ ఒక్క దురాచారం ప్రబలిన దాఖలాలేదు. ఒకరకంగా చెప్పాలంటే, పాశ్చాత్య సంస్కృతి ప్రభావం వల్ల కేవలం ఒక్క శతాబ్దంలో ప్రబలిన దుర్మార్గాలతో పోల్చితే, 14 శతాబ్దాల సుదీర్ఘచరిత్రలో

కనీసం ఒక్కశాతం కూడా దరిచేరలేదని చెప్పవచ్చు. కనుక ఈ పటిష్టమైన, ఫలవంతమైన జీవనవ్యవస్థ ద్వారా మీరు ప్రయోజనం పొందాలనుకుంటే మీరు దాని విధానాలను, దాని క్రమశిక్షణను సంపూర్ణంగా అనుసరించవలసి ఉంటుంది. అంతేకాదు మీ మేథలో జనించిన, లేక ఇతరుల నుండి అరువు తెచ్చుకున్న అపరిపక్వ ఆలోచనలు, పరీక్షలకు నిలవని, అసలు పరీక్షకే రాని విధానాలను కూడా త్యజించవలసి ఉంటుంది.

మూడోవర్గం అజ్ఞానులు, ఆలోచనలేనివారు. వీరికి స్వయంగా ఆలోచించే శక్తిగాని, అర్థం చేసుకునే వివేకం కాని ఉండవు. అందుకని వీరిని గురించి చర్చించి సమయం వృథా చేసే బదులు వీరిని చూసీ చూడనట్లు వదిలివేసి ముందుకు సాగిపోవటమే మంచిదని భావిస్తున్నాము.



7వ అధ్యాయం

# ప్రకృతి సహజ చట్టాలు

దైవం మిగతా అన్ని జాతులు జీవులకు లాగానే మానవుల్ని కూడా జతలుగా అంటే ఆడ, మగలుగా సృష్టించాడు. సహజంగానే వీరు ఒకరిపట్ల ఒకరు ఆకర్షణ కలిగి కలసిమెలసి ఉంటారు. అయితే ఇతర పశు జాతుల్లోని విభజన (ఆడ, మగ) సహజ ఆకర్షణ, పరస్పర కలయికల ఉద్దేశ్యం కేవలం ఆ జాతి పరిరక్షణకు మాత్రమేనని పరిశీలనల ద్వారా తెలుస్తోంది. అందుకే ఆయా జాతుల పరిరక్షణకు అసరమైనంత మేరకు మాత్రమే వాటిలో ఆకర్షణ గుణాన్ని ఉంచడం జరిగింది. దీన్ని ఏదో ఒక పరిమితి మేర నియంత్రించుకునే శక్తి కూడా వాటి స్వభావంలో లేదు. పరస్పర ఆదరాభిమానాలతో శాశ్వతంగా కలసి మెలసి జీవనం గడుపుతున్న ఆడ మగ జాతుల్లో పరస్పర ఆకర్షణకు అసంఖ్యాక అవకాశాలను సమకూర్చడం జరిగింది. వాటి హృదయాల్లో ప్రేమానురాగాలను నెలకొల్పి వాటి దేహనిర్మాణం, వాటి రంగు రూపు, స్పర్శ వాటి ఒక్కో అవయవానికి పరస్పర ఆకర్షణను సృజించడం జరిగింది. వాటి అరుపులో, చూపులో నడతలో ప్రతి విషయంలోనూ ఒక విధమైనటు వంటి ఆకర్షణాశక్తి ఉంది. వాటి ఒక్కో కదలికతో, ఈ విషయం ద్యోతకమవుతోంది. వాయు సంచారం, నీటి ప్రవాహం, పూలపరిమళం, పక్షుల కువకువలు, ప్రకృతి పచ్చదనం ఇవన్నీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఈ ఉద్యమంలో పాలుపంచు కుంటున్నాయి.

ఇక మానవ దేహ నిర్మాణాన్ని పరిశీలించినట్లయితే ఏక కాలంలో జీవనశక్తి, ఆచరణాశక్తి కలిగి ఉన్నటువంటి ఓ బలమైన శక్తి మానవుల్లో ఉన్నట్లు మనకు అర్థమవుతుంది. అలాగే లైంగిక శక్తి కూడా! వారిలో జీవశక్తిని జనింపచేసే గ్రంథులు మానవ అవయవాల్లో హార్మోన్లను ఉత్పత్తి చేస్తాయి. వారిలో తెలివిని, మేధస్సును, బలాన్ని, ఆచరణా శక్తిని జనింపచేస్తాయి. లైంగిక శక్తిని, పెంపొందించడం కూడా వీటిపనే. భావోద్రేకాలను ప్రేరేపించడానికి అందచందాలు, రూపురేఖలు, అలంకారాల్లాంటి అనేక ఉపకరణాలు సమకూర్చబడ్డాయి. వీటి ద్వారా ప్రభావితమయ్యే, ఆకర్షింపబడే గుణాన్ని వారి కళ్లు, చెవులు, స్పర్శ చివరికి వారి ఆలోచనా శక్తి కూడా సమకూర్చి పెట్టాయి.

దైవ ప్రసాదితమైన ఈ శక్తియుక్తులన్నీ మానవుల్లో కనిపిస్తాయి. వారి మనస్సుల్లో ఎన్ని చలన శక్తులు ఉన్నాయో, వాటన్నిటి సంబంధం రెండు అద్భుతమైన శుభ గుణాల ద్వారా కలిసి ఉంది. ఒకటేమిటంటే, స్వీయ సంరక్షణతోపాటు, తన జాతి సేవకోసం ప్రేరేపిస్తుంది. రెండవది లింగపరంగా తనకు వ్యతిరేక జాతితో సంబంధానికి ఒత్తిడి తెస్తుంది. యుక్త వయసులో ఈ భావన మంచి ఊపు మీద ఉంటుంది. ఒక్కోసారి మొదటి గుణాన్ని డామినేట్ చేసి ఎంతటి త్యాగాలకైనా సిద్ధపడేటట్లు చేస్తుంది.

## నాగరికత సృజనలో లింగాకర్షణ ప్రభావం

ఇదంతా ఎందుకు? కేవలం జాతి పరిరక్షణకేనా? కాదు. మానవజాతి పరిరక్షణకే అయితే, చేపలు, మేకలు ఇంకా ఇతర జీవరాసుల్లో ఇంతగా సంతాన పరిరక్షణ చేయాల్సిన అవసరం లేదు. మరి ఇతర జీవ జాలాలన్నిటికంటే ఎక్కువగా మానవుల్లో ఇంతటి లింగాకర్షక శక్తిని, దానికోసం అనేక అవకాశాలను సమకూర్చడానికి కారణం ఏమిటి? కేవలం మానవుల మనోవాంఛలు తీర్చుకోడానికా? అదీకాదు. దైవం ఎక్కడా రుచులు, మనోవాంఛలనే ధ్యేయంగా పెట్టలేదు. ఒక మహత్తర లక్ష్యం కోసం సేవకోసం మానవులు, ఇతర జీవరాశులు తమను తాము అర్పించుకోడానికైనా సిద్ధపడేలా దైవం మనోవాంఛల్ని, కోరికల్ని, రుచుల్ని వారికి అందించాడు. తద్వారా ఈ సేవ (లక్ష్యం) పరాయి వారిది కాదు తమదే అని శ్రద్ధగా నిర్వహించడానికి. ఈ విషయంలో ఏ మహోన్నత లక్ష్యం ప్రకృతి దృష్టిలో ఉందో ఇక మీరే ఆలోచించండి. ఎంత ఆలోచించినా దైవం ఇతర జీవజాలానికి భిన్నంగా మానవ జాతిని నాగరిక జాతిగా చేయాలని అభిలషిస్తున్నాడన్న ఒక్క సమాధానం తప్ప మరే విషయమూ ఆలోచనకందదు.

అందుకని మానవ హృదయంలో స్త్రీ పురుషుల మధ్య పరస్పర ప్రేమాభిమానాలకు సంబంధించిన పార్శ్వాన్ని ఉంచడం జరిగింది. అది కేవలం శారీరక వాంఛల పరిపూర్తిని మాత్రమే కోరుకోదు, ఒక శాశ్వతమైన తోడును, మానసిక ఆత్మీయ అనుబంధాన్ని, మనఃపూర్వక ప్రేమానురాగాలను కూడా కోరుతుంది.

అందుకే మానవుడిలో మానసిక, ఆత్మీయ అనుబంధాన్ని, అతని లైంగిక శక్తికన్నా అధికంగా ఉంచడం జరిగింది. ఇందులో ఎంత కోరిక, మోహం, లైంగిక ఆకర్షణ ఉందంటే, ఒకవేళ దీనికనుగుణంగా, లేక మరో పదిరెట్లు అదనంగా

లైంగిక కార్యానికి పాల్పడితే అతని శక్తి సన్నగిల్లిపోతుంది. వృద్ధాప్యానికి చేరుకోక పూర్వమే అతని శారీరక శక్తి నశించి పోతుంది. కనుక మానవుడిలో లైంగిక కార్యంకన్నా, లైంగిక ఆకర్షణ అధికంగా ఉండడమంటే, అతను ఇతర జంతువులకన్నా అధికంగా లైంగిక కార్యకలాపాలు కొనసాగించాలని కాదని దీని ద్వారా మనకు తెలుస్తోంది. అంటే స్త్రీ పురుషులను పరస్పరం కలిపి ఉంచడం, వారిమధ్య బంధాన్ని పటిష్ట పరచడం, వారి మధ్య చక్కని అవగాహన, అనుబంధాన్ని జనింపజేయడం అసలు ఉద్దేశ్యం.

స్త్రీ స్వభావం (నైజం)లో లైంగిక కోరిక, ఆకర్షణతోపాటు, సిగ్గు బిడియం సహనం, చంచలత పాలు అధికంగా ఉంటుంది. కాస్త అటూ ఇటుగా ఇది స్త్రీలందరిలోనూ ఒకేవిధంగా కనబడుతుంది. ఈ పొగరుబోతుతనం, సిగ్గు, బిడియాల స్థితి ఇతర జీవరాసుల్లోనూ ఉన్నప్పటికీ, మానవతా జాతిలో కాస్త బలంగా ఉంటుంది. సిగ్గు బిడియాల భావోద్రేకాల ద్వారా దీన్ని మరింత పటిష్టం చేయడం జరిగింది. దీని ద్వారా కూడా మనకు తెలిసేదేమంటే మానవుడిలో లైంగిక ఆకర్షణ ఉద్దేశ్యం ఒక శాశ్వతమైన బంధం మాత్రమే. తప్ప ప్రతి లైంగికాకర్షణ ఫలితం ఒక లైంగిక కార్యం కాదు.

అందుకే మానవ శిశువును మిగతా అన్ని జీవరాసుల శిశువులకన్నా బలహీనంగా అశక్తునిగా సృజించడం జరిగింది. ఇతర జీవరాసుల సంతానానికి భిన్నంగా, మానవ శిశువు అనేక సంవత్సరాలు తల్లిదండ్రుల సంరక్షణలో, పర్యవేక్షణలో ఉండవలసి ఉంటుంది. మానవ శిశువు తన కాళ్లపై తాను నిలబడడం, ఎవరి సహాయం లేకుండా తనంత తాను స్వతంత్రంగా వ్యవహరించడానికి కూడా చాలా సమయం పడుతుంది. అంటే, స్త్రీ పురుషుల సంబంధం కేవలం లైంగిక కార్యకలాపం వరకే పరిమితం కాకుండా, అది వారిని శాశ్వతంగా, పరస్పర సహాయకులుగా, తోడునీడగా ఒక పటిష్టమైన బంధంలో ఉంచడం దీని ఉద్దేశ్యం.

అందుకే మానవ హృదయంలో సంతానం పట్లప్రేమ ఇతర జీవరాసులన్నిటి కన్నా అధికంగా ఉంటుంది. జంతుజాలం ఒక పరిమిత కాలం వరకు మాత్రమే తమ సంతానాన్ని పర్యవేక్షించి, తరువాత వేరై పోతాయి. తరువాత వాటిలో ఎలాంటి ఆత్మీయ సంబంధాలూ ఉండవు. అంతేకాదు తరువాతి కాలంలో అవి ఒక దాన్నొకటి గుర్తించను కూడా గుర్తించలేవు. దీనికి భిన్నంగా మానవులు బాల్యదశ దాటిన

తరువాత కూడా తమ సంతానం పట్ల ప్రేమానురాగాలు కలిగి ఉంటారు. ఈ ప్రేమబంధం ఒక తరం నుండి మరో తరానికి బదిలీ అవుతూ నిరంతరం కొనసాగుతూ ఉంటుంది. ఒక దశలో మానవుడు తనకన్నా ఎక్కువగా తన సంతానం కోసమే ఆలోచిస్తాడు. తన సంతానానికి మంచి భవిష్యత్తు అందించడానికి శక్తివంచన లేని కృషి చేస్తాడు. తన శ్రమ ఫలాలను వారికి వదిలి వెళ్లాలని అభిలషిస్తాడు. ఈ భావాలను జనింపజేయడంలో ఉన్న ఉద్దేశ్యం కేవలం స్త్రీ పురుషుల మధ్య సంబంధాలను సదా పరిరక్షించడమే. తద్వారా ఈ శాశ్వత సంబంధాన్ని కుటుంబ వ్యవస్థకు ఆధారభూతంగా నిలపడం. ఈ విధంగా రక్త సంబంధాలతో ముడిపడిన ప్రేమానురాగాలు పరిఢవిల్లి అందరి మధ్య సత్సంబంధాలు నెలకొంటాయి. ఈ విధంగా ఒక సమాజం, ఒక నాగరిక వ్యవస్థ ఉనికిలోకి వస్తుంది.

## నాగరికతకు మౌలిక సమస్య

దీనివల్ల మనకు తెలుస్తున్నదేమిటంటే, స్త్రీ పురుషుల మధ్య ఉన్నటువంటి ఈ ప్రేమ మానవ దేహంలో, ఆత్మలో నరనరాల్లో అణుఅణువునా జీర్ణించుకుపోయి ఉంది. దీని సహాయం కోసం విశ్వంలో విస్తృతస్థాయిలో అడుగడుగునా కావలసినన్ని అవకాశాలను సమకూర్చడం జరిగింది. మానవుని వ్యక్తిగతాన్ని సామూహికతలోనికి మార్చడమే దీని ఉద్దేశ్యం, ఈ ప్రేమానురాగాల ఆకర్షణాశక్తి వల్ల రెండు మానవ జాతుల మధ్య అనుబంధం ఏర్పడుతుంది. ఈ అనుబంధం ద్వారా సామాజిక జీవిత (social life) ఆరంభమవుతుంది.

ఈ విషయం ధృవపడిన తరువాత స్త్రీ పురుషుల మధ్య సంబంధం నాగరికతకు మూలకందం అన్న విషయం కూడా దానంతట అదే స్పష్టమౌతుంది. ఈ సమస్య సమగ్ర పరిష్కారంపైనే సంస్కృతీ నాగరికతల మంచి చెడ్డలు, లాభనష్టాలు, వాటి పటిష్టతలు ఆధారపడి ఉన్నాయి. మానవజాతిలోని ఈ రెండు కోణాల్లో ఒకటి పశుప్రాయమైన సంబంధం (లేక పైశాచిక సంబంధం) దీని ఉద్దేశ్యం సంతానోత్పత్తి తప్ప మరొకటి కాదు. రెండవది మానవీయ సంబంధం. దీని ఉద్దేశ్యం, ఏమిటంటే, ఇద్దరూ కలిసి, ఉమ్మడి ప్రయోజనాల కోసం తమ తమ శక్తి సామర్థ్యాల మేరకు సహకరించుకోవడం. ఈ సహాయ సహకారాల కోసం వారి ప్రేమ, చెలిమి, ఒక వారధిగా పనిచేస్తుంది. ఈ పశుప్రాయ, మానవీయ శక్తులు కలిసి ఏకకాలంలో వారి ద్వారా నాగరిక వ్యాపారం చేయడానికి కూడా సిద్ధమవుతాయి. ఆ వ్యాపారాన్ని కొనసాగించడానికి మానవవనరులను పెంపొందించుకునే పనికూడా

తీసుకుంటాయి. ఈ రెండు శక్తుల కలయిక తగిన రీతిలో ఉండడం పైనే నాగరికత పవిత్రత గాని, చెడుగాని ఆధారపడి ఉన్నాయి.

ఇప్పుడు మనం ఈ సమస్యను విశ్లేషిద్దాం. ఒకమంచి నాగరికతకోసం స్త్రీ పురుషుల మానవీయ, అమానవీయ సంబంధాల్లో న్యాయబద్ధత, అనుగుణ్యత, సారూప్యత ఎలా ఉంది. ఈ సారూప్యతపై అసమానతల అమానవీయతల ఏ ఏ రూపాలు ప్రభావం చూపడం వల్ల నాగరికత భ్రష్టుపట్టి పోతుందో చూద్దాం.

## 1) స్త్రీ పురుష సంబంధాలు..

అన్నిటికన్నా ప్రధాన సమస్య లైంగిక ఆకర్షణకు సంబంధించినది. అంటే దీన్ని నియంత్రించడం ఎలా? పై పేరాల్లో చెప్పుకున్నట్లు, మానవ అంతరంగంలో ఈ కోరిక అన్ని జంతుజాలాల కన్నా ఎక్కువగా, బలంగా ఉంది లైంగిక ఆకర్షణను తీవ్రంగా ప్రేరేపించే శక్తులు కేవలం మానవుడి అంతరంగంలోనే కాదు, బాహ్యంలో కూడా అసంఖ్యాకంగా ఉన్నాయి. ఈ విశాల ప్రపంచంలో లైంగికాకర్షణను ప్రేరేపించే సాధనాలకు కొదవలేదు. ప్రకృతి స్వయంగా దీనికోసం కొన్ని ఏర్పాట్లు చేసిపెట్టింది. మానవుడు కూడా తన బుద్ధిని, శక్తి సామర్థ్యాలను వినియోగించి ఈ కోరికలకు ఇంకా ప్రోత్సాహ మందించి నట్లయితే, తన మనో వాంఛల దాహం పెరిగి పొయ్యే వైఖరిని అవలంబించినట్లయితే, ఈ దాహాన్ని తీర్చుకునే మార్గాలు కూడా సుగమం చేసుకుంటూ పోతే, ఇది నిర్ణీత హద్దుల్ని అతిక్రమించి ఉల్లంఘనకు పాల్పడినట్లే. మానవుడిలోని మానవీయ కోణంపై పైశాచిక కోణం స్వారీ చేయడం మొదలుపెడు తుంది. ఈ పైశాచికత్వం అతని మానవత్వాన్ని, నాగరికతను మింగేస్తుంది. స్త్రీ పురుష సంబంధాల పునాదిలో, దాని చలనాల్లోని ఒక్కో విషయంలో ప్రకృతి ఎంతో మాధుర్యాన్ని ఉంచింది. కాని ముందే సూచన ప్రాయంగా వివరించినట్లు, ప్రకృతి ఈ మాధ్యుర్యాన్ని కేవలం నాగరిక నిర్మాణం కోసం మాత్రమే ఉద్దేశించింది. ఈ కోరిక హద్దులు మీరిపోవడం, మనిషి అందులోనే మునిగి తేలడం వల్ల కేవలం నాగరికతే కాదు, స్వయంగా మానవుడు కూడా వినాశనమయ్యే ప్రమాదం ఉంది. ఇలా ఒక్కసారి కాదు అనేక సార్లు జరిగింది. జరుగుతోంది. వినాశనమైన జాతుల చరిత్రను చూసినట్లయితే మితిమీరిన లైంగిక కోరికలే వారి పతనానికి కారణమని పిస్తోంది. వారి సాహిత్యం చాలా చవకబారుగా, అశ్లీలంతో కూడుకొని ఉండేది. వారి రచనలు, ఆలోచనలు, కథలు, కవిత్వం, వారి చిత్రలేఖనం, లలిత కళలు

వారి ప్రార్థనాలయాలు, వారి వీధులు, ఇవన్నీ దానికి సజీవ సాక్ష్యాలు. ఏ జాతులైతే ఇప్పుడు పతనం వైపుకు వెళుతున్నాయో, వాటి పరిస్థితి కూడా చూడండి. వారు తమ ఇంద్రియలోలత్వానికి, విశృంఖలత్వానికి ఆర్ట్ (కళ) పేరుతో ఎన్ని అందమైన నగిషీలు చెక్కినా, తాత్పర్యం మారినంత మాత్రాన వాస్తవమైతే మారిపోదు. సమాజంలో స్త్రీ, స్త్రీల కంటే ఎక్కువగా పురుషుల స్నేహాన్ని, పురుషుడు పురుషుల కంటే అధికంగా స్త్రీల సహచర్యాన్ని కోరుకుంటున్నారు. ఎందుకని? స్త్రీ పురుషుల్లో మితిమీరిన శృంగార భావనలు పెరిగి పోతున్నాయెందుకు? ఈ మిశ్రమ సమాజంలో స్త్రీ తన శరీర అవయవాలను బహిర్గత పరచడానికి గల కారణాలేమిటి? స్త్రీ తన ఒక్కో అవయవాన్ని విప్పి చూపించవలసిన అవసరం ఎందుకు ఏర్పడుతోంది? ఇది చాలక పురుషులు ఇంకా.. ఇంకా.. అని వ్యామోహంతో అర్రులు చాస్తున్న పరిస్థితి ఎందుకుంది? నగ్న చిత్రాలు, ప్రతిమలు, నగ్న ప్రదర్శనలు, పచ్చి అశ్లీలాన్ని అన్నిటికన్నా ఎక్కువగా ఇష్టపడుతున్నారెందుకు? చలన చిత్రాల్లో ప్రేమ, శృంగారం, విచ్చలవిడి పిచ్చిపాటలు హద్దులు మీరకపోతే అందులో మజాయే రాదెందుకు?

ఇవన్నీ విశృంఖలత్వానికి, ఇంద్రియలోలత్వానికి, కామాతురతకు నిదర్శనాలు కాకమరేమిటి? ఏ సమాజంలోనైతే ఈ విధమైనటువంటి అసహజ, అసమతుల్య లోలత్వం జనిస్తుందో దాని అంతిమ పరిణామం సర్వవినాశనం తప్ప మరేమవుతుంది?

ఇలాంటి వాతావరణంలో స్త్రీ పురుషులలో లైంగిక తీవ్రత పెరిగిపోతుంది. అధికంగా లైంగిక కార్యకలాపాల్లో పాల్గొన్న కారణంగా సంతతి బలహీనమైపోతుంది. శారీరకంగా, బుద్ధిజ్ఞానాల పరంగా ఎదుగుదల క్షీణిస్తుంది. వివేకం గందరగోళానికి గురవుతుంది. అశ్లీలత విచ్చలవిడిగా పెరిగిపోతే వ్యాధులు విజృంభిస్తాయి.[1]

1. *ఒకడాక్టర్ ఇలా రాస్తున్నాడు : యవ్వన ప్రారంభకాలం అనేక మార్పులతో ప్రారంభమవుతోంది. దేహ స్వభావంలోని విభిన్న కార్యాల్లో అప్పుడు ఒక విప్లవాత్మక స్థితి జనించి, అన్ని రకాలుగా పరిపక్వతకు చేరుకుంటుంది. ఆ కాలంలో మనిషికి ఆ మార్పులను భరించే, ఆ పరిపక్వతను, వికాసాన్ని సొంతం చేసుకోవడానికి పూర్తిస్థాయిలో తన శక్తి యుక్తులను ధారపోయవలసి ఉంటుంది. ఈ కారణంగానే ఆ సమయంలో వ్యాధులను ఎదుర్కొనే శక్తి కూడా మనిషిలో సన్నగిల్లుతుంది. సాధారణ వికాసం, అవయవాల వికాసం, దేహస్వభావాల్లోని ఈ సుదీర్ఘ మార్పుల కారణంగానే మనిషి శిశువు నుండి యువకుడిగా మార్పు చెందుతాడు. ఇది*

గర్భస్రావాలు, కుటుంబ నియంత్రణ, భ్రూణహత్యల్లాంటి రుగ్మతలు ఉద్యమ రూపాల్లో ఉనికిలోకొస్తాయి. స్త్రీ పురుషులు పశువుల్లా మసలుకోవడమే కాకుండా, అంతకన్నా వికృతంగా ప్రవర్తిస్తారు. ప్రకృతి మనిషికి ప్రసాదించిన ఉద్దేశ్యానికి, ప్రకృతి స్వభావానికి వ్యతిరేకంగా దుర్వినియోగపరుస్తూ ఆటవికతలో జంతువులతో పోటీ పడుతుంటారు. ఈ విధమైనటువంటి లైంగిక పైశాచికత్వం, అనాగరికత మానవీయ నాగరికతనే కాకుండా, స్వయంగా మానవత్వాన్నే సర్వనాశనం చేస్తుంది. ఇందులో కూరుకుపోయిన వారు నైతికంగా అథఃపాతాళానికి దిగజారిపోతారు.

ఇదే విధంగా లైంగిక వాంఛలను పూర్తిగా అణిచివేయాలనుకునే నాగరికత పరిణామం కూడా ఇలాగే ఉంటుంది. ఏ విధంగానైతే లైంగిక వాంఛలు విశృంఖల రూపం దాల్చడం వల్ల నష్టం కలుగుతుందో, అలాగే వాటిని అతిగా అణిచివేయడం వల్ల కూడా నష్టం సంభవిస్తుంది. ఏ నాగరిక వ్యవస్థ మానవుణ్ని బ్రహ్మచర్యం, సన్యాసత్వం వైపుకు తీసుకుపోతుందో అదే సహజ నైజంతో సంఘర్షిస్తుంది. అయితే ఆ నైజం మాత్రం తన వైరిపక్షం ముందు ఎన్నటికీ తలవాల్చదు. పైగా దాన్నే చిత్తుగా ఓడించివేస్తుంది. కేవలం బ్రహ్మచర్యం పునాదులపై ఎలాంటి వ్యవస్థా నిర్మితం

---

*మనిషిని ఎంత అలసిపోయేలా చేస్తుందంటే, ఈ క్రమంలో ఆరోగ్యం, నైజం, తీవ్రమైన సంఘర్షణలో మునిగిపోతుంది. ఈ పరిస్థితిలో అతనిపై ఏదైనా అసాధారణ భారాన్ని మోపడం ధర్మసమ్మతం కాదు. ప్రత్యేకించి, లైంగికకార్యం అత్యంత ప్రమాదకరం."*

*జర్మనీకి చెందిన ఓ ప్రఖ్యాత మానసిక నిపుణుడు ఇలా రాస్తున్నాడు: "స్త్రీ పురుష అవయవాలు కామోద్రేకాలతో సంబంధం కలిగి ఉన్నాయి. ఈ కారణంగా ఈ అవయవాలు మన మేధాశక్తిలోని ఓ పెద్ద భాగాన్ని తమలో ఇముడ్చుకోడానికి, లేక ఆక్రమించుకోడానికి ఎప్పుడూ కాచుకొని ఉంటాయి. ఒకవేళ వీటికి విజయం సమకూరినట్లయితే ఇవి మనిషిని నాగరిక కార్యకలాపాలకు బదులు వ్యక్తిగత కోరికలు తీర్చుకోవడంలో తలమునకలు చేస్తాయి. ఈ శక్తియుక్తుల స్థాయి వారికి మానవ దేహంలోనే సమకూరుతుంది. ఇది మనిషి యొక్క దాంపత్య జీవితాన్ని, కొద్ది ఏమరుపాటు సమయంలో సమతుల్య మార్గంనుండి అసమతుల్యం మార్గం వైపు గొనిపోయి, లాభానికి బదులు నష్టాలను మిగల్చగలదు. విద్యయొక్క అసలు ఉద్దేశ్యం ఈ ప్రమాదాన్నుండి కాపాడడమే అయి ఉండాలి."*

కాదన్నది సుస్పష్టం. ఎందుకంటే, నిజానికది సంస్కృతీ, నాగరికతలకు వ్యతిరేకి. అయితే బ్రహ్మచర్య భావనలను మనస్సుల్లో జనింపచేసి, నాగరిక సమాజంలో లైంగిక భావనలు లేని ఓ వాతావరణాన్ని సృజించవచ్చు. తద్వారా లైంగిక సంపర్కం స్వతహాగా ఒక అసహ్యకర కార్యం అన్న భావం అలాంటి సమాజంలో కలిగే అవకాశం ఉంది. లైంగిక కార్యానికి దూరంగా ఉండడం నైతికతకు నిదర్శనమని కూడా భావిస్తారు. శక్తినంతా ఉపయోగించి, అన్ని విధాలుగా ఈ వాంఛను కఠినంగా అణిచివేసే ప్రయత్నం జరుగుతుంది. కాని లైంగిక వాంఛలను అణచడమంటే, నిజానికి మానవత్వాన్ని అణిచివేయడమే. అయితే అదొక్కటే అణిగిపోదు. తనతోపాటు మానవుడి మేధ, శక్తి సామర్థ్యాలు, విజ్ఞాన వివేచనలు, ధైర్యస్థైర్యాలు, తదితర అన్ని సామర్థ్యాలతోపాటు అణిగిపోతుంది. ప్రకృతిసిద్ధమైన, సహజసిద్ధమైన లైంగిక వాంఛలను బలవంతంగా అణచివేయడం వల్ల అన్ని రకాల వికాసాలూ సద్దుమణిగిపోతాయి. ఏ విధమైనటువంటి సామర్థ్యం మిగిలి ఉండదు.

కనుక లైంగిక వాంఛలను విశృంఖలంగా వదిలేయడం, ఏక పక్షంగా అణిచిపారేయడం కాకుండా వాటిని సమతుల స్థితికి తీసుకురావడం, ఒక నిర్దిష్ట క్రమ పద్ధతిలో పటిష్ట పరచడం ఒక నాగరిక సమాజం యొక్క ప్రాథమిక విధి. సామూహిక జీవన వ్యవస్థ ఎలా ఉండాలంటే, మానవుడు తన భావాలు, అభిరుచులకనుగుణంగా సృష్టించుకున్న అసమతుల భావోద్రేకాలన్నింటినీ అడ్డుకొని, సహజసిద్ధమైన ప్రకృతి సిద్ధమైన భావోద్రేకాల సంతృప్తి కోసం సహజనైజానికి అనుగుణంగా, ప్రకృతి ఉద్దేశ్యాలకు విరుద్ధంకాని మార్గాలను ఎంచుకోవాలి.

## 2) కుటుంబ పటిష్టత

ఇక ఇప్పుడు, అసలు ప్రకృతి ఉద్దేశ్యం, లక్ష్యం ఏమిటి? అన్న ప్రశ్న సహజంగానే ఉత్పన్నమవుతుంది. ఈ విషయంలో ప్రకృతి మనల్ని ఎలాంటి మార్గదర్శకాలూ చేయకుండా గాలికొదిలేసిందా? గుడ్డిగా ఏదో ఒక వైఖరి అవలంబిస్తే అదే ప్రకృతి ఉద్దేశ్యం అయిపోతుందా? లేక ప్రకృతి యదార్థాలపై దృష్టి పెట్టి యోచన చేస్తే అసలు ఉద్దేశ్యాన్ని కనుగొనవచ్చా? కాని ఇవన్నీ ఏమీ పట్టించుకోకుండా చాలా మంది మొదటి విషయానికే ప్రాధాన్యతనిస్తారు. అందుకే వారు సహజ సిద్ధమైన ప్రకృతి నైజాన్ని పట్టించుకోకుండానే దేన్నిబడితే దాన్నే ప్రకృతి ఉద్దేశ్యం అని చెప్పేస్తుంటారు. కాని ఒక యదార్థవాది, వాస్తవాలపై దృష్టిసారించి, పరిశీలనకు

పూనుకున్నప్పుడు, కేవలం రెండడుగుల్లోనే ప్రకృతి తన ఉద్దేశ్యం ఇది అని స్పష్టంగా సంకేతాలిస్తున్నట్లు కనుగొంటాడు.

ఇతర అన్ని జీవరాసుల్లాగే, మానవుల్లో కూడా దాంపత్య సంబంధాలు, వారి మధ్య లైంగిక ఆకర్షణను జనింపజేయడంలో ప్రకృతి ప్రధాన ఉద్దేశ్యం మానవసంతతిని పరిరక్షించడం అన్న విషయం మనకు తెలిసిందే.

కాని ప్రకృతి మానవుల నుండి కేవలం సంతాన పరిరక్షణ, మానవజాతి ఉనికిని కాపాడడం వరకే కోరుకోవడం లేదు. అంతకుమించి మరెన్నో ఇతర కోరికలూ కోరుతోంది. ప్రకృతి ఉద్దేశ్యాన్ని అర్థం చేసుకుంటే, అవేమిటన్న విషయం మనకు తెలిసే అవకాశం ఉంది. మొట్టమొదట మన దృష్టిపడే వస్తువు ఏమిటంటే, ఇతర అన్ని జీవజాలాలకు భిన్నంగా మానవశిశువు చాలా ఎక్కువగా పరిరక్షణ కోరుకుంటాడు. పెంపకంకోసం ఎక్కువ సమయం తీసుకుంటాడు. ఇతర జీవరాసుల సంతానం చాలా తొందరగా తమ తల్లిదండ్రుల సంరక్షణ నుండి బయటకు వచ్చేస్తే, మానవ శిశువుకు ఈ కాలం చాలా ఎక్కువగా అవసరమవుతుంది. ఆహారాన్ని తీసుకోవడం, దాన్ని సమకూర్చుకునే స్థాయికి రావాలంటే అనేక ఏళ్లు పడుతుంది. మొదటి మూడు నాలుగేళ్లనుంచే అతను మరీ అశక్త స్థితిలో ఉండి, తల్లి కాస్త ఏమరుపాటులో ఉన్నా తన ఉనికే ప్రశ్నార్థకమైపోతుంది.

అయితే మానవుడు ఎంత అనాగరిక స్థితిలో ఉన్నా, ఎట్టి పరిస్థితిలోనూ పశువు మాత్రం కాడు. ఏదో ఒక స్థాయిలో అతడి జీవితంలో నాగరికత ఉండడం అనివార్యం. ఈ కారణంగా సంతాన పరిరక్షణలో ప్రకృతి ఉద్దేశ్యాల ప్రకారం తప్పనిసరిగా మరో రెండు విషయాలుకూడా అదనంగా వచ్చి చేరతాయి. ఒకటేమంటే, శిశువు పరిరక్షణలో, సంరక్షకునికి అందుబాటులో ఉన్న అన్ని నాగరిక అవకాశాలు, సాధనాలనూ వినియోగించుకోవాలి. రెండు : శిశువుకు ఎలాంటి శిక్షణ ఇవ్వాలంటే, ఏ నాగరిక వాతావరణంలో అతడు జన్మించాడో, అక్కడి నాగరిక వ్యవస్థను నడపడానికి, పూర్వీకుల స్థానం సంపాదించడానికి అతడు తయారు కాగలగాలి.

నాగరికత ఎంత గొప్పగా అభివృద్ధి చెందుతుందో, ఈ రెండు అవసరాలు కూడా అదేస్థాయిలో బలాన్ని సంతరించుకుంటూ పోతాయి. ఒక వైపు సంతాన పరిరక్షణకు అవసరమయ్యే సాధనాలు, అవకాశాలు పెరుగుతూపోతుంటే, మరోవైపు నాగరికత తన పరిరక్షణ, ఉనికిని కాపాడుకోవడం కోసం, తన స్థాయికి తగినట్లుగా,

మంచి విద్యాజ్ఞానాలు, సుశిక్షితులైన కార్యకర్తలను కోరుకుంటుంది. అంతేకాదు, తన ప్రగతీ వికాసాల కోసం రాబోవు సంతతి పూర్వ సంతతికంటే ఉత్తమంగా ఉండాలని అభిలషిస్తుంది. అంటే, స్పష్టంగా చెప్పాలంటే ప్రతి ఒక్కరూ తమ సంతానాన్ని తమకంటే ఉత్తములుగా తయారు చేయడానికి ప్రయత్నించాలన్నమాట. దీనికోసం తమ సొంత అభిప్రాయాలను పక్కనబెట్టి అత్యున్నత త్యాగాలకు సిద్ధపడవలసి ఉంటుంది.

ఇవీ, మానవనైజం అభిలషిస్తున్న సహజకోరికలు. ఈ కోరికల మొదటి సంబోధితురాలు స్త్రీ. పురుషుడు కొన్ని నిమిషాలపాటు స్త్రీతో సంయోగం చెంది ఆమెనుండి, ఆ కలయిక, బాధ్యతల నుండి శాశ్వతంగా తప్పుకోవచ్చు. కాని స్త్రీని మాత్రం ఆ కలయిక ద్వారా ఏర్పడే సహజ ఫలితం సంవత్సరాలపాటు, లేక జీవితాంతం వెంటాడుతూనే ఉంటుంది. గర్భం నిలిచిన తరువాత కనీసం ఐదు సంవత్సరాలపాటు ఈ ఫలితం ఆమెను ఎట్టి పరిస్థితిలోనూ వీడదు. ఒకవేళ అన్ని విధాలా సామాజిక బాధ్యతలు నెరవేర్చాలనుకుంటే, అదనంగా మరో పదిహేనేళ్లపాటు ఈ బాధ్యతనుండి తప్పించుకోలేదు. కేవలం కొన్ని నిమిషాల సుఖం కోసం పురుషునిలో లైంగిక సంపర్కంలో పాల్గొన్న ఫలితమిది. ఇద్దరు కలిసి జంటగా చేసిన పని బాధ్యతను కేవలం ఒక్కరే స్వీకరించడానికి ఎలా అంగీకరిస్తారన్నది అసలు ప్రశ్న. స్త్రీకి తన భాగస్వామి మోసం, భయం నుండి విముక్తి లభించినంత వరకు, తన శిశువు పరిరక్షణకు సంబంధించిన పూర్తి నమ్మకం కుదరనంత వరకు, స్వయంగా తన జీవితావసరాల పరిపూర్తికి సంబంధించిన భరోసా ఏదో ఒకస్థాయిలో లభించనంతవరకు, ఆమె ఇంతపెద్ద భారాన్ని మోయడానికి ముందుకెలా రాగలదు? భర్త, లేక సంరక్షకుడు లేకుండా గర్భం దాల్చిన స్త్రీకి ఆ గర్భం పెద్ద భారంగా, శాపంగా పరిణమిస్తుంది. అంతేకాదు అదొక పెద్ద ఆపద కూడా, దాన్నుండి విముక్తి పొందాలని సహజంగానే ఆమె మనసు కోరుకోవాలి. కోరుకుంటుంది కూడా. అలాంటప్పుడు అంతపెద్ద ఉపద్రవానికి ఆమె సంతోషంగా స్వాగతం ఎలా పలకగలుగుతుంది?

మొత్తానికి మానవజాతి ఉనికి సంరక్షణ, సంస్కృతీ నాగరికతల వికాసం అత్యంత ఆవశ్యకం. ఒక పురుషుడు ఒక స్త్రీతో సంభోగం జరిపి, ఆమె గర్భం దాల్చడానికి కారణమవుతాడు. ఈ క్రియలో ఇద్దరూ సమాన భాగస్వాములై, ఆ బాధ్యతాభారాన్ని మోయడానికి కూడా అతను ఇష్టపడతాడు. కాని ఈ సంబంధం

శాశ్వతత్వం సంతరించుకునేలా అతడ్ని ఒప్పించడం ఎలా? అతడైతే స్వతహాగా స్వార్థపరుడు. మానవజాతి సంరక్షణకు సంబంధించి, పురుషుడి పాత్ర స్త్రీతో సంపర్కం జరపడంతోనే ముగిసిపోతుంది. స్త్రీ గర్భం దాల్చడంతో అతని వంతు బాధ్యత తీరిపోతుంది. తరువాత అతడు అంతంతమాత్రంగానే ఆమెను అంటి పెట్టుకొని ఉంటాడు. లైంగికాకర్షణకూడా అదే స్త్రీతో అంటిపెట్టుకొని ఉండమని ఏమీ ఒత్తిడి చేయదు. అతను కోరితే ఆమెను వదిలేసి మరో స్త్రీ, ఆమెకాకపోతే మరొకరితో సంబంధాలు కొనసాగించగలడు. ఎక్కడ సారవంతమైన భూమి కనిపిస్తే అక్కడ విత్తనం నాటుకుంటూ వెళతాడు. కనుక ఈ వ్యవహారాన్ని అతని ఇష్టానికి వదిలివేసినట్లయితే, మహా సంతోషంతో ఈ బాధ్యతను స్వీకరిస్తాడు. ఎందుకంటే తన కష్టార్జితాన్ని ఆ స్త్రీ కోసం, ఆమె సంతానం కోసం ఖర్చు పెట్టమని ఎవరు ఒత్తిడి తెస్తున్నారుగనక. మరో అందాలరాశిని వదిలేసి, ఆ పాత ముఖాన్నే పట్టుకొని వేలాడాల్సిన అవసరం ఏముంది? ఒక పనికి రాని మాంసపు ముద్దను తన ఖర్చులతో ఎందుకు సాకాలి? రేయింబవళ్లు ఆ పిల్లవాడు చేసే అల్లరికి తన ప్రశాంతతను ఎందుకు భగ్నం చేసుకోవాలి?

అందుకే ప్రకృతి చాలా వరకు ఈ సమస్యను పరిష్కరించడానికి తగిన ఏర్పాట్లు చేసిపెట్టింది. స్త్రీ స్వభావంలో సౌందర్యం, మాధుర్యం, మనసు దోచే చాకచక్యం, ప్రేమకోసం త్యాగాలు చేసే శక్తియుక్తులు జనింపచేసింది. తద్వారా ఈ ఆయుధాలను ఉపయోగించి పురుషుడి స్వార్థపరత్వంపై సునాయాసంగా విజయం సాధించి అతన్ని తన బందీగా చేసుకోగలదు. అలాగే ప్రకృతి పసివానికి కూడా ఒక విచిత్రమైన వశీకరణ శక్తిని ప్రసాదించింది. అందుకే శిశువు ఎంత అసహ్యాకర, అసహాయ స్థితిలో ఉన్నా తల్లిదండ్రుల్ని తన ప్రేమ బంధంలోకి ఆకర్షించగలుగుతుంది.

అయితే కేవలం ఈ విషయాలే మానవులు తాము నైతిక, నాగరిక, ప్రాకృతిక బాధ్యతలను సంవత్సరాల తరబడి అనేక కష్టనష్టాలను, ఒడిదుడుకులను ఎదుర్కొంటూ నెరవేర్చడానికి ఉపకరించలేవు. ఎందుకంటే మానవుడికి అతని ఆగర్భ శత్రువు షైతాన్ ఎప్పుడూ వెన్నంటేఉంటాడు. అతన్ని సహజమార్గం నుండి తప్పించి వక్రమార్గం పట్టించడానికి ప్రతినిత్యం ప్రయత్నాలు చేస్తుంటాడు. వీడు తన వంచనా ఎత్తుగడలలో అన్నీ కాలాల్లో ప్రజల్ని రకరకాలుగా, వివిధ రకాల వంకలు, సాకులు చూపుతూ అనేక ఆకర్షణీయ ప్రలోభాలు సమకూర్చిపెట్టాడు.

మానవుల్ని - అంటే, స్త్రీ పురుషుల్ని జాతికోసం, జీవన విధానం కోసం, బంధాలకోసం త్యాగాలు చేసే వారుగా తీర్చిదిద్దిన ఘనత ధర్మానికే దక్కుతుంది. స్వార్థపరత్వంతో పశుప్రాయునిగా ఉన్నవాణ్ని మనిషిగా మార్చి త్యాగాలకోసం తయారు చేసింది ధర్మం. దైవం పంపినటువంటి ప్రవక్తలు ప్రకృతి స్వభావాన్ని పూర్తిగా అర్థం చేసుకొని స్త్రీ పురుషుల మధ్య సంబంధ బాంధవ్యాలు, నాగరిక జీవన విధానం కోసం 'నికాహ్'ను సరైన విధానంగా ముందుకు తెచ్చారు. వారు పంచినటువంటి నైతిక సూత్రాలు, నియమాల ఆధారంగానే మానవుల్లో ఈ బంధం కారణంగా ప్రతిఫలించే కష్టనష్టాలను భరించే మానసిక శక్తి జనించింది. లేకపోతే శిశువుకు తల్లిదండ్రులను మించిన శత్రువు మరెవరూ ఉండేవారు కాదేమో. ఇది వాస్తవం. వీరు ఏర్పరచిన నాగరిక జీవన విధానమే కుటుంబ వ్యవస్థకు నాంది పలికింది. ఈ పటిష్ట బంధమే యువతీ యువకుల్ని బాధ్యతాయుతమైన భాగస్వామ్య కార్యకలాపాలకు ప్రేరేపించింది. లేకపోతే యుక్తవయసులోని పైశాచిక కోరికలు కేవలం నైతిక బాధ్యతల భావన, బాహ్య క్రమశిక్షణ లేకుండా, వారిని స్వేచ్ఛాయుత లైంగిక కార్యకలాపాలనుండి కాపాడి ఉండేవి కావు. లైంగిక భావోద్రేకం స్వతహాగా సామూహికతకు వ్యతిరేకం. (Anthi-Social) ఇది స్వార్థం, ఒంటరితనం, విచ్చలవిడి, క్రమశిక్షణారాహిత్యాల సంగమం. ఇందులో విశాలత్వం, బాధ్యతాభావం, జవాబుదారీ తనాలు ఉండవు. కేవలం క్షణికానందం సాధనం మాత్రమే. కనుక ఈ భూతాన్ని సమాధిచేసి, ఒక మహత్తరమైన, సహనం, సౌశీల్యం, శ్రమ, త్యాగం, బాధ్యతాభావంతో ఒక మంచి సామాజిక జీవితాన్ని పొందడం అంతతేలిక విషయం కాదు. ఈ భూతాన్ని సీసాలో బంధించి, దాని విచ్చలవిడితనాన్ని, క్రమశిక్షణా రాహిత్యాన్ని ఆపాలంటే అది నికాహ్, కుటుంబ వ్యవస్థ ద్వారా మాత్రమే సాధ్యం. దీనికోసం స్త్రీ పురుషులు పరస్పరం సహకరించుకుంటూ, సమాన భాగస్వాములుగా సామాజిక జీవితం గడపడం ఎంతైనా అవసరం. ఇలా చేయకపోతే మానవుల నాగరిక జీవితం అంతమైపోతుంది. మానవుడు పశువుగా రూపొందుతాడు. చివరికి మానవజాతి ఆ జాబితానుండి కనుమరుగై పోతుంది.

అందుకని మానవజాతిని రక్షించు కోవాలంటే, ప్రకృతిసిద్ధమైన సహజ విధానాన్ని అనుసరిస్తూ నికాహ్ వ్యవస్థను ఆశ్రయించాల్సిందే. దీని ద్వారానే కుటుంబ

వ్యవస్థకు పునాదిపడాలి. ఈ విశాలమైన నాగరిక మానవ వ్యవస్థ మనుగడ సాగించడానికి కావలసిన వారు ఈ చిన్న కుటుంబాల నుండే ఉనికిలోకి రావాలి. ఇక్కడ యువతీ యువకులు యుక్త వయసుకు చేరుకోగానే, కుటుంబ యజమానులు వారికి సరైన ఉపయుక్తమైన జోడీలను అన్వేషించి వ్యవస్థ మనుగడకు చర్యలు చేపట్టగలగాలి. ఆ జంటల ద్వారా ఉనికిలోకొచ్చిన సంతానాన్ని ఉత్తములుగా తయారు చేయడానికి శాయశక్తులా ప్రయత్నించగలగాలి.

ప్రేమ, మమకారాలు పంచి బాధ్యతాయుతులుగా మలచడానికి కృషిచేయాలి. ప్రపంచంలో కేవలం తల్లిదండ్రుల్లో మాత్రమే ఈ భావన ఉండే అవకాశం ఉంది. తమ సంతానం తమకంటే ఉత్తమంగా, ఉన్నతంగా ఉండాలన్న భావన వారికి మాత్రమే ఉంటుంది. ఈ విధంగా వారు కాకతాళీయంగానో, యాదృచ్ఛికంగానో భవిష్యతరాలకు బంగారు బాట వేయడానికి శ్రమిస్తారు. ఈ ప్రయత్నంలో వారిలో అణు మాత్రమైనా స్వార్ధం ఉండదు. వారు తమకోసం ఏమి కోరుకోరు. తమ పిల్లల మేలు కోరుకుంటారు. ఇలాంటి భావాలు కల మానవులు ఈ వ్యవస్థలో మాత్రమే ఉండగలరు. దీన్ని కాదన్న మరే విధానంలోనైనా ఇలాంటి భావనలు మచ్చుకైనా కానరావు. అందుకే మానవ మనుగడకు, అత్యున్నత నాగరిక జీవన విధానానికి నికాహ్ వ్యవస్థ మినహా మరే విధానమూ సమ్మతం కాదు. ఇంతకంటే పవిత్రమైన, ఉన్నతమైన వ్యవస్థ మానవ సమాజంలో మరొకటి లేదు.

ప్రతి యేడూ మానవ సంతతిని, జీవన విధానాన్ని, నాగరికతను కాపాడుకోడానికి, క్రమ పద్ధతిలో ఉంచుకోడానికి, నికాహ్‌ద్వారా విస్తృత కార్యస్థానాలకు పునాదువేసి, సంతోషంగా, బాధ్యతగా ఈ సేవ చేయడానికి లక్షల, కోట్లమంది ప్రజల అవసరముంటుంది. ప్రపంచంలో నడుస్తున్న ఈ అద్భుతమైన కర్మాగారం ఈ విధంగానే మనుగడ సాగిస్తోంది. ఈ క్రమం ఇలా కొనసాగకపోతే మానవజాతి ప్రమాదంలో పడిపోతుంది. అందుకని ఈ సృష్టి కర్మాగారం ఇలా కొనసాగవలసిందే, ఒకరి తరువాత మరొకరు ఈ బాధ్యతను స్వీకరించవలసిందే.

ఈ విధంగా చూసినట్లయితే, నికాహ్ కేవలం ధర్మసమ్మతమైన మార్గంలో కోరికలు తీర్చుకునే విధానం మాత్రమే కాదని, నిజానికి ఇదొక సామాజిక బాధ్యత అని అర్థమవుతోంది. ఇది వ్యక్తిపై సామూహికతకు ఉన్న హక్కు. ఎందుకంటే ఒక వ్యక్తి తన ఇష్టప్రకారం నికాహ్ చేసుకోడానికి, చేసుకోకపోవడానికి అతనికి అనుమతి లేదు. అంటే వివాహం చేసుకోవడం, చేసుకోకపోవడం అతని నిర్ణయంపై ఆధారపడి

లేదు. ఎవరైతే బలమైన కారణం లేకుండా వివాహాన్ని తిరస్కరిస్తాడో, సమాజానికి అతను ద్రోహిగా (Parasites) పరిగణించబడతాడు. ఎందుకంటే, అతను భూమిపై తొలిశ్వాస మొదలుకొని యుక్త వయసుకు చేరుకునే దాకా పూర్వతరాలు సమకూర్చి ఉంచిన అసంఖ్యాక వస్తువుల ద్వారా ప్రయోజనం పొందాడు. వారు నెలకొల్పిన సంస్థల కారణంగానే అతనికి జీవితం లభించింది. వృద్ధివికాసాలు సాధించి మానవుడిగా అభివృద్ధి చెందే అవకాశం దొరికింది. ఈ క్రమంలో అతడు అంతా తీసుకోవడమే తప్ప సమాజానికి అతను ఇచ్చిందేమీలేదు.

ఒక స్థాయికి చేరిన తరువాత అతనెంతో ఉపకరిస్తాడనే ఉద్దేశ్యంతో సంఘం అతనికోసం ఎంతో చేసింది. కాని అతడు ఎదిగిన తరువాత స్వయం నిర్ణయాధికారమని మాట్లాడుతున్నాడు. నేను కేవలం నా కోరికలను తీర్చుకుంటాను, కాని వాటితో అనుసంధానమై ఉన్న బాధ్యతల భారం మాత్రం మోయలేను అంటాడు. ఇలాంటి వాడు సంఘానికి ద్రోహం తలపెడుతున్నాడు. అతని జీవితంలోని ప్రతిక్షణం ఒక అన్యాయం, అక్రమం, దౌర్జన్యం తప్ప మరేమీకాదు. సమాజానికి స్పృహ ఉన్నట్లయితే, ఇలాంటి దుర్మార్గుడ్ని త్యాగ ధనుడని కీర్తించేబదులు దోషిగా, జాతికి ద్రోహం తలపెట్టిన ద్రోహిగా చూస్తుంది. మనం కోరినా కోరకపోయినా, అంగీకరించినా అంగీకరించకపోయినా, మన పూర్వీకులు వదిలివెళ్లిన సమస్తానికీ మనం వారసులమయ్యాము. కనుక ఏ సహజ ప్రాకృతిక చట్టాల ప్రకారం మనకీ వారసత్వం లభించిందో, దాని ఉద్దేశ్యాన్ని ఇష్టమైతే నెరవేరుస్తామని, లేకపోతే వద్దని చెప్పే స్వేచ్ఛ, అధికారం మనకెక్కడిది?

## 3. విచ్చలవిడితనానికి అడ్డుకట్ట

వివాహం, కుటుంబ బంధంతోపాటు, వివాహేతర సంబంధాలకు అడ్డుకట్ట వేయడం కూడా చాలా అవసరం. ఎందుకంటే ఇలా చేయనట్లయితే ప్రకృతి నిర్దేశించిన వివాహం, కుటుంబ వ్యవస్థల ఉద్దేశ్యం పూర్తిగా నీరుగారి పోతుంది. పాతకాలం నాటి అజ్ఞానం మాదిరిగానే ఆధునిక విజ్ఞాన కాలంలో కూడా చాలామంది వ్యభిచారాన్ని ఓ సహజసిద్ధమైన చర్యగానే భావిస్తున్నారు. వారి దృష్టిలో వివాహం కేవలం ఒక మార్పు, లేక అదనపు సవరణ మాత్రమే. వారి అభిప్రాయం ప్రకారం ఏ విధంగానైతే ప్రకృతి మేకను పోతుకోసం, ఆడ కుక్కను మగకుక్క కోసం పుట్టించిందో, అలాగే స్త్రీని పురుషుడి కోసం పుట్టించింది. కనుక ఎప్పుడు, ఎక్కడ అవసరం

కలుగుతుందో, అవకాశం లభిస్తుందో, అప్పుడు, అక్కడ ఇద్దరూ ఇష్టపడి సంపర్కం జరుపుకోవచ్చు. కాని వాస్తవం ఏమిటంటే ఇది మానవ నైజాన్ని పూర్తిగా వక్రీకరించి చెప్పే దృష్టాంతమే. వారు మానవుడ్ని ఓ పశువు కింద జమకట్టారు. అందుకే వారు నైజాన్ని గురించి మాట్లాడినప్పుడల్లా వారి ఉద్దేశ్యం పశు నైజమే కాని, మానవనైజం కాదు. ఏ విచ్చలవిడి శృంగారాన్ని వారు సహజనైజం అంటున్నారో, అది పశుపక్ష్యాదులకు సహజనైజమే. కాని మానవులకు మాత్రం కాదు. ఇలాంటి వారు మానవ నైజానికి మాత్రమే కాకుండా అంతిమ ఫలితం రీత్యా మానవ స్వభావంలో నిబిడీకృతమై ఉన్న పశునైజానికి కూడా వ్యతిరేకమే. ఎందుకంటే మానవుడిలో మానవత్వం దానవత్వం రెండూ వేరువేరుగా లేవు. ఒకే ఉనికిలో రెండూ కలగలసి ఒక వ్యక్తిత్వాన్ని తయారు చేస్తాయి. రెండింటి అవసరాలు పరస్పరం ఒకదానితో ఒకటి ఎలా అనుసంధానమై ఉంటాయంటే, ఒకదాని ఉద్దేశ్యాన్ని తిరస్కరించడం జరిగితే, రెండవదాని ఉద్దేశ్యం కూడా దానంతట అదే నీరుగారి పోతుంది.

వివాహం చేసుకున్నా చేసుకోకపోయినా, వ్యభిచారం సంతాన పరిరక్షణ ఉద్దేశ్యాన్ని నెరవేరుస్తుంది కదా! అని ఆలోచిస్తాడు భోగలాలసుడైన మనిషి. వ్యభిచారంలో మనిషి ఏమనుకుంటాడంటే, ఇది కనీసం పశునైజ అవసరాన్నయినా పూర్తి చేస్తోంది కదా. ఎందుకంటే మానవజాతి పరిరక్షణకు లైంగిక సంపర్కం ఎంతైనా అవసరం. కాని ఇంతకుముందే విన్నవించినట్లు ఈ క్రియ ఏవిధంగా మానవ నైజాన్ని నష్టపరుస్తుందో, అదే విధంగా పశునైజాన్ని కూడా దెబ్బతీస్తుంది. మానవ నైజం కోరుకునేదేమిటంటే, స్త్రీ పురుష సంబంధాల్లో నిలకడ, స్థిరత్వం ఉండాలి. ఎందుకంటే తద్వారా శిశువును తల్లి తండ్రి ఇద్దరూ కలసి పరిరక్షిస్తారు. ఒక సుదీర్ఘ కాలం వరకు తండ్రి శిశువునే కాకుండా, తల్లిని కూడా సంరక్షిస్తూ ఉండగలగాలి. ఒకవేళ శిశువు విషయంలో అతనికి అనుమానం తలెత్తితే శిశువు తనదోకాదో అనుకుంటే సంరక్షణా బాధ్యతలు మోయడానికి అతను ముందుకు రాడు. తన వారసుడుగా అతణ్ని ఎట్టి పరిస్థితిలోనూ అంగీకరించడు. ఇదేవిధంగా స్త్రీకి కూడా పురుషుడు తనను గర్భవతిని చేసి, తనను తన బిడ్డను సంరక్షించడన్న అనుమానం కలిగితే, ఆమె గర్భం దాల్చడానికే సిద్ధపడదు. ఒకవేళ శిశువు సంరక్షణలో తల్లిదండ్రులు నిర్లక్ష్యం వహిస్తే అతని విద్యాబుద్ధులు, నైతిక సంస్కరణ ఎట్టి పరిస్థితిలోనూ కొనసాగవు. మానవ నాగరికతకు పనికొచ్చే వ్యక్తిగా అతను

ఎదగలేడు. ఈ విలువలన్నీ మానవ అవసరాలకు తప్పనిసరి. వీటి పట్ల నిర్లక్ష్యం వహించి, కేవలం పశువుల్లా స్త్రీ పురుషులు తాత్కాలిక సంబంధాలు నెలకొల్పుకుంటే, అవి స్వయంగా పశునైజ అవసరాల పట్ల కూడా ఏమరుపాటు నిర్లక్ష్యం వహించడమే. ఎందుకంటే ఆ సమయంలో అవేవీ వారికి పట్టవు. అప్పుడు కేవలం మనోవాంఛల సంతృప్తి, లైంగికానందం మాత్రమే వారిపై స్వారీ అయి ఉంటాయి. ఇది పూర్తిగా ప్రకృతి స్వభావానికి వ్యతిరేకం.

ఆధునిక సోకాల్డ్ మేధావులు సైతం ఈ కోణాన్ని కూడా బలహీనంగానే చూస్తారు. అందుకని వారు దీనికి మరో తర్కం జోడించి, సంఘంలోని ఇద్దరు వ్యక్తులు పరస్పర అంగీకారంతో కొన్ని క్షణాలు ఆనంద తరంగాల్లో తేలియాడితే ఈ సమాజానికి వచ్చే నష్టమేమిటి? అని ప్రశ్నిస్తారు. సమాజానికి ఎలాంటి నష్టం లేనప్పుడు మధ్యలో వాళ్లు జోక్యం చేసుకోవాల్సిన అవసరం ఏమిటి? ఒకవేళ పరస్పరం అంగీకారం లేకుండా ఒకర్నొకరు బలవంతం చేస్తున్నప్పుడు లేక వంచనతో మోసగిస్తున్నపుడు సమాజానికి అడ్డుకునే అధికారం తప్పక ఉంటుంది. లేక సంఘ వ్యతిరేకతకు పాల్పడినా అడ్డుకునే హక్కు ఉంటుంది. కాని ఇదేమీ లేనప్పుడు, కేవలం ఇద్దరు స్త్రీ పురుషుల మధ్య జరిగే ఆనందానుభూతుల వ్యవహారంలో కల్పించుకునే హక్కు, పరస్పర అంగీకారంతో జరిగే రసానందాన్ని అడ్డుకునే హక్కు సొసైటీకి ఎక్కడిది? ప్రజల ప్రైవేటు వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం వ్యక్తి స్వేచ్ఛను భంగం పరచడం మాత్రమే కాదు, అసలు ఆ పదానికి అర్థమే లేకుండా చేయడమే అని వారు తర్కిస్తారు.

వ్యక్తి స్వేచ్ఛకు సంబంధించిన ఈ భావన 18, 19వ శతాబ్దపు అజ్ఞాన భావనల్లో ఒకటి. విద్యాపరిశీలనల తొలికిరణం ప్రసరించగానే ఈ అజ్ఞాన తిమిరం పటాపంచలైపోతుంది. కాస్త మనసుపెట్టి ఆలోచిస్తే వ్యక్తి స్వేచ్ఛకు సంబంధించిన ఇలాంటి డిమాండుకు సామాజిక జీవితంలో చోటే లేదని తేలిపోతుంది. ఒకవేళ ఎవరైనా ఇలాంటి స్వేచ్ఛను కోరుకుంటే, వారు అడవుల్లోకి వెళ్లి జంతువుల్లా జీవనం సాగించవచ్చు. నిజానికి మానవ సమాజం కొన్ని విలువలు, విధానాలకు కట్టుబడి ఉంటుంది. ఇలాంటి సమాజంలో ఒకవ్యక్తి అనేకమందితో సంబంధాలు కలిగి ఉంటాడు. ఒకరి ప్రభావం అనేకులపై పడుతుంది. ఇతరుల ప్రభావమూ అతనిపై పడుతుంది. ఈ పరస్పర సంబంధ బాంధవ్యాల్లో ఒక మనిషి చేసే ఏ పనీ కేవలం అతని వ్యక్తిగత వ్యవహారమని చెప్పలేము. ఒకవ్యక్తి చేస్తున్న పని మొత్తం సమాజంపై

కూడా ప్రభావం చూపవచ్చు. అందుకని వ్యక్తిగతంగా ఎవరేమి చేసుకున్నా దాని ప్రభావం సమాజంపై పడదని వాదించడం ఎంతమాత్రం సమర్ధనీయం కాదు.

కనుక ఒక స్త్రీ ఒక పురుషుడు పరస్పర అంగీకారంతో ఒక రహస్య ప్రదేశంలో తమ వాంఛను తీర్చుకుంటే, ఆ ప్రభావం సామాజిక జీవితంపై పడదనడం ఏమాత్రం పరిపక్వతలేని పిచ్చిప్రేలాపన మాత్రమే తప్ప మరేం కాదు. నిజానికి ఆ ప్రభావం కేవలం మానవ సమాజంపైనే కాదు నేరుగా మానవత్వంపైన్నే పడుతుంది. అంతేకాకుండా అది కేవలం వర్తమానానికి కూడా పరిమితం కాదు. భవిష్యత్తరాలపై కూడా ఆ దుష్ట ప్రభావం పడి తీరుతుంది. ఏ సామాజిక సంబంధాల్లో మానవాళి బంధించబడి ఉందో, దాన్నుండి ఏ వ్యక్తీ, ఏ పరిస్థితిలోనూ వేరుగా ఉండజాలడు. ఏకాంతంలో నాలుగు గోడల మధ్య ఉన్నా నలుగురిలో ఉన్నట్లు సామాజిక జీవితం గడపాల్సిందే. అలాకాక ఏకాంతంలో తప్పుడు కార్యాలకు, పాపకార్యాలకు ఒడిగడితే, తన శక్తి సామర్థ్యాలను వ్యర్ధపరుచుకుంటూ ఉంటే, నిజానికి తను సామాజిక జీవనానికి తూట్లు పొడిచి మానవుల హక్కులు కాలరాసి, సంఘాన్ని నైతికంగా, భౌతికంగా అన్ని రకాలా నష్టపరచడంలో నిమగ్నమైనట్లుగా భావించాల్సి ఉంటుంది. అతను తన స్వార్థం స్వలాభం కోసం సంఘంలో తనూ ఒక సభ్యుడిగా గుర్తించడానికి కారణమైన అన్ని వ్యవస్థకు స్వయంగా చేయూతనిచ్చి ఆదుకోడానికి బదులు దెబ్బతీస్తున్నట్లు అనుకోవాల్సి ఉంటుంది. సంఘంలో పంచాయితీ నుండి పార్లమెంటు వరకు, ప్రాథమిక స్థాయి నుండి సైన్య వ్యవస్థ వరకు, కార్యాలయాల నుండి ప్రయోగ శాలల వరకు ఎన్ని సంస్థలైతే ఉన్నాయో అన్నీ వాటినుండి ప్రయోజనం పొంది, వాటి ప్రగతీ వికాసాల్లో తమ భాగస్వామ్యాన్ని ప్రతివ్యక్తి అందిస్తారన్న నమ్మకం విశ్వాసంతో మనుగడ సాగిస్తున్నాయి. కాని ఎప్పుడైతే ఈ నమ్మకద్రోహి తన లైంగిక సామర్థ్యాన్ని సంతానం, భవిష్యత్తు, శిక్షణ విలువలు నాగరికత లాంటి బాధ్యతల నిర్వహణకోసం కాకుండా, కేవలం స్వార్థం కోసం క్షణికానందం కోసం ఉపయోగించి నట్లయితే, వ్యక్తిగతంగా అతడు ఒకే వేటుతో మొత్తం వ్యవస్థనే తుదముట్టించిన వాడవుతాడు. ఈ రకంగా అతను స్వయంగా తానొక సభ్యుడిగా ఉన్న సాంఘిక, సామాజిక ఒప్పందాన్నే ఉల్లంఘించాడు. అతను తన భారం తానే మోసే బదులు భారమంతా ఇతరులపై నెట్టే ప్రయత్నం చేశాడు. ఇలాంటి వ్యక్తి ఎంతమాత్రం

సంఘ శ్రేయోభిలాషి కాలేదు. అతనొక దొంగ, ద్రోహి, అతనితో సంబంధాలు కొనసాగించడం మొత్తం మానవాళి పట్ల దౌర్జన్యం చేయడమే.

సాంఘిక జీవితంలో వ్యక్తి స్థానం ఏమిటన్నది ముందుగా అర్థం చేసుకోవాల్సిన విషయం. మన శరీరంలో, స్వభావంలో ఉన్నటువంటి ఒక్కొక్క శక్తి కేవలం మన ఒక్కరి కోసమే కాదు. మొత్తం మానవుల కోసం మనవద్ద అమానతుగా ఉంది. ఈ విషయంలో మొత్తం మానవాళి తరపున మనం బాధ్యత వహించవలసి ఉంటుంది. మనం మన ప్రాణాన్ని గాని, లేక మరే శక్తిసామర్థ్యాలనైనా వృథా చేస్తే, లేక తప్పుడు నిర్ణయాల వల్ల మనకు మనమే నష్టపరచుకుంటే, మన ప్రాణం కాబట్టి మనం తీసుకుంటే, మన శక్తిసామర్థ్యాలు కాబట్టి మనం వృథా చేసుకుంటే, మనమే నష్టపరచుకుంటే దీని ప్రభావం తప్పకుండా సమాజంపై పడుతుంది. మన ప్రాణం కాబట్టి మనకు దాన్ని తీసుకునే హక్కు ఉంది, శక్తి సామర్థ్యాలు మనవే కాబట్టి మన ఇష్టానుసారం వాటిని వృథా చేసుకునే అధికారం మాకుంది అనడానికి వీల్లేదు. ఇలా చేయడం మొత్తం మానవాళికి సంబంధించి మన వద్ద ఉన్న అమానతును వృథా చేయడం, తద్వారా మానవాళినంతటినీ నష్టపరచడమే అవుతుంది. ఎందుకంటే, ఇతరులు తమ బాధ్యతను సక్రమంగా నిర్వహించి, ఎంతో శ్రమపడి వారి జీవితంలోని వెలుగును మనకు పంచారు. తరువాత ప్రభుత్వ వ్యవస్థలు రక్షణ కల్పించాయి. ఆరోగ్యపరమైన అవసరాలు తీర్చాయి. లక్షల కోట్లమంది ప్రజలు మనల్ని ఆదుకున్నారు. అన్ని రకాల సామాజిక వ్యవస్థలన్నీ కలిసి మనశక్తి సామర్థ్యాలను ఉత్తమంగా తీర్చిదిద్ది మంచి శిక్షణ ఇవ్వడానికి ప్రయత్నించాయి. ఇన్ని వ్యవస్థలు కలిసి తీర్చిదిద్దిన తరువాతనే ఇప్పుడు మనం మనంగా ఉన్నాము. ఏ ప్రాణం నిలిచి ఉండడానికి, ఏ శక్తి సామర్థ్యాలు పరిపూర్ణంగా వికసించడానికి ఇతరుల పాత్ర ఎంతో గణనీయంగా ఉన్నప్పుడు, అదంతా విస్మరించి మనం వాటిని వృథా చేస్తామనడం ప్రయోజనకరంగా మలచుకునే బదులు, నష్టపరచుకుంటా మనడం ఎంతవరకు సమంజసం? ఎంతవరకు సమర్థనీయం? ఈ కారణంగానే ఆత్మహత్య నిషిద్ధం అని చెప్పడం జరిగింది. హస్తప్రయోగం చేసే వారిని ఈ కారణం గానే ప్రపంచ ప్రఖ్యాత వైద్యులు పైశాచికులన్నారు. అందుకే స్వలింగ సంపర్కం అత్యంత దుష్ట కార్యమని నిర్ణయించారు. ఈ కారణంగానే వ్యభిచారం కూడా వ్యక్తిగత సంతోషం కాదు మొత్తం మానవాళిపైనే దౌర్జన్యమని చెప్పడం జరిగింది.

ఒక్కసారి ఆలోచించండి. వ్యభిచారం వల్ల ఎన్ని సామాజిక రుగ్మతలు ముడిపడి ఉన్నాయో ఆలోచించండి.

1) మొట్టమొదట, ఒక వ్యభిచారి అనేక రోగాలకు లోనయ్యే ప్రమాదం ఉంది. దీనివల్ల అతని శారీరక శక్తి సామర్థ్యాలన్నీ నిర్వీర్యమై, తద్వారా ఆ ప్రభావం మొత్తం మానవజాతిని నష్టానికి గురిచేసే అవకాశం ఉంది. అనేక రోగాలు అతణ్ని చుట్టుముట్టే ప్రమాదంతోపాటు, అనేక భయంకర వ్యాధులు కూడా అతణ్ని కబళిస్తాయి. ఇది ఒక్కడికే పరిమితం కాదు. అతడి ద్వారా అనేక మందికి ఈ వ్యాధులు అంటుకొనే ప్రమాదం కూడా ఉంది. ఫలితంగా అతడి సంతానం, తరువాత వారి సంతానం ఈ విధంగా ఈ వ్యాధుల పరంపర కొనసాగుతుంది. ఇదంతా అతను సామాజిక కట్టుబాటు, ధర్మాన్ని కాదని, వక్రమార్గంలో మనోవాంఛలు తీర్చుకున్న ఫలితం.

2) ఇలాంటి భయంకర వ్యాధుల్లో కూరుకుపోకపోయినా, అనేక రుగ్మతల నుండి, అనైతికతల నుండి సురక్షితంగా ఉండడం మాత్రం అసంభవం. నిస్సిగ్గు, మోసం, వంచన, అబద్ధం, దుర్బుద్ధి, స్వార్థం, మనోవాంఛల దాస్యం, నిగ్రహశక్తి లోపించడం, దురాలోచన, నమ్మకద్రోహం, ఇవన్నీ వ్యభిచారమనే పాపంలో కూరుకుపోయిన వారి సహజ లక్షణాలు, దాని దుష్ఫలితాలు. ఇలాంటి దుర్గుణాలను తనలో పెంచిపోషించుకుంటున్న మనిషి, తన బలహీనతలను తన మనోవాంఛల వరకే పరిమితం చేసుకోలేడు. జీవితంలోని అన్ని రంగాల్లో అతని తరఫున ఇలాంటి కానుకలే సమాజానికి లభిస్తాయి. సమాజంలోని ఎక్కువ మందిలో గనక ఈ దుర్గుణాలు ప్రవేశిస్తే, దీని ఫలితంగా సాహిత్యం, క్రీడలు, పారిశ్రామికం, పర్యాటకం, సామాజికం, ఆర్థికం, రాజకీయం, న్యాయవ్యవస్థ, సైన్యం, పాలనా నిర్వహణ తదితర అన్ని రంగాలూ ఎంతో కొంత ప్రభావితమవుతాయి. ప్రత్యేకించి ప్రజాస్వామ్య వ్యవస్థలోనైతే వ్యక్తుల ఒక్కొక్క నైతిక ఆచరణ మొత్తం జనజీవనాన్నే ప్రభావితం చేస్తుందనడంలో సందేహంలేదు. ఏ జాతిలోనైతే అధికశాతం మంది ప్రజలు త్యాగం, సహనం, పరోపకారం, నిగ్రహం, క్రమశిక్షణ, నైతికత లాంటి మానవీయ సుగుణా లకు దూరంగా ఉంటారో, అలాంటి వారి పాలనలో రాజకీయ వ్యవస్థలో పటిష్టత, సమన్యాయం, పారదర్శకత ఎలా సాధ్యమవుతుంది?

3) వ్యభిచారం చట్టబద్ధమైనప్పుడు, సమాజంలో వేశ్యావాటికల అవసరం కూడా అనివార్యంగా ఏర్పడుతుంది. ఒక యువకుడికి 'విలాసాలు' చేసుకునే హక్కుండాలని అనేవారు, దాంతోపాటు సంఘజీవితంలో ఇలాంటి అవసరాలు తీర్చడానికి అన్ని విధాలా అధమస్థాయిలో ఉండే స్త్రీల వర్గం కూడా ఒకటుండాలని అంటారు. అయితే ఈ స్త్రీలు ఎక్కడినుండి ఊడిపడతారు. ఇదే సమాజం నుండి రావాలి గదా! అంటే ఎవరో ఒకరికి తల్లి మరెవరో ఒకరికి చెల్లి. ఒక్కో ఇంటికి రాణి, ఒక్కో కుటుంబానికి సంరక్షకురాలు, అనేకమంది పిల్లల శిక్షకురాలు. కావలసిన లక్షలాది మంది స్త్రీలను తీసుకొచ్చి బజారుల్లో కూర్చోబెట్టవలసి ఉంటుంది. మున్సిపాలిటీ వారి టాయిలెట్ల మాదిరిగా, వారు ఆవారాగాళ్ళ అవసరాలు తీర్చే యంత్రాలుగా మారాలన్నమాట. ఈ విధంగా స్త్రీలకున్నటువంటి ప్రత్యేకతలన్నీ వారినుండి లాక్కోబడతాయి. ప్రేమ, అందం, మనస్సు శరీరమంతా ఇతరులకు సమర్పించుకొని వారి వాంఛలు తీర్చే యంత్రాలుగా, వారి చేతిలో బొమ్మలుగా మారాలి.

4) వ్యభిచార కార్యకలాపాల వల్ల నాగరిక విధానమైన నికాహ్ (వివాహం) పద్ధతికి అనివార్యంగా నష్టం వాటిల్లుతుంది. అంతేకాదు చివరికి నికాహ్ విధానం అంతమై కేవలం వ్యభిచారం ఒక్కటే మిగిలినా ఆశ్యర్యం లేదు. వ్యభిచారానికి అలవాటు పడ్డ స్త్రీ పురుషుల్లో సమర్థవంతమైన దాంపత్య సంబంధాలు ఉండవు. ఎందుకంటే స్వేచ్ఛా శృంగారం వల్ల వారి మధ్య అపనమ్మకం, అనుమానాలు జనిస్తాయి. ఒక ఫలవంతమైన దాంపత్య జీవితానికి ఇవన్నీ అడ్డుగోడలుగా పరిణమిస్తాయి. ఇలాంటి వారు ఒక దాంపత్య బంధం పరిధిలోకి వచ్చినా, వారి మధ్య కావలసినంత సఖ్యత, స్వచ్ఛత, పరస్పర నమ్మకం, స్నేహపూర్వక సంబంధాలు మాత్రం ఉండవు. ఒక సంతోషకరమైన గృహ వాతావరణం గాని సత్సంతానం గాని ఉనికిలోకి వచ్చే అవకాశాలు ఉండవు.

అలాగే, ఎక్కడైతే వ్యభిచారానికి సునాయాస మార్గాలుంటాయో అక్కడ నాగరిక, సాంప్రదాయ నికాహ్ విధానం కనుమరుగైపోతుంది. ఎందుకంటే ఎలాంటి బాధ్యతలు, బాదరబందీలు లేకుండానే మనోవాంఛలు సంతృప్తిగా తీరుతుంటే నికాహ్ లాంటి బాధ్యతను నెత్తుకెత్తుకోడానికి ఎవరు మాత్రం ముందుకొస్తారు?

5) వ్యభిచార దురాచారం వల్ల కేవలం నాగరికతేకాదు, మానవ సంతతి మూలాలు కూడా అంతమైపోతాయి. స్వేచ్ఛాయుత శృంగార సంబంధాల్లో స్త్రీ పురుషులెవ్వరిలోనూ భవిష్యత్తరాల సంరక్షణ, సేవ అన్న భావమే ఉండదు.

6) వ్యభిచారం వల్ల మానవులకు, మానవ సమాజానికి సంతానం లభించినా వారు అక్రమ సంతానం అనబడతారు. కొంతమంది అమాయకులు భావిస్తున్నట్లు, సంతానం విషయంలో ధర్మాధర్మాల విచక్షణ కేవలం ఒక ఉద్రేకపూరిత విషయం ఎంతమాత్రం కాదు. నిజానికి అనేక కారణాల వల్ల అక్రమ సంతానాన్ని కనడం, స్వయంగా ఆ శిశువు పట్లనే కాకుండా, మొత్తం మానవ నాగరికతపైనే ఘోరమైన దౌర్జన్యం అవుతుంది. మొదటి విషయం ఏమిటంటే, తల్లిదండ్రులు కేవలం పైశాచిక ఉద్రేకంలో వాంఛలు తీర్చుకునే క్రమంలో ఇలాంటి శిశువుకు బీజం పడుతుంది. వివాహ బంధంతో ఒక్కటై న జంట లైంగిక కార్యంలో పాల్గొన్నప్పుడు వారిలో వ్యక్తమయ్యే మానవీయ, పవిత్ర భావనలు, మానసిక ఆనందం, అక్రమ సంబంధం నెరిపే జంటల్లో ఎన్నటికీ ప్రాప్తంకాదు. ఒక పశుప్రాయమైన కామోద్రేకం మాత్రమే వారిని ఏకం చేస్తుంది. 'ఆ' సమయంలో అన్నిరకాల మానవీయ ప్రత్యేకతలు వారి నుండి దూరమైపోతాయి. కనుక అక్రమ సంబంధం ద్వారా జన్మించిన శిశువు సహజసిద్ధంగా పశుప్రవృత్తినే వారసత్వంగా అందిపుచ్చుకుంటుంది. తల్లిదండ్రులకు ఒక గుదిబండగా పరిణమించిన ఆ శిశువును అక్కున చేర్చుకోవడం వారికి చాలా భారమవుతుంది. అలాంటి శిశువుకు తండ్రి ప్రేమ ఏమాత్రం అందే అవకాశం లేదు. కేవలం అతంతమాత్రపు తల్లి ప్రేమకు మాత్రమే ఆ శిశువు పరిమితం కావలసి వస్తుంది. తాతయ్య, అమ్మమ్మ నానమ్మ, బామ్మ, పిన్ని, బాబాయి, అత్తయ్య మామయ్యలు ఇతర కుటుంబీకుల పర్యవేక్షణ, ప్రేమానురాగాలు ప్రాప్తం కావు. మొత్తంగా ఇలాంటి శిశువు ఒక అసంపూర్ణ మానవుడుగానే తయారవుతాడు. అతడి శీల నిర్మాణం జరగదు. అతని శక్తిసామర్థ్యాలూ వికసించవు. అతడు స్వయంగా అసంపూర్ణుడు, అసహాయుడు పీడితుడు కావడం మూలాన సమాజానికి ఏవిధంగానూ ఉపకరించడు. ఒకవేళ కాస్తోకూస్తో పనికొచ్చినా సక్రమ సంతానానికి సరితూగలేడు.

స్వేచ్ఛాశృంగారాన్ని సమర్థించేవారు ఏమంటారంటే, పిల్లల ఆలనా, పాలనా, శిక్షణ విద్యాబుద్ధులు గరపడానికి ఒక జాతీయ వ్యవస్థ ఉండాలి. అది ఇలాంటి అక్రమ సంతానాన్ని పెంచిపోషించి సమాజ సేవకు పనికొచ్చేవిధంగా తీర్చిదిద్దాలి. అంటే, స్త్రీ పురుషుల స్వేచ్ఛ, వారి ఏకాంతం సురక్షితంగా ఉండాలి. వివాహ

సంబంధమనే జంజాటం లేకుండానే వారి మనోవాంఛలు, లైంగిక కోరికలు తీరాలి. తద్వారా కలిగే సంతానం వల్ల మానవ మనుగడకూ విఘాతం కలగకూడదు. ఇదీ ఇలాంటి ప్రతిపాదన చేసే వారి అసలు ఉద్దేశ్యం. కాని, ఆశ్చర్యకర విషయం ఏమిటంటే ఎవరైతే ప్రస్తుత తరం స్వేచ్ఛగా విహరించాలని కోరుకుంటున్నారో వారు భవిష్యత్తరాలకోసం ఒక జాతీయ విద్యావ్యవస్థనో, లేక ప్రభుత్వ పరంగా శిక్షణా కేంద్రాలు కావాలని ప్రతిపాదిస్తున్నారో, వాటిలో స్వేచ్ఛాభావన, వ్యక్తిత్వ వికాసాలకు ఏమాత్రం అవకాశం ఉండదు. ఇలాంటి వ్యవస్థలో వేలు, లక్షల సంఖ్యలో ఒకేసారి, ఒకే మూసలో, ఒకే పద్ధతి ప్రకారం ఉనికిలోకొస్తారు కాబట్టి పిల్లల వ్యక్తిత్వం, ఎప్పుడూ వికసించదు. ఇక్కడ అధికశాతం ఒకేరకమైన పోలిక ఉంటుంది. ఈ కర్మాగారం నుండి పిల్లలు ఒకేరకమైన వ్యక్తిత్వంతో ఉనికిలోకొస్తారు. ఏవిధంగా నైతే ఒక పెద్ద ఫ్యాక్టరీ నుండి ఇనుప ముక్కలు ఒకే మూసలో బయటికొస్తాయో అలా! మానవునికి సంబంధించి ఈ బుద్ధిహీనుల భావనలు ఎంతనీచంగా ఉన్నాయో ఆలోచించండి. వీళ్లు బాటా చెప్పుల్లాగా మానవుల్ని తయారు చేయాలనుకుంటున్నారు. శిశువు రూపాన్ని వ్యక్తిత్వాన్ని తయారు చేయడం ఒక అందమైన కళ అని ఈ అజ్ఞానులకేం తెలుసు? ఈ కళ ఒక చిన్న పరిశ్రమలోనే సాధ్యమవుతుంది. చిన్న పరిశ్రమల్లో కళాకారుని దృష్టి ఒకే బొమ్మపై కేంద్రీకృత మవుతుంది. పెద్ద కర్మాగారాల్లోనైతే అనేకమంది కూలీలు ఒకే మూసలో లక్షల సంఖ్యలో కళాఖండాలను తయారు చేస్తారు. ఒక కళాకారుడు ఒక కళాఖండంపై శ్రద్ధను కేంద్రీకరించి తయారు చేసిన దానికి, అనేకమంది లక్షలాది కళాఖండాలను ఒకే రకంగా ఏక కాలంలో తయారు చేసిందానికి ఎంతతేడా ఉంటుందో ఒక్కసారి ఆలోచించండి. అలాంటి కళాఖండాల్లో ఎంతమాత్రం నైపుణ్యం గాని, నాణ్యతగాని ఉండదు.

అయితే జాతీయ విద్యావ్యవస్థ ద్వారా పిల్లల పరిరక్షణ చేపట్టాలంటే, సమాజం తరఫున ఆ సంరక్షణా బాధ్యతను స్వీకరించే కార్యకర్తలు అవసరమవుతారు. ఈ సేవకు సిద్ధపడాలంటే, వారు తమ కోరికలను త్యాగం చేసే వారై ఉండాలి. తమ భావోద్రేకాలను నియంత్రించుకొని, నైతిక, మానవీయ సుగుణాలను పుణికిపుచ్చుకున్న వారై ఉండాలి. అప్పుడే వారు పిల్లలకు చక్కని శిక్షణను అందించగలరు. అయితే ఇలాంటి సంఘసేవకుల్ని ఎక్కడినుండి తెస్తారన్నది ప్రశ్న. ఎందుకంటే, జాతీయ, విద్యా, శిక్షణా వ్యవస్థను స్థాపించేదే స్త్రీ పురుషులు స్వేచ్ఛగా తమ కోరికలు నెరవేర్చుకోడానికి స్వేచ్ఛా శృంగార ఫలితంగా పురుడుపోసుకున్న సంతానాన్ని సాకి, సంరక్షించడానికి.

ఈ విధంగా సమాజంలో నైతిక విలువలు పెంపుదల, కోరికలను నియంత్రించుకొనే శక్తిసామర్థ్యాలనే కూకటి వేళ్లతో పెళ్లగించడం జరిగింది. అంటే కొత్త తరాన్ని చూసి నడక నేర్చుకోడానికి, అంధుల వీధిలో కళ్లున్న వారు ఎక్కడి నుండి వస్తారు?

7) ఒక పురుషుడు తన స్వార్థంకోసం అక్రమ సంబంధం ద్వారా ఒక స్త్రీని తల్లిని చేసినట్లయితే ఇక ఆమె జీవితం శాశ్వతంగా నాశనమైనట్లే. సమాజ ఛీత్కారాల తోపాటు అనేక కష్టాల పర్వతాలు ఆమెపై విరుచుకుపడతాయి. ఇక జీవితంలో ఎప్పుడూ ఆమె ఈ అవమానాల నుండి బయటపడలేదు. అయితే నేటి నూతన నైతిక వ్యవస్థలో ఈ సమస్యను అధిగమించడానికి, అన్ని రకాల మాతృత్వాన్ని, అంటే, వివాహ బంధంలో ఉన్నా లేకున్నా సమానంగా చూడాలని ప్రతిపాదించడం జరిగింది. సంతానం సక్రమంగా కలిగినా, అక్రమంగా కలిగినా మొత్తానికి మాతృత్వాన్ని ఆదరించవలసిందే. తెలిసో, తెలియకో తల్లయిన యువతిని సమాజం నీచ దృష్టితో చూడడం దుర్మార్గం అంటోంది నేటి నూతన వ్యవస్థ. కాని, ఈ ప్రతిపాదనలో దుర్నడత కలిగిన స్త్రీలకోసం ఎన్ని వెసులుబాట్లు కల్పించినా మొత్తం మీద సమాజానికి ఇదొక ఆపదే తప్ప మరొకటి కాదు. ఎందుకంటే అక్రమ సంతానం కన్న తల్లిని సమాజం సహజంగానే నీచ దృష్టితో చూస్తుంది. అంటే ఒకవైపు ప్రజల్ని అనైతికతనుండి, పాపాలనుండి కాపాడడానికి ప్రధాన అడ్డంకిగా మారుతూనే మరోవైపు అదే సమాజంలో కూడా నైతిక విలువలు బ్రతికే ఉన్నాయన్న దానికి నిదర్శనంగానూ నిలుస్తోంది. ఒకవేళ అక్రమ సంతానం కన్న స్త్రీని, సక్రమ సంతానం కలిగిన తల్లిని సమ దృష్టితో గనక చూడడం ప్రారంభిస్తే సంఘంలో మంచీ చెడు, పాపం పుణ్యాల మధ్య విచక్షణా జ్ఞానం నశించి పోయిందని భావించాల్సి ఉంటుంది. ఒకవేళ ఈ విధానం సరైందనే భావించినట్లయితే, ఒక అక్రమ సంతానాన్ని కన్న ఆ తల్లికి ఎదురయ్యే కష్టాలు నిజంగానే దూరం అయిపోతాయా అన్నది కూడా ప్రశ్నే. మీరు మీ విధానాలు, సిద్ధాంతాల ప్రకారం ధర్మాధర్మాల మాతృత్వాలను సమదృష్టితో చూడగలరేమో కాని, ప్రకృతి మాత్రం ఈ రెంటినీ ఎప్పుడూ సమంగా చూడదు. ఎందుకంటే యదార్థంగా ధర్మాధర్మాలు ఎప్పుడూ ఒకటి కాలేవు కాబట్టి వారి సమానత్వ భావన సిద్ధాంతాలకు, యదార్థాలకు, న్యాయానికి, బుద్ధీజ్ఞానాలకు అన్నిటికీ వ్యతిరేకం. అసలు తనను గాని తన సంతానాన్ని గాని సంరక్షించే బాధ్యత తీసుకోని ఒక స్వార్థ పరుడికి క్షణికానందం కోసం తనను తాను అర్పించుకున్న

ఒక అజ్ఞానురాలైన స్త్రీ, మరియు సచ్ఛీలుడైన పురుషుడు దొరకనంత వరకూ తన భావోద్రేకాలను అదుపులో ఉంచుకొన్న సచ్ఛీలురాలైన స్త్రీ, ఇద్దరూ సమానమెలా అవుతారు? బుద్ధీజ్ఞానాలు కలవారెవరైనా ఈ ఇద్దరూ సమానమని అనగలరా? ఈ తర్కాన్ని ఏ బుద్ధి అంగీకరిస్తుంది? మీరు కేవలం అలంకారం కోసం వీరికి సమాన హోదా ప్రసాదించగలరేమోగాని, వివాహబంధంలో ఒక స్త్రీకి లభించే రక్షణ, గౌరవం, హుందాతనం, శాంతిసంతృప్తులు, గౌరవమర్యాదలు ఒక తిరుగుబోతు స్త్రీకి ఇప్పించగలరా? కన్నతండ్రి ద్వారా లభించే ప్రేమానురాగాలను, అంటే పితృప్రేమను మీరు ఏ మార్కెట్‌లోనో కొని ఆ అక్రమ శిశువుకు అందించగలరా? మీరు మహాచేస్తే చట్టబలంతో భరణం వరకు మాత్రం ఇప్పించగలరు. నిజంగా ఒక తల్లీ, బిడ్డకు ప్రపంచంలో భరణమొక్కటే సర్వస్వమా? వీరికి మరే అవసరాలూ ఉండవా? వాస్తవం ఏమిటంటే, ధర్మ అధర్మాల మాతృత్వాన్ని సమానంగా చూడడం వల్ల పాపాలు చేసే వాళ్లకు ఎంతటి బాహ్య సంతృప్తి లభించినప్పటికీ, మొత్తంమీద ఇది వారిని, అహంకారపూరిత కార్యాల సహజ ఫలితాల నుండి అలాగే, వారి సంతానాన్ని ఈ విధమైనటువంటి ఘోర నష్టాల నుండి ఎంతమాత్రం కాపాడలేదు.

ఈ కారణాల వల్లనే, సామాజిక జీవన మనుగడ, దాని వృద్ధీ వికాసాలకోసం, సమాజంలో విచ్చలవిడి లైంగిక కార్యకలాపాలను నిరోధించవలసిన అవసరం ఎంతైనా ఉంది. భావోద్రేకాల సంతృప్తి కొరకు దాంపత్య బంధమనే ఒకే ఒక్క ద్వారాన్ని మాత్రమే తెరవాలి. ప్రజలకు శృంగారస్వేచ్ఛను ఇవ్వడమంటే, అనవసరంగా వారిని ఇబ్బందుల్లోకి నెట్టి, సమాజంపై దౌర్జన్యం చేయడమే. అంతేకాదు సమాజాన్ని అంతం చేయడం కూడా. ఏ సమాజమైతే ఈ వ్యవహారాన్ని చాలా చిన్న విషయంగా భావించి, వ్యభిచారాన్ని కేవలం సరదా కాలక్షేపం (Having a good time) వ్యవహారమనుకొని చూపోపు వహించాలనుకుంటుందో, అక్రమంగా పుట్టుకొచ్చిన వారిని (Sowing withdoats) సానుభూతితో సాకడానికి సిద్ధపడితే నిజంగా అలాంటి సమాజం అజ్ఞాన అనాగరిక సమాజమే అవుతుంది. దానికి తన హక్కుల స్పృహలేదు. అలాంటి సమాజం తనకు తానే శత్రువుగా వ్యవహరిస్తోంది. నిజంగానే దానికి తన హక్కుల స్పృహ ఉంటే లైంగిక సంబంధాల విషయంలో వ్యక్తిగత స్వేచ్ఛకు ఆస్కారం కల్పిస్తే ఆ దుష్ప్రచారం సమాజంపై ఎలా పడుతుందో తెలుసుకోవాలి, అర్థం చేసుకోవాలి. అప్పుడు ఈ స్వేచ్ఛా శృంగారాన్ని కూడా దోపిడి, దొంగతనం, హత్యలను ఎలా చూస్తారో అలాగే చూడాలి. ఎందుకంటే వీటివల్ల

జరిగే నష్టం పరిమితం. కాని ఒక వ్యభిచారి మొత్తం సమాజాన్ని, ముందుతరాలను కూడా నష్టపరుస్తాడు. ఏకకాలంలో లక్షలు, కోట్లాదిమంది ప్రజలను దోచుకుంటాడు. ఈ నేర ఫలితాలు ఈ దోషులకంటే కూడా ఎంతో విస్తృతమైనవి.

స్వార్థపరుల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా సమాజ సంరక్షణ కోసం చట్టపరమైన అధికారాలున్నాయి. ఈ చట్టాల ఆధారంగానే దొంగలు, దోపిడిదారులు, హంతకులు మోసగాళ్ల వంచకులు, ఇతరుల హక్కుల్ని కొల్లగొట్టే వారు ఇంకా ఇతర అనేక నేరాలకు పాల్పడే దోషుల భరతం పట్టడం జరుగుతోంది. మరి వ్యభిచారం విషయంలో చట్టం సమాజ రక్షణకు ఎందుకు ఉపయోగపడకూడదు? చట్టపరిధిలో వ్యభిచారాన్ని నేరంగా ఎందుకు పరిగణించకూడదు?

సూత్రప్రాయంగా కూడా వివాహబంధం, వివాహేతర సంబంధం, రెండూ ఏకకాలంలో చట్ట వ్యవస్థలో భాగం కాలేవన్నది సుస్పష్టం. ఎందుకంటే ఒక మనిషికి, ఎలాంటి బరువు బాధ్యతలు స్వీకరించకుండానే, కోరికలు తీర్చుకునే ధర్మసమ్మతమైన వెసులుబాటు కల్పించినట్లయితే, అదే కార్యం కోసం వివాహ వ్యవస్థను ఏర్పరచు కోవడంలో ఇక అర్థమేముంది? ఇది ఎలా ఉందంటే రైల్లో ప్రయాణించాలంటే తప్పనిసరిగా టికెట్టు కొనుక్కోవాలన్న నిబంధనలు ఏర్పరచుకొని, టికెట్టులేని ప్రయాణం కూడా నేరంకాదు అని చెప్పినట్లుగా ఉంది. బుద్ధిజ్ఞానాలు కలిగిన ఏ వ్యక్తీ ఈ రెండు విరుద్ధ వాదనలను ఏకకాలంలో అంగీకరించలేడు. సరైన పద్ధతి ఏమిటంటే, టిక్కెట్టు కొనాలన్న నిబంధనను పూర్తిగా తొలగించనైనా తొలగించాలి. లేకపోతే టికెట్టులేని ప్రయాణాన్ని నేరంగానైనా పరిగణించాలి. ఇదే విధంగా వివాహబంధం, వివాహేతర సంబంధాల విషయంలో ఈ ద్వంద్వ విధానం కూడా ఖచ్చితంగా ఆక్షేపణీయమే. ముందే చర్చించినట్లు నాగరిక సమాజానికి నికాహ్ వ్యవస్త అవసరమనుకుంటే, దాంతో పాటు, వివాహేతర సంబంధాన్ని నేరంగా పరిగణించాలి.

ఏ కార్యాల పరిణామ ఫలితాలు వెంటనే బహిర్గతమవుతాయో, ఏవికావో వాటిని గుర్తించడం ఆనాటి అజ్ఞాన కాలపు ప్రత్యేకతల్లో ఒకటి. ఈ విధంగా వారు వెంటనే వెలువడే ఫలితాల కార్యాలపై మొగ్గుచూపి, ఆలస్యంగా వెలువడే వాటిని పట్టించుకునే వారు కాదు. అందుకే దోపిడి, దొంగతనం, హత్య తదితర నేరాలకు ఉన్న ప్రాముఖ్యత, వ్యభిచారం లాంటి పాపానికి లేకుండా పోయింది. అంటురోగాలు

వ్యాపింపజేసే వాణ్ని నాటి అనాగరిక సమాజం క్షమించరాని నేరంగా పరిగణించేది. ఎందుకంటే ఆ చర్య నష్టదాయకమని స్పష్టంగా కనిపిస్తోంది కాబట్టి. కాని ఒక వ్యభిచారి తన స్వార్థం కోసం సభ్యతా సంస్కృతుల పునాదులనే కూల్చేస్తాడు. దానికి నష్టం వెంటనే గోచరించదు. అందుకని అజ్ఞానులకది నష్టదాయకమైనదిగా కనబడదు. ఒకవేళ నాగరికత అజ్ఞానం పునాదులపై కాకుండా, బుద్ధి జ్ఞానాలపై ఆధారపడి ఉంటే ఈ విధమైన తప్పుడు వైఖరి అవలంబించేవారు కాదు.

## 4. చెడుల నిరోధం ఎలా?

సమాజానికి హానికరమైన కార్యకలాపాలను నిరోధించడానికి వాటిని కేవలం చట్టపరమైన నేరాలుగా పరిగణించి శిక్షించడమొక్కటే సరిపోదు. దాంతోపాటు మరో నాలుగు అంశాలను కూడా పరిగణనలోకి తీసుకోవాలి.

- మొదటి విషయం ఏమిటంటే, విద్యా శిక్షణల ద్వారా వ్యక్తుల మనోమస్తిష్కాలను సంస్కరించి వారు స్వయంగా ఈ దుష్కార్యాన్ని అసహ్యించుకొనే విధంగా తయారు చెయ్యాలి. తద్వారా వారు దీన్ని పాపంగా పరిగణించి, స్వయంగా తమ నైతికత ఆధారంగా ఈ దుష్కార్యానికి దూరంగా ఉండగలగుతారు.
- రెండవ విషయం ఏమంటే, సమాజం ఈ పాపకార్యాన్ని వ్యతిరేకించే విధంగా, ప్రజలు దీన్ని సిగ్గుమాలిన, నీతిబాహ్య కార్యంగా పరిగణించేలా, దీనికి పాల్పడిన వారిని అసహ్యించుకునేవిధంగా సమాజంలో నైతిక విలువలు పెంపొందిస్తూ, జనాభిప్రాయాన్ని కూడగట్టాలి. దీనివల్ల శిక్షణా లోపంతో అనైతిక కార్యాలకు పాల్పడే వారు సైతం సమాజంలోని అత్యధిక శాతం మంది ప్రజల మనోభావాలకు భయపడి ఈ దుష్కార్యానికి దూరంగా ఉంటారు.
- మూడవ అంశం ఏమిటంటే, నాగరిక సమాజంలో ఈ పాపకార్యం వైపుకు పురిగొలిపే, అన్నిరకాల సాధనాలను నియంత్రించాలి. అదేవిధంగా వ్యక్తిగతంగా బలవంతంగా ఈ ఊబికిలోకి దింపే మార్గాలను కూడా దూరం చేయాలి.
- ఇక నాల్గవ విషయం ఏమిటంటే, అంతకూ ఒకవేళ ఎవరైనా ఈ దుష్కార్యానికి పాల్పడే సాహసం చేసినట్లయితే, సామాజిక జీవితంలో అడుగడుగునా అవరోధాలు, ఇబ్బందులు సృష్టించాలి. దీనివల్ల అతడు దుష్కార్యానికి పాల్పడాలనుకున్నా అది దుస్సాధ్యమైపోతుంది.

ఈ నాలుగు అంశాలు చాలా ముఖ్యమైనవి. బుద్ధిజ్ఞానాలు కలవారెవరూ వీటి అవసరాన్ని కాదనలేరు. సామాజిక కట్టుబాట్లు, ఏ విషయాలను నేరంగా, పాపంగా పరిగణిస్తాయో, వాటిని నిరోధించడానికి శిక్షతోపాటు ఈ నాలుగు అంశాలను కూడా దాదాపు దేశమంతా తప్పనిసరిగా అనుసరిస్తోంది. కనుక విచ్చలవిడి లైంగిక సంబంధాలు సమాజానికి హానికరమని, సంఘవ్యతిరేక కార్యాల్లో ఇది అత్యంత నీచమైన నేరమని అంగీకరించినట్లయితే, మరి దాన్ని నిరోధించడానికి శిక్షలతోపాటు అన్ని రకాల నైతిక, సంస్కరణా మార్గాలను తప్పక అనుసరించవలసి ఉంటుంది. దీనికోసం వ్యక్తిగత శిక్షణతోపాటు, ఈ దుష్కార్యానికి వ్యతిరేకంగా జనాభిప్రాయాన్ని కూడగట్టవలసి ఉంటుంది. వ్యక్తుల భావోద్రేకాలను రెచ్చగొట్టే అన్ని రకాల సాధనాలను, అశ్లీల ప్రచార ప్రసార మాధ్యమాలనూ సమాజం నుండి బహిష్కరించవలసి ఉంటుంది. దీంతోపాటు నికాహ్ (వివాహానికి)కు అవరోధంగా నిలిచే అన్నిరకాల దురాచారాలనూ సమాజం నుండి తరిమేయాలి. అంతేకాకుండా స్త్రీ పురుష సంబంధాల విషయంలో, ఒకవేళ వారు దాంపత్య పరిధికి వెలుపల, లైంగిక సంపర్కం వైపు మొగ్గుచూపితే వారి మధ్య అనేక పటిష్టమైన పరదాలు అడ్డుపడాలి. ఈ విధంగా వ్యభిచారాన్ని నేరంగా, పాపంగా అంగీకరించిన తరువాత ఇంగిత జ్ఞానమున్న ఏ మనిషీ ఈ అంశాల ఆవశ్యకతను కాదనలేడు.

కొంతమంది వ్యభిచారాన్ని పాపంగా పరిగణించే అన్ని సామాజిక, నైతిక సూత్రాలనూ అంగీకరిస్తారు. కాని దానికి వ్యతిరేకంగా శిక్షలు ఖరారు చేసి, దాన్ని నిరోధించే ప్రయత్నాలు చేసే బదులు కేవలం సంస్కరణవైపు మొగ్గుచూపితే సరిపోతుంది కదా అంటారు. విద్యాశిక్షణల ద్వారా వారిలో చైతన్యాన్ని తీసుకొచ్చి, వారి మనసులో ఇది చెడు అన్న అభిప్రాయాన్ని కలిగించి, స్వయంగా వారే దాన్నుండి సురక్షితంగా ఉండే విధంగా ప్రయత్నించాలంటారు. ఇలా కాకుండా శిక్షలు, అవరోధాల వైఖరినవలంబిస్తే ఇది మానవులను అవమానపరిచినట్లే అవుతుందని వాదిస్తారు. మానవ సంస్కరణకు వారు చెప్పే ఉత్తమ విధానాన్ని మేము కూడా ఒక పరిధి మేర అంగీకరిస్తాం. మానవ ఆంతర్యంలో సామాజిక కట్టుబాట్లను గౌరవించే భావాలను పటిష్టపరచడమే నిజానికి సమాజ బాధ్యత. స్వయంగా వారి మనసే అనైతిక విషయాల పట్ల వ్యతిరేకత కనబరచాలి. ఈ ఉద్దేశ్యంతోనే వ్యక్తుల విద్యా శిక్షణల కోసం శక్తినంతా ఉపయోగించడం జరుగుతోంది. కాని, నిజంగా సమాజం తన లక్ష్యసాధనలో సఫలీకృతమైందా? నిజంగా విద్యా, నైతిక విలువల

ఆధారంగా మానవులను అంత నమ్మదగ్గ నాగరికులుగా తీర్చిదిద్దడం జరిగిందా? సామాజిక వ్యవస్థ సంరక్షణకోసం బాహ్యంలో ఏవైనా శిక్షా, నియంత్రణల అవసరం కలగలేదా? పూర్వకాలపు విషయాలను వదిలేయండి, ఎందుకంటే మీ దృష్టిలో అది చీకటి యుగం. కాని ఇది ఇరవయ్యో శతాబ్దం, అత్యంత ఆధునిక యుగం మీముందుంది. ప్రస్తుత యూరప్ అమెరికాలను చూసుకోండి. అక్కడి ప్రతిపౌరుడు విద్యాధికుడే. వారు తమ విద్యా ప్రమాణాలపట్ల, ఉత్తమ శిక్షణపట్ల ఎంతో గర్వపడతారు. మరి అక్కడి విద్య, మనో సంస్కరణ, నేరాలను, చట్ట ఉల్లంఘనలను నిరోధించగలిగాయా? అక్కడ దోపిడి దొంగతనాలు, హత్యలు జరగడం లేదా? మోసం, వంచన, దగా దౌర్జన్యం, ఘర్షణలు అక్కడ ఉండవా? అక్కడ పోలీసులు, న్యాయస్థానం, జైళ్లు, సామాజిక బాధ్యత లాంటి విషయాల అవసరం ఉండదా? అక్కడి పౌరుల్లో బాధ్యతాభావం జనించిందా? వాస్తవం ఏమిటంటే, ఈ ఆధునిక కాలంలో కూడా చట్టాలను, సామాజిక వ్యవస్థను కేవలం వ్యక్తుల నైతిక సుగుణాలపై వదిలేయడం జరగలేదు. నేరాలను నిర్మూలించడానికి, శిక్షలు, నిరోధక చర్యలు చేపట్టడం ద్వారా ఇప్పటికీ ప్రతిచోటా మానవత్వానికి అవమానం జరుగుతూనే ఉంది. మరి కేవలం ఒక్క లైంగిక సంబంధాల విషయంలోనే ఈ అవమానాన్ని ఎందుకు సహించలేకపోతున్నారు? ఈ ఒక్క విషయంలోనే మీకెందుకంత పట్టుదల. మనసులో ఎవడైనా దొంగ దాక్కుని ఉన్నాడేమో కాస్త తొంగి చూసుకోండి.

ఏ విషయాలనైతే మీరు భావోద్రేకాలను రెచ్చగొట్టేవని ఖరారు చేసి, సమాజంనుండి దూరం చేయాలనుకుంటున్నారో, అవన్నీ కళలకు సంబంధించినవని, సామాజిక సౌందర్యానికి అవి ప్రాణం లాంటివని, అలాంటి ప్రాణవాయువును సమాజం నుండి దూరం చేస్తే మానవ జీవితంలోని మాధుర్య మంతా వట్టిపోయి జీవితం నిస్సారంగా మారిపోతుందని కూడా అనే వారున్నారు. అందుకని నాగరిక తను పరిరక్షించుకొనే, సమాజాన్ని సంస్కరించుకొనే క్రమంలో ఈ విధమైనటువంటి కళలకు దెబ్బతగలకుండా చూసుకోండి. అయితే, కళల పరిరక్షణ విషయంలో మేము కూడా వీరితో కొంత వరకు ఏకీభవిస్తాము. అమూల్యమైన కళలను కాపాడుకోవాలనడం, వాటి పరిరక్షణ అవసరమన్న విషయంలో భిన్నాభిప్రాయం లేదు. కాని, సామాజిక జీవితం, సాంఘిక సాఫల్యం వీటన్నిటికన్నా ముఖ్యం. దీన్ని కళల పేర బలిచేయడం ఎంతమాత్రం సమంజసం కాదు. కళలకు ప్రోత్సాహం లభించాలంటే వాటిని సామాజిక జీవన సాఫల్యంతో అనుసంధానం చేసే

మార్గమేమైనా ఉందేమో ఆలోచించాలి. అంతేగాని ఏ కళలైతే జీవితంలో ఆనందం నింపే బదులు వినాశం కలిగిస్తాయో, సాఫల్యానికి బదులు ఉపద్రవాన్ని కొనితెస్తాయో, అలాంటి వాటిని సమాజంలో వికసించడానికి ఎట్టి పరిస్థితిలోనూ అవకాశం కల్పించకూడదు. ఇదేదో మా ఒక్కరి అభిప్రాయం ఎంతమాత్రం కాదు. బుద్ధీజ్ఞానాలు, మానవ నైజం కోరే బలమైన కోరిక. అంతేకాదు యావత్ ప్రపంచం అంగీకరించే సహజ సూత్రం. ప్రపంచమంతటా ఇదే విధానం అమల్లో ఉంది. సాంఘిక జీవితానికి నష్టం చేకూర్చే ఏ విషయాలనైనా కళల పేరిటగాని, మరేపేరుతోగాని ప్రపంచంలో ఎక్కడా అనుమతించడం జరగదు. ఉదాహరణకు ప్రజల భావోద్రేకాలను, మతోన్మాదాన్ని, రెచ్చగొట్టే, హింసవైపు ప్రేరేపించే సాహిత్యాన్ని అందులో ఎన్ని సాహితీ విలువలున్నప్పటికీ దాన్ని ఎవరూ ధర్మసమ్మతమని అంగీకరించరు. అలాగే ఉపద్రవాలను సృష్టించి, సమాజంలో భయోత్పాతాన్ని రగిలించే సాహిత్యాన్నీ ఎవరూ సహించరు. అశాంతిని, తిరుగుబాటును ప్రోత్సహించే సాహిత్యాన్ని ప్రజల్లోకి తీసుకొచ్చే మాధ్యమాలను కూడా ఎవరూ ప్రోత్సహించరు. ఇలాంటి వాటిని ప్రభుత్వం అణిచివేస్తుంది. అలాగే అశ్లీల అసభ్య దృశ్యాలను, నైతిక రాహిత్యాన్ని పెంచిపోషించే సాహిత్యాన్ని కూడా ప్రజలూ, ప్రభుత్వాలూ ఆదరించవు. మొత్తానికి కళల పేరుతో, సాహిత్యం పేరుతో సమాజానికి నష్టం కలిగించే, సమాజంలో అనైతికతను పెంచిపోషించే ఏ ప్రక్రియనైనా నిర్ద్వంద్వంగా తిరస్కరించవలసిందే. సమాజంనుండి వాటిని బహిష్కరించవలసిందే. ఎంత సాహితీ ప్రకర్ష ప్రదర్శించినా సమాజం దాన్ని ఆమోదించదు. కనుక విలువలకు పాతరేసే అన్నిరకాల కళలను నిరసిస్తూ వాటి పరిరక్షణకు, ధర్మసమ్మతమైన మార్గంలో కళలను ప్రోత్సహించడానికి ఏకాభిప్రాయం కుదిరితే మంచిది.

అక్రమ సంబంధాలను నిరోధించడానికి స్త్రీ పురుషుల మధ్య అవరోధాలు సృష్టించడం, వారి స్వేచ్ఛాయుత కలయికలపై నిషేధాలు విధించడం నిజానికి వారి నైతికత, వారి వ్యక్తిత్వంపై దాడి చేయడమే. అంతేకాదు ప్రజలందరూ దుర్నడత కలిగిన వారేనని తీర్మానించినట్లు కూడా అవుతుంది. ఈ విధంగా స్త్రీ పురుషుల స్వేచ్ఛాయుత కలయికపై నిషేధం విధించాలనుకునేవారికి స్వయంగా తమ స్త్రీలపై గాని, పురుషులపైగాని నమ్మకం ఉండదని కూడా కొందరంటారు. వినడానికి ఇలాంటి మాటలు సహేతుకంగానే ఉంటాయి కాని, ఇదే తర్కాన్ని కాస్త ముందుకు పొడిగించండి. ఒక యజమాని తన ఇంటికి తాళం వేసుకున్నాడంటే ప్రజలందరినీ

దొంగలుగా భావిస్తున్నాడని అర్థమా? ప్రభుత్వం పోలీసు శాఖను ఉనికిలోకి తెచ్చిందంటే, దేశ ప్రజలందరూ నేరస్తులు, దొంగలని భావిస్తున్నట్లా? ఇచ్చిపుచ్చుకునే వ్యవహారాల్లో, ఆర్థికలావాదేవీల్లో దస్తావేజులు/ప్రాంసరీ నోట్లు రాసుకోవడమంటే, ఇచ్చే వాడు తీసుకునే వాణ్ని మోసగాడిగా, వంచకుడిగా భావిస్తున్నాడనా? నేరాన్ని నిరోధించడానికి చేపట్టే నేర నిరోధక చర్య వెనుక అసలు ఉద్దేశ్యం, ఆ చర్య ప్రభావం పడే ప్రతి ఒక్కరూ నేరానికి పాల్పడే అవకాశం ఉన్నదనే విషయాన్ని పరోక్షంగా సూచిస్తుంది. ఈ వాదన (తర్కం) ప్రకారం మీరు అనుక్షణం ఒక దొంగగా, ద్రోహిగా, వంచకునిగా, దుర్నడత కలిగినవాడిగానే పరిచయమవుతున్నారు. అయినా మీ ఆత్మగౌరవానికి అణుమాత్రమైనా భంగం కలగడం లేదు. మరి కేవలం ఈ ఒక్క విషయంలోనే మీ భావాలు ఎందుకింత సున్నితంగా సంకుచితంగా తయారవుతున్నాయో అర్థం కావడంలేదు.

అసలు విషయం ఏమిటంటే, ఎవరి మనసుల్లోనైతే కొద్దో గొప్పో నైతిక భావనల ప్రభావం మిగిలి ఉందో, వారు వ్యభిచారాన్ని, నగ్నత్వాన్ని చెడుగానే భావిస్తున్నారు కాని, మరీ దాన్ని పూర్తిగా నిషేధించేంత తీవ్రత ఉన్న చెడుగా మాత్రం భావించడం లేదు. ఈ విషయాన్ని మేము ఇంతకుముందే సూచనప్రాయంగా చెప్పాము. ఈ కారణంగానే సంస్కరణ, చెడుల నిరోధాల వైఖరిలో వారిమధ్య మా మధ్య ఏకత్వం లేదు. నిజంగా వాళ్లు గనక ప్రకృతి యదార్థాలు తెలుసుకొని వాస్తవాలను అర్థం చేసుకోగలిగితే, ఈ విషయంలో వారు కూడా మాతో ఏకీభవించవలసి ఉంటుంది. వ్యక్తిగత స్వార్థాలను, కోరికలను పక్కనపెట్టి సామాజిక ప్రగతీ సాఫల్యాలను కోరుకునే వారెవరూ ఈ అంశాలను ఎట్టిపరిస్థితిలోనూ విస్మరించలేరు.

## 5. సరైన దాంపత్య బంధం

దాంపత్య సంబంధాలు విచ్ఛిన్నం కాకుండా నిరోధించి, కుటుంబాలను పటిష్టపరిచిన తరువాత ఒక మంచి సమాజ నిర్మాణం కోసం కొన్ని విషయాలు అవసరం. అవేమిటంటే, సామాజిక వ్యవస్థలో స్త్రీ పురుష సంబంధాలను సరైన రీతిలో నిర్వచించాలి. వారి హక్కుల్ని న్యాయబద్ధంగా నిర్ణయించాలి. వారిమధ్య విధులు బాధ్యతలను సమానంగా పంచాలి. కుటుంబంలో వారి స్థాయి తరగతుల్లో సమతూకం నెలకొనేలా చూడాలి. సామాజిక సమస్యలన్నిటిలో ఇది చాలా కీలకమైన సమస్య. కాని ఈ విషయంలో మానవుడెప్పుడూ వైఫల్యాన్నే చవిచూశాడు.

కొన్ని జాతులు (సమాజాలు) పురుషుల కంటే స్త్రీలకే ఎక్కువ ఆధిక్యతను ప్రసాదించాయి. కాని ఈ జాతులు అత్యున్నత ప్రగతి శిఖరాలను అధిరోహించినట్లు చరిత్రలో ఒక్క ఆధారం కూడా లేదు.

చాలా జాతులు స్త్రీలకంటే పురుషులకు ఎక్కువ ఆధిక్యతను కట్టబెట్టాయి. అయితే ఈ ఆధిక్యత దాదాపుగా దౌర్జన్యరూపం సంతరించుకుంది. స్త్రీని బానిసగా చేసి, నీచ దృష్టితో చూడడం జరిగింది. ఆమెకు ఏ విధమైనటువంటి సామాజిక హక్కులు లేకుండా పోయాయి. కుటుంబంలో ఆమె ఒక సేవికగా, పురుషుల కోరికలు తీర్చే యంత్రంగా తయారు చేశారు. కుటుంబాలకు వెలుపల ఒక వర్గాన్ని కొంతమేర విద్యాబుద్ధులకు, సంస్కృతికి దగ్గర చేసినా, అదికూడా కేవలం పురుషుల లైంగిక కోరికలను సమర్ధవంతంగా పూర్తిచేయడానికే. తమ గాత్రం ద్వారా, తమ నృత్యం ద్వారా, తమ అందం ద్వారా, చివరికి తమ శీలాన్ని కూడా వారికి అర్పించి లైంగిక ఆనందం అందించే బొమ్మలుగా మారిపోవాలి. ఇది స్త్రీలను అవమానపరిచే, అత్యంత నీచమైన, సిగ్గుమాలిన పద్ధతి. పురుషుల స్వార్ధం దీనికి ఊపిరిపోసింది. ఏ జాతులు ఈ విధానాన్ని అవలంబించాయో అవి కూడా ఈ దుష్పరిణామాల నుండి సురక్షితంగా లేవు.

ఆధునిక పాశ్చాత్య నాగరికత మరో విధానాన్ని అనుసరించింది. స్త్రీ పురుషులిరువురూ సమాన స్థాయి కలిగి ఉండి, ఇద్దరి బాధ్యతలూ దాదాపు ఒకే విధంగా ఉండాలి. ఇద్దరూ ఒకే కార్యరంగంలో కలసి ముందుకు పోవాలి. ఎవరి సంపాదన వారిదే. ఎవరి అవసరాలూ వారివే. ఎవరి సంపాదనకు వారే యజమాని. సమాజంలో ఈ విధానం ఇంకా వ్యవస్థీకృతంగా పరిపూర్ణం కాలేదు. ఎందుకంటే, పురుషుల ఆధిక్యం ఇంకా ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది. జీవితంలోని ఏ రంగంలో కూడా స్త్రీ పురుషునితో సరితూగలేకపోతోంది. సంపూర్ణ సమానత్వం రూపంలో లభించాల్సిన హక్కులేవీ ఆమెకు లభించడం లేదు. అయితే ఏ పరిధిమేరకైతే సమానత్వం ఏర్పరచబడిందో అదికూడా సామాజిక వ్యవస్థలో ఉపద్రవాన్ని సృష్టించింది. ఈ విషయం ఇంతకు ముందే మేము విపులంగా చర్చించాము. ప్రస్తుతం ఆ వివరణ అవసరం లేదు.

ఈ మూడు విధానాలూ న్యాయానికి, సమానత్వానికి భిన్నంగా ఉన్నాయి. ఎందుకంటే, వారు ప్రకృతి మార్గదర్శకత్వాన్ని (నియమాలను) అర్థం చేసుకోవడంలో,

ఖచ్చితమైన విధానాన్ని అవలంబించడంలో విఫలమయ్యారు. బుద్ధీ జ్ఞానాలను ఉపయోగించి ఆలోచించినట్లయితే, బుద్ధే స్వయంగా ఈ సమస్యలకు పరిష్కారం సూచిస్తోందన్న విషయం అర్ధమవుతుంది. అంతేకాదు, నిజానికి ఈ బుద్ధి బలం, స్వభావ సిద్ధ ప్రభావం వల్లనే స్త్రీని ఎంతగా అణగదొక్కాలన్న ప్రయత్నం జరిగినా ఆ స్థాయికి పడిపోకుండా ఉండగలిగింది. ఎంత ఎత్తుకు ఎదగాలనుకుందో, లేక పురుషులు ఎత్తాలనుకున్నారో అంత ఎత్తుకు ఎదగలేకపోయింది. ఈ హెచ్చుతగ్గులు, అతిశయాల రెండు కోణాలూ మానవుల అపరిపక్వ జ్ఞానం, నిలకడలేని ఆలోచనల ప్రభావంతో అవలంబించినవి. కాని నైజం మాత్రం న్యాయం, సమానత్వాలను కాంక్షిస్తుంది. స్వయంగా దానికి దారి చూపుతుంది.

మానవులుగా స్త్రీ పురుషులిద్దరూ సమానమన్న విషయంలో భిన్నాభిప్రాయం లేదు. ఈ విషయాన్ని ఎవరూ కాదనలేరు. ఇద్దరూ మానవ మూలానికి సమాన భాగస్వాములే. సమాజ నిర్మాణంలో, సంస్కృతీ నాగరికతల నియామకంలో, మానవ సేవలో కూడా ఇద్దరూ సమాన భాగస్వాములు. ఇద్దరూ ఒకే విధమైన బుద్ధీజ్ఞానాలు, భావోద్రేకాలు, ఆశలు కోరికలు, మానవ అవసరాలు కలిగి ఉంటారు. సామాజిక ప్రగతీ వికాసాలకు, సాఫల్యానికి, సంస్కరణకు ఇద్దరి మనో సంస్కారాలు, మేధోపరమైన ఆలోచనలు, శక్తిసామర్థ్యాలు సమానంగా అవసరమవుతాయి. ఎందుకంటే, సమాజసేవలో ప్రతి ఒక్కరూ తమ పాత్రను పూర్తిగా నెరవేర్చగలగాలి. ఈ పరంగా సమానత్వ వాదన పూర్తిగా సమంజసమే. పురుషులకులాగే స్త్రీలక్కూడా వారి సహజసిద్ధమైన శక్తి సామర్థ్యాల మేరకు, అత్యధికంగా ప్రగతి సాధించడానికి అవకాశాలు కల్పించడం ఒక మంచి సమాజం యొక్క విధి, బాధ్యత కూడా. వారిని ఉన్నత విద్యా ప్రమాణాలతో అలంకరించి, పురుషులకు లాగే సమాజంలో అన్ని హక్కులు ఇవ్వాలి. సమాజంలో వారికి అత్యున్నత గౌరవస్థానం ప్రసాదించాలి. దీనివల్ల వారిలో ఆత్మగౌరవం, ఆత్మ విశ్వాసం జనిస్తుంది. కేవలం ఆత్మగౌరవంతో మాత్రమే జనించే మహత్తరమైన సుగుణాలు వారిలో వికసిస్తాయి. ఏ సమాజాలైతే స్త్రీలకు ఈ విధమైనటువంటి హక్కులు ఇవ్వడానికి నిరాకరించాయో, ఆ సమాజాలు తమ స్త్రీలను అజ్ఞానాంధకారంలో ఉంచడంతోపాటు, స్వయంగా తామూ అంధకారంలో కూరుకుపోయాయి. మానవ జనాభాలో సగభాగమైన స్త్రీలను వికసించకుండా అణిచివేయడమంటే, మొత్తం మానవ జాతిని అణిచివేసినట్లే లెక్క. అనాగరికమైన తల్లుల ఒడినుండి సుగుణ సంపన్నులైన పిల్లలు ఉనికిలోకి రాలేరు.

అలాగే అల్ప బుద్ధిగల తల్లుల నుండి ఉన్నత భావాలు గల పిల్లలు కూడా ఉనికిలోకి రారు.

అయితే స్త్రీ పురుష సమానత్వానికి సబంధించిన మరో కోణం ఏమిటంటే, స్త్రీ పురుషులిద్దరి కార్యరంగం ఒకటే అయిఉండి, ఇద్దరూ ఒకే విధమైన పనిచేయాలి. జీవితంలోని అన్ని రంగాల్లో ఇద్దరిపై ఒకేవిధమైన బాధ్యతలు మోపాలి. సమాజంలో ఇద్దరి స్థాయి, తరగతులు ఒకటే అయి ఉండాలి. స్త్రీ పురుషులిద్దరూ శారీరక శక్తి సామర్థ్యాల పరంగా సమానమేనని సైంటిఫిక్ పరిశోధనల సహాయంతో రుజువు చేయవచ్చు. అయితే ప్రకృతి ఉద్దేశ్యం కూడా ఇద్దరి ద్వారా ఒకే విధమైన పని తీసుకోవడమేనని చెప్పడానికి కేవలం ఇద్దరిలో ఈ విధమైన సమానత్వం కనబడుతోందని చెప్పడమొక్కటే సరిపోదు. ఇద్దరి శారీరక వ్యవస్థ ఒకటేనని రుజువు చేయనంత వరకు ఇలాంటి అభిప్రాయానికి రావడం సమంజసం కాదు.

ప్రకృతి ఇద్దరిపై ఒకేవిధమైనటువంటి బరువు బాధ్యతలు కూడా మోపిందని, ఇద్దరి మానసిక భావోద్రేకాలు కూడా పరస్పరం పోలి ఉన్నాయని రుజువు చేయాలి. మానవుడు ఇప్పటి వరకు చేసిన శాస్త్రీయ పరిశోధనల్లో ఈ మూడు ప్రశ్నల సమాధానం స్పష్టంగా, సకారాత్మకంగా లభించలేదు.

జీవశాస్త్ర పరిశోధనల ద్వారా రుజువైన విషయం ఏమిటంటే, స్త్రీ తన రూపురేఖలు, బాహ్య అవయవాలు మొదలు, శరీరం లోని సూక్ష్మ కణాల వరకూ (Protein Molecules of tissues cells) ప్రతిదీ పురుషులకు భిన్నంగా ఉంటుంది. ఎప్పుడైతే మాతృ గర్భంలో శిశువు లింగనిర్ధారణ జరిగి పోతుందో (Sex Formation) అప్పటినుండే శరీరాకృతి (ఆడ+మగ), రూపురేఖలు వేరువేరుగా వృద్ధిచెందుతూ ఉంటాయి. స్త్రీ శారీరక వ్యవస్థ మొత్తం ప్రత్యేకంగా శిశుజననాలకూ, వారి పరిరక్షణకు అనువుగా రూపుదిద్దుకుంటుంది. జననం నుండి యుక్త వయసు వరకు ఆమె శారీరక వికాసమంతా దీనికి అనుగుణంగానే ఉంటుంది. ఇదే ఆమె భావి జీవితానికి మార్గం సుగమం చేస్తుంది.

రజస్వల కాగానే రుతుక్రమం ప్రారంభమవుతుంది. దీని ప్రభావం వల్ల ఆమె దేహంలోని అవయవాల కదలికలన్నీ ప్రభావితమవుతాయి. జీవశాస్త్ర నిపుణుల అధ్యయనం, పరిశోధనల ప్రకారం రుతుక్రమ సమయంలో స్త్రీలలో ఈ క్రింది మార్పులు సంభవిస్తాయని తేలింది.

1) శరీర ధర్మంలో మార్పులు చోటుచేసుకుంటాయి. శరీర ఉష్ణోగ్రతను గ్రహించుకునే శక్తి సన్నగిల్లుతుంది. శరీరంలోని వేడి పడిపోతుంది. (తగ్గిపోతుంది)

2) నాడీ వ్యవస్థ మందగిస్తుంది. రక్త ప్రసరణ తగ్గిపోతుంది. శ్వాసక్రియలో కూడా మార్పులు సంభవిస్తాయి.

3) రుతుక్రమ సమయంలో గ్రంధులు (endocrines) గొంతులో (Tonsies) మరియు Lymphatic glans లో మార్పులు సంభవిస్తాయి.

4) Protein Metabalismలో క్షీణత ఏర్పడుతుంది.

5) పాస్ఫేట్స్, క్లోరైడ్స్‌ల అసమతుల్యత, గ్యాస్టిక్ మూలాల్లో మార్పులు చోటు చేసుకుంటాయి.

6) జీర్ణక్రియ ప్రభావిత మవుతుంది. ఆహారంలోని ప్రోటీన్లు కొవ్వులో కలిసి శరీరానికి శక్తినివ్వడంలో విఫలమవుతాయి.

7) ఉచ్ఛ్వాస నిస్వాశాల ప్రక్రియ బలహీనపడుతుంది. మాట గాంభీర్యం కోల్పోతుంది.

8) కండరాల బలహీనత ఏర్పడుతుంది. భావాలు ఆలోచనలు మందగిస్తాయి.

9) ఆలోచనా శక్తి సన్నగిల్లుతుంది. ఆలోచనలను నియంత్రించుకోవడం కష్టమవుతుంది.

ఈ మార్పులు ఒక ఆరోగ్యవంతురాలైన మహిళను వ్యాధిగ్రస్త స్థితికి ఎంత చేరువ చేస్తాయంటే, ఆ పరిస్థితిలో ఆరోగ్యవంతురాలు, అనారోగ్య స్త్రీల మధ్య ఒక సన్నని రేఖ గీయడం కూడా కష్టమైపోతుంది. నూటికి 23శాతం మంది స్త్రీలు మాత్రమే బహిష్టు కాలంలో ఎలాంటి నొప్పి, బాద లేకుండా ఉండగలుగుతారు. మిగతా 77శాతం మందీ బాధను అనుభవించే వారే. ఒకసారి 1020 మంది స్త్రీలను శాంపిల్‌గా తీసుకొని, వారిని పరీక్షించడం జరిగింది. అప్పుడు వారిలో 84శాతం మంది స్త్రీలు తాము బహిష్టు కాలంలో కడుపులో నొప్పితోపాటు, ఇతర సమస్యలనూ ఎదుర్కొన్నట్లు తెలిపారు. ప్రముఖ స్త్రీ వైద్యనిపుణులు డాక్టర్ ఉమైర్ నూదాక్ ఇలా రాస్తున్నాడు :

రుతుక్రమంలో ఉన్నప్పుడు స్త్రీలు సాధారణంగా ఈ సమస్యను ఎదుర్కొంటారు:

"తలనొప్పి, అలసట, కాళ్లు చేతులు లాగడం, నీరసం, చిరాకు, కొన్ని పరిస్థితుల్లో మలమద్దకం, ఒక్కోసారి తలతిప్పడం, వాంతులు. చాలామంది స్త్రీలలో సన్నని ఛాతి నొప్పి, ఒక్కోసారి అది తీవ్రరూపం దాలుస్తుంది. బహిష్టు కాలంలో కొంతమంది స్త్రీలకు గొంతు వాపుకూడా వస్తుంది. (Thairoed)కొన్ని సమయాల్లో జీర్ణక్రియ మందగిస్తుంది. శ్వాస తీసుకోవడం కష్టమవుతుంది. డాక్టర్ కరేగర్ పరిశీలించిన స్త్రీలలో సగానికి సగంమంది బహిష్టు సమయంలో అజీర్ణ వ్యాధితో బాధపడ్డారు. చివరి రోజుల్లో మలబద్దకం ఏర్పడుతుంది. డాక్టర్ గిబ్‌హార్ద్ ఇలా అంటున్నారు. బహిష్టు సమయంలో ఎలాంటి బాధలూ, సమస్యలూ లేని స్త్రీలు చాలా తక్కువ సంఖ్యలోనే తన పరిశీలనలో తెలిసినట్లుగా హార్ద్ తెలుపుతున్నారు. తలనొప్పి, అలసట, పొత్తికడుపు నొప్పి, ఆకలి మందగించడం, చిరాకు, ఏడవాలనిపించడం లాంటి సమస్యలే ఎక్కువ మంది స్త్రీలు ఎదుర్కొంటున్నారు."

ఇలాంటి పరిస్థితిలో, బహిష్టు సమయంలో స్త్రీ అనారోగ్యంగా ఉంటుందనడమే సమంజసం. ప్రతినెలా ఆమె ఈ అనారోగ్య సమస్యను ఎదుర్కొవలసి ఉంటుంది.

ఈ శారీరక మార్పుల ప్రభావం తప్పనిసరిగా ఆమె ఆలోచనలపై, ఆమె ఆచరణలపై కూడా పడుతుంది. 1909లో Dr. Voice chevsky విస్తృతమైన పరిశోధనల తరువాత 'ఆ కాలంలో స్త్రీలు స్థిర నిర్ణయాలు తీసుకోలేకపోతారు. ఆలోచనాశక్తి తగ్గిపోతుందని తేల్చాడు. ప్రొ॥ Krschiskevsky మానసిక పరిశోధనల అనంతరం చెప్పిన సారాంశం ఇది. ఆ సమయంలో స్త్రీల నాడీ వ్యవస్థ ఉత్తేజితమవుతుంది. మానసిక దౌర్బల్యం జనిస్తుంది. జ్ఞాపకశక్తి సన్నగిల్లుతుంది. మతిమరుపు సంభవిస్తుంది. దీనివల్ల దైనందిన జీవితంలో అసమతౌల్య స్థితి ఏర్పడి, అనేక సమస్యలు ఎదురౌతాయి. ఒక స్త్రీ కండక్టర్ అయితే, ఆ సమయంలో ప్రయాణీకులకు ఒక టికెట్ ఇవ్వబోయి మరో టికెట్ ఇస్తుంది. ఒక స్త్రీ డ్రైవర్ అయితే నెమ్మదిగా భయంభయంతో నడుపుతుంది. ప్రతి మలుపులో కంగారు పడుతుంది. అలాగే ఒక లేడీ టైపిస్ట్ తప్పుగా టైప్ చేస్తుంది. చాలా నిదానంగా టైప్ చేస్తుంది. ఎంత ప్రయత్నించినా మధ్య మధ్యలో అక్షరాలు లేపేయకుండా ఉండలేదు. వాక్యాలు తప్పుగా రాస్తుంది. ఒక అక్షరంపై టైప్ చేయాలనుకుంటే వేళ్లు మరో అక్షరంపైకి వెళతాయి. ఒక మహిళా లాయర్ తన వాదనలను సమర్థవంతంగా వినిపించలేకపోతుంది. ఆమెలోని వాదనా పటిమ సన్నగిల్లిపోతుంది. ఒక మహిళా

న్యాయమూర్తి తన తీర్పులో సమతౌల్యతకు పాటించలేదు. ఆమె నిర్ణయం, తీర్పు రెండూ ప్రభావితమవుతాయి. ఒక నృత్యకారిణి, గాయకురాలు రాగయుక్తంగా పాడనూలేదు, లయబద్ధంగా నర్తించలేదు. గానప్రవీణలు, లేక నృత్య ప్రవీణలు కేవలం ఆమె గాత్రం వింటూనే ఆ స్త్రీ బహిస్టు స్థితిలో ఉందని గ్రహించగలుగుతారు.

ప్రొ॥ లాపిస్కీ (Lapinsky) The Development of personality in women అనే తన గ్రంథంలో ఇలా రాస్తున్నాడు : "బహిష్టు స్థితి స్త్రీని స్వేచ్ఛాయుత ఆచరణకు దూరం చేస్తుంది. ఆ స్థితిలో ఆమె తనకిష్టంలేని పనులకు బానిస అయిపోతుంది. తన అభీష్టం మేరకు ఏమైనా చేసే చేయకపోయే శక్తిని చాలా వరకు కోల్పోతుంది."

ఆరోగ్యకరంగా ఉన్న ఓ మహిళలోనే ఇలాంటి మార్పులన్నీ సంభవిస్తాయి. క్రమంగా అవి వృద్ధి చెందుతూ ఒక వ్యాధిగా రూపొందుతాయి. బహిష్టు స్థితిలో స్త్రీ ఉన్మాదిగా మారిన దాఖలాలు కూడా ఉన్నాయి. చిన్న చిన్న విషయాలకే కోపోద్రిక్తురాలుకావడం, అమానవీయంగా, అజ్ఞానంగా ప్రవర్తించడం, చివరికి ఆత్మహత్య వరకూ పరిస్థితులు దారితీయడం సహజం. డాక్టర్ క్రాఫ్ట్ అబైంగ్ ఇలా రాస్తున్నాడు :-

సాధారణంగా సౌమ్యగుణం కలిగిన స్త్రీలు, ఉత్తమ ప్రవర్తన కలిగినవాళ్లు, బహిష్టు సమయంరాగానే ఒక్కసారిగా మారిపోవడాన్ని మనం దైనందిన జీవితాల్లో చూస్తూ ఉంటాం. ఆ స్థితి వారిపై ఒక తుఫానులా వస్తుంది. దాంతో వారు చిరాకు, ఆగ్రహానికి లోనవుతారు. సహనం నశించిపోతుంది. భర్త, పిల్లలు, నౌకర్లు అందరిపై చిందులేస్తారు. చివరికి ముక్కూ ముఖం తెలియని అపరిచితులపట్ల కూడా దురుసుగా ప్రవర్తిస్తారు. బహిష్టుస్థితిలోనే స్త్రీలు అధికంగా నేరాలు చేస్తారని కొంతమంది నిపుణులు అభిప్రాయపడుతున్నారు. ఎందుకంటే అప్పుడు వారు తమ అధీనంలో ఉండరు. ఒక మంచి స్త్రీ ఆ స్థితిలో దొంగతనానికి పాల్పడి, తరువాత పశ్చాత్తాపపడుతుంది. వెయిన్‌బర్గ్ తన పరిశోధనల అనుభవాన్ని ఇలా రాస్తున్నాడు. ఆత్మహత్యకు పాల్పడే స్త్రీలలో 50శాతం మంది స్త్రీలు బహిష్టు స్థితిలోనే ఈ ఘాతుకానికి పాల్పడినట్లు వెల్లడైంది. ఈ కారణంగానే నేరాలకు పాల్పడిన మహిళలను విచారించేటప్పుడు వారా సమయంలో బహిష్టు స్థితిలో గాని ఉన్నారేమో న్యాయమూర్తులు పరిశీలించుకోవాలని డాక్టర్ క్రాఫ్ట్ ఎబైంగ్ అభిప్రాయపడుతున్నారు.

నెలసరి దినాలకు మించి గర్భందాల్చిన కాలం స్త్రీలకు మరింత కష్టకాలం. డాక్టర్ రెగ్రేఫ్ ఇలా రాస్తున్నాడు : గర్భస్థ సమయంలో స్త్రీల శరీరం నుండి వెలువడే వ్యర్థాలు కొన్నిసార్లు అవసరానికి మించి విసర్జితమవుతాయి. ఆ కాలంలో ఆమెలోని శక్తిసామర్థ్యాలు గర్భంలేని సాధారణ స్థితిలో ఉన్నంత పటిష్టంగా ఉండవు. శారీరకంగా, మానసికంగా బలహీన పడిపోతాయి. ఆ కాలంలో ఆమెపై సంభవించే పరిస్థితులు ఒకవేళ పురుషుల, లేక గర్భరహిత స్థితిలో స్వయంగా స్త్రీలపై సంభవించినా ఖచ్చితంగా వారిని రోగగ్రస్తులుగా నిర్ధారించవచ్చు. ఆ కాలంలో అనేక నెలలపాటు ఆమె నాడీ వ్యవస్థ బలహీనపడి ఉంటుంది. మానసిక సంతులనం కొరవడుతుంది. మొత్తం శారీరక, మానసిక వ్యవస్థ గందరగోళానికి గురవుతుంది. ఆమె ఆరోగ్యం అనారోగ్యాల మధ్య ఊగిసలాతూ ఉంటుంది. ఒక చిన్నపాటి కారణం కూడా ఆమెను అనారోగ్యం అంచుల వరకూ చేర్చడానికి సరిపోతుంది. డాక్టర్ ఫిషర్ ఇలా అంటున్నారు : ఆరోగ్యవంతురాలైన స్త్రీ కూడా గర్భస్థ సమయంలో మానసిక దౌర్బల్యానికి లోనవుతుంది. ఆమెలో చంచలత్వం ఏర్పడుతుంది. ఆలోచనలు స్థిరంగా ఉండవు. మస్తిష్కం గందరగోళానికి లోనవుతుంది. వివేకం, ఆలోచనా శక్తి సన్నగిల్లుతుంది. హ్యూలాక్ ఐలీస్, అల్‌బర్ట్‌మూల్ ఇంకా కొంతమంది నిపుణులు గర్భవతియైన స్త్రీని చివరి నెలలో ఏవిధమైన శారీరక, మానసిక శ్రమకు గురిచేయరాదని ఏకాభిప్రాయం వ్యక్తం చేశారు.

ప్రసవం తరువాత అనేక వ్యాధులు ప్రబలడానికి, వృద్ధిచెందడానికి ఎక్కువుగా ప్రమాదం పొంచి ఉంటుంది. ప్రసవ గాయం విష ప్రభావం గ్రహించడానికి అనువుగా ఉంటుంది. గర్భానికి పూర్వమున్న స్థితికి చేరుకోడానికి అవయవాల్లో ఒక రకమైన చలనం ప్రారంభమవుతుంది. ఇది మొత్తం శారీరక్యవస్థను ఒక కుదుపు కుదుపుతుంది. ఛిన్నాభిన్నం చేస్తుంది. ఒకవేళ ఎలాంటి ప్రమాదం ఎదురుకాకపోయినప్పటికీ, తన అసలు స్థితికి చేరుకోడానికి అనేక వారాలు పడుతుంది. ఈ విధంగా ప్రసవం తరువాత దాదాపు సంవత్సరం పాటు స్త్రీ ఒక రకమైన అనారోగ్య స్థితిలో ఉంటుంది. కనీసం ఎంతో కొంత అనారోగ్యంగానైనా ఉంటుంది. ఆమెలోని శక్తి సామర్థ్యాలు సాధారణ స్థితితో పోల్చుకుంటే కాన్పు తరువాత గణనీయంగా తగ్గిపోతాయి.

ఇక బిడ్డకు పాలిచ్చే కాలంలో స్త్రీ తాను తన కోసం కాకుండా, దైవం తనకు ప్రసాదించిన అమానతుకోసమే బతుకుతుంది. ఆమె శరీరంలోని అణువణువూ

బిడ్డకోసం పాలుగా తయారవుతుంది. ఆమెసేవించే ఆహారంలో కేవలం ఆమె బతికుండడానికి మాత్రమే పరిణామం శరీరానికి అంది మిగతా మొత్తం పాల ఉత్పత్తి కోసమే ఖర్చవుతుంది.

తరువాత కొంతకాలం వరకు శిశువు సంరక్షణ, పోషణ, శిక్షణల కోసం ఆమె పూర్తిగా దృష్టి కేంద్రీకరించవలసి ఉంటుంది. ఈ రోజుల్లో తల్లి పాలకు బదులు పోతపాల వంటి కృత్రిమ విధానాన్ని అవలంబిస్తున్నారు. కాని ఇది సమస్యకు సరైన పరిష్కారం కాదు. ఎందుకంటే ప్రకృతి పిల్లల పోషణకు కావలసిన సామగ్రిని తల్లి ఎదలోనే ఉంచింది. దీనికి సరితూగే పోషణ సామగ్రి మరెక్కడా లభించదు. పిల్లలను తల్లిపాలనుండి దూరం చేయడం వారిపై దౌర్జన్యం చేయడం స్వార్థపరత్వం తప్ప మరేమీ కాదు. పిల్లల ఆరోగ్యానికి, వారి వృద్ధి వికాసాలకు తల్లిపాల కంటే శ్రేష్టమైనది మరొకటిలేదని నిపుణులందరి ఏకాభిప్రాయం.

ఇదే విధంగా సంతాన సంరక్షణ, వారి శిక్షణ కారణంగా మహిళలను బయటి పనుల్లో అంతరాయం కలగకుండా ఉండేందుకు నర్సింగ్‌హోంలు, కేర్ సెంటర్‌లు ఉనికిలోకొచ్చాయి. తల్లులు తమ పిల్లలను ఈ సెంటర్స్‌లో పడేసి తాము హాయిగా బయటి పనుల్లో నిమగ్నం కావచ్చు. కాని నర్సింగ్‌హోముల్లో, కేర్ సెంటర్స్‌లో పిల్లలకు మాతృప్రేమ లభిస్తుందా? పసి పిల్లల పట్ల మాతృ హృదయంలో ఉప్పొంగే ప్రేమ అద్దె మనసుల్లో ఉంటుందా? పసి పిల్లలకు ప్రారంభ దశలో అందించవలసిన ప్రేమానురాగాలతో నిండిన నిస్వార్థ సేవలు డబ్బులు తీసుకొని కిరాయికి అందించేవారి హృదయాల్లో ఎక్కడినుండి పుట్టుకొస్తాయి. సంతాన శిక్షణకు సంబంధించిన ఈ ఆధునిక విధానాలు నేటి వరకూ ఎక్కడా పరీక్షించబడలేదు. ఈ ప్రయోగాల విజయ వైఫల్యాలకు సంబందించిన సంపూర్ణ స్వరూప స్వభావాలు ఇంకా పూర్తిగా తెలియని కారణంగా దీనిపై అప్పుడే ఒక అభిప్రాయానికి రావడం కుదరదు. కనుక ప్రపంచం తల్లి ఒడికి ప్రత్యామ్నాయం కనుగొన్నదని చెప్పడం తొందరపాటు చర్యే అవుతుంది. అందుకే పిల్లల సహజసిద్ధమైన ప్రాథమిక శిక్షణగా కేంద్రం తల్లి ఒడే అని ఖచ్చితంగా చెప్పవచ్చు.

ఒకవేళ స్త్రీ పురుషుల శారీరక, మానసిక శక్తి సామర్థ్యాలు సమానమే అయినప్పటికీ, ప్రకృతి మాత్రం ఇద్దరిపై సమాన బాధ్యతలు మోపలేదన్న దాన్ని సామాన్యులు కూడా అర్థం చేసుకోగలుగుతారు. మానవ జాతిని సంరక్షించే క్రమంలో పురుషునిగా తన విధిని నెరవేర్చడమే తప్ప మరెలాంటి బాధ్యతా అతనిపై

మోపబడలేదు. తరువాత అతను జీవితంలోని ఏ రంగంలోనైనా కార్యకలాపాలు నిర్వహించుకోవచ్చు. కాని తరువాతి భారమంతా స్త్రీపైనే మోపబడింది. ఈ భారాన్ని మోయడానికి మాతృగర్భంలో మాంసం ముద్దగా ఉన్నప్పటినుండే ఆమెను సన్నద్ధం చేయడం జరిగింది. అందుకే ఆమె శరీరంలోని యంత్రాంగాన్నంతా దానికి అనువుగా తయారు చేయడం జరిగింది. ఈ కారణంగానే ఆమె యుక్త వయసులోని కాలమంతా రుతుక్రమం జరుగుతూ ఉంటుంది. ప్రతినెలా మూడు నుండి ఏడు, పది రోజుల వరకు ఏదైనా పెద్ద బాధ్యతా భారం మోయడానికి గాని, లేక ఏదైనా శారీరక మానసిక శ్రమ చేయడానికి గాని, ఆమె సంసిద్ధంగా ఉండజాలదు. అందుకే గర్భం దాల్చింది మొదలు, ప్రసవం తరువాత కూడా సంవత్సర కాలమంతా ఆమె ఇబ్బందులతోనే గడపవలసి ఉంటుంది. నిజానికి ఆమె ఈ కాలంలో ప్రాణాలరచేతిలో పెట్టుకొని గడుపుతుందంటే అతిశయోక్తి కాదు. ఈ కారణంగానే ఆమె పాలుపట్టే రెండేళ్లు తన శరీరంలోని రక్తాన్నంతా ధారపోసి మానవ వ్యవసాయ క్షేత్రాన్ని సాగుచేస్తుంది. తన గుండెల్లోని పాల ప్రవాహంతో దాన్ని తడిపి ఊపిరిపోస్తుంది. అందుకే పిల్లల ప్రారంభదశ పోషణ కోసం అనేక సంవత్సరాలు ఆమె శ్రమించవలసి ఉంటుంది. ఈ క్రమంలో ఆమెకు పగటి విశ్రాంతి, రాత్రి నిద్ర కూడా నిషిద్ధమైపోతాయి.

ఈ విధంగా ఆమె తన విశ్రాంతిని, తన సంతోషాన్ని, కోరికలను తన సమస్తాన్నీ భవిష్యత్తరాల కోసం త్యాగం చేస్తుంది.

ఇలాంటి పరిస్థితిలో న్యాయం కోరేదేమిటో ఆలోచించండి. పురుషుని భాగస్వామ్యం లేని సహజసిద్ధ బాధ్యతలను కూడా నెరవేరుస్తూ, పురుషునితో సమానంగా సమాజ బాధ్యతలను కూడా ఆమెపై మోపడం న్యాయమా? సామాజిక బాధ్యతలు మోయడానికే పురుషుణ్ని స్త్రీకి కేటాయించిన బాధ్యతల నుండి తప్పించడం జరిగింది. ప్రకృతి పరంగా, సహజసిద్ధంగా నీపై పడే బాధలు కష్టాలు కూడా భరించు, మాతో పాటు సంపాదించడానికీ కష్టపడు. న్యాయస్థానాల్లో, రాజకీయాల్లో, ఉద్యోగాలు, వ్యాపారాలు, వ్యవసాయం, శాంతి భద్రతల పరిరక్షణ, దేశ రక్షణలాంటి వ్యవహారాల్లో కూడా సమాన బాగస్వామ్యమంతో పనిచేయి. మాతోపాటు బయటికొచ్చి మమ్మల్ని అలరించు. మా భోగవిలాసాలకు, కోరికల పరిపూర్తికి కావలసిన ఏర్పాట్లు సిద్ధం చేయి అని ఆమెను కోరడం న్యాయమా? ఎంతమాత్రం

కాదు. ఇది పూర్తిగా ఆమెపట్ల దౌర్జన్యం. సమానత్వం కాదు పూర్తి అసమానత్వం. న్యాయం కోరేదేమిటంటే, ఎవరిపైనైతే ప్రకృతి ఎక్కువగా భారం మోపిందో, వారికి సమాజంలో స్వల్పస్థాయి బాధ్యతలు మాత్రమే కేటాయించాలి. ప్రకృతిపరంగా ఏ భారం లేని వారు సమాజంలోని అన్ని బరువు బాధ్యతలు మోయవలసి ఉంటుంది. కుటుంబ సేవ, కుటుంబ పోషణ, సంరక్షణ బాధ్యత కూడా వారిపైనే ఉండాలి ఇదీ న్యాయం.

ఇంతేకాదు, స్త్రీపై సహజసిద్ధంగా తారసిల్లినవి తప్ప బయటి బాధ్యతలు మోపటం కూడా ఆమెపట్ల దౌర్జనమే. ఎందుకంటే పురుష బాధ్యతలు మోసే శక్తిసామర్థ్యాలు ఆమెలో ఉండవు. సహజసిద్ధంగా ఆమె మోసే బాధ్యతలకు అదనంగా ఆమెపై భారం వేసి సమానస్థాయి కల్పించామని చెప్పడం అన్యాయం, దౌర్జన్యం తప్ప మరేమీ కాదు. ప్రకృతి ఎవరికి కేటాయించిన బాధ్యతలు వారే నిర్వహించాలి. స్త్రీలతో పోల్చుకుంటే పురుషులు శారీరకంగా, మానసికంగా కాస్త బలవంతులనడంలో సందేహం లేదు. అందుకని కఠినతరమైన బరువు బాధ్యతలన్నీ పురుషులే నిర్వర్తించాలి. అలాకాకుండా సమానత్వం పేరుతో అన్ని రంగాల్లో వారిని భాగస్వాములను చేయాలనుకోవడం పొరపాటు. ఎందుకంటే, స్త్రీలు నెలకోసారి కొన్ని రోజుల పాటు ఒక ప్రత్యేక స్థితిని ఎదుర్కొంటారు. ఈ కాలంలో వారి శారీరక, మానసిక శక్తిసామర్థ్యాలు పూర్తిగా మందగిస్తాయి. అలాంటప్పుడు వారు తమ బాధ్యతలను సమర్థవంతంగా ఎలా నెరవేర్చగలుగుతారు? ఉదాహరణకు, యుద్ధరంగంలో అందరూ స్త్రీలే ఉన్నటువంటి సైన్యం ఒకటుందనుకోండి. యుద్ధం కీలక దశకు చేరుకున్న సమయంలో అత్యధిక శాతంమంది నెలసరి రావడంతో నీరసపడిపోతారు. కొంతమంది గర్భిణులు కావడం వల్ల కదల్లేని స్థితిలో విశ్రాంతి తీసుకుంటారు. మరికొంతమంది ప్రసవవేదనతో గుడారాల్లోకి చేరిపోతారు. అప్పుడా సైన్యం పరిస్థితి ఏమిటి? ఇది చాలా కష్టతరమైన బాధ్యత అని మీరు అనరా? ఇది చాలా కష్టతరమైన బాధ్యతతో సంబంధం కలిగిన విషయమని మీరంటారు. కాని, పోలీసు యంత్రాంగం, న్యాయవ్యవస్థ, పాలనా వ్యవహారం, దౌత్యబాధ్యతలు, రైల్వే, ఉద్యోగ వ్యాపార, పారిశ్రామిక రంగాల్లో విశ్వసనీయతకు యోగ్యమైన రంగం ఏది? కనుక ఎవరైతే స్త్రీల ద్వారా పురుషులు చేసే పని చేయించాలనుకుంటున్నారో, బహుశా వారి ఉద్దేశ్యం స్త్రీలందరినీ స్త్రీలు కాకుండా చేసి మానవజాతిని అంతం చేయడం, లేక వారిలో ఖచ్చితంగా కొద్దిశాతం మందిని స్త్రీత్వానికి దూరం చేయడానికి

ఎంపిక చేయడం, లేక అన్ని సామాజిక వ్యవహారాల్లో వారి యోగ్యతా శాతాన్ని కనీస స్థాయికి దిగజార్చడం.

మీరు ఈ రూపాల్లో దేన్నయినా అవలంబించండి. స్త్రీని పురుష కార్యాలకోసం తయారుచేయడం ప్రకృతికి, సహజత్వానికి, ప్రకృతి ఉద్దేశ్యాలకు పూర్తి వ్యతిరేకం. ఇది మానవత్వానికి, స్వయంగా స్త్రీ ఉనికికే ప్రమాదకరం. ఎందుకంటే జీవశాస్త్రం ప్రకారం స్త్రీ శిశువుకు జన్మనివ్వడం, దాన్ని పెంచి పోషించడానికే ఆమె సృజన జరిగింది. అందుకే మానసికంగా కూడా ఆమె సహజ నైజానికి అనుగణమైన శక్తి సామర్థ్యాలనే సుగుణాలను ప్రసాదించడం జరిగింది. అంటే, ప్రేమ, కరుణ, జాలి, దయ, క్షమ, మార్దవం, సేవాభావం సిగ్గు సౌశీల్యంలాంటివన్నమాట. దీనికి భిన్నంగా పురుషునిలో కాఠిన్యం పాలు కాస్త ఎక్కువ. కఠిన నిర్ణయాలు తీసుకోవడంలో పురుషులు చూపించే తెగువ స్త్రీలు చూపించలేరు. వారిలో సున్నితత్వం పాలు అధికం. అందుకని ఎవరి రంగాల్లో వారు పనిచేయడమే సమాజానికి అన్ని విధాలా శ్రేయస్కరం. అలాకాకుండా అన్ని రంగాల్లోనూ స్త్రీని రుద్దాలని చూస్తే ఆమెలోని శక్తి సామర్థ్యాలను వృధా చేయడంతోపాటు, ఆయా రంగాలకూ అన్యాయం చేసినట్లవుతుంది.

ఇలా చేయడం స్త్రీని ప్రగతివైపు నడిపించడమా? ఎంతమాత్రం కాదు. ఇది ఖచ్చితంగా తిరోగమన విధానమే. అసలు ప్రగతి అంటే ఏమిటి? ఒకరి సహజసిద్ధమైన శక్తి సామర్థ్యాలను అణిచి వేయడమా? తుడిచి వేయడమా? ప్రకృతి పరంగాలేని కృత్రిమ సామర్థ్యాలను ఆమెలో జొప్పించాలని, ప్రయత్నించడమా? నిజానికి ప్రగతి ఏమిటంటే, ప్రకృతి పరమైన సహజ సామర్థ్యాలను వృద్ధిపరచడం, వాటికి మరింత సానపెట్టి అద్భుతంగా తీర్చిదిద్దడం, వారి వృద్ధీ వికాసాలకు అత్యుత్తమ ఆచరణా మార్గాలు తెరవడం. ఇదీ ప్రగతి అంటే.

ఇందులో స్త్రీల కోసం సాఫల్యం కాక వైఫల్యమే ఉంది. జీవితంలోని ఒక పార్శ్వంలో స్త్రీలు బలహీనులైతే పురుషులు బలవంతులు. మరో కోణంలో పురుషులు బలహీనులైతే స్త్రీలు బలవంతులుగా ఉన్నారు. స్త్రీలు బలహీనంగా ఉన్నరంగం నుండి వారిని తీసుకొచ్చి పురుషులకు ధీటుగా నిలబెడితే, ఖచ్చితంగా వారు పురుషుల కన్నా తక్కువ స్థాయిలోనే ఉంటారు. మీరు ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ వారిలో ఒక అరిస్టాటిల్, ఒక ఇబ్నెసీనా, కాంట్, హీగల్, షేక్స్‌పియర్, సికిందర్, నెపోలియన్,

సలాహుద్దీన్, నిజాముల్ ముల్క్‌తౌసీ, బస్మార్క్ లాంటి వారికి దీటైన వారు రాలేరు. అలాగే, ప్రపంచంలోని పురుషులందరూ కలసి ఎన్ని ప్రయత్నాలు చేసినా, వారు తమ మొత్తం జాతినుండి ఒక సాధారణ స్థాయి తల్లిని కూడా సృష్టించలేరు.

కనుక, ఈ పరస్పర వైరుధ్య విధానంలో సమాజానికి లాభం కాక నష్టమే ఉంది. మానవ జీవితానికి, సమాజానికి స్థిరత్వం, కఠినత్వం, ఎంత అవసరమో, మార్దవం, నమ్రత, సౌమ్యత కూడా అంతే అవసరం. మంచి సైన్యాధ్యక్షులు, మంచి ఆలోచనాపరులు, మంచి అధికారులు, మంచి పాలకుల అవసరం ఎంతుందో, మంచి మాతృమూర్తులు, మంచి భార్యలు, మంచి కుటుంబాల అవసరం కూడా అంతే ఉంది. ఈ రెండు అంశాల్లో దేన్ని విస్మరించినా మొత్తం మీద సమాజమే నష్టపోతుంది.

ఈ విభజన స్వయంగా ప్రకృతే మానవుల (ఆడ, మగ) మధ్య నెలకొల్పంది. జీవశాస్త్రం, మానసిక శాస్రం, వైద్య ఆరోగ్య శాస్త్రాల్లాంటి అన్ని శాస్త్రాల్లోనూ సూచనప్రాయంగా ఈ విభజన నిబిడీకృతమై ఉంది. శిశువుకు జన్మనివ్వడం, ఆలన, పాలనలాంటి సేవలు స్త్రీలకు మాత్రమే ప్రత్యేకం. ఇందులో భిన్నాభిప్రాయానికి తావులేదు. ఈ ప్రకృతి నిర్ణయాన్ని మార్చే శక్తి ఏ కృత్రిమ శక్తికీ లేదు. ఈ వాస్తవాన్ని తు.చ. తప్పకుండా అంగీకరించి స్త్రీకి గౌరవప్రదమైన ఔన్నత్యస్థానం ఇచ్చిన సమాజమే ఒక మంచి సమాజంగా మనగలుగుతుంది. ధర్మసమ్మతమైన ఆమె సామాజిక, ఆర్థిక హక్కులను అంగీకరించి, ఆమెకు కేవలం కుటుంబ బాధ్యతలనే అప్పగించాలి. బయటి బాధ్యతలన్నీ పురుషుడు చూసుకోవాలి. ఏ సమాజమైతే ఈ విభజనను తుడిచివేయడానికి ప్రయత్నిస్తుందో, అది తాత్కాలికంగా ప్రగతి సాధించినట్లు కనిపించినా, చివరికి ఇలాంటి సమాజ పతనం ఖాయం. ఎందుకంటే స్త్రీలపై పురుషులతో సమానమైన బరువు బాధ్యతలు మోపినప్పుడు ఆమె తనపై ఉన్న సహజసిద్ధమైన బాధ్యతా భారాన్ని తీసి అవతల పారేస్తుంది. ఫలితంగా సమాజమొక్కటే కాదు, మొత్తం మానవతే నాశనమయ్యే ప్రమాదం ఉంది. స్త్రీ తన సహజనైజానికి భిన్నంగా ఒకవేళ ప్రయత్నిస్తే ఏదో ఒక మేర పురుషులతో పోటీ పడగలదేమో కాని, పురుషుడు మాత్రం ఎట్టి పరిస్థితిలోనూ శిశువులకు జన్మనివ్వడం, వారి ఆలనా, పాలనా చూడడం లాంటి పనులు మాత్రం చేయలేడు. ఈ ప్రకృతి విభజనను దృష్టిలో ఉంచుకొని, కుటుంబ వ్యవస్థ, సమాజంలో స్త్రీ పురుషుల బాధ్యతలను నిర్వచిస్తే (నిర్ణయిస్తే) వారి కనీస బాధ్యతలు ఈ విధంగా ఉంటాయి.

1) కుటుంబ పోషణ కోసం సంపాదించడం, కుటుంబాన్ని సంరక్షించడం, సమాజం కోసం శ్రమించడం లాంటి పనులన్నీ పురుషులపని. దీనికోసం అతని విద్యా శిక్షణలు ఎలా ఉండాలంటే, ఈ ఉద్దేశ్యాల పరిపూర్తికి అతడు ప్రయోజనకారి కాగలగాలి.

2) పిల్లల సంరక్షణ, వారి ఆలనా పాలన, కుటుంబ బాధ్యతలు కుటుంబంలో సుఖశాంతులు పరిఢవిల్లే విధంగా చూసుకోవడం స్త్రీల బాధ్యత. దీనికోసం ఆమెకు మంచి విద్యా శిక్షణల తర్ఫీదు అవసరం.

3) కుటుంబ వ్యవస్థ ఛిన్నాభిన్నం కాకుండా పటిష్టంగా ఉండడం కోసం చట్టపరిధిలో సర్వాధికారాలు కల ఒక వ్యక్తి అవసరం. ఎందుకంటే కుటుంబం ఎవరికి వారే అన్నట్టుగా చిందరవందరగా ఉండడానికి వీల్లేదు. ఇలాంటి వ్యక్తి పురుషుడే కావాలి. స్త్రీలైతే సహజసిద్ధంగా తమకెదురయ్యే నెలసరి తలనొప్పుల కారణంగా ఇలాంటి బాధ్యతలను సమర్ధవంతంగా టాకిల్ చేయకపోవచ్చు.

4) సామాజిక వ్యవస్థలో ఇలాంటి విభజన, శిక్షణ వ్యవస్థను సుస్థిరంగా ఉంచడానికి సంరక్షణా చర్యలు తప్పనిసరిగా తీసుకోవాలి. ఎందుకంటే, కొంతమంది అజ్ఞానులు తమ అతి తెలివితో స్త్రీ పురుష రంగాల్లో మిశ్రమ సంస్కృతిని ప్రవేశపెట్టి ఒక మంచి సామాజిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసే అవకాశం లేకుండా చేయాలి.



## 8, వ అధ్యాయం

# మానవ తప్పిదాలు

గత పంక్తుల్లో కేవలం శాస్త్రీయ ఉదాహరణల ఆధారంగా మేము మానవ నైజంలోని సానుకూలతలు, మానవమేధలోని ప్రతికూలతలు, దేహ నిర్మాణంలోని అన్ని విషయాలను దృష్టిలో ఉంచుకొని ఒక మంచి సామాజిక వ్యవస్థను ఏర్పరచ దలిస్తే, స్త్రీ పురుష సంబంధాలకు అవసరమైన విధి విధానాలు ఏమిటన్న విషయం చెప్పడానికి ప్రయత్నించాము. ఈ చర్చలో మేమెక్కడా వాదనలకు తావిచ్చే పోలికలను తీసుకురాలేదు. ఇందులో చర్చించినదంతా శాస్త్రీయత, వివేకం ద్వారా చర్చించిందే. సాధారణంగా ఇవన్నీ విద్యావంతులందరికీ తెలిసిన విషయాలే. కాని మానవుని నిస్సహాయత చూడండి. మానవుడు నిర్మించిన సామాజిక వ్యవస్థలన్నింటిలో ఏ ఒక్క దాంట్లో కూడా సర్వసామాన్య, మానవ సహజ హితవులు ఉపదేశాలను కనీసం సమతూకం కోసమైనా ఉంచకుండా బొత్తిగా విస్మరించారు. మానవుడు స్వయంగా తన నైజమేమిటో స్వభావమేమిటో తెలియకుండా లేడన్నది సుస్పష్టం. తన శారీరక ప్రత్యేకతలు, తన మానసిక ఆలోచనలు, శక్తి సామర్థ్యాలు, ఏమిటో తనకు పూర్తిగా తెలుసు. అయినప్పటికీ ఒక ఆమోదయోగ్యమైన, సమతుల్యమైన, సహజసిద్ధ సూత్రాల కనుగుణమైన, మధ్యేమార్గ సామాజిక వ్యవస్థను నిర్మించడంలో విఫలమయ్యాడన్న విషయం చాలా స్పష్టంగా తెలుస్తోంది.

### వైఫల్యానికి అసలు కారణం

దీనిక్కారణం ఏమిటో పుస్తక ప్రారంభంలోనే మేము సూచన ప్రాయంగా తెలియజేశాము. మానవుడి నైజంలో ఉన్న సహజమైన బలహీనత ఏమిటంటే, అతని దృష్టి ఏ అంశంలోనైనా, దాని సమస్త పార్శ్వాలపై సమానంగా, పరిపూర్ణంగా ప్రసరించజాలదు. ఎప్పుడూ ఏదో ఒక కోణమే అతడ్ని తనవైపు అధికంగా ఆకర్షి స్తుంది. అతడు ఆ వైపు మొగ్గుచూపగానే,మరోవైపు అతని శ్రద్ధ సహజంగానే తగ్గి పోతుంది. లేదా కావాలనే దాన్ని విస్మరిస్తాడు. జీవితంలోని వ్యక్తిగత వ్యవహారాల్లో మానవుడి ఈ బలహీనత స్పష్టంగా కానవస్తుంది. మరిలాంటప్పుడు సమాజంలోని అనేక సమస్యలు ఈ బలహీనతకు ప్రభావితం కాకుండా ఎలా ఉంటాయి? విద్యా బుద్ధీ విచక్షణా జ్ఞానం మానవుడికి ప్రసాదించబడింది కాని, సాధారణంగా ఈ

వ్యవహారాల్లో కేవలం విచక్షణ జ్ఞానమొక్కటే మార్గదర్శి కాజాలదు. ముందుగా కోరికలు, అతణ్ని ఒక దిశవైపుకు మళ్లిస్తాయి. దీంతో అతడు ఆ దిశవైపు మొగ్గు చూపుతాడు. అప్పుడు వివేక విజ్ఞతలను ఆశ్రయిస్తాడు. ఈ పరిస్థితిలో ఒకవేళ స్వయంగా అతని వివేకమే వ్యవహారానికి సంబంధించిన మరో కోణాన్ని చూపిస్తే, అతడి బుద్ధి అతణ్ని ఈ అసంపూర్ణ దిశపట్ల హెచ్చరిస్తే అప్పుడు కూడా అతడు తప్పును అంగీకరించడు. పైగా తన వైఖరికనుగుణమైన వాదన కోసం బుద్ధీ జ్ఞానాలను ఇబ్బందికి గురిచేస్తాడు.

## స్పష్టమైన కొన్ని ఉదాహరణలు

సమాజంలోని ఏ సమస్యను గురించైతే మనం ఇంతవరకూ చర్చిస్తూ ఉన్నామో, అందులో మానవుడి యొక్క ఈ ఒంటెద్దుపోకడలోని హెచ్చుతగ్గుల విధానం చాలా స్పష్టంగా మనముందుకొచ్చింది.

ఒకవర్గం నైతికత, ఆధ్యాత్మికత వైపుకు మొగ్గింది మంచిదే. మానవ సమాజం లో ఇవి తప్పనిసరిగా ఉండవలసిన విషయాలే. కాని ఇది అతివాదంగా మారి అసలు స్త్రీ పురుషుల దాంపత్య సంబంధాలనే ఒక నీచమైన కార్యంగా తీర్మానిం చేసింది. ఈ అతివాదం లేక అసమతౌల్యం మనకు బౌద్ధమతంలో, క్రైస్తవంలో మరికొన్ని హిందూ మతాలలో కనబడుతుంది. దీని ప్రభావం వల్లనే ఇప్పటివరకూ ప్రపంచంలోని ఓ పెద్ద భూభాగంలో లైంగిక సంబంధాలను తప్పుగా భావిస్తున్నారు. ఆ సంబంధాలు దాంపత్య బంధం పరిధిలో ఉన్నా వెలుపల ఉన్నా తప్పేనన్న భావం నెలకొని ఉంది. ఫలితం ఏమైంది? ఫలితంగా సన్యాసత్వం లాంటి అసహజ, అనాగరిక జీవితాన్ని నైతికమైన ఆత్మపరిశుద్ధ జీవితంగా భావించడం జరిగింది. మానవ జాతిలో అనేక మంది స్త్రీ పురుషులు తమ మేధాశక్తిని, శారీరక సామర్థ్యాలను తమ నైజానికి భిన్నంగా, ప్రకృతితో సంఘర్షిస్తూ వ్యర్థం చేశారు. ఇక ఎవరైతే తమ సహజ నైజానికి తలొగ్గి సంబంధం నెరిపినా, గతిలేని స్థితిలో తన పాపపు కోరిక తీర్చుకున్న విధంగా కుంగిపోతారు. ఈ విధమైన సంబంధం దంపతుల మధ్య ప్రేమను, సహకారభారాన్ని ఎట్టి పరిస్థితిలోనూ పెంపొందించదు. దీనిద్వారా ఒక చక్కని సత్సమాజం ఉనికిలోకొస్తుందని కూడా ఆశించలేము. ఇంతేకాదు, సమాజంలో స్త్రీ స్థానం పడిపోవడానికి కూడా ఈ ఊరూపేరూ లేని ఆధ్యాత్మికత ప్రభావమే ప్రధానకారణం. సన్యాసత్వాన్ని సమర్థించే అపర ఆధ్యాత్మిక వాదులు లైంగిక ఆకర్ష ణను షైతాన్ ప్రభావమని, ఈ ఆకర్షణకు పురిగొలిపే సాధనాన్ని, అంటే స్త్రీని

షైతాన్ ఏజెంటు అని నిర్ధారించారు. ఆమె ఉనికే పాపానికి మూలమని, పరిశుద్ధతను కోరుకునే ప్రతి ఒక్కరూ స్త్రీ ఉనికిని అసహ్యించుకోవడం తప్పనిసరి అని తీర్మానించారు. క్రైస్తవం, బుద్ధిజం, ఇంకా హైందవ సాహిత్యంలో స్త్రీని గురించి ఇలాంటి భావాలే అధికంగా ఉన్నాయి. మరిలాంటప్పుడు ఏ సామాజిక వ్యవస్థ ఇలాంటి భావాల పునాదులపై నిర్మితమవుతుందో, అలాంటి సమాజంలో స్త్రీ స్థానం ఏవిధంగా ఉంటుందో ఊహించడం కష్టం కాదు.

దీనికి భిన్నంగా, మరోవర్గం మరో రకమైన అతిశయానికి పోయింది. అందులోనూ అది మానవ నైజం అవసరాలు కాదుగదా పశు నైజ అవసరాలను కూడా పట్టించుకోలేదు. పాశ్చాత్య సమాజంలో ఇప్పుడిది దాచినా దాగని సత్యం. వారి చట్టాల ప్రకారం వ్యభిచారం అసలు నేరమే కాదు. ఒకరకంగా బలాత్కారం నేరమవుతుంది, లేక చట్టపరమైన హక్కుల్లో జోక్యం చేసుకుంటే నేరమవుతుంది. ఈ రెండింటి పరిధిలోకి రాకపోతే వ్యభిచారం స్వతహాగా శిక్షార్హమైన నేరమేమీ కాదు. నైతికంగా కూడా ఏమంత సిగ్గుపడే పని కూడా కాదు. ఇక్కడ వరకు వారు కనీసం పశునైజం పరిధిలోనైనా ఉన్నారు. కాని తరువాత మరికాస్త ముందుకు వెళ్లారు. లైంగిక సంబంధం కేవలం సంతానోత్పత్తికోసమేనన్న పశునైజాన్ని కూడా విస్మరించి, కేవలం భౌతిక ఆనందం కోసమే ప్రత్యేకించుకున్నారు.

ఇంకొక వర్గం కుటుంబం ప్రాముఖ్యతను గుర్తించినప్పటికీ ఆ వ్యవస్థలో ఒక వ్యక్తిని ఎంతగా బంధించిందంటే, అతని హక్కులు, బాధ్యతల్లో అసలు సమతూకమన్నదే లేకుండా చేసింది. హైందవ కౌటుంబిక వ్యవస్థే దీనికి ప్రత్యక్ష ఉదాహరణ. హిందూ కుటుంబ వ్యవస్థలో స్త్రీలకు భావప్రకటనా స్వేచ్ఛగాని, ఆచరణా స్వేచ్ఛగాని లేవు. సమాజంలో ఆమెకెలాంటి హక్కులూ లేవు. ఆమె కూతురైనా భార్య అయినా, తల్లి అయినా అన్ని రూపాల్లోనూ ఆమె బానిసే. వితంతువు అయితే ఇక చెప్పాల్సిన పనేలేదు. సజీవ దహనానికి సిద్ధం కావాల్సిందే. ఆమె భాగానికి బాధ్యతలే కాని, హక్కుల విషయానికొస్తే ఆమె వాటా సున్నా. కనీసం ఆమె తన వ్యక్తిత్వాన్ని కూడా గుర్తించగల స్పృహ కూడా లేనంతగా ఈ సామాజిక వ్యవస్థలో ఆమెనొక నోరున్న పశువుగా మార్చడానికి ప్రయత్నాలు జరిగాయి. ఈ విధంగా కౌటుంబిక వ్యవస్థ పునాదుల్ని పటిష్టపరిచి, ఆమె ఎంతమాత్రం తిరుగుబాటు ఆలోచనలు చేయకుండా దారులు మూసేయడం జరిగింది. కాని, సంఘంలో సగభాగం అయినటువంటి స్త్రీ జాతిని అణగదొక్కి ఈ వ్యవస్థ తన నిర్మాణంలో లోపాలు మాత్రమే కాకుండా,

ప్రమాదకరమైన ద్వారాలు కూడా తెరిచింది. దీని దుష్ఫలితాలు ఈనాడు స్వయంగా హిందు బంధువులు కూడా చవిచూస్తున్నారు.

ఇక మరోవర్గం స్త్రీ జాతిని ఔన్నత్య స్థాయికి తీసుకువెళ్లే ప్రయత్నంలో ఆమెకు హద్దులు మీరిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ప్రసాదించింది. దీనివల్ల కుటుంబ వ్యవస్థే ఛిన్నాభిన్నమైపోయింది. భార్య అయినా, కూతురైనా, కొడుకైనా ఏ రూపంలో ఉన్నా అందరూ స్వేచ్ఛా ప్రియులే. కుటుంబంలో పెద్దంటూ ఎవరూ ఉండరు. ఎవరికీ ఎవరిపై ఎలాంటి అధికారం ఉండదు. రాత్రి నువ్వు ఎక్కడికెళ్లావు, ఎక్కడ గడిపావు అని భర్త భార్యను అడగలేడు. అమ్మా నువ్వు ఎక్కడికెళుతున్నావు, ఎవరితో కలిసి తిరుగుతున్నావు అని తండ్రి కూతుర్ని ప్రశ్నించలేడు. వాస్తవానికి భార్యాభర్తలు సమాన స్నేహితులు మాత్రమే. సమాన బాధ్యతలతో ఒక కుటుంబాన్ని ఏర్పరచుకుంటారు. ఆ కుటుంబమనే అసోసియేషన్‌లో వారి సంతానం చిన్నపాటి కార్యకర్తల స్థాయి కలిగి ఉంటారు. ఏ చిన్నపాటి అభిప్రాయబేధమైనా ఆ కుటుంబాన్ని విచ్ఛిన్నం చేయగలుగుతుంది. ఎందుకంటే, ఏదైనా ఒక వ్యవస్థను సుస్థిరంగా ఉంచగలిగే 'విధేయత' అనే తప్పనిసరి అంశం ఆ వ్యవస్థలో అసలు పునాదినుండే లేదు. ఇదీ పాశ్చాత్య కౌటుంబిక జీవన విధానం. ఈ పాశ్చాత్య ధ్వజవాహకులు విద్యా వైజ్ఞానిక, నాగరికతలకు తామే ఆద్యులమని గొప్పలు చెప్పుకుంటారు. నిజంగా వీరి గొప్పతనం చూడాలంటే యూరోపు, అమెరికాల్లోని న్యాయస్థానాల్లో వివాహం, విడాకులు, బాలనేరస్థులకు సంబంధించిన చరిత్రను ఓ సారి చూడండి. ఈ మధ్యనే అమెరికా హోంశాఖ విడుదల చేసిన నేర జాబితాలో పిన్నవయసులోనే నేరాలకు పాల్పడుతున్న బాలబాలికల సంఖ్య రోజురోజుకూ పెరిగిపోతోందని పేర్కొంది. దీనికి ప్రధాన కారణం కుటుంబంలో క్రమశిక్షణ బొత్తిగా లేకపోవడమేనని కూడా అభిప్రాయ పడింది. (చూడండి Blue book of crime statistic 1934)

మానవ నైజంలో, ముఖ్యంగా స్త్రీ స్వభావంలో ఉన్నటువంటి సిగ్గు బిడియాల అంశాన్ని సరిగా అర్థం చేసుకోవడంలో, ఆచరణాత్మకంగా మానవ జీవితాలకు దీన్ని అన్వయించడంలో ఏ నాగరిక సమాజమూ సఫలం కాలేకపోయింది. సిగ్గు బిడియాలను మానవుల, ముఖ్యంగా స్త్రీల మహత్తర సుగుణాల్లో ఒకటిగా ఎంచబడింది. కాని ఆచరణాత్మకంగా, నిర్మాణాత్మకంగా ఈ సుగుణాలను సమాజంలో విస్తరింపజేయడానికి ఎవరూ ప్రయత్నించలేదు. స్త్రీ పురుషుల వేషధారణలో, వారి ఆచార వ్యవహారాల్లో సిగ్గు బిడియాల పాత్రను ఏవైనా నియమాలకనుగుణంగా

నిర్ణయించవలసింది. కాని అలాజరగలేదు. సమాజంలో పురుషులు పురుషుల మధ్య, స్త్రీలు స్త్రీల మధ్య అలాగే స్త్రీ పురుషుల మధ్య పరదా బేపరదాల సముచితమైన సమంజసమైన పరిధులే ఏర్పరచలేదు. సభ్యత, సంస్కృతి, నైతికతలకు ఇది ఎంత అవసరమో గుర్తించకుండా దాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేయడం జరుగుతుంది. అంతేకాదు దీన్ని ఆచార వ్యవహారాలతో ముడిపెట్టారు. నిజానికి ఆచర వ్యవహారాలు సామాజిక పరిస్థితుల కనుగుణంగా మారుతూఉంటాయి. లేక కొందరి వ్యక్తిగత అభిరుచి అని, ఎంపిక అని ముడిపెట్టడం జరిగింది. నిజానికి భావోద్రేకాలను పక్కనబెడితే సిగ్గు బిడియాల ప్రకారం అందరూ సమానమే. ప్రతి ఒక్కరూ తమ భావోద్రేకాల ప్రకారం తగిన పద్ధతిని అవలంబించేంతటి నేర్పు శక్తి యుక్తులు అందరిలో ఉండవు. దీని ఫలితంగానే విభిన్న సంఘాల్లో (సమాజాల్లో) వేషధారణ, సమాజంలో సిగ్గు లజ్జ అనైతికతల విచిత్ర పరిస్థితి కనిపిస్తుంది.ఇందులో ఏవిధమైన నైతిక నిబద్ధత, సమానత్వం ఏవైనా నియమాలు, కట్టుబాట్లు కనబడవు. ప్రాగ్దేశాల్లో మాత్రం ఇది కేవలం ఒక పద్ధతి, విధానం లేనితనం వరకే పరిమితమైంది కాని, పశ్చిమ జాతుల వస్త్రధారణ, సమాజంలో నిస్సిగ్గు అశ్లీలం హద్దులు మీరినప్పుడు వారు పూర్తిగా సిగ్గుబిడియాల వేర్లనే నరికేశారు. వారి ఆధునిక సిద్ధాంతం ఏమిటంటే సిగ్గు సౌశీల్యాల భావన అసలు నైజంలోనే లేదన్నది వారి వాదన. అంతేకాదు, కేవలం బట్టలు తొడిగే అలవాటు ఆభావనను జనింపజేసింది. స్త్రీ వస్త్ర ధారణ, సిగ్గు సౌశీల్యాలకు, నైతికత, పరిశుద్ధతలకు అసలు సంబంధమే లేదు. అంతేకాదు, వాస్తవంగా అది మానవుడి లైంగిక భావనలకు చలనం కలిగించే కారణాల్లో అది కూడా ఒకటి. (.... తన గ్రంథం లో అక్షరం పొల్లుపోకుండా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు.) 1) కనుక, ఈ అర్ధనగ్న వస్త్రధారణ, అందాలపోటీలు, అశ్లీల నృత్యాలు, అశ్లీలచిత్రాలు, బ్రేక్‌డాన్సులు, ఆ నగ్నత్వం (Nudism) ఇవన్నీ ఆ సిగ్గుమాలిన ఫిలాసఫీ యొక్క ప్రత్యక్షరూపాలు. వెరసి మానవుణ్ని పశుత్వం కంటే హీనమైన దిశవైపు తీసుకెళ్లే వినాశ సాధనాలు. ఇదే అసమంజసత, అసమానత, ఈ సమస్య రెండో కోణంలోనూ దర్శనమిస్తుంది.

ఎవరైతే నైతికతకు, పరిశుద్ధతకు ప్రాముఖ్యతనిచ్చారో వారు స్త్రీ సంరక్షణకు ఆమెను ఒక ప్రాణమున్న జీవిగా, వ్యక్తిత్వం, బుద్ధీ మనసున్న ఉనికిగా గుర్తించకుండా ఒక నిర్జీవ ఆభరణంగా, ఒక విలువైన మణిలాగా చూసి, ఆమె విద్యా శిక్షణల పట్ల నిర్లక్ష్యం వహించారు. నిజానికి సంస్కృతీ నాగరికతల వికాసానికి పురుషులకు

విద్య ఎంత అవసరమో స్త్రీలకూ అంతే అవసరం. దీనికి భిన్నంగా ఎవరైతే విద్యాజ్ఞానాల ప్రాముఖ్యతను గుర్తించారో వారు నైతికత పరిశుద్ధతల ప్రాణాన్ని విస్మరించి మరో విధంగా సంస్కృతీ నాగరికతల వినాశానికి పరోక్షంగా కారణ మయ్యారు.

మరెవరైతే ప్రకృతి విభజనను గౌరవించారో వారు సమాజసేవకోసం కేవలం గృహనిర్వహణ, సంతాన సంరక్షణ బాధ్యతలో స్త్రీకి అప్పగించి, కుటుంబ పోషణ, సంపాదనా బాధ్యతలను పురుషునికి కేటాయించారు. కాని ఇందులో వారు సమాన త్వాన్ని సమతుల్యతను పాటించలేక పోయారు. వారు స్త్రీనుండి ఆమె సామాజిక హక్కులన్నీ హక్కుని, వారసత్వంలో ఆమెకెలాంటి వాటా ఇవ్వలేదు. ఆస్తిపై అన్ని హక్కులూ పురుషునికే కట్టబెట్టారు. ఈ విధంగా సామాజిక పరంగా ఆమెకు మొత్తంగా మొండి చేయి చూపించి స్త్రీ పురుషుల మధ్య యజమాని బానిసల సంబంధాన్ని ఏర్పరిచారు. ఈ అన్యాయాన్ని రూపుమాపడానికి మహిళకు తన ఆర్థిక సామాజిక, హక్కులను ఇప్పించే ఉద్దేశ్యంతో మరో వర్గం ముందు కొచ్చింది. కాని వీరు మరో తప్పులో కాలేశారు. వారి మస్తిష్కాలపై భౌతికత్వం తిష్టవేసుకొని ఉంది. అందుకని వారు స్త్రీని ఆర్థిక, సామాజిక బానిసత్వం, బంధనాల నుండి విముక్తి కల్పించడమంటే, ఆమె కూడా పురుషునిలా కుటుంబ పోషణ కోసం సంపాదించే వ్యక్తిగా, సామాజిక బాధ్యతలన్నిటినీ మోయడంలో పురుషునితో సమానంగా భాగస్వామ్యం పంచుకొనేలా తయారు చేయాలనుకున్నారు. భౌతిక వాద సిద్ధాంతం ప్రకారం ఈ విధానంలో మంచి ఆకర్షణా కోణం ఉంది. ఎందుకంటే దీనివల్ల పురుషుని భారం తగ్గడంతోపాటు, ఆర్థిక వెసులుబాటు కూడా కలిగి విలాస వంతమైన జీవితానికీ మార్గం సుగమమైంది. సామాజిక బాధ్యతలు నెరవేర్చడంలో, ఆర్థిక వ్యవహారాల నిర్వహణలో మొదటికంటే ఇప్పుడు రెండింతలు ప్రయోజనం చేకూరింది. ఎందుకంటే ఇప్పుడు రెండు చేతులకు బదులు నాలుగు చేతులు సంపాదిస్తున్నాయి. ఒక మేధకు బదులు రెండు మెదళ్లు ఆలోచిస్తున్నాయి. దీనివల్ల ఒక్కసారిగా సామాజిక వికాసక్రమం అప్రతిహతంగా దూసుకుపోయింది. కాని భౌతిక, సామాజిక కోణాలవైపు ఇంత ఎక్కువగా మొగ్గు చూపిన ఫలితంగా వీటికి ఏమాత్రం తక్కువ కాని మిగతా విభాగాలు వారి దృష్టికి రాకుండా పొయ్యాయి. మరికొన్ని కోణాలనైతే వారు తెలిసీ కావాలనే విస్మరించారు. వారు ప్రకృతి నైజాన్ని తెలిసుండి కూడా కావాలని దానికి భిన్నంగా ప్రవర్తించారు. ఈ విషయాన్ని స్వయంగా వారి శాస్త్రీయ

పరిశోధనలే స్పష్టం చేస్తున్నాయి. వారు స్త్రీకి న్యాయం చేస్తామని బీరాలు పలికి నష్టానికి గురిచేశారని స్వయంగా వారి పరిశోధనలు, ప్రయోగాలే సాక్ష్యం పలుకుతున్నాయి వారు స్త్రీలకు సమానత్వం ప్రసాదిస్తామని చెప్పి అసమానత్వానికి గురిచేశారు. వారి విద్యావైజ్ఞానిక ఆధారాలే దీనికి సాక్ష్యం. వారు సంస్కృతీ నాగరికతలను సంస్కరించాలనుకున్నారు. కాని వాటి వినాశనానికి అత్యంత ప్రమాదకరమైన సాధనాలను సమకూర్చారు. ఈ విషయం స్వయంగా వారు చెబుతున్న వాదనలు, వారు సమకూర్చిన గణాంకాలే మనకు చెబుతున్నాయి. అయితే వారు ఈ వాస్తవాల పట్ల ఏమరుపాటులో ఉన్నారని కాదు, కాని మేము ముందే విన్నవించుకున్నట్లు, వారు స్వయంగా మానవుల కోసం చట్టాలు రూపొందించడంలో సమాజంపైన, సముచితమైన, సమతుల్యమైన, సహేతుకమైన వివేక విజ్ఞతలను ప్రదర్శించలేకపొయ్యారు. ఇది మానవుల బలహీనత. కోరికల ప్రవాహంలో మనిషి కొట్టుకుపోయినప్పుడు అనేక వాస్తవాలు అతని దృష్టికిరావు. మరెన్నో యదార్థాలను అతను చూసినప్పటికీ, వాటిని గురించి అతనికి తెలిసినప్పటికీ చూసీ చూడనట్లు కళ్లుమూసుకుంటాడు. ఇలాంటి కళ్లుండి చూడలేని గుడ్డితనానికి ఉదాహరణగా, ఇలాంటి మరో గుడ్డివాడి సాక్ష్యాన్ని ప్రవేశపెట్టడమే తప్ప మరేమీ చేయలేం. రష్యాకు చెందిన అంతూన్ నీమ్‌లాఫ్ అనే ప్రఖ్యాత శాస్త్రవేత్త ఈయన నూటికి నూరుశాతం కమ్యూనిస్టు. (The biological tragedy of women) అనే గ్రంథంలో, శాస్త్రీయ ప్రయోగాలు, పరిశోధనల ద్వారా స్త్రీ పురుషుల సహజసిద్ధ అసమానతలు రుజువు చేయడానికి దాదాపు 2వందల పేజీలు రాశాడు. కాని మళ్లీ తనే స్వయంగా ఈ శాస్త్రీయ పరిశోధనల అనంతరం ఇలా రాశాడు:

“ప్రస్తుత పరిస్థితుల్లో స్త్రీకి సామాజిక వ్యవస్థలో పరిమితమైన హక్కులు ఇవ్వాలన్నా చాలా తక్కువమంది మాత్రమే దీన్ని సమర్థిస్తారు. స్వయంగా నేను కూడా ఈ ప్రతిపాదనకు వ్యతిరేకమే. కాని స్త్రీ పురుష సమానత్వాన్ని జీవితంలో ఆచరణాత్మకంగా చూపెట్టడం ఆషామాషీ వ్యవహారం కాదు. అలా అనుకోవడం ఆత్మవంచనే తప్ప మరొకటి కాదు. స్త్రీ పురుషుల మధ్య సమానత్వ సాధన కోసం సోవియట్ రష్యాలో జరిగినన్ని ప్రయత్నాలు ప్రపంచంలో మరెక్కడా జరగలేదు. అయినా ఈ విషయంలో ఎక్కడా నిష్పక్షపాత, ఉదారమైన ఉదాత్తమైన చట్టాలు రూపొందించబడలేదు. అయినప్పటికీ స్త్రీస్థానం కుటుంబంలో చాలా తక్కువగానే మార్పు చెందుతున్న విషయం యదార్థం. (పే.నెం.76)

## 2. కుటుంబంలోనే కాదు.. సమాజంలో కూడా..

'ఇప్పటి వరకూ స్త్రీ పురుషుల మధ్య అసమానత్వ మన్నది ఒక గంభీరమైన భావన. కేవలం కిందిస్థాయి వారిలోనే కాకుండా ఉన్నత విద్యావంతులైన సోవియట్ వర్గాల్లో కూడా ఇది పేరుకుపోయింది. స్వయంగా స్త్రీలలో కూడా ఈ భావన ఎంతబలమైన ప్రభావం చూపిందంటే, ఒకవేళ నిజంగానే వారిని సమాన దృష్టితో చూసినప్పటికీ, వారు దీన్ని పురుషుని స్థానంకంటే తక్కువగానే భావిస్తారు. అంతేకాదు, దాన్ని పురుషుని బలహీనతగా, చేతగానితనంగా పరిగణిస్తారు. ఈ విషయంలో మనం గనక ఏ సైంటిస్టునో, రచయితనో, విద్యార్థినో, వ్యాపారినో, లేక పక్కా కమ్యూనిస్టునో తీసుకున్నా వీరిలో ఏ ఒక్కరూ మహిళను తనతో సమానురాలిగా భావించరన్న విషయం స్పష్టంగా మనకు తెలిసిపోతుంది. మనం ఒక గొప్ప అభ్యుదయ రచయిత రాసిన ఏ నవలను చదివినా అందులో ఎక్కడో ఒకచోట ఏదో ఒక రకంగా స్త్రీని తక్కువగా చూపిన ఉదాహరణలు తప్పకుండా కనిపిస్తాయి. (పే. 194-195)

## దీనిక్కారణం?

'దీనికి కారణం ఏమిటంటే, ఇక్కడ విప్లవ భావాలు అత్యంత ప్రాముఖ్యత కలిగిన ఒక ప్రత్యేక పరిస్థితితో తలపడతాయి. అంటే జీవశాస్త్రం ప్రకారం రెండు జాతుల మధ్య (స్త్రీ, పురుష) సమానత్వం లేదు. కనుక ఇద్దరిపై సమాన భారం మోపడం కుదరదు. (పే.77)

'వాస్తవం ఏమంటే, ఈ వ్యక్తులందరిలో లైంగిక విశృంఖల భావాలున్నాయని చాలా స్పష్టంగా తెలుస్తోంది. ఇది అత్యంత ప్రమాదకరస్థితి. ఇది సోషలిస్టు వ్యవస్థ పతనానికి హెచ్చరికను జారీ చేస్తోంది. ఏ విధంగానైనా సరే దీన్ని ఎదుర్కోవాలి. ఎందుకంటే దీనికి వ్యతిరేకంగా సమరం సాగించడం చాలా కష్టంతో కూడుకున్న పని. నేను దీనికి వేలాది సాక్ష్యాలు చూపించగలను. లైంగిక విశృంఖలత్వం కేవలం పామరుల్లోనే కాకుండా ఉన్నత విద్యావంతుల వర్గం, మేధావి వర్గమనే వాళ్లలోనూ విస్తరించింది.' (పే.202, 3)

ఇవి ఎంత స్పష్టమైన సాక్ష్యాలో చూడండి. ఒకవైపు స్వయంగా ప్రకృతి పరంగానే స్త్రీ పురుషుల్లో సమానత్వం లేదన్న అంగీకారం ఉంది. ఆచరణాత్మక జీవితంలో కూడా సమానత్వాన్ని ఏర్పచాలన్న ప్రయత్నాలు విఫలమయ్యాయి.

సాధ్యమైనంత వరకు ప్రకృతికి వ్యతిరేకంగా పోరాడి సమానత్వాన్ని సాధించడానికి ప్రయత్నించిన ఫలితంగా అశ్లీలత పెను తుఫానులా విరుచుకుపడింది. దీనివల్ల మొత్తం సామాజిక వ్యవస్థ ప్రమాదంలో పడిపోయింది. మరోవైపు సామూహిక జీవితంలో స్త్రీల హక్కుల విషయంలో ఏ విధమైనటువంటి కట్టుబాట్లు ఉండకూడదన్న వాదనా ఉంది. ఎవరైనా ఇలా చేస్తే వారిని వ్యతిరేకిస్తామన్న హెచ్చరికా ఉంది. మానవుడు అజ్ఞాని కాదు విజ్ఞాని, మేధావి, అన్నీ తెలిసినవాడు అయివుండీ తన మనోవాంఛలకు ఎలా దాసుడన్న దానికి ఇంతకు మించిన ఉదాహరణ ఇంకేం కావాలి.

స్వయంగా తన పరిశోధనలను తానే తృణీకరిస్తాడు. స్వీయ అనుభవాలనే కాదంటాడు. కళ్లుమూసుకొని గుడ్డిగా మనోవాంఛల ప్రవాహంలో కొట్టుకుపోతాడు. ఈ అతివాదానికి, కుతర్కానికి వ్యతిరేకంగా తన జ్ఞాన, వివేకాలు ఎన్ని రుజువులు సాక్ష్యాలు ప్రవేశపెట్టినా, చెవులారా స్వయంగా ఎన్ని సంఘటనలు విన్నా, అతని కళ్లు ఎన్ని వైఫల్యాలను చూసినా అవేమీ పట్టించుకోడు.

اَفَرَاَيْتَ مَنِ اتَّخَذَ اِلٰهَهٗ هَوٰهُ وَاَضَلَّهُ اللّٰهُ عَلٰى عِلْمٍ وَّخَتَمَ
عَلٰى سَمْعِهٖ وَقَلْبِهٖ وَجَعَلَ عَلٰى بَصَرِهٖ غِشٰوَةً ؕ فَمَنْ يَّهْدِيْهِ
مِنْۢ بَعْدِ اللّٰهِ ؕ اَفَلَا تَذَكَّرُوْنَ ۝ (الجاثية:٢٣)

'తన మనోవాంఛలను తన దేవుడుగా చేసుకున్న వ్యక్తి స్థితిని గురించి కూడా నీవు ఎప్పుడైనా ఆలోచించావా? జ్ఞానం ఉన్నప్పటికీ, అతనిని అల్లాహ్ మార్గభ్రష్టత్వంలోకి విసిరివేశాడు, అతని హృదయం మీదా, చెవుల మీదా ముద్రవేశాడు, అతని కళ్లకు తెరవేశాడు. ఇక అల్లాహ్ తప్ప అతనికి మార్గం చూపేవాడెవడున్నాడు? మీరు గుణపాఠాన్ని నేర్చుకోరా?' *(అల్ జాసియహ్ 45 : 23)*

## ఇస్లాంలో సమానత్వ భావన

అసమానతలు, ఉచ్ఛనీచాలు, హెచ్చుతగ్గులు రాజ్యమేలుతున్న ఈ ప్రపంచంలో, అందరికీ అన్ని స్థాయిల్లో సంపూర్ణ సమానత్వం, సమతుల్యత అందించే ఒకే ఒక్క జీవన వ్యవస్థ ఉంది. అందులో మానవ నైజంలోని ఒక్కో కోణాన్ని స్పృశించి, చివరికి సూక్ష్మాతి సూక్ష్మమైన కోణానికి కూడా సమాన గౌరవం

ఇవ్వబడింది. మానవుని శారీరక స్వరూపం, పైశాచిక స్వభావం, అతని మానవీయ గుణం, మనో ప్రత్యేకతలు, అతని సహజ అలవాట్లకు సంబంధించి సంపూర్ణ, వివేక విజ్ఞతలతో వ్యవహరించడం జరిగింది. ఇందులోని ఒక్కో వస్తువు సృజన ద్వారా దేనికీ ఎలాంటి నష్టం వాటిల్లకుండా ఉత్తమ రీతిలో లక్ష్యసాధనకు ఏర్పాట్లు చేయబడ్డాయి. అంతిమంగా ఇవన్నీ కలిసి మానవ జీవిత అసలు లక్ష్యాన్ని సాధించడంలో పరస్పరం సహకరించుకుంటాయి. ఈ సమానత్వం, సమతుల్యత, ఎంత పరిపూర్ణంగా ఉన్నాయంటే, ఎవరూ స్వయంగా తమ బుద్ధిని ఉపయోగించి, లేక ప్రయత్నాలు చేసి వీటిని సృష్టించలేరు. మానవుడు తయారు చేసిన నియమాల్లో, చట్టాల్లో ఏదో ఒక చోట అసమతౌల్యం ఏర్పడకుండా ఉండడం అసాధ్యం. స్వయంగా తయారు చేయడం తర్వాత సంగతి. వాస్తవానికి ఒక సామాన్య మానవుడు అసాధారణ మైన శాంతి స్వభావుడు కానంతవరకు ఈ మహత్తర చట్టాలను పూర్తిగా ఆకళింపు చేసుకోవడం కూడా కష్టమే. వీటిని గురించి ఏళ్లతరబడి విజ్ఞాన శాస్త్రాలు అధ్యయనం చేసి వాటి ద్వారా ప్రయోజనం పొంది, దానిపై పరిశీలనలు చేయడం కూడా అసాధ్యమే. నేనేదో ఇస్లాంను విశ్వసించే వాడిగా ఆ ధర్మాన్ని ప్రశంసించడం లేదు. నిజానికి అందులోని పరిపూర్ణ సమానత్వం, మానవ నైజానికి తగిన దాని సహజ సిద్ధాంతాలను చూసే నేను ఇస్లాంను విశ్వసించాను. ఈ సహజ సిద్ధ సిద్ధాంతాలను చూసి నా హృదయం ఆనందంతో ఉప్పొంగి ఇలా సాక్ష్యం పలికింది. ఈ భూమ్యా కాశాల నిర్మాణం నిస్సందేహంగా సమస్తమూ తెలిసిన ఒక మహత్తర శక్తి సంపన్నుడి ఆజ్ఞకు లోబడి జరిగింది. అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతూ దారి, దిశ తప్పిన మానవజాతికి సరైన దారిచూపింది ఆయనేనని నా అంతరంగం సాక్ష్యం పలికింది.

**قُلِ اللّٰهُمَّ فَاطِرَ السَّمٰوٰتِ وَالْاَرْضِ عٰلِمَ الْغَيْبِ وَالشَّهَادَةِ**
**اَنْتَ تَحْكُمُ بَيْنَ عِبَادِكَ فِيْ مَا كَانُوْا فِيْهِ يَخْتَلِفُوْنَ ○**

(الزمر:٤٦)

**"ఇలా అను, "దైవమా! భూమ్యాకాశాలకు సృష్టికర్తా! గోచర అగోచరాలను ఎరిగినవాడా! నీవే నీ దాసుల మధ్య వారు విభేదిస్తూ ఉన్న విషయం గురించి తీర్పు చేస్తావు."** ***(అజ్ జుమర్ 39 :46)***

**9వ అధ్యాయం**

# ఇస్లామీయ జీవన వ్యవస్థ

ఇస్లాం ఒక సమగ్రమైన, సంపూర్ణమైన జీవన ధర్మం. ఇస్లాం ప్రత్యేకత ఏమిటంటే, అది తన చట్టాల్లోని వివేకంపై కూడా స్వయంగా దృష్టి సారిస్తుంది. సమాజంలో స్త్రీ పురుషుల మధ్య సంబంధాలను పటిష్టపరచడానికి ఇస్లాంలో ఉన్నటువంటి చట్టాలు ఏ ప్రాతిపదికలపై, ఏ పునాదులపై, ఏ ప్రకృతి యదార్థాలపై ఆధారపడి ఉన్నాయో మనకు స్పష్టంగా చెబుతుంది.

**దాంపత్య మూలార్థం**

ఈ విషయంలో మొదటి వాస్తవాన్ని ఇస్లాం ఇలా విశదీకరిస్తుంది.

وَمِنْ كُلِّ شَيْءٍ خَلَقْنَا زَوْجَيْنِ (الذّريت: ۴۹)

**"ప్రతి వస్తువునూ మేము జంటలుగా సృష్టించాము."**

***(అజ్ జారియాత్ 51 : 49)***

ఇందులో, దాంపత్య సంబంధం ఒక నిరంతర ప్రక్రియ అన్న సూచన ఉంది. విశ్వసృష్టికర్త సృష్టిలోని సమస్తాన్నీ దాంపత్య బంధం ద్వారానే ఉనికిలోకి తెచ్చానని, తన పనితనంలోని రహస్యాన్ని బహిరంగపరిచాడు. అంటే యంత్రంలోని (సృష్టిలోని) భాగాలన్నీ జంటల రూపంలోనే తయారు చేశానని చెబుతున్నాడు. ఈ సృష్టి కర్మాగారంలో మీరు చూస్తున్న పనితనమంతా ఈ జంటల దాంపత్య బంధ మహిమే.

- ఇప్పుడు కాస్త ఈ దాంపత్య బంధాన్ని గురించి ఆలోచించండి. అసలు దాంపత్యమంటే ఒకరు కార్యనిర్వాహకులైతే మరొకరు కార్యభారాన్ని మోసేవారు. ఒకరు ప్రభావం చూపేవారైతే మరొకరు దాన్ని స్వీకరించేవారు. ఒకరు సలహాదారైతే మరొకరు దాన్ని స్వీకరించేవారు. ఈ బంధాను బంధాలు, ఈ కార్యనిర్వాహణ, భారాలు, ప్రభావ స్వీకారాలు, ఈ కర్తక్రియల అనుబంధం ఏదైతే ఉందో అదే దాంపత్యబంధం. ఈ బంధం ద్వారానే సమస్త విశ్వకర్మాగార వ్యవస్థ మనుగడ సాగిస్తోంది.

సృష్టిలోని ప్రతి వస్తువూ, ప్రతిప్రాణీ జంటలుగానే సృష్టించబడ్డాయి. ప్రతి

జంటలోనూ ప్రకృతిపరమైన ఈ బంధమే కనబడుతుంది. అంటే ఒకరు కార్యనిర్వాహకులైతే, ఒకరు కార్య భారాన్ని మోసేవారు. అయితే జీవరాసుల్లో ఈ సంబంధం వివిధ రూపాల్లో ఉండవచ్చు. సంబంధం ఏవిధంగా కొనసాగినా మొత్తం మీద అసలు లక్ష్యం మాత్రం ఒక్కటే. లక్ష్యం పరిపూర్ణం కావడానికి, సృష్టిపరంపర కొనసాగడానికి ఒకరికి కార్యనిర్వహణా శక్తి, మరొకరికి ఆ కార్య భారాన్ని మోసే శక్తి ఉండడం అత్యంత అవసరం.

– పై వాక్యంలోని అర్థం తేటతెల్లం అయిన తరువాత, దాంపత్య నియమాలకు సంబంధించిన మూడు విషయాలు స్పష్టంగా మనముందుకొస్తాయి.

1) దైవం ఈ విశ్వవ్యవస్థను ఏ పథకం ప్రకారం తయారు చేశాడో, ఏ విధంగా ఈ కర్మాగారం నడిచే ఏర్పాటు చేశాడో, ఆ విధానం ఎట్టి పరిస్థితిలోనూ అనైతికం, అరాచక విధానం కాజాలదు. అది తన స్వభావం రీత్యా అత్యంత విలువైనది, గౌరవప్రదమైనది, పవిత్రమైనది. కర్మాగారాన్ని వ్యతిరేకించేవారు దీన్ని కలుషితమైనదని, అపవిత్రమైందని భావించి దూరంగా ఉంటే ఉండవచ్చు. కాని, స్వయంగా దాని సృష్టికర్త, యజమాని మాత్రం కర్మాగారం మూతపడాలని ఎప్పుడూ కోరుకోడు. అతనెప్పుడూ తన కర్మాగారం కలకాలం కళకళలాడాలని, తన యంత్రాలు నిరంతరం పనిచేస్తూ ఉత్పత్తి సాధనలో తమ వంతు కర్తవ్యం నిర్వర్తించాలనే అభిలషిస్తాడు.

2) ఒక కర్మాగారాన్ని నడపడానికి కార్యనిర్వాహకుడు ఎంత ముఖ్యమో, కార్యభారాన్ని మోసేవాడు అంతే ముఖ్యం ఈ కర్మాగారంలో ఇద్దరి ప్రాముఖ్యతా సమానమే. ఎవరికీ ఎవరిపై ఎలాంటి ఆధిక్యం లేదు. ఒకరు ఉన్నతులూ కాదు, మరొకరు అల్పులూ కాదు. అయితే కార్యనిర్వాహకునిలో ఉండాల్సిన విశేషం ఏమిటంటే, అతనిలో కార్యనిర్వాహణా శక్తి సమర్థవంతంగా ఉండాలి. ఎందుకంటే, అతను దాంపత్య కార్యభారాన్ని సమర్థవంతంగా నెరవేర్చగలగాలి. అలాగే కార్యభారాన్ని మోసేవారి గొప్పతనం ఏమిటంటే, దాంపత్య సంబంధ భారాన్ని స్వీకరించి, తద్వారా తనపై తారసిల్లే బాధ్యతల్ని ఉత్తమరీతిలో నిర్వర్తించగలగాలి. ఒక మామూలు యంత్ర భాగాన్ని కూడా ఎవరైనా దాని అసలు స్థానం నుండి తొలగించి, దానితో సంబంధమే లేని మరో దానితో అమర్చాలని చూస్తే అలాంటి వారిని అజ్ఞానులనిగాని, పిచ్చివాళ్లనిగాని అనవలసి ఉంటుంది. ఎవరైనా అమాయ

కంగా అలాచేస్తే, అసలా ప్రయత్నమే సఫలం కాదు. అయినా సరే పట్టువీడక ప్రయత్నిస్తే ఆ యంత్రం విఫలం అవుతుంది. పనికిరాకుండా పోతుంది. అత్యద్భుతమైన ఈ విశ్వవ్యవస్థ పరిస్థితి కూడా అంతే. మూర్ఖులు, అజ్ఞానులు భర్తను తీసుకొచ్చి భార్యస్థానంలో భార్యను భర్త స్థానంలో నిలబెట్టాలని చూడవచ్చు. ఇలా ప్రయత్నించి ఇందులో సఫలమవుతామని కూడా డాంబికాలు చెప్పుకోవచ్చు. కాని యంత్రాన్ని సృష్టించిన వాడు మాత్రం ఎప్పుడూ అలా చేయడు.

సమర్థతలకనుగుణంగా దేని స్థానంలో దాన్నే అమర్చి శక్తివంతమైన కోణాన్ని సంరక్షణగా రూపొందిస్తాడు.

3) స్వత:సిద్ధంగా కార్యనిర్వహకుడు శక్తివంతుడై కార్యభారాన్ని మోసే వారిపై ఒకరకమైన ప్రత్యేకతను కలిగి ఉంటాడు. అంటే ఈ ప్రత్యేకత కారణంగా అతనేదో గౌరవనీయుడని, కార్యభారాన్ని మోస్తున్నవారు గౌరవనీయులు కాదు, నీచులని అసలే అర్థంకాదు. ప్రత్యేకత అన్నది ఆధిక్యం, శక్తి, ప్రభావాల కారణంగా మాత్రమే. ఒక వస్తువు మరొక వస్తువుపై అధికారం చేస్తుందంటే, దానికి దానిపై ఆధిక్యం ఉందన్నమాట. శక్తి సామర్థ్యాల విషయంలో దానికంటే బలమైనది కావడం వల్ల ప్రభావం చూపగలుగుతుంది. అలాగే మరొకటి ఆ ప్రభావాన్ని స్వీకరిస్తోందంటే, దానికి దాన్ని ఎదుర్కొనే శక్తి లేదనే అర్థం. ఏ విధంగా లైంగిక కార్యం నెరవేరాలంటే ఇద్దరి ఉనికీ సమానంగా అవసరమవుతుందో, అలాగే ఆ కార్యనిర్వాహకునిలో శక్తిసామర్థ్యాలు కూడా అంతే అవసరం. అలాగే పార్ట్‌నర్‌లో దాన్ని భరించే, ఆ ప్రభావాన్ని గ్రహించే శక్తి కూడా అవసరం. ఎందుకంటే ఇద్దరూ సమాన శక్తివంతులైతే, ఎవరికీ ఎవరిపై ఆధిక్యం ప్రాప్తం కాకపోతే, ఆ ఇద్దరిలో ఎవరూ ఎవరి ప్రభావాన్ని గ్రహించలేరు. దీని ఫలితంగా అసలా కార్యమే నెరవేరదు. ఒకవేళ వస్త్రంలో కూడా సూదిలాంటి గట్టిదనమే ఉంటే కుట్టడమే కుదరదు. భూమిలో గనక మెతకదనం లేకపోతే నాగలి ఎంతమాత్రం ప్రభావాన్ని చూపించలేదు. ఫలితంగా వ్యవసాయం బీడుపడిపోతుంది. మొత్తానికి ప్రపంచంలో సంభవించే ఏ కార్యమైనా ఒకటి బలంగా, మరోటి బలహీనంగా లేకపోతే అసలు ఏ పనీ జరగదు. కనుక దంపతులిద్దరిలో ఒకరి శక్తిసామర్థ్యాల ప్రభావం అధికంగా ఉంటుంది. దీన్నే పుంసత్వం లేక మగసిరి అంటారు. ఎందుకంటే ఒక పురుషునిగా తన బాధ్యతలు నెరవేర్చడానికి అతను అలా ఉండడం చాలా అవసరం. దీనికి భిన్నంగా స్త్రీలో సౌకుమార్యం, మెతకదనం, లాలిత్యం లాంటి సుగుణాలుంటాయి. దీన్నే స్త్రీత్వం

అంటారు. ఎందుకంటే దాంపత్యంలోని ఈ ప్రభావిత గుణాలే ఆమె విజయానికి కారణమవుతాయి. ఎవరైతే ఈ రహస్యాన్ని అర్థం చేసుకోలేరో, వారు పురుషునికి ప్రత్యేకత అంటగట్టి గౌరవనీయునిగానూ స్త్రీని అధమంగానూ చూస్తారు. లేక అసలు పురుషుని ప్రత్యేకతను మొత్తానికే తీసిపారేసి, స్త్రీకి కూడా పురుషునిలాంటి ప్రత్యేకతలు ఆపాదించడానికి ప్రయత్నం చేస్తారు. కాని ఈ ఇద్దరినీ సృష్టించిన కర్త మాత్రం ఎవరి గౌరవ మర్యాదలకూ విఘాతం కలగకుండా బాధ్యతలను సమానంగా విభజించాడు. అయితే దాంపత్యబంధ ఉద్దేశ్యం నెరవేరడానికి గాను ఈ ఆధిక్యతా విధేయుల అవసరాన్ని సృష్టించాడు. అంతేగాని, ఇద్దరూ శిలల్లాఢీకొని పరస్పరం ఎలాంటి ఫలితాన్నీ అందించకుండా ఉండేందుకు కాదు.

దాంపత్య బంధ ప్రారంభ దశలో మనకు కొన్ని సూత్రాలు లభిస్తాయి. స్త్రీ పురుషులు భౌతికంగా జంటలు జంటలుగా ఉండడం, తద్వారా వారి మధ్య సంబంధాలు నెలకొనడం ఈ సూత్రాలకు ప్రాతిపదిక. భూమ్యాకాశాల సృష్టికర్త ఏ సామాజిక వ్యవస్థనైతే నిర్మించాడో, దానిలో ఈ మూడు సూత్రాలు ప్రధాన భూమిక పోషించాయి. ఈ విషయం మనకు ముందు ముందు తెలుస్తుంది.

## మానవుడి పశుప్రవృత్తి - దాని కారణం

ఇప్పుడు కాస్త ముందుకు పోదాం. స్త్రీ పురుషుల ఉనికి కేవలం ఒక భౌతిక ఉనికి మాత్రమే కాదు. అదొక పశుప్రాయమైన ఉనికి కూడా. అందుకని ఆ జంటల అవసరమేమిటో తెలుపుతూ పవిత్ర ఖుర్‌ఆన్ ఇలా అంటోంది :

جَعَلَ لَكُمْ مِّنْ اَنْفُسِكُمْ اَزْوَاجًا وَّ مِنَ الْاَنْعَامِ اَزْوَاجًا ۚ
يَذْرَؤُكُمْ فِيْهِ ؕ (الشوریٰ: ١١)

**"అల్లాహ్, స్వయంగా మీ జాతి నుండే మీ కొరకు జంటలను సృజించాడు; ఇదేవిధంగా పశువులలో కూడా (వాటి జాతి) జంటలను సృష్టించాడు. ఈ విధంగా ఆయన మీ సంతతులను వ్యాపింపజేస్తాడు.."**

***(షూరా 42-11)***

نِسَآؤُكُمْ حَرْثٌ لَّكُمْ ۪ (البقرة: ٢٢٣)

"మీ స్త్రీలు మీ యొక్క సేద్యపు భూములు" ***(బఖర 2 : 223)***

ఈ వాక్యాల్లో మానవుణ్ని మిగతా జీవరాసుల నుండి వేరుచేసి, మీలో ఆలుమగల సంబంధం రైతుకు తన వ్యవసాయ క్షేత్రంతో ఉండే సంబంధం లాంటిదని స్పష్టం చేయడం జరిగింది. ఇది నిజంగా ఒక జీవశాస్త్ర వాస్తవం. జీవశాస్త్ర సిద్ధాంతం ప్రకారం స్త్రీ పురుష సంబంధానికి ఇదొక బ్రహ్మాండమైన పోలిక.

1) దైవం అన్ని జీవరాసులకు లాగానే, దాంపత్య సంబంధం ద్వారా మానవ సంతతిని విస్తరింపజేయడానికి వారిని కూడా జంటలు జంటలుగా పుట్టించాడు. దైవం మానవుల్లో కొందరిని తమ మనో కాంక్షల దాస్యం చేసి, అలానే అంతమైపోడానికి సృష్టించలేదు. నిర్ణీత అంతిమ దినం వరకూ మానవ సంతతిని పరిరక్షించాలన్నది ఆయన ఉద్దేశ్యం. అందుకే ఈ జంటలు తమ దాంపత్య సంబంధాన్ని కొనసాగించి పుడమి కళకళలాడే విధంగా సంతానోత్పత్తి ప్రక్రియను కొనసాగించాలి. కనుక దైవం తరఫున నిర్ణయమైన చట్టాలు లైంగిక సంబంధాలను ఎప్పుడూ అణిచివేయవు, అంతం చేయవు. ఈ సంబంధాలను అసహ్యించుకోవడం గాని, వ్యతిరేకించడం గాని జరగదు. అంతేకాదు మానవులు తమ సహజసిద్ధమైన అవసరాలను తీర్చుకునే అవకాశాలను కూడా కల్పించడం జరుగుతుంది.

2) స్త్రీ పురుషులను రైతుకు, వ్యవసాయ భూమికి ఉన్న సంబంధంతో పోల్చి, ఆలుమగల సంబంధాన్ని, ఇతర జీవరాసుల జంటలనుండి వేరుచేయడం జరిగింది. రైతుకు పొలంతో ఉన్న సంబంధం ఏమిటి? విత్తనంవేయడంతోనే అతని పని అయిపోతుందా? కాదు. అతనా పొలంలో విత్తనం నాటడంతోపాటు, నీరు కూడా పెట్టాలి. చీడపీడలు పట్టకుండా చూసుకోవాలి. ఎరువులు వేయాలి. అనుక్షణం దాన్ని కనిపెట్టుకొని ఉంటూ సంరక్షించుకోవాలి. అలాగే స్త్రీ కూడా, ఒక జంతువు చేలో సంచరిస్తూ ఒక విత్తనం పారేస్తే తనంత తానే చెట్టును మొలకెత్తించే భూమికాదు. పుడమి గర్భదాల్చినప్పుడు రైతు అవసరం ఎంతైనా ఉంటుంది. అతను దాన్ని పరిరక్షిస్తూ, ఉన్న అవసరాలూ తీరుస్తూ మొత్తం బాధ్యతను భరించవలసి ఉంటుంది.

3) మానవ జంటల్లో ఉన్నటువంటి లైంగిక ఆకర్షణ, జీవశాస్త్రం ప్రకారం ఇతర జీవరాసుల్లో ఉండే ఆకర్షణలాంటిదే. ప్రతి జాతిలోనూ స్త్రీ పురుష ప్రాణుల మధ్య పరస్పర లైంగిక ఆకర్షణ ఉంటుంది. ఏ జాతికాజాతి వంశపరంపరను పరిరక్షించుకోవాలన్న బలమైన కోరిక ఆయా జాతుల స్వభావంలోనే సృజించడం జరిగింది. సంతానోత్పత్తి, లైంగిక వాంఛ కలిగినటువంటి రెండు జాతుల్లోనూ

(ఆడమగ) ఈ పరస్పర ఆకర్షణ ఉంటుంది. అందుకే సృష్టికర్త తయారు చేసిన చట్టం మానవ నైజంలోని ఈ బలహీన కోణాన్ని కూడా విస్మరించదు. ఎందుకంటే ఇందులో లైంగిక స్వేచ్ఛకు సంబంధించి తీవ్రమైన ఆకర్షణ దాగి ఉంది. దీని సంరక్షణకు ప్రత్యేక చర్యలు చేపట్టకపోతే నియంత్రణలో ఉంచడం చాలా కష్టం. ఒకసారి గనక అది అదుపు తప్పిందంటే, మానవుడు పశుప్రాయుడిగా మారిపోతాడు. అంతేకాదు అంతకంటే హీనంగా దిగజారకుండా అతణ్ని ఆపడం కూడా ఎవరితరం కాదు.

لَقَدْ خَلَقْنَا الْاِنْسَانَ فِیْٓ اَحْسَنِ تَقْوِیْمٍ۝ ثُمَّ رَدَدْنٰهُ اَسْفَلَ سٰفِلِیْنَ۝ (التین: ۴،۵)

**లఖద్ ఖలఖ్‌నల్ ఇన్సాన ఫీ అహ్సనితఖ్వీం. సుమ్మరదద్‌నాహు అస్‌ఫలసాఫిలీన్**

**మేము మానవుణ్ణి అద్భుతమైన ఆకృతిలో సృజించాము. తరువాత మేము అతన్ని వెనక్కితిప్పి నీచాతి నీచుడుగా మార్చివేశాము. *(అత్‌తీన్ 95: 4,5)***

## మానవనైజం - దాని అవసరాలు

మేము ముందే విన్నవించినట్లు మానవ నైజంలో పశుస్వభావం వేళ్లూనుకొని ఉంది. ఈ భూమండలం పైనే మానవత్వ నిర్మాణం జరిగింది. మానవుని వ్యక్తిగత ఉనికి, అతని సంతాన పరంపరను ఉనికిలో ఉంచడానికి అవసరమైన అన్ని విషయాలు, కోరికలు, శక్తి సామర్థ్యాలు ఆ పశు స్వభావంలోనే ఉంచడం జరిగింది. వీటిలోని ఏ కోరికను అణిచివేయడం కాని, వీటిలోని ఏ సామర్థ్యాన్ని అంతం చేయడం గాని సృష్టికర్త ఉద్దేశ్యం కాదు. ఎందుకంటే ఇవన్నీ అవసరమైనవే. ఇవి లేకుండా మానవ ఉనికి మనజాలదు. అయితే నిజదైవం కోరేదేమిటంటే, మానవుడు తన ఈ కోరికలు తీర్చుకోవడంలో, తన శక్తి సామర్థ్యాలను వినియోగించడంలో పశుస్వభావాన్ని వినియోగించకూడదు. మానవ నైజానికనుగుణమైన ఉత్తమ విధానాన్ని అవలంబించాలి. దీనికోసమే దైవం ధర్మశాస్త్ర హద్దుల్ని నిర్ణయించాడు. తద్వారా మానవ క్రియలను నియమబద్ధం చేసి, ఒకవేళ హద్దులు మీరి ప్రవర్తిస్తే నియమాలను అతిక్రమిస్తే వినాశం పాలవుతారని హెచ్చరికలు కూడా చేశాడు.

وَمَنْ یَّتَعَدَّ حُدُوْدَ اللّٰهِ فَقَدْ ظَلَمَ نَفْسَهٗ ؕ (الطلاق: ۱)

**"ఇవి అల్లాహ్ నిర్ణయించిన హద్దులు. ఎవడు అల్లాహ్ నిర్ణయించిన హద్దులను అతిక్రమిస్తాడో, అతడు స్వయంగా తనకు తానే అన్యాయం చేసుకుంటాడు."** ***(అత్ తలాక్ 65 : 1)***

ఇప్పుడు, చూడండి. లైంగిక విషయాల్లో పవిత్ర ఖుర్‌ఆన్ మానవ నైజంలోని ఏ ప్రత్యేకతలు, కోరికల వైపు సంజ్ఞ చేస్తుందో చూడండి.

1) రెండు జాతుల మధ్య ఏ విధమైన సంబంధం మానవ నైజంలో ఉంచడం జరిగిందో గమనించండి.

خَلَقَ لَكُمْ مِّنْ اَنْفُسِكُمْ اَزْوَاجًا لِّتَسْكُنُوْٓا اِلَيْهَا وَجَعَلَ بَيْنَكُمْ مَّوَدَّةً وَّرَحْمَةً ۭ (الروم:٢١)

**"అల్లాహ్ మీ కొరకు భార్యలను మీ జాతిలో నుండే సృష్టించాడు- మీరు వారివద్ద శాంతిని పొందటానికి, మీ మధ్య ప్రేమనూ, కారుణ్యాన్నీ సృజించాడు. నిశ్చయంగా ఆలోచనాపరులకు ఇందులో ఎన్నో సూచనలు ఉన్నాయి."** ***(అర్ రూమ్ 30 : 21)***

هُنَّ لِبَاسٌ لَّكُمْ وَاَنْتُمْ لِبَاسٌ لَّهُنَّ ۭ (البقرة:١٨٧)

**"వారు మీకు దుస్తులు, మీరు వారికి దుస్తులు."** ***(అల్ బఖర 2 : 187)***

ఇంతకు ముందు పేర్కొన్న వాక్యంలో మానవులు, ఇతర జీవరాసులను జంటలుగా సృష్టించినట్లు, ఇలా సృష్టించే ఉద్దేశ్యం సంతానం పరిరక్షణ అని చెప్పబడింది. ఇప్పుడు ఇతర జీవరాసుల నుండి వేరు చేసి మానవుడి ప్రత్యేకతను గురించి చెప్పబడింది. మానవ జంటల్లోని ఒక మహోన్నత లక్ష్యం వారి సంబంధం కేవలం వాంఛల పరిపూర్తి మాత్రమే కాదు. ప్రేమానురాగాల సంబంధం. హృదయ పూర్వకమైన, ఆత్మల కలయిక. వారు ఒకరి రహస్యాలు ఒకరు ఎరిగినవారు. ఒకరి కష్టసుఖాలు ఒకరు పంచుకునేవారు. దేహం దుస్తుల మధ్య ఎలాంటి సంబంధ ముంటుందో, వారిమధ్య అలాంటి అనుబంధమే ఉంటుంది. స్త్రీపురుషుల ఈ సంబంధమే మానవ సంస్కృతీ నాగరికతల నిర్మాణానికి పునాదిరాయి. ఈ విషయం మేము ఇంతకుముందే సవివరంగా తెలియజేశాము. దీంతోపాటు 'లితస్కునూ ఇతైహా' అని చెప్పి స్త్రీలవద్ద పురుషులకు శాంతి సౌఖ్యాలున్నాయన్న సూచన కూడా

చేయబడింది. నిజంగా ఈ గందరగోళంతో నిండిన యాంత్రిక జీవితంలో సాంత్వన అందించే సేవాభావం ఆమె నైజంలోనే ఉంది. ఇది పూర్తిగా మానవుని వ్యక్తిగత జీవితం. ఈ వ్యక్తిగత జీవితాన్ని భౌతిక ప్రయోజనాలకోసం పాశ్చాత్యులు నిర్లక్ష్యం చేశారు. నిజానికి సమాజం, ప్రజా విభాగాల్లో దేని ప్రాముఖ్యమైతే ఇతర విభాగాలకుందో, అదే ప్రాధాన్యత ఈ విభాగానికే ఉంది. సామాజిక జీవనానికి ఇతర విభాగాలు ఎంత అవసరమో ఇది కూడా అంతే అవసరం.

2) ఈ దాంపత్య సంబంధం కేవలం దంపతుల మధ్య ప్రేమకే పరిమితం కాదు. ఈ సంబంధం ద్వారా ఉనికిలోకొచ్చే సంతానం పట్ల కూడా బలీయమైన ఆత్మీయ సంబంధం ఉంటుంది. దీనికోసం దైవం మానవుని, ముఖ్యంగా స్త్రీ శరీరంలోనే సహజసిద్ధమైన ఏర్పాట్లు చేశాడు. ఆమెనరనరాల్లో, అణువణువలో సంతానంపట్ల ప్రేమను జొప్పించాడు. పవిత్ర ఖురాన్‌లో ఇలా ఉంది :

حَمَلَتْهُ اُمُّهٗ وَهْنًا عَلٰى وَهْنٍ وَّ فِصٰلُهٗ فِىْ عَامَيْنِ. (لقمٰن:۱۴)

**"అతని తల్లి బలహీనతపై బలహీనతను సహించి అతనిని తన కడుపున మోసింది. అతను పాలు విడిచిపెట్టటానికి రెండు సంవత్సరాలు పట్టింది."**
**(లుక్మాన్ 31-14)**

حَمَلَتْهُ اُمُّهٗ كُرْهًا وَّوَضَعَتْهُ كُرْهًا ؕ وَحَمْلُهٗ وَفِصٰلُهٗ ثَلٰثُوْنَ شَهْرًا ؕ (الاحقاف:۱۵)

**"అతని తల్లి అతనిని ఎంతో శ్రమతో తన గర్భంలో పెట్టుకొని మోసింది; ఎంతో శ్రమతోనే అతనిని కన్నది. అతనిని గర్భంలో పెట్టుకొని మోసేం దుకు, అతనిచే పాలు మాన్పించేందుకు ముప్పై మాసాలు పట్టింది."**
***(అహ్‌కాఫ్ 46 : 15)***

బిడ్డల ప్రేమలో స్త్రీల ప్రేమకు సాటి రాకపోయినా పురుషుల పరిస్థితి కూడా దాదాపు ఇలాగే ఉంటుంది.

زُيِّنَ لِلنَّاسِ حُبُّ الشَّهَوٰتِ مِنَ النِّسَآءِ وَالْبَنِيْنَ. (آل عمران:۱۴)

**"స్త్రీలూ, సంతానం మానవులకు మనోహరంగా చేయబడ్డాయి." (3-14)**

ఈ ప్రకృతిసిద్ధమైన సహజ ప్రేమలే మానవుల మధ్య పుట్టిల్లు మెట్టిల్లు లాంటి బంధుత్వాలు ఏర్పరుస్తాయి. ఈ బంధుత్వాల ద్వారా కుటుంబాలు, తెగలు జాతులు ఏర్పడతాయి. వీటి పరస్పర సంబంధాల ద్వారానే సంస్కృతీ నాగరికతలు ఉనికిలోకొస్తాయి.

وَهُوَ الَّذِىْ خَلَقَ مِنَ الْمَآءِ بَشَرًا فَجَعَلَهٗ نَسَبًا وَّ صِهْرًا ؕ

(اَلفرقان: ۵۴)

**"దైవం నీటితో మానవుణ్ణి సృష్టించాడు. తరువాత అతని ద్వారా (తన) వంశము, అత్తవారి వంశము అనే రెండు వేర్వేరు బంధుత్వపు క్రమాలను రూపొందించాడు. నీ ప్రభువు సర్వశక్తి సంపన్నుడు."**

***(పుర్ఖాన్ 25 : 54)***

يٰۤاَيُّهَا النَّاسُ اِنَّا خَلَقْنٰكُمْ مِّنْ ذَكَرٍ وَّ اُنْثٰى وَجَعَلْنٰكُمْ شُعُوْبًا وَّ قَبَآئِلَ لِتَعَارَفُوْا ؕ

(الحجرات: ۱۳)

**"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగానూ, తెగలుగానూ చేశాము."**

***(అల్ హుజురాత్ 49 : 13)***

ఈ సంబంధ బాంధవ్యాలే మానవ నాగరికతకు పునాదిరాళ్లు. స్త్రీ పురుషుల సక్రమ సంబంధం, తద్వారా విస్తరించే సంతానమే ఈ పునాదిని సురక్షితంగా ఉంచగలుగుతుంది.

3) మానవ నైజం కోరే మరో విషయం ఏమిటంటే, మనిషి తన సేద్యాన్ని, రక్తాన్ని ఏకం చేసి ఆర్జించిన సంపాదన కేవలం తన సంతానం, తన రక్త సంబంధీకులకు మాత్రమే దక్కాలని కోరుకుంటాడు.

وَاُولُوا الْاَرْحَامِ بَعْضُهُمْ اَوْلٰى بِبَعْضٍ فِىْ كِتٰبِ اللّٰهِ ؕ

(الانفال: ۷۵)

"అల్లాహ్ గ్రంథం ప్రకారం రక్త సంబంధం కలవారు పరస్పరం ఎక్కువ హక్కుదారులు.' *(అన్ఫాల్ 8 :75)*

**وَمَا جَعَلَ اَدْعِيَآءَ كُمْ اَبْنَآءَ كُمْ ط** (الاحزاب:٣)

**"మీరు మీ భార్యలను తల్లులుగా చెప్పుకున్నంత మాత్రాన దేవుడు వారిని మీ తల్లులుగా చేయడు.** *(అల్ అహ్జాబ్ 33 : 4)*

కనుక వారసత్వ పంపిణీ విషయంలో కుటుంబాన్ని వంశావళిని దృష్టిలో ఉంచుకోవాల్సిన అవసరం ఉంది.

4) సిగ్గు బిడియాలు మానవ నైజంలోని స్వత:సిద్ధసుగుణాలు. మరి దేహంలోని కొన్ని భాగాలను గోప్యంగా ఉంచుకోవాలన్న కాంక్ష సహజంగానే వారి స్వభావంలో ఉంటుంది. ఈ సహజసిద్ధమైన అకాంక్షే ప్రారంభం నుండీ ఏదో ఒక విధంగా వస్త్రధారణకు ప్రాణం పోసింది. ఈ విషయంలో పవిత్ర ఖుర్ఆన్ ఆధునిక వైఖరిని పూర్వపక్షం చేస్తూ, మానవ దేహంలోని ఏ భాగాలైతే స్త్రీ పురుషుల మధ్య పరస్పర ఆకర్షణను కలిగిస్తాయో, వాటిని బహిర్గతం చేయకుండా గుప్తంగా ఉంచడానికి ప్రయత్నించడం మానవ నైజంలోనే ఉందంటుంది. అయితే షైతాన్ మాత్రం వాటిని బహిర్గతం చేయాలని అభిలషిస్తాడు.

**فَوَسْوَسَ لَهُمَا الشَّيْطٰنُ لِيُبْدِىَ لَهُمَا مَاوُرِىَ عَنْهُمَا مِنْ سَوْاٰتِهِما... فَلَمَّا ذَاقَا الشَّجَرَةَ بَدَتْ لَهُمَا سَوْاٰتُهُمَا وَطَفِقَا يَخْصِفٰنِ عَلَيْهِمَا مِنْ وَّرَقِ الْجَنَّةِ ط** (الاعراف:٢٠-٢٢)

**" షైతాను వారిని మాయకు లోనుచేశాడు, ఒకరిని మరొకరికి గుప్తంగా ఉన్న వారి మర్మాంగాలను వారికి బహిర్గతం చేసేందుకు. వాడు వారితో ఇలా అన్నాడు : "మీ ప్రభువు మిమ్మల్ని ఈ వృక్షం వద్దకు పోవద్దని వారించటానికి కారణం, మీరు దైవదూతలు అయిపోతారేమో అనేదీ, లేక మీకు శాశ్వతమైన జీవితం లభిస్తుందేమో అనేదీ తప్ప మరొకటి కాదు." ఇంకా వాడు ప్రమాణం చేసి వారితో ఇలా అన్నాడు: "నేను మీ నిజమైన శ్రేయోభిలాషిని." ఈ విధంగా మోసంచేసి అతడు వారిద్దరినీ క్రమక్రమంగా తన పన్నుగడ వైపునకు త్రిప్పుకున్నాడు. చివరకు వారు**

**ఆ వృక్షాన్ని రుచిచూడగానే, వారి ఆచ్ఛాదనలు వారిముందే తొలగిపోయాయి. అప్పుడు వారు తమ శరీరాలను స్వర్గంలోని ఆకులతో కప్పుకోసాగారు. "** ***(అల్ ఆరాఫ్ 7 : 21,22)***

పవిత్ర ఖుర్ఆన్ ఇలా అంటోంది. మీరు మీ శరీరాలను కప్పుకోడానికి, దాంతోపాటు సౌందర్యానికీ దైవం వస్త్రాలను అవతరింపజేశాడు. అయితే కేవలం శరీరాలను కప్పుకోవడమే కాదు. మీ హృదయాల్లో దైవభీతి కూడా ఉండాలి.

**قَدْ اَنْزَلْنَا عَلَيْكُمْ لِبَاسًا يُّوَارِىْ سَوْاٰتِكُمْ وَ رِيْشًا ۭ وَّ لِبَاسُ التَّقْوٰى ۙ ذٰلِكَ خَيْرٌ ۭ** (الاعراف:٢٦)

**"ఆదము సంతానమా! మేము మీపై దుస్తులను అవతరింపజేశాము. అవి మీరు సిగ్గుపడే మీ శరీర భాగాలను కప్పుతాయి. మీ శరీర రక్షణకు శోభకు సాధనంగా ఉంటాయి. భయభక్తులు అనే దుస్తులే మంచి దుస్తులు."** **(అల్ ఆరాఫ్ 7 : 26)**

ఇవీ ఇస్లామీయ జీవన వ్యవస్థ మూల సూత్రాలు. వీటిని మస్తిష్కంలో ప్రతిష్ఠించుకొని ఈ సూత్రాలపై ఏర్పడిన సామాజిక వ్యవస్థ లోతుపాతుల్ని పరిశీలించండి. ఈ పరిశీలనాక్రమంలో ఇస్లాం ఏసూత్రాలనైతే తన చట్టాలకు ప్రాతిపదిక అని చెబుతుందో వాటిలో సమగ్రత, సమానత, శాశ్వతత్వం, న్యాయం ఎంతవరకుందో నిష్పక్షపాతంగా ఆలోచించండి. మానవులు తయారు చేసిన చట్టాలు సిద్ధాంతాలు ఎన్ని ఉన్నాయో, వాటిలో ఎందులోనూ బలంలేదు. వాటి మూల సిద్ధాంతాలూ ఆచరణయోగ్యంగా లేవు. అన్ని విభాగాల్లోనూ పరస్పర వైరుధ్యంకొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. సిద్ధాంతం ఒకటైతే ఆచరణ మరొకటవుతుంది. సిద్ధాంతానికి, ఆచరణకు పొంతనే ఉండదు. ఆలోచనా శిఖరాలను అధిరోహించి ఒక సిద్ధాంతాన్ని రూపొందించడం జరుగుతుంది. కాని అక్కడినుండి కిందికి దిగి మనిషి ఆచరణాత్మక జీవితంలో అడుగుపెట్టే ప్రయత్నం చేయగానే అంతులేని సమస్యల్లో కూరుకుపోతాడు. అతనికి అసలు తన సిద్ధాంతమే గుర్తుకురాదు. మానవ స్వభావంలోని సూత్రాల్లో, ఏ ఒక్క నియమమూ ఈ బలహీనతకు అతీతంగా కనిపించదు. ఇప్పుడు మీరు మామూలుగా కాదు, సూక్ష్మదర్శిని సహాయంతో పరిశీలించినా అరేబియా ఎడారుల్లో జన్మించిన ఒక నిరక్షరాసి ప్రపంచానికి పరిచయం చేసిన సిద్ధాంతంలో ఏవిధమైన వైరుధ్యమూ బలహీనతా మీకు కనిపించదు.

10వ అధ్యాయం

# ఇస్లామీ జీవన వ్యవస్థ విధివిధానాలు

సామాజిక వ్యవస్థలో లైంగిక సంబంధాలను విశృంఖలతను నియంత్రించి, ఒక పద్ధతిలో లేక నియంత్రణలో ఉంచడమెలాగన్నది ప్రధాన ప్రశ్న. ఎందుకంటే ఒక సంస్కృతి, ఒక విధానం లేకుండా కట్టుబాటు అన్నదానికి అర్థమేలేదు. ఒకవేళ ఏదో ఒక కట్టుబాటు ఏర్పరచుకున్నా సమాజాన్ని విచ్ఛిన్నం కాకుండా, మనిషిని తీవ్రమైన నైతిక, మానసిక క్షీణతనుండి రక్షించే మార్గం ఎంతమాత్రం లేదు. అందుకే ఇస్లాం స్త్రీ పురుషుల సంబంధాలను కొన్ని హద్దులకు లోబడేలా చేసి ఒక కేంద్రంగా రూపొందించింది.

**నిషిద్ధాలు**

మొట్టమొదట ఇస్లాం తప్పనిసరిగా కలిసిమెలసి ఉండవలసిన వాళ్లు, దగ్గరి సంబంధీకులైన స్త్రీ పురుషులను ఒకరిపై ఒకరికి నిషేధం విధించింది. ఉదాహరణకు తల్లీకొడుకు, తండ్రీ కూతురు, అన్నాచెల్లెలు, మేనత్తమేనల్లుడు, బాబాయి అమ్మాయి, మామయ్య, పిన్ని, అక్క కూతురు (మేనకోడలు) సవితితండ్రి, కూతురు, సవతితల్లి, కొడుకు, అత్తా, అల్లుడు, మామ, కోడలు, బావా, మరదలు (సోదరి భర్త) సోదరి బ్రతికుండగా స్తన్యసంబంధ తల్లి, సోదరీలు (సూరె నిసా 14వ రుకూ) ఈ విధంగా లైంగిక ఆకర్షణలకు లవలేశమైనా అవకాశాలు లేకుండా నిషేదాజ్ఞలు విధించి, పవిత్రమైన, పరిశుద్ధమైన వాతావరణాన్ని ఏర్పరచడం జరిగింది. (నైతిక కట్టుబాట్లను అంగీకరించని పశుప్రాయమైన ఒకరిద్దరు ఎక్కడైనా ఉంటే ఉండవచ్చు. అది వేరే విషయం)

**వ్యభిచారం**

అంతేకాకుండా, మరొకరి దాంపత్య బంధంలో ఉన్న స్త్రీలందరిపై నిషేధం విధిస్తూ మరో షరతు కూడా పెట్టింది.

(النساء:۲۴) ...وَالْمُحْصَنٰتُ مِنَ النِّسَآءِ **"ఇతరుల వివాహబంధంలో ఉండే స్త్రీలు కూడా మీకు నిషేధించబడ్డారు."** (4-24) తరువాత ఇక మిగిలిన స్త్రీలతో కూడా అన్నిరకాల అక్రమ సంబంధం నిషిద్ధం చేయబడింది.

وَلَا تَقْرَبُوا الزِّنٰٓى اِنَّهٗ كَانَ فَاحِشَةً ط وَسَآءَ سَبِيْلًا ۝ (بنی اسرائیل:٣٢)

"వ్యభిచారం దరిదాపులకు కూడా పోకండి. అది అతి దుష్టకార్యం. బహు చెడ్డ మార్గం" *(బనీ ఇస్రాయీల్ 17 : 32)*

**వివాహం**

ఈ విధంగా కొన్ని హద్దులు ఏర్పరచి లైంగిక విశృంఖలతకు దారితీసే మార్గాలన్నిటినీ మూసివేయడం జరిగింది. అయితే మానవుడి మనోవాంఛల పరిపూర్తి కోసం, ప్రకృతి వ్యవస్థ నియమబద్ధంగా, నిరాటంకంగా మనుగడ సాగించడం కోసం ఒక ద్వారాన్ని తెరిచి ఉంచాల్సిన అవసరం కూడా ఉంది. అందుకని నికాహ్ రూపంలో ఆ ద్వారాన్ని తెరవడం జరిగింది. దీనిద్వారా మీ అవసరాన్ని తీర్చుకోండి. విశృంఖలత్వానికి పాల్పడకండి, దొడ్డిదార్లు తొక్కకండి. నిస్సిగ్గుగా హద్దుల్ని అతిక్రమించి అక్రమ సంబంధాలకు పాల్పడకండి. అని చెప్పబడింది. ఒక పద్ధతి ప్రకారం, బహిరంగ ప్రకటన చేయండి. తద్వారా ఫలానా పురుషుడు, ఫలానా స్త్రీ భాగస్వాములని ప్రజలకు తెలిసిపోతుంది.

وَاُحِلَّ لَكُمْ مَّا وَرَآءَ ذٰلِكُمْ اَنْ تَبْتَغُوْا بِاَمْوَالِكُمْ مُّحْصِنِيْنَ غَيْرَ مُسٰفِحِيْنَ ط (النسآء:٢٤)

"వివాహబంధంతో రక్షణ కల్పించాలి. కాని విశృంఖలమైన కామక్రీడలకు ఒడిగట్టరాదు.." *(అన్ నిసా 4 : 24)*

فَانْكِحُوْهُنَّ بِاِذْنِ اَهْلِهِنَّ... مُحْصَنٰتٍ غَيْرَ مُسٰفِحٰتٍ وَّلَا مُتَّخِذٰتِ اَخْدَانٍ ج (النسآء:٢٥)

"అందువల్ల వారి సంరక్షకుల అనుమతితో వారిని వివాహం చేసుకోండి. న్యాయమైన పద్ధతిలో వారికి మహర్ ఇవ్వండి – వారు వివాహ బంధంలో సురక్షితంగా ఉండేందుకు, స్వేచ్ఛాకామక్రీడలకు దిగకుండా ఉండేందుకు" *(అన్ నిసా 4 : 25)*

ఇస్లాంలోని మధ్యేమార్గం గొప్పదనం చూడండి. దాంపత్య బంధానికి వెలుపల ఏ లైంగిక సంబంధమైతే హరాం మరియు అసహ్యామో, అదే సంబంధం దాంపత్య పరిధిలో ధర్మ సమ్మతం, అభిలషణీయం, పుణ్యప్రదం కూడా. దీన్ని అవలంబించమని ఆదేశిస్తూ, వ్యతిరేకించడం అయిష్టమైన కార్యంగా చెప్పబడింది. దాంపత్యబంధం ద్వారా కొనసాగే సంబంధం పుణ్యకార్యంగా పరిగణించబడింది. అంతేకాదు, స్త్రీ తనభర్త ధర్మసమ్మతమైన కోరికనుండి తప్పించుకోడానికి నఫిల్ రోజాగాని, నఫిల్ నమాజులో గాని లీనమైపోతే అది పుణ్యానికి బదులు పాపానికి కారణమవుతుంది. ఈ విషయంలో ప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు :

عَلَيْكُمْ بِالْبَاءَ ةِ فَانَّه اَغَضُّ لِلبَصَرِ وَاَحْصَنُ لِلْفَرَجِ فَمَنْ لَّمْ يَسْتَطِعُ مِنكُمُ البَاءَ ةَ فَعَلَيْهِ بِالصَّوْمِ فَاِنَّ الصَّومَ لَهُ وِجَاءٌ.

(الترمذی ابواب النکاح فی هذا المعنی حدیث فی کتاب النکاح للبخاری)

'మీరు వివాహం చేసుకోండి. వివాహం చెడు దృష్టినుండి మిమ్మల్ని కాపాడి మర్మాంగాన్ని రక్షించడానికి చక్కని మార్గం. వివాహం చేసుకొనే స్థోమత లేనివారు రోజా పాటించాలి. రోజా మీ వాంఛలను నియంత్రిస్తుంది.

واللّٰه انی لاخشاکم للّٰه و اَتْقَاکُمْ لَهٗ لٰکنّی اَصُوْم وافطرو اصلی و ارقد و اتزوّج النّساء فمن رَغِبَ عن سُنّتی فلیس مِنّی.

(بخاری، کتاب النکاح)

నేను మీ అందరికంటే ఎక్కువగా దైవానికి భయపడేవాణ్ని. ఆయన శిక్షకు భయపడేవాణ్ని. అయినా నన్ను చూడండి. నేను రోజాలు పాటిస్తాను, విరమిస్తాను. నమాజులు పాటిస్తాను. రాత్రులు నిద్రకూడా పోతాను. స్త్రీలతో వివాహం కూడా చేసుకుంటాను. ఇది నా విధానం. నా విధానాన్ని కాదన్నవారితో నాకెలాంటి సంబంధమూ లేదు.

لا تَصُوْمُ الْمَرْاَةُ و بَعْلُهَا شاهِدٌ اِلاّ باذنهٖ.

(بخاری، باب صوم المرأة باذن زوجها)

"స్త్రీ తన భర్త అభీష్టానికి వ్యతిరేకంగా అతని సమక్షంలో నఫిల్ రోజా పాటించకూడదు."

**اذا باتت المرأة مهاجرة فراش زوجها لعنتها الملائكة حتى ترجع.** (بخاری، کتاب النکاح)

"ఏ స్త్రీ అయితే తన భర్తకు దూరంగా, ఒంటరిగా రాత్రి గడిపితే, మళ్లీ భర్త ప్రసన్నం కానంతవరకు దైవదూతలు ఆమెను శపిస్తూ ఉంటారు.' (బుఖారీ కితాబున్నికాహ్)

**ذارأی احدکم امرأة فاعجبته فليأت اهله فان معها مثل الذی معها.** (ترمذی، باب ماجاء الرجل یری المرأة فتعجبهٔ)

'మీలో ఎవరైనా పరస్త్రీని చూసి, ఆమె అందానికి ప్రభావితులైతే, మీరు మీ భార్య దగ్గరికి వెళ్లాలి. ఎందుకంటే ఆమె దగ్గర ఏముందో, మీ భార్య దగ్గర కూడా అదే ఉంది.'

అంటే ధర్మశాస్త్రం ఉద్దేశ్యం ఏమిటంటే దాంపత్య సంబంధాలను భార్యాభర్తల వరకే పరిమితం చేసి లైంగిక విశృంఖలత్వానికి అడ్డుకట్ట వేయడం. దాంపత్య పరిధుల వెలుపల లైంగిక చలనాలకు సాధ్యమైనంత మేర అవకాశాలు లేకుండా చేయడం. ఈ లైంగిక భావోద్రేకాల పరిపూర్తికి ఒక కేంద్రస్థానాన్ని నిర్ణయించడం. స్త్రీకి ఆమెభర్త, పురుషునికి అతని భార్య. తద్వారా వీరు అన్నిరకాల వికారాలకు, అనైతిక కార్యాలకు దూరంగా సమిష్టి సంరక్షణా శక్తితో సామాజిక సేవలో పాలుపంచుకోగలుగుతారు. విశ్వకర్మాగారాన్ని నడపడం కోసం దైవం వారిలో జనింపజేసిన ప్రేమ, ఆకర్షణ అంతా ఒక కుటుంబాన్ని ఉనికిలోకి తీసుకురావడానికి, దాన్ని పటిష్టపరచడానికే వినియోగించబడాలి. దీనికి వివాహమే అన్ని విధాలా సరైన మార్గం. ఎందుకంటే అది మానవనైజం. ఇతర నైజాల ఉద్దేశ్యం, దైవచట్టాల లక్ష్యాన్ని నెరవేరుస్తుంది. సహజీవనం అన్ని విధాల అనైతికం. ఎందుకంటే అది రెండు చెడుల్లో ఖచ్చితంగా ఒక చెడు పై ఆధారపడి ఉంటుంది. మానవుడు ప్రకృతి నైజం, సహజస్వభావా లకు భిన్నంగా, తన శక్తి సామర్థ్యాలను ప్రకృతితో పోరాడడం లోనైనా వ్యర్థం చేస్తాడు. లేకపోతే, సహజసిద్ధ అవసరాలకు లొంగిపోయి అనైతిక పద్ధతుల ద్వారా తన కోరిక తీర్చుకుంటాడు.

## కుటుంబ వ్యవస్థ

లైంగిక సంపర్కాన్ని కుటుంబ ఉనికి, దాని పటిష్టతకు ఆధారంగా చేసి ఇస్లాం కుటుంబ వ్యవస్థను ఏర్పరుస్తుంది. ఇక్కడ కూడా అది పూర్తి సమతూకాన్ని పాటిస్తూ ప్రకృతి చట్టాల్లోని అన్ని కోణాలనూ గౌరవిస్తుంది. ఈ విషయం మేము ఇంతకుముందే చెప్పాము. స్త్రీ పురుష హక్కుల విషయంలో అది ఎంత న్యాయబద్ధమైన, ధర్మబద్ధమైన వైఖరినలంభించిందో దాన్ని గురించి నేను 'భార్యాభర్తల హక్కులు' అని ఒక పుస్తకం రాశాను. దాన్ని చదివితే స్త్రీ పురుషుల సమానత్వానికి సంబంధించిన అన్ని విషయాలు మీకు తెలుస్తాయి. అయితే, ప్రకృతికి,మానవ నైజానికి వ్యతిరేకంగా ఉన్నటువంటి సమానత్వానికి ఇస్లాం అనుకూలం కాదు.మానవ రాశిగా పురుషులకెలాంటి హక్కులున్నాయో, స్త్రీలకూ అలాంటి హక్కులే ఉన్నాయి. 'లహున్న మిస్‌లుల్లజీ అలైహిన్న'. కాని ఆధిక్యం కలవాడిగా పురుషునికి ఒక ప్రత్యేకత ఉంది. (అంటే స్వాభావిక ఆధిక్యమే తప్ప, గౌరవాదరణల విషయంలో కాదు) పూర్తి న్యాయబద్ధంగా ఇది పురుషునికి ప్రసాదించబడింది. 'వలిర్రిజాలి అలైహిన్న దరజ' (2: 228) ఈవిధంగా స్త్రీ పురుషుల మధ్య సహజ సమానత్వాన్ని, సహజ సంబంధాన్ని అంగీకరించి ఇస్లాం కుటుంబ వ్యవస్థను ఏర్పరిచింది.

## పురుషుని అధికారం

اَلرِّجَالُ قَوّٰمُوْنَ عَلَى النِّسَآءِ بِمَا فَضَّلَ اللّٰهُ بَعْضَهُمْ عَلٰى
بَعْضٍ وَّبِمَآ اَنْفَقُوْا مِنْ اَمْوَالِهِمْ ط (النسآء:٣٤)

**"పురుషులు స్త్రీలకు అధికారులు (ఖవ్వామ్), ఎందుకంటే అల్లాహ్ వారిలో ఒకరికి మరొకరిపై ఆధిక్యతను ప్రసాదించటంవల్ల, ఇంకా పురుషులు తమ సంపదను వారికొరకు ఖర్చు చేస్తున్నందువల్ల"**

*(అన్ నిసా 4 : 34)*

اَلرَّجُلُ رَاعٍ عَلٰى اَهْلِهٖ وَهُوَ مَسْئُوْلٌ (بخاری، باب قوا انفسکم واہلیکم نارا کتاب النکاح)

**'పురుషుడు తన భార్యాపిల్లలపై వ్యవహార కర్త. తన ఆధీనంలో ఉన్నవారి విషయంలో అతను దైవానికి జవాబుదారీ వహించవలసి ఉంటుంది.' (బుఖారీ...)**

فَالصّٰلِحٰتُ قٰنِتٰتٌ حٰفِظٰتٌ لِّلْغَيْبِ بِمَا حَفِظَ اللّٰهُ ط (النسآء: ۳۴)

'సుగుణవతులైన స్త్రీలు విధేయత కలిగివుంటారు. పురుషులు లేనప్పుడు అల్లాహ్ రక్షణలో ఉంటూ వారి హక్కులను కాపాడుతారు.' (4 : 34)

'ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారు :

قال النّبی صلى الله عليه وسلم اذا خرجت المرأة مِن بيتها و زوجُها كاره لعنها كل ملک فی السّماء وكل شیءٍ مرت عليه غير الجن والانس حتّی ترجع. (کشف الغمه)

భర్త అభీష్టానికి భిన్నంగా ఇంటి నుండి బయలుదేరిన స్త్రీని ఆకాశంలోని ప్రతి దైవదూతా శపిస్తాడు. మానవులు జిన్నులు తప్ప, ఎటు నుండి ఆమె వెళుతుందో ఆ వస్తువులన్నీ ఆమెను శపిస్తాయి. ఆమె తిరిగి ఇంటికి వెళ్ళేంతవరకూ.' (కషఫుల్ గమ్మ)

وَالّٰتِیْ تَخَافُوْنَ نُشُوْزَهُنَّ فَعِظُوْهُنَّ وَاهْجُرُوْهُنَّ فِی الْمَضَاجِعِ وَاضْرِبُوْهُنَّ ج فَاِنْ اَطَعْنَكُمْ فَلَا تَبْغُوْا عَلَيْهِنَّ سَبِيْلًا ط (النسآء: ۳۴)

'ధిక్కరిస్తారనే భయం మీకు ఏ స్త్రీల విషయంలో కలుగుతుందో వారికి నచ్చజెప్పండి. పడకగదులలో వారికి దూరంగా ఉండండి, మరియు కొట్టండి, తరువాత వారు మీకు విధేయులైతే, అకారణంగా వారిని వేధించటానికి సాకులు వెతక్కండి.' (4 : 34)

ప్రవక్త(స) ప్రవచించారు :

وقال النّبی صلى الله عليه وسلم لاطاعة لمن لم يطع اللّٰه (رواہ احمد من حدیث) ولا طاعة فی معصية اللّٰهِ (رواہ احمد من حدیث عمران بن حصین) انما الطاعة فی المعروف. (بخاری۔ کتاب الاحکام)

'ఎవరైతే దైవానికి విధేయులై ఉండరో, వారికి విధేయత చూపకూడదు.

దైవాన్ని వ్యతిరేకించేవారి విధేయత సమర్థనీయం కాదు. మంచి పనుల్లో మాత్రమే విధేయత చూపాలి.' (బుఖారీ)

وَوَصَّيْنَا الْاِنْسَانَ بِوَالِدَيْهِ حُسْنًا ط وَاِنْ جٰهَدٰكَ لِتُشْرِكَ
بِيْ مَالَيْسَ لَكَ بِهٖ عِلْمٌ فَلَا تُطِعْهُمَا ط (العنكبوت:٨)

**'తన తల్లిదండ్రుల పట్ల సద్భావంతో మెలగుమని మేము మానవునికి ఉపదేశించాము. కాని ఒకవేళ వారు నా భాగస్వామిగా నీవు ఎరుగని వానిని (ఆరాధ్యుణ్ణి) నాకు భాగస్వామిగా చేయమని నిన్ను బలవంత పెడితే, అప్పుడు వారి యెడల విధేయత చూపకు.'**

***(అల్ అన్ కబూత్ 29 : 8)***

కుటుంబ వ్యవస్థను ఎవరైతే విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తారో వారిని ప్రవక్త(స) ఏమన్నారో చూడండి:

من افسد أمراة علىٰ زوجها فليس منّا. (كشف الغمه)

**'ఎవరైతే భార్యాభర్తల మధ్య సంబంధాన్ని చెడగొట్టా లని చూస్తాడో, అలాంటి వానితో మాకు ఏవిధమైన సంబంధమూ లేదు'(కషఫుల్‌గమ)**

## స్త్రీ ఆచరణా పరిధి

ఈ వ్యవస్థలో స్త్రీ గృహ సామ్రాజ్యానికి మహారాణి. సంపాదనా బాధ్యత పురుషునిదే. భర్త సంపాదనతో కుటుంబ నిర్వహణ మాత్రమే ఆమె పని.

المرأة راعية علىٰ بيت زوجها و هى مَسْؤلةٌ.

(بخارى باب قوا انفسكم و اهليكم ناراً)

**'స్త్రీ తన భర్త గృహానికి మహారాణి, అధికారి. తన అధికార పరిధిలో ఆమె తన ఆచరణకు బాధ్యురాలు.'**

***(బుఖారీ ఖూఅన్ ఫుసికుం వఅహలీకుంనారా అధ్యాయం)***

బయటి వ్యవహారాలన్నింటి నుండి ఆమెకు మినహాయింపునివ్వడం జరిగింది.

- జుమా నమాజు ఆమెకు విధి కాదు. అబూ దావూద్)

- జిహాద్ ఆమెపై విధిగా నిర్ణయించబడలేదు. ఒకవేళ అవసరమైతే యుద్ధవీరుల సహాయం కోసం వెళ్ళవచ్చు. ఈ విషయం తరువాత తెలుసుకుందాం.
- జనాజా నమాజులో ఆమె పాల్గొనాల్సిన అవసరంలేదు. దాన్నుండి ఆమెకు మినహాయింపు ఉంది. (బుఖారీ)
- ఆమె నమాజులు జమాఅత్‌తో మసీదులో చేయడం తప్పనిసరికాదు. నిబంధనలకు లోబడి మస్జిదులకు వచ్చే అనుమతి ఉంది. కాని అది అంత అభిలషణీయంకాదు.
- ముహర్రిమ్ వెంట లేకుండా స్త్రీ ప్రయాణం కూడా చేయజాలదు.

అంటే మొత్తమ్మీద ఏవిధంగా చూసినా స్త్రీ బయటికి వెళ్ళకపోవడమే అభిలషణీయం. ఆమె ఇంటి పట్టున ఉండడమే ఇస్లాం దృష్టిలో అన్ని విధాల శ్రేయస్కరం. పవిత్ర ఖుర్ఆన్‌లోని ఈ వాక్యం కూడా ఈ అభిప్రాయానికి బలం చేకూరుస్తోంది. అయితే కొన్ని పరిస్థితుల్లో స్త్రీ ఇంటినుండి బయటికి వెళ్ళడం కూడా తప్పనిసరి అవుతుంది. అందుకే ఈ అధ్యాయంలో అంత కఠినంగా చెప్పడం జరగలేదు. ఎందుకంటే, ఏ స్త్రీ కైనా ఇంటి బాధ్యతలు చూసుకునే భర్త లేకపోవచ్చు. లేక పేదరికం, వ్యాధులు, నిస్సహాయత లేక మరేవో కారణాల వల్ల స్త్రీ బయటికి వెళ్ళడం తప్ప గత్యంతరం లేని పరిస్థితి ఏర్పడుతుంది. అలాంటి పరిస్థితుల్లో చట్టంలో కావలసినంత వెసులుబాటును కూడా సమకూర్చడం జరిగింది. హదీసులో ఇలా వుంది :

**قد اذن الله لكن ان تخرجن لِحوائجكن.**(1)

**"మీ అవసరాల పరిపూర్తికి ఇంటి నుండి బయటికెళ్ళవచ్చని అల్లాహ్ మీకు అనుమతినిస్తున్నాడు.**

అయితే ఈ విధమైన వెసులుబాటు కేవలం పరిస్థితులనుబట్టే కల్పించబడిందని గుర్తుంచుకోవాలి. నిజానికి స్త్రీ ఆచరణా పరిధి గృహమే. ఇది కేవలం ఒక వెసులుబాటు మాత్రమే. దాన్ని ఆ మేరకే వినియోగించుకోవాలి.

## తప్పనిసరి నిబంధనలు

ప్రాజ్ఞ స్త్రీలకు తన స్వంత విషయాల్లో చాలా వరకు స్వేచ్ఛను ప్రసాదించడం జరిగింది. అయితే పురుషులతో పోల్చుకుంటే కాస్త తక్కువే. ఉదాహరణకు పురుషుడు

తన ఇష్టానుసారం ఎక్కడికైనా వెళ్ళగలడు. కాని, స్త్రీ- కన్య అయినా, వివాహితు రాలైనా, వితంతువైనా ప్రయాణంలో తప్పకుండా ఆమె వెంట ఒక ముహ్రిం ఉండాలి.

**لایحل لامرأة تؤمن بالله و الیوم الاٰخر ان تسافر سفراً یکون ثلاثة ایام فصاعداً الا ومعها ابوها او اخوها اوزوجها او ابنها او ذومحرمٍ منها.**

'దైవాన్ని, పరలోకాన్ని విశ్వసించే స్త్రీలు, మూడు రోజులు లేక అంతకంటే ఎక్కువ ప్రయాణం చేయదలిస్తే ఆమెవెంట తండ్రి కాని, సోదరుడు కాని, భర్త కాని, లేక ఎవరైనా ముహ్రిం పురుషుడు కాని వెంట ఉండాలి. ఎవరూ లేకుండా ఒంటరిగా ప్రయాణం చేయడం ధర్మ సమ్మతం కాదు.'

హజ్రత్ అబూహురైరా(ర)ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త(స) ప్రవచించారు:

**وعن ابی ھریرة عن النبیﷺ انه قال لا تسافر المرأة مسیرة یوم ولیلة الاومعها محرم، والعمل علیٰ ھذا عند اھل العلم.** (ترمذی باب ماجاء فی کراھة ان تسافر المرأة وحدھا)

'ముహ్రమ్ పురుషుడు వెంట లేకుండా స్త్రీ ఒక పగలు రాత్రి ప్రయాణం చేయ కూడదు'

అబూహురైరా ఉల్లేఖించిన మరో ఉల్లేఖనం : ప్రవక్త(స) ఇలా ప్రవచించారు:

**و عن ابی ھریرة ایضا ان النبیﷺ قال لایحل لامرأة مسلمة تسافر مسیرة لیلة الاومعها رجل ذوحرمة منها.**

(ابوداؤد، باب فی المرأة تحج بغیر محرم)

'ఒక ముహ్రిం పురుషుడు లేకుండా ఏ ముస్లిం స్త్రీ అయినా ఒక రాత్రి ప్రయాణం చేయరాదు'

ఈ ఉల్లేఖనాల్లో ప్రయాణానికి సంబంధించి నిర్ణీత గడువు ఏదీ సరిగా తెలుపబడలేదు. కాబట్టి ఒక రోజో, రెండు రోజులో అనే ప్రశ్న ముఖ్యం కాదిక్కడ. అసలు విషయం ఏమిటంటే, ఏదో ఒక అనర్థానికి, ప్రమాదానికి దారితీసే లాంటి స్వేచ్ఛను, ఒంటరితనాన్ని ఆమెకు కల్పించకూడదన్నది అసలు ఉద్దేశ్యం. అందుకే ప్రయాణానికి నిర్ణీత దినాలు నిర్ణయించడంలో ప్రవక్త(స) అంతగా శ్రద్ధ వహించలేదు. పరిస్థితులనుబట్టి రకరకాల వెసులుబాట్లు కల్పించారు.

## మహిళల హక్కులు

దీంతోపాటు ఇస్లాం స్త్రీల హక్కుల విషయంలో ప్రధానంగా మూడువిషయాలను దృష్టిలో ఉంచుకుంది : ఒకటేమిటంటే, పురుషుడు తనకప్పగించబడిన కుటుంబ అధికార బాధ్యతను దుర్వినియోగం చేసి అక్రమంగా, దౌర్జన్యాలకు పాల్పడకుండా, విధేయతా సంబంధాన్ని యజమాని బానిస సంబంధంగా మార్చకుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసింది.

రెండవ విషయం ఏమిటంటే, సామాజిక వ్యవస్థ పరిధిలో ఉంటూ స్త్రీలు తమ శక్తిసామర్థ్యాలను వృద్ధిపరచుకోడానికి, సమాజ వికాసంలో తమ వంతు పాత్రను సమర్థవంతంగా నిర్వహించే అన్ని అవకాశాలను కల్పించింది.

మూడవ విషయం ఏమిటంటే, స్త్రీలు తమ వ్యక్తిత్వాన్ని కాపాడుకుంటూ ప్రగతీ వికాసాల అంచుల వరకు ఎదగ గలగాలి. స్త్రీ స్త్రీగానే ప్రగతి సాఫల్యాలు సాధించగలగాలి కాని,దానికోసం పురుషునిగా మారాల్సిన అవసరం లేదు. స్త్రీ, పురుష జీవితాన్ని అవలంబించడం వల్ల సమాజానికి గాని, స్వయంగా ఆమెకుగాని ఎలాంటి ప్రయోజనం లేదు.

ఈ మూడువిషయాల పట్ల అత్యంత శ్రద్ధ వహించి, ఇస్లాం స్త్రీకి విస్తృతమైన సామాజిక హక్కులతోపాటు, ఆమెకు పతాక స్థాయి గౌరవ మర్యాదలు ప్రసాదించింది. ఈ గౌరవోన్నత స్థాయి, హక్కుల పరిరక్షణ కోసం ఇస్లాం ప్రతిపాదించిన నైతిక, చట్టపరమైన సమగ్ర నియమాలు ప్రపంచంలోని ప్రాచీన ఆధునిక సామాజిక వ్యవస్థలో ఎక్కడా మనకు కానరావు.

## ఆర్థిక హక్కులు

సమాజంలో మానవుడి ఔన్నత్యమైనా, దాన్ని అతను నిలుపుకోవడమైనా, సమాజ పటిష్టత పైనే ఆధారపడి ఉంది. ఇస్లాం తప్ప మిగతా చట్టాలన్నీ స్త్రీని

ఆర్థికంగా బలహీన పరిచాయి. ఈ ఆర్థిక నిస్సహాయతే సమాజంలో స్త్రీని బానిసగా చూసే మనస్తత్వానికి కారణంగా నిలిచింది. ఈ స్థితిని మార్చాలనుకొన్న యూరప్ సమాజం స్త్రీని సంపాదనాపరురాలిగా మార్చివేసింది. అయితే ఇది మరో విధమైన చెడుకు కారణమైంది. అందుకే ఇస్లాం మధ్యేమార్గాన్ని అవలంబిస్తుంది. ఇస్లాం స్త్రీకి విస్తృతమైన వారసత్వ హక్కులు ప్రసాదించింది. తండ్రి, భర్త, సంతానం, ఇతర దగ్గరి బంధువుల ఆస్తిలో ఆమెకు వాటా లభిస్తుంది.[1] అంతేకాక ఆమెకు భర్త నుండి మెహెర్ కూడా లభిస్తుంది. ఈ విధంగా ఆమెకు లభించే ధనసంపదలపై వ్యక్తిగతంగా ఆమెకు సంపూర్ణ హక్కులు సంక్రమిస్తాయి. ఆమె తన ఇష్టానుసారం ఈ సంపదను వినియోగించుకోవచ్చు. ఈ విషయంలో జోక్యం చేసుకునే హక్కు తండ్రికి గాని, భర్తకు గాని, మరెవరికీ లేదు. అంతేకాదు. ఆమె ఈ ధనం ద్వారా ఏదైనా వ్యాపారం చేసి గాని, వ్యవసాయం చేసి గాని సంపాదించిన ధనానికి కూడా ఆమె యజమాని అవుతుంది. అయినప్పటికీ ఆమె పోషణ భారం మాత్రం భర్తపైనే ఉంటుంది. స్త్రీ ఎంత ధనవంతురాలైనప్పటికీ భర్త తన బాధ్యతలనుండి తప్పించుకోలేడు. ఈవిధంగా ఇస్లాం స్త్రీని ఆర్థికంగా బలోపేతం చేసింది. దీనివల్ల ఒక్కోసారి పురుషుని కన్నా స్త్రీయే మంచి స్థితిలో ఉండే అవకాశం ఉంది.

## సామాజిక హక్కులు

1) వరుని ఎంపికలో స్త్రీకి పూర్తి హక్కులు ప్రసాదించబడ్డాయి. ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా, ఆమె అనుమతి లేకుండా వివాహం జరిపించే అధికారం ఎవరికీ లేదు. ఆమె తన ఇష్ట ప్రకారం నచ్చిన ముస్లిం వ్యక్తిని వివాహం చేసుకోదలిస్తే ఆమెను ఎవరూ ఆపలేరు. అయితే కుటుంబ స్థాయిని దిగజార్చి, పరువు ప్రతిష్టలకు భంగం కలిగే ఎంపిక పట్ల అభ్యంతరం వ్యక్తం చేసే అధికారం ఆమె సంరక్షకులకు ఉంటుంది 2) ఇష్టంలేని భర్త, దౌర్జన్యపరుడు, పనికిరాని భర్త నుండి 'ఖులా' పొందేహక్కు, వివాహాన్ని రద్దు చేసుకొనే విశేష అధికారాలు ఆమెకున్నాయి. 3) భర్తకు భార్యపై ఉన్నటువంటి హక్కుల వినియోగంలో సత్ప్రవర్తన, ఔదార్య గుణం కలిగి ఉండాలని ఆదేశించడం జరిగింది. పవిత్ర ఖుర్ఆన్‌లో ఇలా ఉంది : 'స్త్రీల పట్ల సత్ప్రవర్తన కలిగివుండండి', 'పరస్పర సంబంధాల్లో ఉదారతను విస్మరించకండి', ప్రవక్త(స) ఇలా ప్రవచించారు : 'తమ భార్యల పట్ల ఉత్తమ రీతిన వ్యవహరించేవారు, తమ భార్యబిడ్డలతో ప్రేమానురాగాలతో మసలుకునేవారు మీలో అందరికన్నా ఉత్తములు.' ఇవి కేవలం నైతిక ఉపదేశాలు మాత్రమేకావు. ఒకవేళ భర్త అధికార

దుర్వినియోగానికి పాల్పడితే, దౌర్జన్యం జరిపితే స్త్రీలకు చట్టాన్ని ఆశ్రయించే సంపూర్ణ అధికారాలున్నాయి. 4) వితంతువులు (భర్త మరణించినవారు), విడాకులు పొందిన స్త్రీలు, ఏ కారణం వల్లనైనా వివాహ బంధం విచ్ఛిన్నమైనా, లేక రద్దు కాబడినా లేక భర్త నుండి వేరైన స్త్రీలందరికీ పునర్వివాహానికి పూర్తి హక్కులు ప్రసాదించబడ్డాయి. వీరిపై మాజీ భర్త, లేక భర్త బంధువులకు ఎలాంటి హక్కులూ ఉండవని తేల్చి చెప్పబడింది. ఇలాంటి హక్కు నేటివరకూ యూరప్, అమెరికాతో సహా అనేక దేశాల స్త్రీలకు ప్రాప్తం కాలేదు. 5) ఆస్థాన, సైనిక చట్టాల్లో స్త్రీ పురుషులకు సంపూర్ణ సమానత్వం కల్పించబడింది. ధన ప్రాణ, గౌరవ మర్యాదల పరిరక్షణలో ఇస్లామీ చట్టాలు స్త్రీ పురుషుల మధ్య ఏ విధమైన వ్యత్యాసాన్నీ చూపవు.

## స్త్రీ విద్య

స్త్రీలు ధార్మిక విద్యతోపాటు ప్రాపంచిక విద్య అభ్యసించడానికి అనుమతి నివ్వడం మాత్రమేకాదు. విద్య పురుషులకు ఎంత అవసరమో, స్త్రీలకూ అంతే అవసరమని తేల్చిచెప్పింది. దైవప్రవక్త (స) వారి వద్ద పురుషులు ఏ విధంగా ధార్మిక నైతిక విద్య నేర్చుకునేవారో స్త్రీలు కూడా అలాగే నేర్చుకునేవారు. ప్రవక్త (స) వారి సతీమణి హజ్రత్ ఆయిషా సిద్దీఖ (రజి) స్త్రీలకు మాత్రమే కాక, పురుషులకు కూడా గురువుగా వ్యవహరించేవారు. గొప్ప గొప్ప సహాబీలు, తాబయీన్‌లు ఆమెవద్ద హదీసు విద్య, 'ఫిఖ' కు సంబంధించిన విద్య నేర్చుకునేవారు. పై స్థాయి మధ్యతరగతి ప్రజల సంగతి సరేసరి, నౌకర్లు, బానిసలకు కూడా విద్యాబుద్ధులు సాహిత్యం నేర్పాలని ఆదేశించారు దైవప్రవక్త (స). ప్రవక్త ప్రవచనం ఇలా ఉంది :

**ایمارجل کانت عنده ولیدة فعلّمها فاحسن تعلیمها و ادّبها فاحسن تادیبها ثم اعتقها و تزوجها فله اجران.**

(بخاری کتاب النکاح)

**'ఎవరి వద్దనైనా ఒక బానిస ఉండి, అతనామెకు మంచి విద్యాబుద్ధులు, ఉన్నత సంస్కారం నేర్పించి, ఆమెకు స్వేచ్ఛను ప్రసాదించి, ఆమెను వివాహమాడతాడో, అతనికి రెండింతల పుణ్యఫలం లభిస్తుంది. (బుఖారీ, కితాబున్నికాహ్)**

కనుక విద్యావిజ్ఞానాల విషయంలో ఇస్లాం స్త్రీ పురుషుల మధ్య ఏ విధమైన వ్యత్యాసాన్ని పాటించలేదు. ఇస్లాం దృష్టిలో స్త్రీ విద్యకు అర్థం ఏమిటంటే, ఆమె ఒక మంచి భార్యగా మంచి తల్లిగా మంచి సంరక్షకురాలిగా రూపొందాలి. ఆమె ఆచరణా పరిధి ప్రధానంగా గృహమే కాబట్టి దానికి సంబంధించిన విజ్ఞానం ఆమెకు అపారంగా ఉండాలి. దాంతోపాటు సంకుచితత్వానికి అతీతంగా ఉన్నతనైతిక ప్రమాణాలతో మనిషిని మనిషిగా తీర్చిదిద్దే విద్య కూడా అవసరం. ఈ విధమైన విద్యను సొంతం చేసుకోవడం ప్రతి ముస్లిం స్త్రీకి తప్పనిసరి. అంతేకాదు, స్త్రీ ఒకవేళ ఇంకా ఉన్నత చదువులను అభ్యసించాలన్నా ఇస్లాం ఆమెను ఎంతమాత్రం అడ్డుకోదు. పైగా ప్రోత్సహిస్తుంది.

## స్త్రీ విమోచన

ఇది కేవలం హక్కులకు సంబంధించిన ప్రస్తావన మాత్రమే. దీనివల్ల ఇస్లాం స్త్రీలకు చేసిన మహోపకారాన్ని అంచనావేయలేం. ప్రపంచంలో స్త్రీ ఉనికి నీచమని, హీనమని, సిగ్గుమాలిన ఉనికని, పాపాలకు మూలమని మానవజాతి చరిత్ర సాక్ష్యం పలుకుతోంది. ఒకతండ్రి ఆడ పుట్టుకను అవమానంగానూ, అల్లుడు రావడం నామోషీగానూ భావించేవాడు. అత్తింటి బంధుత్వాన్ని అవమానంగా భావించడం వల్లనే మామయ్య, బావమరిది లాంటి పదాలు ఈనాటికీ ఒక తిట్టులా చలామణిలో ఉన్నాయి. ఈ అవమానంనుండి తప్పించుకోడానికి అనేక జాతులు ఆడపిల్లల్ని చంపడం ఆచారంగా చేసుకున్నాయి. ఈ అజ్ఞాన, అనాగరిక స్వభావాన్ని పవిత్ర ఖురాన్ స్పష్టంగా ఇలా ఆవిష్కరించింది. 'వారిలో ఎవరికైనా కూతురు పుట్టిందని శుభవార్త వినిపిస్తే చాలు, వెంటనే అతని ముఖం మాడి ముడుచుకుపోతుంది. అతను లోలోన తెగబాధపడిపోతాడు. ఈ దుర్వార్త విన్నాక ఇక నా మోహం జనాలకు ఎలా చూపించను? అని భావిస్తూ ప్రజలనుండి తప్పించుకొని తిరుగుతాడు. అంతేకాదు ఈ అవమానభారంతో కూతుర్ని అలాగే అట్టి పెట్టుకోవాలా లేక మట్టిలో పూడ్చి పెట్టాలా? అని తీవ్రంగా ఆలోచిస్తాడు.' (16,58,59)

పామరులు సరేసరి, తలపండిన ధార్మిక పండితుల్లో కూడా స్త్రీ అసలు మనిషేనా? దైవం ఈమెకు ఆత్మను ప్రసాదించాడా? అన్న ప్రశ్న కొన్ని తరాల వరకు చర్చనీయాంశంగా ఉండిపోయింది. హిందూమతంలో స్త్రీలకు విద్య నిషేధం. బౌద్ధమతంలో స్త్రీతో సంబంధం కలిగి ఉన్న వారి ముక్తి మోక్షాలకు ఎలాంటి

అవకాశం లేదు. ఇక యూద, క్రైస్తవ మతాల దృష్టిలోనైతే సకల పాపాలకు మూలం స్త్రీయే. యూనాన్‌లో స్త్రీలకు విద్యగాని, సంస్కృతి సంస్కారం గాని, హక్కులు గాని ఉండేవికావు. ఈ హక్కులు పొందిన వాళ్లు విధవలుగా పరిగణించబడేవారు. రోమ్,ఇరాన్, ఈజిప్ట్, చైనా తదితర నాగరిక దేశాల పరిస్థితి కూడా దాదాపు ఇలాగే ఉండేది. శతాబ్దాల బానిసత్వ బతుకుల కారణంగా స్వయంగా స్త్రీల మనసులోనుండి కూడా ఆత్మగౌరవ భావన తుడిచిపెట్టుకు పోయింది. వారికి కూడా కొన్ని హక్కులున్నాయని, వారికీ గౌరవప్రదమైన స్థానమున్నదన్న విషయాన్ని వారు మరిచిపోయారు. స్త్రీలపై దౌర్జన్యం జరపడం పురుషుడు తన హక్కుగా భావిస్తే, దాన్ని భరించడం ఆమె తన విధిగా భావించేది. భర్తకు తనకు తాను కేవలం 'దాసీ'నని గర్వంగా చెప్పుకొనే విధంగా, ఆమెలో బానిస భావాలు ప్రోది చేశారు. భర్తను దైవంగా భావించడం 'పతివ్రత' ధర్మంగా కూడా ఆమెకు నూరిపోయడం జరిగింది.

ఇలాంటి వాతావరణంలో చట్టపరంగా, ఆచరణా పరంగానే కాకుండా, ఆలోచనా పరంగా కూడా ఒక మహోన్నత విప్లవాన్ని సృష్టించింది ఇస్లాం. స్త్రీ పురుషుల ఆలోచనా విధానాన్ని మార్చివేసింది కేవలం ఇస్లాం మాత్రమే. స్త్రీ గౌరవం, ఆమె హక్కుల భావనను ఇస్లాం మానవుల హృదయాల్లో జనింపజేసింది. ఈనాడు మహిళా హక్కులు, స్త్రీ విద్య, స్త్రీ చైతన్యంలాంటి పదాలు ఏవైతే మనం వింటున్నామో అవి ముహమ్మద్ ప్రవక్త (స) వారి నోటినుండి జాలువారినవే. అవి మానవుల ఆలోచనా విధానాన్ని పూర్తిగా మార్చివేశాయి. పురుషుడికిలాగానే స్త్రీ కూడా మనిషేనన్న విషయాన్ని ముహమ్మద్ ప్రవక్త (స) ప్రపంచానికి చాటిచెప్పారు. పవిత్ర ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది :

خَلَقَكُمْ مِّنْ نَّفْسٍ وَّاحِدَةٍ وَّخَلَقَ مِنْهَا زَوْجَهَا (النسآء: ١)

**"దైవం మిమ్మల్ని ఒకే ప్రాణి నుండి పుట్టించాడు. అదే ప్రాణి నుండి దాని జతను సృష్టించాడు. ఇంకా ఆ జంటద్వారా ఎంతోమంది పురుషులను, స్త్రీలను అవనిలో వ్యాపింపజేశాడు.** ***(అన్ నిసా 4 :1)***

لِلرِّجَالِ نَصِيْبٌ مِّمَّا اكْتَسَبُوْا ؕ وَ لِلنِّسَآءِ نَصِيْبٌ مِّمَّا اكْتَسَبْنَ ؕ

(النسآء: ٣٢)

**పురుషులు సంపాదించిన దానికి తగినట్లుగా వారి భాగం ఉంటుంది. స్త్రీలు సంపాదించిన దానికి తగినట్లుగా వారి భాగం ఉంటుంది. (4-32)**

విశ్వాసం, సదాచరణలతో పాటు పురుషులు ఆధ్యాత్మిక వృద్ధివికాసాలను ఎలా సాధించగలరో అలాగే స్త్రీలు కూడా అత్యున్నత స్థాయికి చేరుకోగలరు. పురుషుడు ఇబ్రాహీం బిన్ ఆధం కాగలిగితే, స్త్రీ కూడా రాబియ బస్రియ కాకుండా ఆమెను ఎవరూ ఆపలేరు. ఎందుకంటే, 'వారి ప్రభువు వారి మొర విని ఇలా అన్నాడు.

فَاسْتَجَابَ لَهُمْ رَبُّهُمْ اَنِّیْ لَآ اُضِیْعُ عَمَلَ عَامِلٍ مِّنْكُمْ مِّنْ
ذَكَرٍ اَوْاُنْثٰی ۚ بَعْضُكُمْ مِّنْۢ بَعْضٍ ۚ (آل عمران:۱۹۵)

**'మీలోని ఎవరి శ్రమనూ నేను వృధాగా పోనివ్వను. పురుషుడైనా, స్త్రీ అయినా మీరంతా ఒకే రాశికి చెందినవారు.' *(అలి ఇమ్రాన్ 3 :195)***

وَمَنْ یَّعْمَلْ مِنَ الصّٰلِحٰتِ مِنْ ذَكَرٍ اَوْ اُنْثٰی وَهُوَ مُؤْمِنٌ
فَاُولٰٓئِكَ یَدْخُلُوْنَ الْجَنَّةَ وَلَا یُظْلَمُوْنَ نَقِیْرًا (النسآء:۱۲۴)

**పురుషులైనా స్త్రీలైనా - వారుగనక విశ్వాసులైతే స్వర్గంలో ప్రవేశిస్తారు. వారికి రవ్వంత అన్యాయం కూడా జరగదు. *(అన్ నిసా 4 :124)***

స్త్రీలపై పురుషులకు ఏవిధమైన హక్కులున్నాయో, అలాగే స్త్రీలకూ పురుషులపై అలాంటి హక్కులే ఉన్నాయని ప్రవక్త మహనీయులు సెలవిచ్చారు.

لَهُنَّ مِثْلُ الَّذِیْ عَلَیْهِنَّ. (البقرة:۲۲۸)

**'మగవారికి మహిళలపై ఉన్నటువంటి హక్కులే ధర్మం ప్రకారం మహిళలకు కూడా మగవారిపై ఉన్నాయి' *(అల్ బఖర 2 : 228)***

అలాగే ముహమ్మద్ ప్రవక్త (స) స్త్రీ జాతి గౌరవాన్ని నీచస్థాయి నుండి పైకి లేపి శిఖరస్థానానికి చేర్చారు. ఆ మహనీయుడే, కూతురు పుట్టాక నీకు అవమానం కాదు, ఆమె సంరక్షణ నిన్ను స్వర్గార్హునిగా చేస్తుందని తండ్రికి చెప్పారు.

**من عال جاريتين حتى تبلغا جاء يوم القيٰمة اناوهو وضمّ اصابعه.** (مسلم، كتاب البر والصلة والادب)

'ఎవరైతే ఇద్దరు కూతుళ్లను యుక్తవయసు వరకు సంరక్షిస్తాడో, అలాంటి వ్యక్తి మరియు నేను ప్రళయ దినాన ఇదిగో, ఇలా నా చేతి వేళ్లలా ఇంత దగ్గరగా ఉంటామన్నారు.

**من ابتلیٰ من البنات بشیءٍ فاحسن الیھن ھُنَّ له سترا من النار.** (مسلم، کتاب مذکور)

'అమ్మాయిలు కలిగినప్పుడు, వారిని మంచిగా సంరక్షించినట్లయితే వారు నరకాగ్నినుండి విముక్తికి కారణమవుతారు?'

శీలవతి అయిన భార్య ప్రపంచంలో నీకు లభించిన గొప్పవరం అని భర్తలకు చెప్పారు.

**خير متا ع الدنيا المرأة الصالحة.** (نسائی، کتاب عشرة النساء)

అలాగే ప్రపంచంలోని వరాల్లో అన్నిటికన్నా గొప్పవరం శీలవతి అయిన భార్య అని ప్రవక్త సెలవిచ్చారు.

**حبب الّی من الدنيا النساء والطيب وجعل قرة عينی فی الصلوة.** (نسائی، کتاب عشرة النساء)

ప్రపంచంలోని వస్తువులన్నిటిలో స్త్రీ, సువాసన నాకు అన్నిటికన్నా ఎక్కువ ఇష్టం. నమాజైతే నా కళ్ల చలవే. అన్నారాయన.

**ليس من متا ع الدنيا شئ افضل من المرأة الصالحةِ.**
(ابن ماجه، کتاب النکاح)

ప్రపంచంలోని వస్తువులన్నింటిలో స్నేహశీలి అయిన భార్యకంటే ఉత్తమమైనదేదీ లేదు.

ప్రవక్త మహనీయులు కొడుకులకు ఇలా ఉపదేశించారు.

'దైవం, దైవప్రవక్త తర్వాత అందరికన్నా గౌరవ ప్రదమైన స్థానం తల్లిదే, నీ

సత్ప్రవర్తనకు అందరికన్నా ఎక్కువ హక్కుదారు ఆమే. ఒక వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధిలో హాజరై ఇలా అడిగాడు.

**سأل رجل یا رسول الله من احق بحسن صحابتی قال امک، قال ثم من؟ قال امک، قال ثم من؟ قال امک، قال ثم من؟ قال ابوک.** (بخاری، کتاب الادب)

**'దైవప్రవక్తా! నా సత్ప్రవర్తననకు అందరికంటే ఎక్కువ అర్హులెవరు? హక్కుదారులెవరు? అప్పుడు ప్రవక్త (స) నీ తల్లి అని చెప్పారు. ఆ వ్యక్తి మళ్లీ 'ఆ తరువాత ఎవరు?''**

ప్రవక్త మళ్లీ 'నీ తల్లే' అని సమాధానం చెప్పారు. 'ఆ తర్వాత' అని మళ్లీ ప్రశ్నించాడా వ్యక్తి. మళ్లీ 'నీ తల్లి' అని చెప్పారు ప్రవక్త (స). అతను మళ్లీ 'తరువాత ఎరు?' అని అడిగాడు. అప్పుడు 'నీ తండ్రి' అని సమాధానం పలికారు ముహ్మద్ ప్రవక్త (స).

**ان الله حرم علیکم عقوق الامهات.** (بخاری، کتاب الادب)

**అల్లాహ్ తల్లిదండ్రుల అవిధేయతను, వారి హక్కుల ఉల్లంఘనను నిషేధించాడు.**

అంతేకాదు, దైవప్రవక్త (స) స్త్రీల గుణాలకు సంబంధించి మరొక వాస్తవాన్ని కూడా వెల్లడించారు. ఆమె చాలా సున్నిత స్వభావురాలు. సిగ్గరి, మంకుపట్టు, అలక పాలు కూడా ఆమెలో కాస్త ఎక్కువే. దైవం ఆమెను అలానే సృష్టించాడు. స్త్రీత్వానికి ఇదేమీ తప్పుకాదు. ఇది ఆమె స్వభావ సౌందర్యం. ఆ విధంగానే ఆమె నుండి ప్రయోజనం పొందండి. అలాకాకుండా మీకు లాగా తిన్నగా, కఠినంగా చేయాలని ప్రయత్నిస్తే అది (మనసు) విరిగిపోతుంది.

ఈ విధంగా స్త్రీలకు సంబందించి కేవలం పురుషుల మైండ్‌సెట్‌నే కాకుండా, స్వయంగా స్త్రీల ఆలోచనా విధానంలో కూడా సమూలమైన మార్పులు తీసుకొచ్చారు, అజ్ఞానపూరిత ఆలోచనా విధానం స్థానంలో బుద్ధిజ్ఞానాల పునాదుల పై మంచి ఆలోచనా విధానాన్ని నిర్మించారు. ముహమ్మద్ ప్రవక్త (స) ఇలా అంతరంగ సంస్కరణ

మాత్రమే కాకుండా, చట్టం ద్వారా స్త్రీల హక్కుల పరిరక్షణ, పురుషుల దౌర్జన్యాలు నుండి వారిని కాపాడే ఏర్పాటు కూడా చేశారు. స్త్రీలు వారు తమ హక్కుల్ని గుర్తించేలా, చట్టపరిధిలో వాటిని పరిరక్షించుకునాలా వారిలో చైతన్యాన్ని కూడా మేల్కొలిపారు.

ఈ విధంగా కారుణ్యమూర్తి ముహమ్మద్ (స) రూపంలో స్త్రీ జాతికి ఒక గట్టి మద్దతుదారు, పరిరక్షకుడు, స్నేహశీలి లభించాడు. వారికి ఏ కాస్త ఇబ్బంది కలిగినా, తమ హక్కులకు ఏమాత్రం భంగం కలుగుతుందేమోనన్న అనుమానం వచ్చినా వెంటనే వారు ప్రవక్త (స) వారి వద్దకు నిస్సంకోచంగా వెళ్లి పిర్యాదు చేసేవారు. తమ భార్యలు తమపై ప్రవక్త వారికి ఎక్కడ పిర్యాదు చేస్తారోనని భయపడుతూ పురుషులు వారికి ఆ అవకాశం దొరకకుండా జాగ్రత్తపడేవారు. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ఇలా అంటున్నారు. ప్రవక్త మహనీయులు జీవించి ఉన్నంతకాలం మేము మహిళలతో మాట్లాడేటప్పుడు జాగ్రత్తగా, ఆచితూచి మాట్లాడేవాళ్లం. ఎందుకంటే వ్యతిరేకంగా ఏదైనా ఆజ్ఞ అవతరిస్తుందేమోనని భయపడేవాళ్లం. ప్రవక్త (స) ఇహలోకం వీడిన తర్వాత కాస్త నిస్సంకోచంగా మాట్లాడడం ప్రారంభించాము. (బుఖారి)

ఇబ్నెమాజలో ఇలా ఉంది. ప్రవక్త మహనీయులు భార్యలపై చెయ్యి చేసుకోవడాన్ని వారించారు. ఒక సందర్భంలో హజ్రత్ ఉమర్ (రజి), స్త్రీలు బాగా తలబిరుసుతనంతో వ్యవహరిస్తున్నారు, వారిని దారిలో పెట్టడానికి కాస్త అనుమతి నివ్వండి అని ప్రవక్తను అభ్యర్థించారు. అప్పుడాయన(స) అనుమతినిచ్చారు. అవకాశం కోసం ఎదురుచూస్తున్న ప్రజలు ఈ అనుమతిని ఆసరాగా తీసుకొని భార్యల్ని కొట్టడం ప్రారంబించారు. ఆ ఒక్కరోజే 70మంది స్త్రీలు తమభర్తల చేతుల్లో చావుదెబ్బలు తిన్నారు. తెల్లవారుపొద్దున దైవప్రవక్త (స) ఇంటిముందు స్త్రీలంతా క్యూకట్టారు. అప్పుడు ప్రవక్త మహనీయులు ప్రజలను సమావేశపరచి ఇలా ప్రసంగించారు :

**لقدطاف الليلة بآل محمد سبعون امرأة كل امرأة تشتكي زوجها فلا تجدون اولئك خياركم.**

**"ఈరోజు ముహమ్మద్ (స) ఇంటి ముందు 70 మంది స్త్రీలు గుమిగూడి,**

**తమ భర్తలపై పిర్యాదు చేస్తున్నారు. ఎవరైతే వీరి పట్ల ఆ విధంగా ప్రవర్తించారో, వారు ఎంతమాత్రం మంచివాళ్లు కాదు, దుర్మార్గులు.'**

ఈ విధమైన నైతిక బోధనలు, చట్టపరమైన సంస్కరణల వల్ల ఇస్లామీయ సమాజంలో స్త్రీకి మహోన్నతమైన స్థాయి, గౌరవమర్యాదలు ప్రాప్తమయ్యాయి. ప్రపంచంలోని మరే సమాజంలోనూ ఆమెకు ఇంతటి ఔన్నత్యం దక్కలేదు. ముస్లిం మహిళ ధార్మికంగా, ప్రాపంచికపరంగా భౌతిక, నైతిక ఆధ్యాత్మిక రంగాల్లో పురుషునితో సమానంగా ప్రగతీ వికాసాల పతాక స్థాయికి చేరుకోగలదు. స్త్రీ కావడమన్నది ఏ స్థాయిలోనూ ఆమె ప్రగతికి అవరోధం కాజాలదు. ఇంత ప్రగతి సాధించిన ఇరవయ్యో శతాబ్దంలో కూడా ప్రపంచం ఇస్లాం కంటే ఎంతో వెనుకబడి ఉండడమే దీనికి నిదర్శనం. మానవ ఆలోచనల ప్రగతి నేటికీ ఇస్లాం చేరుకున్న స్థానానికి చేరుకోలేకపోతుంది. పాశ్చాత్య సమాజం స్త్రీకి ఏమిచ్చిందో, అది స్త్రీని స్త్రీగా గుర్తించి ఇవ్వలేదు. స్త్రీని పురుషునిగా మార్చి ఇచ్చింది. అది ఇప్పటికీ మధ్యయుగాల అజ్ఞాన భావజాలంతోనే స్త్రీని నీచంగా చూస్తుంది. ఇంటికి రాణిగా, సంతానానికి తల్లిగా, వ్యక్తిత్వం కలిగిన ఇల్లాలిగా ఇప్పటికీ ఆ సమాజంలో గౌరవం లేదు. ఒకవేళ ఉంటే, గింటే మగరాయుడిగా భావించడం వల్ల మాత్రమే. అంటే, శారీరకంగా స్త్రీ అయినా, ఆలోచనాపరంగా సమాజంలో పురుష స్వభావంతో పని చేస్తుంది. కనుక ఇది స్త్రీని స్త్రీగా గుర్తించి ఇచ్చిన గౌరవం కాదు. మగరాయుడిలా ప్రవర్తిస్తున్నందుకు లభించే గౌరవం మాత్రమే.

ఇకపోతే పాశ్చాత్య మహిళ, తన పురుష వస్త్ర ధారణ పట్ల గర్వపడడం ఆమెలోని ఆత్మన్యూనతా భావానికి స్పష్టమైన నిదర్శనం. కాని పురుషుడు మాత్రం స్త్రీ వస్త్రధారణ చేసిన నలుగురిలోకి రావడాన్నే ఊహించలేడు. భార్యగా ఉండడం లక్షలాది పాశ్చాత్య మహిళల దృష్టిలో నీచత్వానికి, బానిసత్వానికి ప్రతీక. కాని భర్తగా ఉండడం ఒక్క మగవాడి దృష్టిలో కూడా నీచం కాదు. పురుషుల్లా పని చేయడాన్ని స్త్రీలు గర్వంగా, గౌరవప్రదంగా భావిస్తారు. కానీ వంటపని, పిల్లల పెంపకంలాంటి స్త్రీలు చేసే పనిని పురుషులు ఎంతమాత్రం గౌరవప్రదంగా భావించరు.

కాబట్టి పాశ్చాత్య సమాజం స్త్రీని స్త్రీగా గుర్తించి ఆమెను గౌరవించలేదని

నిస్సంకోచంగా చెప్పవచ్చు. కేవలం ఇస్లాం మాత్రమే స్త్రీని సమాజంలో తన సహజస్థానంలో ఉంచి గౌరవించింది. స్త్రీని స్త్రీగా గుర్తించే గౌరవించింది. ఆమె ఔన్నత్యాన్ని శిఖర స్థానానికి చేర్చింది. ఇస్లామీయ సమాజంలో స్త్రీ పురుషులిద్దరూ సమానమే. ఇద్దరూ తమతమ పరిధుల్లో అందించే సేవలు సమాజానికి సమానంగా ప్రయోజనకరమైనవి. సమానంగా గౌరవించదగినవి. మగవారిలో ప్రత్యేక గౌరవంగాని, స్త్రీత్వంలో అవమానంగాని ఎంతమాత్రం లేదు. ఏవిధంగానైతే పురుషుడు పురుషుడిగా ఉండి అందిస్తున్న సేవలో గౌరవం, వృద్ధి, సాఫల్యాలున్నాయో, అలాగే స్త్రీ స్త్రీగా ఉంటూ అందించే సేవల్లో కూడా గౌరవం, వికాసం, సాఫల్యాలు ఉంటాయి.

ఒక మంచి నాగరిక సమాజం చేయవలసిన పని ఏమిటంటే, స్త్రీలను వారి స్వాభావికమైన ఆచరణా పరిధుల్లోనే ఉంచి వారికి పరిపూర్ణ మానవ హక్కులు కల్పించాలి. వారికి గౌరవం, ఔన్నత్యం, శ్రేష్టతను ఇవ్వాలి. విద్యాబుద్ధుల ద్వారా వారిలో దాగి ఉన్న శక్తి సామర్థ్యాలను వెలికితియ్యాలి. ఆ విధంగానే వారికోసం ప్రగతీ వికాసాలు, సాఫల్యాల మార్గాలు తెరవాలి.



11వ అధ్యాయం

# ఇస్లామీయ సామాజిక వ్యవస్థ

## (3) రక్షణ కవచాలు

ఇదీ ఇస్లామీయ సామాజిక వ్యవస్థ సంపూర్ణ స్వరూపం. ఇప్పుడు కూడా మనం ఇందులోని ప్రధాన విషయాలను మరోసారి స్పృశిస్తూ ముందుకు సాగుదాం.

1. సమాజంలో అసభ్యత, అశ్లీలత, విశృంఖలత్వాలకు తావులేకుండా సాధ్యమైనంతమేర దాన్ని పవిత్రంగా, పరిశుద్ధంగా ఉంచడం ఈ వ్యవస్థ అసలు ఉద్దేశ్యం. తద్వారా మానవుడి శారీరక, మానసిక శక్తులు వికసించి వృద్ధి చెందడానికి నిర్మలమైన ప్రశాంత వాతావరణం లభిస్తుంది. వారు సమాజ నిర్మాణంలో తమ వంతు పాత్రను సమర్ధవంతంగా పోషించగలుగు తారు.
2. లైంగిక సంబంధాలు కేవలం దాంపత్య బంధం పరిధికి మాత్రమే పరిమితం కావాలి. దీనికి వెలుపల సంబంధాలు కొనసాగడం మాట అటుంచి, అటువంటి ఆలోచనలను సైతం ధ్వంసం చేయాలి.
3. స్త్రీ, పురుషులకు తమతమ కార్యాచరణ పరిధి వేరుగా ఉండాలి. వారి ఆలోచనా విధానం, స్వభావం, శారీరక శక్తి సామర్థ్యాలను దృష్టిలో ఉంచుకొని, వేర్వేరు సామాజిక బాధ్యతలు వారికి అప్పగించాలి. ధర్మ సమ్మతమైన పరిధుల్లో పరస్పరం సహకరించుకొనే విధంగా వారి కోసం సహకార వ్యవస్థను ఏర్పాటు చేయాలి. పరిధుల్ని అతిక్రమించి ఒకరి పనుల్లో ఒకరు జోక్యం చేసుకో కూడదు.
4. కుటుంబ వ్యవస్థలో పురుషుడు కుటుంబ పెద్దగా, అధికారిగా ఉండాలి. ఇతర సభ్యులందరూ మాట వినాలి.
5. స్త్రీ పురుషులిద్దరికీ సమానమైన మానవహక్కులుండాలి. ఇద్దరూ సమానంగా ఎదగడానికి, ప్రగతి సాధించడానికి అన్ని అవకాశాలు కల్పించబడాలి. అయితే సమాజంలో వారికి ఏర్పరచిన హద్దుల్ని ఇద్దరిలో ఏఒక్కరూ అతిక్రమిం చరాదు.

ఈ విధంగా రూపుదిద్దుకున్న సామాజిక వ్యవస్థ తన ప్రత్యేకతలను నిలుపుకుని స్థిరంగా ఉండడం కోసం కొన్ని రక్షణ చర్యలు కూడా అవసరం. ఇస్లాంలో ఇవి మూడు రకాలుగా ఉంటాయి.

1) అంతరంగ సంస్కరణ

2) చట్టపరమైన శిక్షలు

3) ఇతర నివారణా చర్యలు చేపట్టడం.

ఈ మూడు రకాల రక్షణ చర్యలు సామాజిక వ్యవస్థ స్వరూపాన్ని దాని లక్ష్యాలను పూర్తిగా దృష్టిలో ఉంచుకొని ప్రతిపాదించినవి. కనుక ఇవి రక్షణ కవచాలనడంలో ఎంతమాత్రం సందేహం లేదు.

అంతరంగ సంస్కరణ ద్వారా స్వయంగా మానవుడు సామాజిక వ్యవస్థకు విధేయుడిగా ఉండేలా అతనికి శిక్షణనివ్వడం జరుగుతుంది. విధేయత కోసం బలవంత పెట్టే శక్తి ఏదీ లేకపోయినప్పటికీ మానవుడు స్వయంగా సామాజిక వ్యవస్థకు విధేయుడుగా ముందుకొస్తాడు.

చట్టపరమైన శిక్షల ద్వారా సామాజిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసే, అస్థిరపరిచే నేరాలన్నింటినీ రూపుమాపడం జరుగుతుంది.

ఇంకా ఇతర నివారణా చర్యలు చేపట్టడం ద్వారా, సమాజంలో అనారోగ్యకర వాతావరణం, కృత్రిమమైన మోసపూరితమైన ఆలోచనలు ప్రబలకుండా సామాజిక జీవన విధానంలో కొన్ని ఉపయుక్తమైన విధానాలను ప్రవేశపెట్టడం జరుగుతుంది. లైంగిక విశృంఖలతను పూర్తిస్థాయిలో తగ్గించి సమాజాన్ని పవిత్రం చేసే ప్రయత్నాలు జరుగుతాయి. నైతిక ఉపదేశాల ద్వారా ఎవరి అంతరంగ సంస్కరణ జరగలేదో, చట్టపరమైన శిక్షల భయం కూడా వారికి లేకుండా పోయిందో, అలాంటి వారు ఎంతగా అభిలషించినా, తమ దుర్మార్గ ప్రయత్నాల్లో సఫలం కాకుండా ఈ విధానాలు అవరోధంగా నిలుస్తాయి. అంతేకాకుండా ఈ విధానాలు స్త్రీ పురుషుల పరిధుల్ని ఆచరణాత్మకంగా వేరుచేసి, కుటుంబ వ్యవస్థను సరైన ఇస్లామీయ పునాదులపై స్థిరంగా ఉంచుతాయి. స్త్రీ పురుషుల జీవితాల్లో ఇస్లాం నిర్దేశించిన వ్యత్యాసపు పరిధులను పరిరక్షిస్తాయి.

## అంతరంగ సంస్కరణ

ఇస్లాం ధర్మం ప్రకారం విధేయతకు పునాది విశ్వాసం. ఎవరైతే దైవం, దైవగ్రంథం, దైవప్రవక్తలను విశ్వసిస్తాడో, అలాంటి వ్యక్తే ధర్మశాస్త్రంలోని ఉచితానుచితాల అసలు సంబోధితుడు. అతణ్ని విధేయుడిగా మలచాలన్నా, అవిధేయుడిగా తయారు చేయాలన్నా ఫలానా ఆజ్ఞ దైవానిది, ఫలానాది కాదు అన్న జ్ఞానమొక్కటే సరిపోతుంది. కనుక ఒక విశ్వాసికి దైవగ్రంథం ద్వారా దైవం, అశ్లీలతను, పాపకార్యాన్ని నిషేధించాడని తెలిసినట్లయితే, దాన్నుండి అతడు దూరంగా ఉండడం తన హృదయాన్ని సైతం పరిశుద్ధంగా ఉంచుకోవడం తప్పనిసరైపోతుంది. ఇదే విధంగా ఒక ముస్లిం స్త్రీకి కూడా, దైవం, దైవప్రవక్త సమాజంలో తనకు ఎలాంటి స్థానం కల్పించారన్న విషయం తెలిసిపోతే, ఆమె దాన్ని అంగీకరించడం, హద్దుల్ని అతిక్రమించకుండా విధేయత పాటించడం తప్పనిసరైపోతుంది. ఈ విధంగా జీవితంలోని ఇతర రంగాలకు లాగానే నైతిక, సామాజిక పరిధుల్లో కూడా సరైన విధంగా సంపూర్ణంగా ఇస్లాంకు విధేయత కలిగి ఉండడం విశ్వాసంపైనే ఆధారపడి ఉంది. ఈ కారణంగానే ఇస్లాంలో నైతిక, సామాజిక విషయాలను బోధించేముందు విశ్వాసం వైపునకు ఆహ్వానించి హృదయంలో దాన్ని ప్రతిష్ఠించడం జరిగింది.

ఇది అంతరంగ సంస్కరణకు అసలు పునాది. ఇది కేవలం నైతికతతోనే కాకుండా పూర్తి ఇస్లామీయ వ్యవస్థతో సంబంధం కలిగి ఉంది. అంతేకాకుండా ప్రత్యేకంగా నైతిక పరిధిలోనే ఇస్లాం విద్యా శిక్షణల వివేకవంతమైన ఏర్పాట్లు కూడా చేసింది. సంక్షిప్తంగా వాటిని కూడా ఇక్కడ పేర్కొంటున్నాము :

## బిడియం

మానవుడు పైశాచిక ప్రభావానికిలోనై దొంగతనం, అసత్యం, వ్యభిచారం లాంటి అనేక పాపాలకు పాల్పడతాడు. ఇవన్నీ మానవ నైజానికి వ్యతిరేకమైనవని మేము ఇంతకుముందే సూచన ప్రాయంగా చెప్పాము. పవిత్ర ఖుర్‌ఆన్ ఇలాంటి కార్యాలన్నింటినీ 'మున్కర్' అన్న పదంతోపోల్చింది. అంటే పాపము, లేక దుష్కార్యము అని అర్థం. ఈ కార్యాలను మున్కర్ అని పేర్కొనడంలోని అర్థం ఏమిటంటే, ఇవన్నీ మానవ నైజానికి సరిపడనివి, కనుక నైజం అంగీకరించనప్పుడు పైశాచిక స్వభావం ఆ కార్యాలు చేయమని దాన్ని బలవంతం చేస్తుంది. అలాంటప్పుడు అన్ని రకాల దుష్కార్యాలను అసహ్యించుకునే ఒక వస్తువేదైనా మానవ స్వభావంలో ఉండాలి.

ఈ అవసరాన్ని గుర్తించిన వివేకస్రష్ట 'బిడియం' (సిగ్గు) అనే వస్తువును మానవ స్వభావంలో ప్రవేశపెట్టాడు.

ఇస్లామీయ ప్రత్యేక పరిభాషలో 'సిగ్గు' (బిడియం) అంటే, ఏదైనా పాపకార్యం వైపు మొగ్గే మనిషి స్వయంగా తన నైజం ముందు తన ప్రభువు ముందు వ్యక్తం చేసే దాన్ని సిగ్గు అంటారు. 'సిగ్గు' అనబడే ఈ శక్తే మానవుణ్ని అన్నిరకాల అశ్లీలతలు, దుర్మార్గాలనుండి కాపాడుతుంది. ఒకవేళ పైశాచిక ప్రభావానికి లోనై ఏదైనా పాపకార్యానికి ఒడిగట్టినా, ఈ సిగ్గు అనేది అతని మనసునుకెలుకుతూ ఉంటుంది. ఇస్లామీయ శిక్షణ, బోధనల్లోని విశేషమేమిటంటే, అది బిడియం రూపంలో దాగిన ఈ పదార్థాన్ని మానవ నైజం లోతుల్లోంచి పైకి తీసి జ్ఞానం, వివేక, విజ్ఞతలతో పెంచి పోషిస్తుంది. పటిష్టమైన నైతిక ఖనిగా తయారు చేసి దాన్ని రక్షణ కవచంగా మానవుని హృదయంలో ప్రవేశపెడుతుంది. ఇది ఖచ్చితంగా 'ప్రతి ధర్మానికి ఒక విధానం ఉంటుంది. అలాగే ఇస్లాం విధానం బిడియం. అన్న ప్రవక్త (స) వారి ప్రవచనానికి అద్దం పడుతోంది. ఈ అంశానికి సంబంధించిన మరో ప్రవచనం ఇలా ఉంది. 'నీలో సిగ్గు అనేది లేనప్పుడే నీ ఇష్టానుసారం ప్రవర్తిస్తావు' ఎందుకంటే సిగ్గన్నదే లేకపోతే మనో వాంఛలు ప్రాబల్యం వహించి పశుప్రాయునిగా తయారు చేస్తాయి. అప్పుడు చెడును కూడా నీకు చెడుగా కనిపించదు.

స్వతహాగా మానవుడిలో ఉండే బిడియం ఇంకా రూపుదిద్దుకోని ఓ నిరాకార వస్తువులాంటిది. అది అనాలోచితంగానే అన్ని చెడులనూ నిరసిస్తుంది. అసహ్యించు కుంటుంది. కాని దానిలో అర్థం చేసుకునే శక్తి ఉండదు. ఈ కారణంగానే ఒక ప్రత్యేక దుష్కార్యం వల్ల అసహ్యమెందుకో దానికి తెలియదు. ఈ అమాయకత్వమే (తెలియనితనమే) క్రమక్రమంగా అసహ్య భావనను బలహీన పరుస్తుంది. చివరికి పైశాచిక భావన ప్రబలి దుష్కార్యాల వైపు మొగుతుంది. చివరికిది సిగ్గుబిడియాల భావనను పూర్తిగా తిరస్కరించే స్థాయికి చేరుకుంటుంది. ఈ అమాయకత్వాన్ని, తెలియని తనాన్ని దూరం చేయడమే ఇస్లామీయ బోధనల ఉద్దేశం. ఇవి అతడికి కేవలం బయటికి కనబడే బాహ్య దుష్కార్యాలను మాత్రమేకాక, మూల మనసు మూలల్లో దాగిన అనేక చెడులనూ దాని ముందు ప్రత్యక్షపరిచి, వాటి జిత్తులు, ఎత్తులనుండి హెచ్చరిస్తుంది. దీనివల్ల అది వాటిని స్పష్టంగా గుర్తించి చీదరించుకో గలగుతుంది. ఈ విధంగా ఈ నైతిక బోధనలు పరిణితి చెందిన సిగ్గును విజ్ఞానిగా

తయారు చేస్తాయి. దీని వల్ల భావాలు, ఆలోచనలు, సంకల్పాలు ఏమాత్రం చెడువైపు మొగ్గుతున్నట్లు అనిపించినా అది హెచ్చరించకుండా ఉండదు.

ఇస్లామీయ బోధనల్లో సిగ్గు బిడియాల పరిధి చాలా విస్తృతం. జీవితంలోని అన్ని రంగాలనూ అది పరివేష్టించి ఉంది. అందుకని సామాజిక వ్యవస్థలోని దాంపత్యరంగానికి సంబంధించి కూడా నైతిక సంస్కరణ కోసం అది సిగ్గుబిడియాలనే ఆశ్రయించింది. స్త్రీల విషయంలో, ఏ కొద్దిపాటి చూపుల దొంగతనానికి పాల్పడినా అది దాన్ని పట్టుకొని సిగ్గుకు అప్పగిస్తుంది. వివరంగా చెప్పడానికి ఇక్కడ అవకాశం లేదు గాని, సంక్షిప్తంగా కొన్ని ఉదాహరణలు చెప్తాను.

## ఇంటిదొంగ

చట్టం దృష్టిలో శారీరక కలయిక మాత్రమే వ్యభిచారం అనబడుతుంది. కాని నైతిక పరంగా చూస్తే వివాహ బంధానికి వెలుపల ఎదుటివారి పట్ల దుర్బుద్ధి కలిగి ఉండడం (ఆడ/మగ) కూడా వ్యభిచారం కిందికే వస్తుంది. అపరిచిత అందాన్ని ఆస్వాదించడం, వారి గొంతు మాధుర్యాన్ని ఆస్వాదించడం, వారితో సంభాషించడానికి ఆసక్తి చూపడం, కాలి సవ్వడి వినడానికి ప్రయత్నించడం, తాకడానికి ప్రయత్నించడం లాంటివన్నీ ఆ మేరకు వ్యభిచారంగానే పరిగణించబడతాయి. ఈ రకమైన వ్యభిచారాలను చట్టం పట్టుకోలేదు. (ఇవి చట్టపరిధిలోకి రావు) ఇది మనసులోని మాలిన్యం, ఈ ఇంటి దొంగను, ఇంటి సంరక్షకుడు మాత్రమే బంధించగలుగుతాడు. ప్రవక్త ప్రవచనం ఈ విషయాన్ని ఇలా విశదీకరిస్తోంది.

**العينان تزنيان و زناهما النظر واليدان تزنيان و زناهما البطش والرِجلان تزنيان و زناهما المشى و زنااللسان النطق والنفس تتمنى و تشتهى و الفرج يصدق ذالك كله اَوُ يكذبه.**

**'కళ్ల వ్యభిచారం చూపు (దృష్టి). తాకడం చేతుల వ్యభిచారం, ఆ వైపునకు నడిచి వెళ్లడం కాళ్ల వ్యభిచారం, సంభాషణ నోటి వ్యభిచారం, వాంఛ, కోరిక కలిగి ఉండడం మనసు వ్యభిచారం. చివరికి మర్మావయవాలు వీటన్నిటినీ స్వీకరిస్తాయి, లేక తిరస్కరిస్తాయి.**

## దుర్మార్గ దృష్టి

మనసులోని దొంగలందరిలో పెద్ద దొంగ దృష్టే. అందుకే ఖుర్ఆన్, హదీసులు రెండూ మొట్టమొదట దీన్నే బంధిస్తాయి. పవిత్ర ఖుర్ఆన్ ఇలా అంటుంది. :

"ప్రవక్తా! విశ్వసించిన పురుషులు తమ చూపులను (పరస్త్రీలపై పడకుండా వేరేవైపు) మరల్చుకోవాలని, తమ మర్మాయవాలను కాపాడుకోవాలని వారికి చెప్పు. వారికిది చాలా శ్రేష్టమైన పద్ధతి. వారు చేసే పనులన్నీ దైవం గమనిస్తూనే ఉన్నాడు.

قُلْ لِّلْمُؤْمِنِيْنَ يَغُضُّوْا مِنْ اَبْصَارِهِمْ وَيَحْفَظُوْا فُرُوْجَهُمْ ؕ ذٰلِكَ اَزْكٰى لَهُمْ ؕ اِنَّ اللّٰهَ خَبِيْرٌۢ بِمَا يَصْنَعُوْنَ ○ وَقُلْ لِّلْمُؤْمِنٰتِ يَغْضُضْنَ مِنْ اَبْصَارِهِنَّ وَيَحْفَظْنَ فُرُوْجَهُنَّ (النور: ۳۰، ۳۱)

**"ప్రవక్తా! విశ్వసించిన పురుషులకు తమ చూపులను కాపాడుకోండి అనీ తమ మర్మాంగాలను రక్షించుకోండి అనీ చెప్పు. ఇది వారికి ఎంతో పరిశుద్ధమైన పద్ధతి... విశ్వవిశ్వసించిన మహిళలకు ఇలా చెప్పు, తమ చూపులను కాపాడుకోండి అని, తమ మర్మాంగాలను రక్షించుకోండి అని" *(అన్ నూర్ 24 : 30, 31)***

హదీసులో ఇలా ఉంది :-

ابن ادم لک اول نظرة وايا و الثانية (الجصاص)

**'మానవుడా! నీ తొలి చూపు క్షమార్హమైనదేకాని, మళ్లీ రెండోసారి చూడకు జాగ్రత్త!'**

ప్రవక్త మహనీయులు హజ్రత్ అలీ (రజి) తో ఇలా అన్నారు : 'అలీ ఒకసారి చూసిన తరువాత రెండోసారి, చూడకు, మొదటి చూపు మన్నించదగిందే కాని తరువాతి చూపు మాత్రం క్షమార్హం కాదు.' (అబూదావూద్)

ياعلى لا تتبع النظرة النظرة فان لک الاولىٰ وليس لک الأخرة. (ابو دائود، باب مايؤمربه من غض البصر)

**అప్పుడు, హజ్రత్ జాబిర్ (రజి) 'అకస్మాత్తుగా (అనుకోకుండా) చూపు**

పడితే ఏం చేయాలి?' అని ప్రశ్నించారు. 'చూపును మరల్చుకో' అని చెప్పారు ప్రవక్త (స) (అబూదావూద్)

## అందాలపోటీ

ఈ దుర్మార్గపు దృష్టిలోని మరో కోణం ఏమిటంటే తమ అందాలను ఇతరులు చూడాలన్న వాంఛను అది స్త్రీలలో కలగచేస్తుంది. అయితే ఈ కోరిక ఎప్పుడూ ప్రత్యక్షంగా ముందుకు రాదు. మనసు మూలల్లో ఎక్కడో ఈ భావన దాగి ఉంటుంది. వస్త్రధారణలో, కేశాలంకరణలో, రకరకాల ఫేషనబుల్ బట్టల ఎంపికలో, పాదరక్షలు మరియు మరికొన్ని సున్నిత వస్తువుల విషయంలో అది తన ప్రభావాన్ని చూపిస్తుంది. దీనికి ఒక పరిధిని నిర్ణయించడం అసాధ్యం. పవిత్ర ఖుర్ఆన్ ఈ మొత్తాన్ని కలపి 'తబర్రుజి జాహిలియ' (అజ్ఞాన సింగారం) అన్న ఒకే ఒక్క సమగ్ర పదాన్ని ఉపయోగించింది. అదే భర్తకోసం తప్ప ఇతరుల దృష్టిని ఆకర్షించడానికి చేయబడే అలంకరణలు, సింగారాలు అన్నీ 'తబర్రుజి జాహిలియా' (ఆటవిక అలంకారం) పరిధిలోకే వస్తాయి. ఒకవేళ పరదా (బురఖా) కూడా ఇతరులు చూడాలన్న ఉద్దేశ్యంతో, అందమైన ఆకర్షణీయమైన రంగును ఎంచుకుంటే అది కూడా ఈ కోవలోకే వస్తుంది. దీనికోసం ప్రత్యేక చట్టాలేమీ రూపొందచడం కుదరదు. స్త్రీల స్వభావంతో ఇది ముడిపడి ఉన్న విషయం. ఈ అపవిత్ర భావన మనసు మూలాల్లో ఎక్కడైనా దాగి ఉన్నదేమో వారు స్వయంగా ఆత్మపరిశీలన చేసుకోవాలి. ఒకవేళ ఉన్నట్లయితే వారు ఈ దైవాదేశంపై దృష్టి సారించాలి. 'ఇస్లాంకు పూర్వం అజ్ఞాన కాలంలో మీరు బాగా అలంకరించుకొని తిరిగే వారు. ఇప్పుడు అలా చేయకండి.' (అహ్‌జాబ్ :33) కనుక దురాలోచన, దుష్ట సంకల్పానికి అతీతంగా ఉన్న ప్రతి సదాలంకరణ ఇస్లామీయ అలంకరణే. ఏమాత్రమైనా దుర్బుద్ధి మిళితమైనా అది అజ్ఞాన, ఆటవిక అలంకరణే.

## దుర్మాగపు నోరు - నోటి ఉపద్రవం

మనోవాంఛల షైతానుకు మరో ఏజెంటు నోరు, లేక నాలుక. నోటి కారణంగా ఎన్నో ఉపద్రవాలు పుట్టుకొస్తాయి, విస్తరిస్తాయి. స్త్రీ పురుషులిద్దరూ మట్లాడుకుంటున్నారు. వారిలో ఎలాంటి దురాలోచనలు లేవు. కాని, మనసులో దాగిన దొంగ మాటల్లో తియ్యదనాన్ని, శబ్దంలో శ్రావ్యతను, వగలమారితనాన్ని జనింపజేస్తూ పోతాడు. ఖుర్ఆన్ ఈ దొంగను పట్టుకొంది. :

اِنِ اتَّقَيْتُنَّ فَلاَ تَخْضَعْنَ بِالْقَوْلِ فَيَطْمَعَ الَّذِىْ فِىْ قَلْبِهٖ مَرَضٌ
وَّقُلْنَ قَوْلاً مَّعْرُوْفًا (الاحزاب:٣٢)

**'మీరు అల్లాహ్‌కు భయపడేవారు అయితే, తగ్గు స్వరంతో మాట్లాడకండి, ఎందుకంటే దుష్ట మనస్సు గల వ్యక్తి ఎవడైనా వ్యామోహపడవచ్చు. కాబట్టి స్పష్టంగా, సూటిగా మాట్లాడండి.' *(అల్ అహ్‌జాబ్ 33 : 32)***

ఈ ఇంటి దొంగ లేక మనసులోని దొంగే ఇతరుల ధర్మాధర్మ లైంగిక సంబంధాలను చెప్పడానికి, లేక వినడానికి చొంగలు కారుస్తూ ఉంటాడు. అందుకే ప్రేమగీతాలు, ప్రేమ కథలు సత్యాసత్యాలను కలగాపులగం చేసి ప్రచారం చేయడం జరుగుతోంది. ఈ విధంగా సమాజంలో అశ్లీలత అగ్గిరాజుకొని దావానలంలా ప్రబలుతూపోతోంది. ఈ విషయమై కూడా పవిత్ర ఖుర్‌ఆన్ ఇలా హెచ్చరించింది..

اِنَّ الَّذِيْنَ يُحِبُّوْنَ اَنْ تَشِيْعَ الْفَاحِشَةُ فِى الَّذِيْنَ اٰمَنُوْا لَهُمْ
عَذَابٌ اَلِيْمٌ فِى الدُّنْيَا وَالْاٰخِرَةِ (النور:١٩)

**'విశ్వాసుల వర్గంలో అశ్లీలత వ్యాపించాలని కోరేవారు, ప్రపంచంలోనూ, పరలోకంలోనూ వ్యధాభరితమైన శిక్షకు అర్హులు.' *(నూర్ 24-19)***

నోటిద్వారా ప్రబలే ఉపద్రవాలు ఇంకా అనేకమున్నాయి. ఏదో ఒక మార్గంలో ఈ మనసులోని దొంగ తన పనిని చక్కబెడుతూ ఉంటాడు. ఇస్లాం ఈ మార్గాలన్నిటినీ కనిపెట్టి హెచ్చరించింది. స్త్రీలు ఇతర స్త్రీలను గురించి తమ భర్తలకు చెప్పడానికి కూడా అనుమతిలేదు.

لاتباشر المرأة حتی تصفها لزوجها کانه ینظر الیها.
(ترمذی، باب ماجاء فی مباشرة المراءة بالمراءة)

**స్త్రీలు పరస్పరం తమ రహస్య అవయవాలను చూసుకోరాదు. ఎందుకంటే ఈ విషయం స్త్రీలు తమ భర్తలకు చెప్పే అవకాశం లేకపోలేదు. దీంతో అతను ఆ పరస్త్రీ అందాలను కళ్లారా చూస్తున్న అనుభూతిని పొందే ప్రమాదం ఉంది. తమ రహస్య దాంపత్య సంబంధాలను ఇతరుల ముందు**

**ప్రస్తావించవద్దని స్త్రీ పురుషు లిద్దరినీ వారించడం జరిగింది. ఎందుకంటే దీనివల్ల కూడా అశ్లీలత వ్యాపిస్తుంది. మనసుల్లో కోరికలు జనిస్తాయి.**

నమాజులో ఇమాం వల్ల ఏదైనా పొరపాటు జరిగితే పురుషులు సబ్‌హానల్లాహ్ పలకాలని, స్త్రీలయితే కేవలం చేతిద్వారా శబ్దం చేసి ఇమాంను హెచ్చరించాలని నోటితో ఏమీ పలకకూడదని హితవు చేయడం జరిగింది. (అబూదావూద్)

## శబ్ద ఉపద్రవం

కొన్ని సందర్భాల్లో నోరు మౌనంగానే ఉంటుంది. కాని, ఇతర అవయవాలు తమ పనిచేస్తాయి. ఇది కూడా సంకల్ప దోషం వల్లనే జరుగుతుంది. ఇస్లాం దీన్ని కూడా నిరసించింది.

وَلاَ يَضْرِبْنَ بِاَرْجُلِهِنَّ لِيُعْلَمَ مَايُخْفِيْنَ مِنْ زِيْنَتِهِنَّ ط (النور: ٣١)

**"తాము గుప్తంగా ఉంచిన తమ అలంకరణ ప్రజలకు తెలిసేలా వారు తమ కాళ్లను నేలపై కొడుతూ నడవరాదని కూడ వారికి చెప్పు."**

***(అన్ నూర్ 24 : 31)***

## సువాసన

ఆకర్షణ విషయంలో సువాసనది కూడా ప్రముఖ స్థానమే. స్త్రీలు సువాసన వాడితే సందేహపడడానికి ఆస్కారం కలుగుతుంది. చాలామంది దీన్ని చాలా స్వల్ప విషయంగా భావిస్తారు కాని, ఇస్లాంలోని పరమ పవిత్రమైన, లజ్జాభావం దీన్ని కూడా సహించదు. సువాసన కలిగిన వస్త్రాలు ధరించి, లేక సుగంధ ద్రవ్యాలు రాసుకొని బయటకు రావడాన్ని వేడుకల్లో పాల్గొనడాన్ని ఒక ముస్లిం మహిళను ఇస్లాం అనుమతించదు. ఎందుకంటే, ఆమె అందచందాలు, అలంకరణలు గుప్తంగా ఉన్నప్పటికీ, ఆమె వాడిన సుంగధ ద్రవ్యాల సువాసన పరిసరాల్లో వ్యాపిస్తుంది.

قال النبی ﷺ المرأة اذا استعطرت فمرت بالمجلس فهی کذا یعنی زانیة. (باب ماجاء فی کراهة خروج المتعطق، ترمذی)

**"ఏ స్త్రీ అయితే అత్తరు రాసుకొని ప్రజల మధ్య నుంచి (నడిచి) వెళు తుందో అలాంటి స్త్రీ తిరుగుబోతు స్త్రీ లాంటిది.' అని దైవప్రవక్త (స) ప్రవచించారు. (తిర్మిజి)**

**اذاشهدت احد اکن المساجد فلاتمسن طيبًا.** (مؤطا و مسلم)

'స్త్రీలు మస్జిదుకు వెళ్లదలచుకున్నప్పుడు సువాసన వాడరాదు.'

**طيب الرجال ما ظهر ريحه وخفى لونه و طيب النساء ماظهر لونه و خفى ريحهٗ**(1)

**'పురుషులు వాడే అత్తరు మంచి సువాసన కలదిగా, రంగు లేనిదిగా ఉండాలి. స్త్రీలు వాడే అత్తరు మంచి రంగుకలదిగా (కలర్‌ఫుల్) సువాసన లేనిదిగా ఉండాలి.'** ***(తిర్మిజీ, అబూదావూద్)***

వస్త్రధారణ విషయంలో కూడా ఇస్లాం, సిగ్గు, బిడియాలను దృష్టిలో ఉంచుకొని ఎంత సరైన రీతిలో పరిపూర్ణ నిర్వచనమిచ్చిందో, ప్రపంచ నాగరికతలో ఎక్కడా దానితో సరితూగే ఉదాహరణలు కానరావు. ప్రపంచంలో నాగరికంగా అత్యంత అభివృద్ధి చెందిన జాతుల పరిస్థితి నేడు ఎలా ఉందంటే, వారి స్త్రీ, పురుషులు శరీరంలోని ఏ భాగమూ బహిర్గత పరచడానికి జంకరు. వారి వస్త్రధారణ కేవలం అందం కోసమే తప్ప శరీరాన్ని కప్పడం కోసం కాదు. కాని ఇస్లాం దృష్టిలో అందం కంటే ఎక్కువ శరీర భాగాలను కప్పడానికే ప్రాముఖ్యం ఉంది. అది స్త్రీ పురుషులిద్దరినీ పరస్పర ఆకర్షణకు ఆస్కారమున్న దేహభాగాలను కప్పుకోవాలని ఆదేశిస్తుంది. నగ్నత్వం ఎంతటి అనాగరికమంటే ఇస్లామీయ సిగ్గు, సౌశీల్యం దాన్ని ఎంతమాత్రం సహించదు. పరాయివారి సంగతి పక్కన పెట్టండి. భార్యాభర్తలు కూడా పరస్పరం ఒకరిముందొకరు నగ్నంగా ఉండడాన్ని ఇస్లాం అంగీకరించదు.

**اذا اتٰی احدکم اهله فليستتر ولا يتجرد العيرين.**

(ابن ماجه، باب التستر عند الجماع)

**'మీలో ఎవరైనా భార్యతో సంభోగం జరిపితే, గాడిదల్లా ఇద్దరూ పూర్తిగా వివస్త్రలు కాకండి. 'సతర్'ను దృష్టిలో ఉంచుకోండి.' (ఇబ్నెమాజ)**

**قالت عائشة مانظرت الٰی فرج رسول الله ﷺ.**

(شمائل ترمذی، باب ماجاء فی حياء رسول اللهؐ)

**హజ్రత్ ఆయిషా (ర.అన్హా) ఇలా అంటున్నారు : 'దైవ ప్రవక్త (స)ను నేను ఎప్పుడూ నగ్నంగా చూడలేదు.' (తిర్మిజీ)**

సిగ్గు బిడియాలకు సంబంధించి మరో విశేషం ఏమిటంటే, ఏకాంతంలో కూడా నగ్నంగా ఉండడాన్ని ఇస్లాం అంగీకరించదు. ఎందుకంటే, 'సిగ్గు బిడియాలకు ఎక్కువ హక్కుదారుడు దైవమే. కాబట్టి ఆయనకు ఎక్కువగా సిగ్గు పడాలి.' ఒక హదీసులో ఇలా ఉంది:

**اياكم والتعرى فان معكم من لايفارقكم الاعند الغائط و حين يفضى الرجل اِلى اهله فاستحيوهم واكرموهم.**

(ترمذى، باب ماجاء فى الاستتار عندالجماع)

**'జాగ్రత్త! ఎప్పుడూ నగ్నంగా ఉండకండి. దైవదూతలు ఎప్పుడూ మీ వెన్నంటి ఉంటారు. మలమూత్ర విసర్జన, భార్యలతో సంభోగించే సమయాల్లో మాత్రమే మీకు దూరంగా ఉంటారు. కనుక మీరు వారి ముందు సిగ్గుపడండి. వారిని గౌరవించండి.' (తిర్మిజీ)**

శరీరం కనబడే లాంటి పల్చని వస్త్ర ధారణ ఇస్లాం దృష్టిలో అసలు వస్త్ర ధారణే కాదు.

దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు :-

**قال رسول اللهﷺ نساء كاسيات عاريات مميلات مائلات رؤسهن كالبخت المائلة لايدخلن الجنة ولايجدن ريحها.**

(مسلم، باب النساء الكاسيات العاريات)

**"వస్త్రాలు ధరించి కూడా దిగంబరంగా ఉండి, ఇతరుల్ని ఆకర్షించడం, ఇతరులచే ఆకర్షించబడడం, చేస్తూ, మదమెక్కిన ఒంటెలా మెడను వంకరపెట్టి మిడిసి పడుతూ నడిచే స్త్రీలు ఎన్నటికీ స్వర్గంలోకి పోలేరు. అంతేకాదు కనీసం స్వర్గ సువాసనను కూడా ఆఘ్రాణించలేరు.' (ముస్లిం)**

అన్ని విషయాలూ చర్చించడం ఇక్కడ ఉద్దేశ్యం కాదు. కేవలం ఇస్లాంలోని నైతిక ప్రమాణాల స్థాయి, పవిత్రతా స్ఫూర్తి అవగతం కావాలనే ఉద్దేశ్యంతో కొన్ని

ఉదాహరణలు మాత్రమే పేర్కొనడం జరిగింది. ఇస్లాం, సమాజాన్ని, సమాజ వాతావరణాన్ని అన్ని రకాల చెడులు, అశ్లీలం, రుగ్మతలనుండి పవిత్రం చేయాలని కోరుతుంది. ఈ రుగ్మతల మూలం మానవ ఆంతర్యంలోనే ఉంది. అశ్లీలత, చెడుల (క్రిములు) సంతతి అక్కడే వృద్ధి చెందుతుంది. అక్కడినుండే నెమ్మదిగా ప్రారంభమై పెద్ద పెద్ద ఉపద్రవాలకు కారణభూతమవుతుంది. అజ్ఞానులు వీటిని చాలా చిన్న విషయాలని భావించి నిర్లక్ష్యం చేస్తారు. కాని వైద్యుడి దృష్టిలో మాత్రం అవి నైతిక, నాగరిక, సామాజిక వినాశానానికి దారితీసే ప్రమాదకర రుగ్మతలకు అసలు మూలం. అందుకని ఇస్లామీయ నైతిక బోధనలు మానవ ఆంతర్యంలో మహత్తరమైన లజ్జా భావనను జనింపజేసి, స్వీయ సమీక్ష చేసుకొనేలా సమాయత్త పరుస్తాయి. ఏమాత్రం చెడు వైపు మొగ్గు చూపే సూచనలు కనిపించినా వెంటనే అప్రమత్తం చేస్తాయి.

## శిక్షాస్మృతి

ఒక మనిషి సమాజానికి హాని కలిగించే చర్యలకు పాల్పడనంత వరకు అతణ్ని ఇబ్బందులకు గురిచెయ్యరాదన్నది ఇస్లామీయ శిక్షాస్మృతుల అసలు సూత్రం. కాని అతడు సమాజ వినాశనానికి పాల్పడితే మాత్రం చిన్న చిన్న శిక్షలు వేసి, మళ్ళీ అతడు దుర్మార్గాలకు పాల్పడే విధంగా, మళ్ళీ శిక్షలు అనుభవించే విధంగా చేయడం సరికాదు. తప్పు చేసినట్లు రుజువు చేసే వ్యవస్థ పటిష్టంగా ఉండాలి. తప్పును నిరూపించే షరతులు కఠినంగా ఉండాలి. 1 సాధ్యమైనంత మేరకు ప్రజలు చట్టాలను ఉల్లంఘించకుండా చూడాలి. 2 ప్రజలు చట్టాలను ఉల్లంఘించి, శిక్షలకు గురికాకుండా ఉండేందుకు, అసలా పరిస్థితే రాకుండా ఉండేందుకు అన్ని చర్యలూ చేపట్టాలి. అయినప్పటికీ ఎవరైనా చట్టాలను ఉల్లంఘిస్తే మాత్రం అలాంటి వారిని కఠినంగా శిక్షించండి. ఈ శిక్ష అతనితోపాటు వేలాది మందికి గుణపాఠం కావాలి. ఆ శిక్షను చూసి ప్రజలు గజగజవణికి పోవాలి. ఎందుకంటే శిక్షల ఉద్దేశ్యం సమాజం అన్ని రకాల నేరాల నుండి పవిత్రంగా ఉండటమే. కాని ప్రజలు మాటిమాటికీ తప్పులు చేయడం, శిక్షలు అనుభవించడం జరగకూడదు.

సమాజ సంరక్షణ కోసం ఇస్లామీయ శిక్షాస్మృతి ప్రకారం, శిక్షార్హమైన ప్రధాన నేరాలు కేవలం రెండే రెండు. ఒకటి : వ్యభిచారం, రెండు వ్యభిచార నింద మోపడం.

## వ్యభిచార శిక్ష

వ్యభిచారానికి సంబంధించిన విషయాలు మనం ఇంతకు ముందు కూడా

చర్చించాము. మానవుడి నైతిక పతనానికి ఇది పరాకాష్ట. ఈ దుష్కార్యానికి పాల్పడిన వారు మానవత్వంపై పైశాచికత్వం ప్రభావం చూపిందని రుజువు చేస్తున్నారన్నమాట. మానవ సమాజంలో అతనొక మంచి వ్యక్తిగా ఉండలేడు. సామాజిక పరంగా చూస్తే, ఇది మానవ సమాజ మూలాలపై దాడిచేసే అతిపెద్ద నేరం. ఈ కారణంగా ఇస్లాం దీన్ని శిక్షార్హమైన నేరంగా పరిగణించింది. బలాత్కారమా, ఇష్టప్రకారమా అన్నది సమస్యకాదు. పవిత్ర ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది :

اَلزَّانِيَةُ وَالزَّانِىْ فَاجْلِدُوْا كُلَّ وَاحِدٍ مِّنْهُمَا مِائَةَ جَلْدَةٍ ۖ وَّلَا تَاْخُذْكُمْ بِهِمَا رَاْفَةٌ فِىْ دِيْنِ اللّٰهِ اِنْ كُنْتُمْ تُؤْمِنُوْنَ بِاللّٰهِ وَالْيَوْمِ الْاٰخِرِ ۚ وَلْيَشْهَدْ عَذَابَهُمَا طَآئِفَةٌ مِّنَ الْمُؤْمِنِيْنَ ۝ (النور: ۲)

**"వ్యభిచారిణి, వ్యభిచారి - ఈ ఇద్దరిలో ప్రతి ఒక్కరినీ నూరేసి కొరడా దెబ్బలు కొట్టండి. మీరు అల్లాహ్‌పై, అంతిమదినంపై విశ్వాసం ఉన్నవారే అయితే, వారి మీద కనికరం చూపే తలంపు అల్లాహ్ ప్రసాదించిన ధర్మ (నిర్వహణ) విషయంలో మిమ్మల్ని అడ్డుకోరాదు. వారిని శిక్షించే టప్పుడు విశ్వాసుల వర్గం ఒకటి అక్కడ ఉండాలి."** ***(నూర్ 24 : 2)***

ఈ విషయంలో ఇస్లామీయ చట్టాలకు, పాశ్చాత్య చట్టాలకు చాలా పెద్ద వ్యత్యాసం ఉంది. పాశ్చాత్య చట్టాలు అసలు వ్యభిచారాన్ని అసలు నేరంగానే పరిగణించవు. బలవంతానికి పాల్పడినప్పుడో, లేక ఇతరుల వివాహ బంధంలో ఉన్నప్పుడు మాత్రమే ఆ నేరం వ్యభిచారంగా పరిగణించడం జరుగుతోంది. అంతేగాని పాశ్చాత్య చట్టాల ప్రకారం స్వతహాగా వ్యభిచారమనేది నేరంకాదు. బలవంతం చేసినప్పుడు మాత్రమే అది నేరమవుతోంది. ఒకరి వివాహబంధంలో లేకుండా భాగస్వాములిద్దరూ ఇష్టపడితే అది నేరం కాదు. దీనికి భిన్నంగా ఇస్లాం దృష్టిలో వ్యభిచారం అన్నది ఎట్టి పరిస్థితిలోనూ నేరమే. బలవంతానికి పాల్పడితేనో, లేక మరొకరి హక్కును కొల్లగొడితే అదనంగా అది మరొక నేరమవుతుంది. ఈ మౌలిక వ్యత్యాసం కారణంగా, శిక్ష విషయంలో కూడా రెండింటి మధ్య స్పష్టమైన తేడా ఉంది. పాశ్చాత్య చట్టాలు బలాత్కారాలకు పాల్పడిన వారిని జైలు శిక్షతో సరిపెడ తాయి. వివాహిత స్త్రీతో వ్యభిచరించినందుకు ఆమె భాగస్వామిని జరిమానాకు అర్హుడిగా నిర్ణయిస్తాయి. ఇలాంటి శిక్షలు నేరాలను అదుపు చేయకపోగా, మరింత

ప్రోత్సాహించేవిగా ఉన్నాయి. అందుకే ఇలాంటి చట్టాలు అమల్లో ఉన్న దేశాల్లో వ్యభిచారుల సంఖ్య పెరిగిపోతోంది. దీనికి భిన్నంగా ఇస్లామీయ చట్టం, సమాజాన్ని ఇలాంటి దుర్మార్గులనుండి పరిశుభ్రంగా, సురక్షితంగా ఉంచేందుకు కఠినమైన శిక్షలు విధిస్తుంది. ఇలాంటి కఠిన చట్టాలు అమల్లో ఉన్న దేశాల్లో వ్యభిచారం సర్వ సామాన్యం కాలేకపోయింది. ఒకసారి గనక ఈ శిక్ష అమలు జరిగిందంటే యావద్దే శంలో కొన్ని సంవత్సరాల వరకు ఇలాంటి నేరం గురించి ఆలోచించే సాహసం కూడా ఎవరూ చేయలేరు. దుర్మార్గపు ఆలోచనలు కలిగిన, నేర స్వభావం కలిగిన వారికి ఇదొక మానసిక శస్త్ర చికిత్స. దీని ద్వారా వారి మనసు స్వయంగా సంస్కరణకు నోచుకుంటుంది.

పాశ్చాత్య స్వభావం కలిగినవారు వంద కొరడా దెబ్బల శిక్షను వ్యతిరేకిస్తారు. దీనిక్కారణం, వారు మానవులకు బాధకలగడాన్ని సహించలేరన్నది కానేకాదు. అసలు కారణం ఏమిటంటే, వారి నైతిక విలువల వృద్ధి వికాసాల్లో ఇంకా లోపం ఉండడమే దీనికి అసలు కారణం. మొదట్లో వారు వ్యభిచారాన్ని ఒక తప్పుగా భావించేవారు. ఇప్పుడు ఒక క్రీడ, తమాషా అని భావిస్తున్నారు. ఇద్దరు సహచరులు కలిసి కాసేపు సంతోషించే ఆట.అందుకే ఈ చట్టం వారి వ్యక్తిగత స్వేచ్ఛలో జోక్యం చేసుకోదు. ఇతరుల హక్కులకు, స్వేచ్ఛకు భంగం కలిగితేనే జోక్యం అవసరం అని భావిస్తుంది. ఒకవేళ జోక్యం చేసుకున్నా కొద్దిపాటి శిక్ష సరిపోతుందని భావిస్తుంది.

వ్యభిచారాన్ని గురించి ఈ విధమైన అభిప్రాయం కలిగిన వాళ్లు, వందకొరడా దెబ్బల శిక్షను దుర్మార్గమైన శిక్షగానే భావిస్తారు. అయితే వారిలో నైతిక, సామాజిక స్పృహ వికసించినట్లయితే, వ్యభిచారం ఇష్టప్రకారం జరిగినా, బలత్కారమైనా, వివాహితుడైనా, అవివాహితులైనా ఏ విధంగానైనా అది సామాజిక నేరమేనని, దీని దుష్పరిణామాలు మొత్తం సమాజాన్ని ప్రభావితం చేస్తాయని తెలిసినప్పుడు శిక్ష విషయంలో కూడా వారి అభిప్రాయాలు తప్పకుండా మారిపోతాయి. సమాజాన్ని ఈ దుష్పరిణామాలనుండి రక్షించడం అవసరమన్న విషయాన్నీ వారు గుర్తిస్తారు.

వ్యభిచారం వైపుకు ప్రోత్సహించే సాధనాలు పైశాచిక మానవ నైజంలో లోతుగా వేళ్లూనుకొని ఉంటాయి. చిన్న చిన్న శిక్షలు, జరిమానాల ద్వారా వాటిని పెళ్లగించడం అసాధ్యం. కాబట్టి ఆ వేర్లను సర్వనాశనం చేయాలంటే పటిష్టమైన చర్యలు చేపట్టాలి. ఒకరిద్దరిని కఠినంగా, తీవ్రంగా శిక్షించి అసంఖ్యాక ప్రజల నైతిక విలువలను కాపాడడం ముఖ్యమా? కొద్దిమంది దుర్మార్గులను రక్షించి మొత్తం

జాతినే నష్టాలపాలు చేయడం మంచిదా ఆలోచించుకోవాలి.

వంద కొరడా దెబ్బల శిక్షను దుర్మార్గమైన శిక్షగా భావించడానికి మరో కారణం కూడా ఉంది. పాశ్చాత్య నాగరికత మూలాలను గమనిస్తే మనకీ విషయం సునాయాసంగా బోధపడుతోంది. ఇంతకుముందే వివరించినట్లు, ఈ నాగరికత నిర్మాణమే సామూహికత కంటే, వ్యక్తులకే ప్రాధాన్యం అన్న బదులు వ్యక్తిగత భావజాలంపై ఉనికిలో కొచ్చింది. దీని నిర్మాణమంతా వ్యక్తిగత హక్కుల పరిధిలోనే ఉంది. అందుకని వ్యక్తి సమాజంపై ఎంత దౌర్జన్యానికి పాల్పడినా పాశ్చాత్య సమాజానికి పెద్ద ఇబ్బందేమీ అనిపించదు. అంతేకాదు ఎక్కువసార్లు వారు దాన్ని సంతోషంగా స్వాగతిస్తారు, స్వీకరిస్తారు. అయితే సామూహిక హక్కుల పరిరక్షణ కోసం వ్యక్తిపై ఏమైనా చర్యలు తీసుకుంటే మాత్రం వారు సహించలేరు. అప్పుడు వారి సానుభూతి అంతా సమాజంపై కాకుండా వ్యక్తిపైనే కేంద్రీకృతమవుతుంది. అందరు మూర్ఖుల్లాగే పాశ్చాత్య మూర్ఖుల అనుయాయుల ప్రత్యేకత ఏమిటంటే, వారు యోగ్యమైన, ఉపయుక్తమైన వాటికి బదులు, పనికిరాని విషయాలకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. ఒక వ్యక్తికి జరిగే నష్టం స్వల్ప పరిమాణంలోనైనా వారి ముందుకొచ్చినప్పుడు, దాన్ని వారు చాలా పెద్ద నష్టంగా భావిస్తారు. దీనికి భిన్నంగా మొత్తం సమాజానికి, తరువాతి తరాలకు జరిగే తీవ్రమైన, సుదీర్ఘ నష్టాన్ని గురించి వారు ఆలోచించరు. ఎందుకంటే మొత్తం సమాజాన్ని, భవిష్యత్తరాల వినాశనానికి దారితీసే దుష్పరిణామాలు వెంటనే కనబడవు కాబట్టి వారు దాన్ని పట్టించుకోరు.

## వ్యభిచార నింద

వ్యభిచారం వల్ల ఎన్ని నష్టాలున్నాయో, కాస్త అటూఇటూగా వ్యభిచార నిందవల్ల కూడా అలాంటి నష్టాలే ఉన్నాయి. ఒక శీలవతిపై వ్యభిచార నింద మోపినట్లయితే ఆ నష్టం ఒక్కరికే పరిమితం కాదు. దానివల్ల కుటుంబాల్లో శతృత్వాలు ప్రారంభమవుతాయి. అశాంతి నెలకొంటుంది. వంశంలో అనుమానాలు పొడసూపుతాయి. దాంపత్య సంబంధాలు దెబ్బతింటాయి. ఒక మనిషి కేవలం ఒకసారి నోరు కదపడం వల్ల, అనేక మంది అనేక సంవత్సరాలపాటు మానసిక క్షోభను అనుభవించవలసి ఉంటుంది. ఇలాంటి నేరస్తులక్కూడా పవిత్ర ఖుర్ఆన్ శిక్షలను ఖరారు చేసింది :

وَالَّذِيْنَ يَرْمُوْنَ الْمُحْصَنٰتِ ثُمَّ لَمْ يَاْتُوْا بِاَرْبَعَةِ شُهَدَآءَ
فَاجْلِدُوْهُمْ ثَمٰنِيْنَ جَلْدَةً وَّلَا تَقْبَلُوْا لَهُمْ شَهَادَةً اَبَدًا ۚ
وَاُولٰٓئِكَ هُمُ الْفٰسِقُوْنَ ۙ (النور: ۴)

"ఎవరైనా శీలవతులైన స్త్రీలపై నిందమోపి తరువాత నలుగురు సాక్షులను తీసుకురాకపోతే, వారిని ఎనభై కొరడా దెబ్బలు కొట్టండి, వారి సాక్ష్యాన్ని ఇక ఎన్నడూ అంగీకరించకండి. వారే దుర్మార్గులు" *(నూర్ 24 : 4)*

## నిరోధక చర్యలు

ఈ విధంగా ఇస్లామీయ చట్టాలు, తన అధికార బలంతో ఒకవైపు దుర్మార్గాలను ఉక్కుపాదంతో అణిచివేస్తాయి. మరోవైపు సమాజంలోని మంచివారిని, శీలవంతులను, దుష్టుల దుష్ప్రచారాలనుండి, అసత్యాలనుండి రక్షిస్తాయి. ఇస్లామీయ నైతిక బోధనలు మానవుల అంతరంగాలను సంస్కరించి అందులో ఏ విధమైన చెడులు, పాపాలు ప్రవేశించకుండా కాపాడితే, దాని శిక్షాస్మృతి బాహ్య సంస్కరణకు దోహదపడుతుంది. అంటే నైతిక సంస్కరణ తరువాత కూడా ఏమైనా కొద్దీ గొప్ప లోపాలు, చెడులు తలెత్తితే వాటిని కూడా బలవంతంగా అణిచి వేయడం జరుగు తుంది. ఈ విధంగా అంతరంగ సంస్కరణతోపాటు, బాహ్య సంస్కరణ పట్ల కూడా శ్రద్ధ వహించి చెడులు ప్రబలే అన్ని అవకాశాలనూ మూసివేయడం జరిగింది. దీనికి సంబంధించి కొన్ని విషయాలను వివరంగా తెలుసుకుందాం.

## వస్త్రధారణ

సామాజిక ఆజ్ఞల విషయంలో మొట్టమొదట ఇస్లాం నగ్నత్వాన్ని రూపు మాపింది. స్త్రీలకు పురుషులకు నిర్ణీత వస్త్రధారణ ఏర్పరచింది. ఈ విషయంలో నాటి అజ్ఞాన అరబ్బుల స్థితికన్నా, నేటి నాగరిక జాతుల స్థితి ఏమంత భిన్నంగా లేదు. వారు పరస్పరం ఒకరిముందు ఒకరు నగ్నంగా ఉండడాన్ని తప్పుగా భావించే వారుకాదు. స్నానం సమయంలో, మలమూత్ర విసర్జన సమయంలో చాటు ఉండాలనుకోవడం అనవసరమని వారి అభిప్రాయం. అంతదాకా ఎందుకు? కాబా గృహ ప్రదిక్షణ సైతం వారు నగ్నంగానే చేసేవారు. అలా చేయడం పుణ్యమని భావించేవారు. ప్రదిక్షిణ సమయంలో స్త్రీలు కూడా నగ్నంగా ఉండేవారు. నాటి స్త్రీల వస్త్రధారణ

ఎలాగుండేదంటే, కొంత వక్షస్థలం, పక్కలు, నడుము, పిక్కలు బయటికి కనబడుతూ ఉండేవి. ఇదే పరిస్థితి ఈనాడు మనకు యూరప్, అమెరికా, జపాన్ తదితర దేశాల్లో కనబడుతోంది. పాశ్చాత్య దేశాల్లో ఎక్కడా సరైన వస్త్రధారణ కలిగిన సామాజిక వ్యవస్థ మనకు కనబడదు. ఇస్లాం ఈ విషయంలో మానవుడికి తొలి పాఠం నేర్పింది. అది ఇలా అంటోంది.

يٰبَنِيْٓ اٰدَمَ قَدْ اَنْزَلْنَا عَلَيْكُمْ لِبَاسًا يُّوَارِيْ سَوْاٰتِكُمْ وَرِيْشًا ط

(الاعراف:٢٦)

**“ఆదం సంతానమా! మేము మీపై దుస్తులను అవతరింపజేశాము. అవి మీరు సిగ్గుపడే మీ శరీర భాగాలను కప్పుతాయి. మీ శరీర రక్షణకు, శోభకు సాధనంగా ఉంటాయి.”** ***(అల్ ఆరాఫ్ 7 : 26)***

పవిత్ర ఖుర్‌ఆన్‌లోని ఈ వాక్యం ప్రకారం, శరీర భాగాలను కప్పుకోవడం స్త్రీ పురుషులందరికీ విధిగా నిర్ణయించబడింది. దైవప్రవక్త (స) కూడా ఎవరూ ఎవరిముందూ దిగంబరంగా ఉండకూడదని వారిస్తూ,

**ملعون من نظر الى سوأة اخيه.** (احكام القرآن للجصاص)

**తన సోదరుడి నిషిద్ధ దేహభాగాలను చూసేవాడు శాపగ్రస్తుడు అని హెచ్చరించారు.**

**لاينظر الرجل الى عورة الرجل ولا المرأة الى عورة المرأة.** (مسلم، باب تحريم النظر الى العورات)

**‘పురుషుడు పురుషుడ్ని, స్త్రీ, స్త్రీని దిగంబరంగా చూడకూడదు.’ (ముస్లిం)**

**لان اخرّ من السماء فانقطع نصفين احب الى من ان انظر الىٰ عورة احد اوينظر اِلى عورتى.** (المبسوط، كتاب الاستحسان)

**అల్లాహ్ సాక్షి! ఆకాశం నుండి భూమ్మీదకు విసిరివేయబడినా పరవాలేదు, నన్ను రెండు ముక్కలుగా నరికినా, చీల్చినా పరవాలేదు, కాని, నేను ఒకరి గుప్తాంగాలను, మరొకరు నా గుప్తాంగాలను చూడడాన్ని మాత్రం సహించలేను.”**

**ايّاكم والتعرى فان معكم من لا يفارقكم الا عند الغائط**
**وحين يفضى الرجل الى اهله.** (ترمذی، باب ماجاء فی الاستتار)

"జాగ్రత్త! ఎప్పుడూ దిగంబరంగా ఉండకండి. ఎందుకంటే, మలమూత్ర విసర్జన, సంభోగ సమయాల్లో తప్ప, ఎప్పుడూ మిమ్మల్ని విడిచి ఉండనివారు (దైవదూతలు) మీ వెంట ఉన్నారు." (తిర్మిజి)

**اذا اتى احدكم اهله فليستتر ولا يتجرد تجرد العيرين.**
(ابن ماجه، باب التستر عندالجماع)

"మీలో ఎవరైనా భార్యతో సంభోగిస్తున్నప్పుడు ఇద్దరూ గాడిదల్లా పూర్తి వివస్త్రలు కాకండి." *(తిర్మిజి)*

ఒకసారి దైవప్రవక్త (స) జకాత్ ఒంటెలు మేస్తున్న ప్రదేశానికి వెళ్లారు. అక్కడ ఒంటెల కాపరి నగ్నంగా పడుకొని ఉన్నాడు. వెంటనే ప్రవక్త (స) అతణ్ని పనిలోంచి తొలగిస్తూ 'సిగ్గులేనివాడు మాకు ఎందుకూ పనికిరాడు' అని తీవ్రంగా మందలించారు.

## పురుషుల వస్త్రధారణ

ఈ ఉపదేశాలతోపాటు, స్త్రీలు, పురుషుల వస్త్రధారణలో కూడా వేరొకరు పరిధులు నిర్ణయించబడ్డాయి. ఏ దేహభాగాలనైతే కప్పడం తప్పనిసరో దాన్ని ధార్మిక పరిభాషలో 'సతర్' అంటారు పురుషులైతే నాభినుండి మోకాళ్ల వరకు సతర్‌గా పరిగణించబడింది. ఈ భాగాన్ని ఎవరి ముందూ బహిర్గత పరచకూడదు. ఇతరుల సతర్ భాగాన్నీ చూడకూడదు.

**عن ابى ايوب الانصارى عن النبى ﷺ مافوق الركبتين**
**من العورة و اسفل من السرّة من العورة.** (دارقطنی)

'మోకాళ్ల నుండి పైన, నాభి నుండి కింద ఉన్న భాగం గుప్తంగా ఉంచవలసిన భాగాలు.' *(దారెఖుత్ని)*

**عورة الرجل مابين سرّته الى ركبتيه.** (مبسوط)

'నాభి నుండి మోకాళ్ల వరకు పురుషులు తప్పనిసరిగా దాయదగిన భాగం" (మబ్‌సూత్)

عن عليّ بن ابی طالب عنِ النبی ﷺ لاتبرز فخذک ولا تنظر الی فخذحی ولامیت. (تفسیر کبیر آیة قل للمومنین یغضوامن ابصارهم)

'నీ తొడను ఎవరి ముందూ బహిర్గతపరచకు. మృతుడైనా, సజీవుడైనా ఎవరి తొడ భాగాన్ని నువ్వు చూడకు.'

ఈ ఆజ్ఞలు సర్వసాధారణమైనవి. భార్య తప్ప అందరికీ ఇవి వర్తిస్తాయి.

احفظ عورتکِ الا من زوجتک او ماملک یمینک.

(احکام القرآن للحصاص ج۳، ص:۳۷)

'మీ సతర్‌ను కాపాడుకోండి. మీ భార్యలు, మీ అధీనంలో ఉన్న బానిసలు తప్ప'

## స్త్రీల వస్త్రధారణ

స్త్రీల సతర్ పరిధి ఇంకా ఇంతకంటే విశాలంగా ఉంటుంది. ముఖం, చేతులు తప్ప మిగతా శరీర భాగమంతా ఇతరుల ముందు కప్పి ఉంచుకోవాలని స్త్రీలను ఆదేశించడం జరిగింది. తండ్రి, సోదరుడు, సహా మిగతా మగ బంధువులంతా ఈ ఆదేశం పరిధిలో కొస్తారు. ఒక్క భర్త తప్ప మరే పురుషుడూ దీనికి మినహాయింపు కాదు. ప్రవక్త ప్రవచనం ఇలా ఉంది :

لایحل لا مرأة تؤمن باللّٰه والیوم الاٰخر ان تخرج یدیها الا الیٰ هٰهنا و قبض نصف الذراع. (ابن جریر)

'దైవాన్ని, అంతిమ దినాన్ని విశ్వసించే స్త్రీ తన చేతిని ఇంతకంటే ఎక్కువ బహిర్గతం చేయడం  ధర్మ సమ్మతం కాదు.' అని ప్రవక్త మహనీయులు తన ముంజేయి సగ భాగాన చేయిపెట్టి చూపించారు. (ఇబ్నె జరీర్)

**الجارية اذا حاضت لم يصلح ان يرٰى منها الاوجهها ويدها اِلى المفصل.** (ابوداؤد)

**'స్త్రీ ప్రాజ్ఞతకు చేరుకున్న తరువాత ముఖం ముంజేతుల వరకు తప్ప శరీరంలోని మిగతా ఏ భాగమూ బయటికి కనిపించకూడదు.' (అబూదావూద్)**

హజ్రత్ ఆయిషా (రజిఅన్‌హా) ఇలా అంటున్నారు :

నేనొకసారి, మా చెల్లెలి కొడుకు అబ్దుల్లాబిన్ తుఫైల్ ముందుకు అలంకరణతో వచ్చాను. అయితే దైవప్రవక్త (స) అయిష్టత కనబరిచారు. అప్పుడు నేను ఈయన మా చెల్లెలు కొడుకే కదా! అన్నాను. దానికి ఆయన ఇలా అన్నారు :

**اذا عرقت المرأة لم يحل لها ان تظهر اِلا وجهها والامادون هٰذا وقبض علےٰ ذراع نفسه فترک بين قبضة و بين الكف مثل قبضة اخرٰى.** (ابن جرير)

**'స్త్రీ ప్రాజ్ఞతకు చేరుకున్న తరువాత ముఖంతోపాటు, ఇదిగో ఇంతవరకు తప్ప శరీరంలోని ఏ భాగమూ బహిర్గతపరచడం ధర్మసమ్మతం కాదు.'**

అంటూ తన ముంజేయిని పట్టుకొని చూపించారు. అప్పుడు ఆయన (స) పట్టుకున్న చోట, అరచేతికి మధ్య ఒక పిడికెడు చోటు మిగిలింది.

ఒకసారి ప్రవక్త వారి మరదలు అస్మా బిన్తె అబూబక్ర్ (రజి) ఆయన గారి దగ్గరికొచ్చింది. అప్పుడామె పల్చని వస్త్రాలు ధరించడం వల్ల లోపలి శరీర భాగాలు కనబడుతున్నాయి. ఆ స్థితిలో ఆమెను చూసిన ప్రవక్త (స) వెంటనే తల తిప్పుకొని:

**يااسماء ان المرأة اِذا بلغت المحيض لم يصلح ان يرٰى منها الاهذا و هٰذا واشار الى وجههٖ و كفّهٖ.** (تكمله فتح القدير)

**'అస్మా! స్త్రీ ప్రాజ్ఞతకు చేరిన తరువాత ఇదిగో ఇవి తప్ప శరీరంలోని ఏ భాగమూ బయటికి కనబడకూడదు. అంటూ ముఖం, అరచేతులు చూపించారు. (తక్మల ఫతహుల్ ఖదీర్)**

'హఫ్స బిన్తె అబ్దుర్రహ్మాన్ (రజిఅన్హా) హజ్రత్ ఆయిషా (రజిఅన్హా) వద్దకు వచ్చారు. అప్పుడామె ఒక పల్చని దుప్పటి కప్పుకొని ఉన్నారు. వెంటనే హజ్రత్ ఆయిషా (రజిఅన్హా) ఆ దుప్పటిని చించిపారేసి, మంచి మందపాటి దుప్పటి నిచ్చారు. (మూతా ఇమాం మాలిక్)

'వస్త్రాలు ధరించి కూడా దిగంబరంగా కనిపించే స్త్రీలపై దేవుని శాపం అవతరించుగాక.' అని దైవప్రవక్త (స) శపించారు.

బాగా బిగుతుగా ఉండి శరీర అవయవాల ఆకారాలు కనిపించే విధంగా ఉండే దుస్తులు స్త్రీలకు తొడగవద్దని హజ్రత్ ఉమర్ (రజి) ఉపదేశించారు.

ముఖము, చేతులు తప్ప స్త్రీ శరీరమంతా సతర్ పరిధిలోకే వస్తుందని ఈ ఉల్లేఖనాల ద్వారా మనకు తెలుస్తోంది. ఆమె తన ఇంట్లో దగ్గరి బంధువుల ముందు కూడా శరీరాన్ని బహిర్గతం చేయకూడదు. ఒక్క భర్త తప్ప మరెవరిముందైనా తన సతర్ను బహిర్గతం చేయరాదు. చివరికి తండ్రి సోదరుడు, చెల్లెలి కొడుకు (కొడుకుతో సమానం) అయినా సరే. అంతేకాకుండా పల్చని వస్త్రాలు, బిగుతుగా ఉండే వస్త్రాలు కూడా ధరించకూడదు. ఇలాంటి వస్త్రధారణ వల్ల శరీరంలోని ఒంపుసొంపులు బహిర్గతం అవుతాయి. ఈ ఆదేశాలు యుక్తవయసు స్త్రీలందరికీ వర్తిస్తాయి. స్త్రీ ప్రాజ్ఞతకు చేరుకునే వయసు నుండి లైంగికాకర్షణ మిగిలి ఉన్నంత వరకు ఈ సతర్ ఆదేశాలు అమల్లో ఉంటాయి. వయసు మళ్లిన తరువాత ఇందులో వెసులుబాటుకు అవకాశం ఉంది. పవిత్ర ఖుర్ఆన్లో ఇలా ఉంది :

**وَالْقَوَاعِدُ مِنَ النِّسَآءِ الّٰتِیْ لَا یَرْجُوْنَ نِكَاحًا فَلَیْسَ عَلَیْهِنَّ جُنَاحٌ اَنْ یَّضَعْنَ ثِیَابَهُنَّ غَیْرَ مُتَبَرِّجٰتٍۭ بِزِیْنَةٍ ؕ وَاَنْ یَّسْتَعْفِفْنَ خَیْرٌ لَّهُنَّ ؕ** (النور: ٦٠)

**యౌవనం ఉడిగిపోయి, వివాహం పట్ల ఉత్సాహం సన్నగిల్లిన స్త్రీలు తమ దుప్పట్లను తీసివేస్తే, వారు ఏ దోషమూ చేసినట్లు కాదు; అయితే వారు తమ అలంకరణను ప్రదర్శించేవారు కాకూడదు. అయినప్పటికీ,**

**వారు సిగ్గునే పాటిస్తే, అది వారికే శ్రేయస్కరమైనది. అల్లాహ్ అన్నీ వింటాడు, అన్నీ తెలిసినవాడు.** ***(అన్ నూర్ 24 : 60)***

ఇక్కడ రాయితీ లేక వెసులుబాటు ఉద్దేశ్యం చాలా స్పష్టంగా చెప్పడం జరిగింది. పెళ్లి ఆశ అడుగంటి పోవడమంటే, లైంగిక కోరికలు పూర్తిగా నశించి, ఎలాంటి ఆశ మిగిలి ఉండని వయసు అని అర్థం. ఇలాంటి వృద్ధ మహిళలు ఇంట్లో ఉన్నప్పుడు దుప్పటి కాని, ఓణీలు కాని కప్పుకోకపోయినా పరవాలేదు.

మరో విషయం ఏమిటంటే, ఇంట్లో వాళ్లు కూడా అకస్మాత్తుగా ఇళ్లలోకి ప్రవేశించకూడదు. మహిళలను చూడకూడని స్థితిలో చూసే ప్రమాదాన్ని నివారించడానికి, ఇంటివారైనా సరే అనుమతి లేకుండా అకస్మాత్తుగా ఇళ్లలోకి ప్రవేశించ వద్దని వారించడం జరిగింది.

**وَاِذَا بَلَغَ الْاَطْفَالُ مِنْكُمُ الْحُلُمَ فَلْيَسْتَاْذِنُوْا كَمَا اسْتَاْذَنَ الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ** (النور:٥٩)

**మీ పిల్లలు యుక్త వయస్సుకు చేరుకున్నప్పుడు, తమ పెద్దలు అనుమతి తీసుకునే విధంగానే వారు కూడా అనుమతి తీసుకుని మరీ రావాలి.**

***(అన్ నూర్ 24 : 59)***

ఇక్కడ కూడా లైంగిక భావనలు జనించని పిల్లలకు వెసులుబాటు కల్పిస్తూ ప్రాజ్ఞతకు చేరుకున్న వారు మాత్రమే అనుమతి తీసుకోవాలి, చిన్న పిల్లలకు అవసరంలేదని చెప్పడం జరిగింది. దీంతో పాటు, బయటి వారు అనుమతి లేనిదే ఎంతమాత్రం వెళ్లరాదని చెప్పడం జరిగింది.

**يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تَدْخُلُوْا بُيُوْتًا غَيْرَ بُيُوْتِكُمْ حَتّٰى تَسْتَاْنِسُوْا وَتُسَلِّمُوْا عَلٰۤى اَهْلِهَا** (النور:٢٧)

**'విశ్వసించిన ప్రజలారా! మీ ఇళ్లల్లోకి తప్ప ఇతరుల ఇళ్లలోకి ప్రవేశించకండి, ఇంటి వారి అంగీకారం పొందనంత వరకు.'** ***(నూర్ 24:27)***

విషయం ఏమిటంటే అంతర్గత వ్యవహారం, బాహ్య వ్యవహారాల మధ్య ఒక హద్దును ఏర్పరచడం అసలు ఉద్దేశ్యం. దీనివల్ల వ్యక్తిగత జీవితాల్లో స్త్రీ పురుషులు

ఇతరుల దృష్టినుండి సురక్షితంగా ఉంటారు. ప్రారంభంలో అరబ్బులు ఈ వెసులు బాటును అర్థం చేసుకోలేకపోయారు. అందుకే కొన్ని సందర్భాల్లో వారు బయటినుండి ఇళ్లలోకి తొంగి చూసేవారు. ఒకసారి స్వయంగా దైవప్రవక్త (స) కూడా ఈ పరిస్థితిని ఎదుర్కొన్నారు. ఆయన తన కుటీరంలో ఉండగా ఒక వ్యక్తి కిటికీలోంచి తొంగి చూశాడు. అప్పుడాయన (స), 'నువ్వు తొంగి చూసే విషయం నాకు ముందే తెలిస్తే, నీ కంట్లో దేంతోనైనా పొడిచేవాణ్ని' అన్నారు. చెడు చూపులనుండి రక్షించుకోడానికే ఈవిధంగా ఆదేశించడం జరిగింది. (బుఖారి).

తరువాత ఆయన ఇలా ప్రకటించారు: 'ఒకవేళ ఎవరైనా ఇంటి వారి అనుమతి లేకుండా అక్రమంగా తొంగిచూస్తే, అతని కనుగుడ్లు పీకేసే అధికారం ఇంటి వారికి ఉంటుంది.' (ముస్లిం)

పర పురుషులు ఇతరుల ఇళ్ల నుండి ఏవైనా వస్తువులు అడగాలంటే, నేరుగా ఇళ్లలోకి వెళ్లకూడదు. బయటి గుమ్మం దగ్గర పరదా చాటున నిలబడి అడగాలి.

وَاِذَا سَاَلْتُمُوْهُنَّ مَتَاعًا فَسْئَلُوْهُنَّ مِنْ وَّرَآءِ حِجَابٍ ؕ ذٰلِكُمْ اَطْهَرُ لِقُلُوْبِكُمْ وَقُلُوْبِهِنَّ ؕ (الاحزاب:۵۳)

**'మీరు స్త్రీలను ఏవైనా వస్తువులు అడగాలనుకుంటే, తెరవెనుక నిలబడి అడగండి. ఇది చిత్తశుద్ధికోసం మీకూ, వారికీ ఎంతో మంచి పద్ధతి.**

***(అల్ అహ్‌జాబ్ 33 : 53)***

అంటే స్త్రీ పురుషులు పరస్పరం స్వేచ్ఛగా, నిస్సంకోచంగా కలుసుకోడానికి, మాట్లాడుకోడానికి అవకాశాలను తగ్గించి వేయడమే అసలు ఉద్దేశ్యం. ఈ ఆదేశాలు కేవలం పరాయివాళ్లకే కాదు, సేవకులకూ వర్తిస్తాయి. హదీసులో ఇలా ఉంది : హజ్రత్ అనస్ (రజి) లేక హజ్రత్ బిలాల్ (రజి) సయ్యిద ఫాతిమా (ర.అన్‌హా) కొడుకుని అడిగితే, ఆమె పరదా వెనుక నుండి అందించారు. వాస్తవానికి ఈ ఇద్దరూ దైవప్రవక్తకు ప్రత్యేక సేవకులు. ఇంట్లో వాళ్లలాగే ఉండేవారు. (ఫతహుల్ ఖదీర్)

## ఏకాంతం -స్పర్శ

మరో విషయం ఏమిటంటే, భర్త తప్ప మరే పురుషుడు ఏకాంతంలో ఉండకూడదు, తాకకూడదు. ఎంత దగ్గరి బంధువైనా సరే.

**عن عقبة بن عامر ان رسول اللهﷺ قال ايّاكم والدخول على النساء فقال رجل من الانصار يا رسول الله افرأيت الحمو. قال الحمو الموت.**(٢)

ఉఖ్బబిన్ ఆమిర్ కథనం ప్రకారం దైవప్రవక్త (స) ప్రవచించారు : 'జాగ్రత్త! స్త్రీలు ఒంటరిగా ఉన్నప్పుడు వారి వద్దకు వెళ్లకండి. అని అప్పుడు ఒక అన్సారీ, మరిది, బావగారి విషయంలో ఆదేశం ఏమిటి? అని ప్రశ్నించాడు. దానికాయన (స), వారైతే మృత్యువుతో సమానం' అని సమాధానం పలికారు.

**لاتلجوا على المغيبات فان الشيطان يجرى من احدكم مجرى الدم.**(٣)

భర్తలేని సమయాల్లో స్త్రీల వద్దకు వెళ్లకండి. ఎందుకంటే షైతాన్ మీ నరాల్లో రక్తంలా ప్రవహిస్తుంటాడు. (తిర్మిజి)

**عن عمرو بن عاص قال نهانا رسول اللهﷺ ان ندخل علے النساء بغير اذن ازواجهن.**(١)

దైవప్రవక్త (స)మమ్మల్ని భర్తల అనుమతి లేకుండా వారి వద్దకు వెళ్లవద్దని వారించినట్లు ఉమర్ బిన్ ఆస్ (రజి) తెలిపారు. (తిర్మిజి)

**لايدخلن رجل بعد يومى هٰذا علٰى مغيبة الامعه رجل اواثنان.** (مسلم، باب تحريم الخلوة بالاجنبية)

'నేటి తరువాత ఎవరూ, భర్తలేని సమయంలో వారి స్త్రీల వద్దకు వెళ్లకూడదు. వారివెంట ఒకరిద్దరు వ్యక్తులుంటే పరవాలేదు.' (ముస్లిం)

తాకడానికి సంబంధించి కూడా ఇలాంటి ఆదేశాలే ఉన్నాయి :

**قال النبیﷺ من مسّ کفّ امرأة لیس منها بسبیل وضع علٰی کفِّهٖ جمرة یوم القیٰمة.** (تکملہ فتح القدیر)

**ధర్మసమ్మతమైన బంధుత్వం లేకుండా, ఎవరైనా ఒక స్త్రీ చేతిని తాకితే, ప్రళయం రోజున అతని అరచేతిలో అగ్నిగోళాలు ఉంచబడతాయి. (ఫతహుల్ ఖదీర్)**

హజ్రత్ ఆయిషా (ర.అన్హా) ఇలా అంటున్నారు. దైవప్రవక్త (స) స్త్రీల నుండి కేవలం నోటి ద్వారానే ప్రమాణం తీసుకునే వారు. వారి చేతిని తన చేతిలోకి తీసుకునే వారు కాదు. తన వివాహబంధంలో ఉన్న స్త్రీ తప్ప, మరే స్త్రీ చేతినీ ఆయన తాకే వారు కాదు. (బుఖారి)

ఉమయ్యా బిన్తె రఖీఖ (ర.అన్హా) కథనం : 'నేను కొందరు స్త్రీలతో కలిసి ప్రవక్త (స) వద్దకు బయత్ కోసం వెళ్లాను. షిర్క్, దొంగతనం, వ్యభిచారం, అపనింద, ఆరోపణ, ప్రవక్త అవిధేయతల నుండి దూరంగా ఉంటామని మాతో ప్రమాణం చేయించారు. ప్రమాణం పూర్తయిన తరువాత నేను, రండి మేము మీ చేతిలో చెయ్యేసి ప్రమాణం చేస్తాము అన్నాను. అప్పుడు ప్రవక్త (స) నేను స్త్రీలతో కరచాలనం చేయను. కేవలం నోటి ప్రమాణం చాలు అన్నారు. (నిసాయి)

ఈ ఆదేశాలు కూడా యుక్తవయసు స్త్రీలకే పరిమితం, వయసుమళ్లిన స్త్రీలతో ఒంటరిగా ఉండడం ధర్మ సమ్మతమే. వారిని తాకడం కూడా తప్పుకాదు. హజ్రత్ అబూబక్ర్ (రజి) విషయంలో ఇలా ఉంది. హజ్రత్ అబూబక్ర్ (రజి) బాల్యంలో గడిపిన ఒక తెగవద్దకు వెళ్లేవారు. అక్కడి వృద్ధ మహిళలతో కరచాలనం చేసేవారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) విషయంలో ఒక ఉల్లేఖనం ఉంది. ఆయన ఒక వృద్ధ మహిళతో తల, కాళ్లు మాలీష్ చేయించుకునేవారు. వృద్ధ మహిళలు, యుక్త వయసు స్త్రీల మధ్య ఈవిధమైన వ్యత్యాసాన్ని పాటించడమంటే స్త్రీ పురుషుల పరస్పర నిస్సంకోచ కలయిక వల్ల జనించే ఉపద్రవాన్ని నిరోధించడమే.

## వివాహమాడడానికి ధర్మ సమ్మతం కాని (మహ్రమ్), పురుషులు, పర పురుషుల మధ్య వ్యత్యాసం

పైన చెప్పుకున్న ఆజ్ఞలన్నీ ఒక్క భర్త తప్ప పురుషులందరికీ వర్తిస్తాయి.

వారు వివాహానికి ధర్మసమ్మతం కాని (మహ్‌రమ్) వారైనా, పర పురుషులైనా (గైర్ మహ్‌రమ్). వీరిలో ఎవరిముందూ స్త్రీ తన కనీసం (సతర్) ఆచ్ఛాదన అంటే ముఖం చేతులు తప్ప మరే శరీర భాగాన్నీ బహిర్గతం చేయకూడదు. ఇదేవిధంగా పురుషుడు కూడా తన సతర్ అంటే నాభినుండి మోకాళ్ల వరకున్న శరీర భాగాన్ని పురుషుల ముందు బహిర్గతం చేయకూడదు. పురుషులందరూ అనుమతి తీసుకొనే ఇళ్లలోకి ప్రవేశించాలి. ఒంటరి స్త్రీ దగ్గర కూర్చోవడం గాని, ఆమెను తాకడం గాని చేయకూడదు.

తరువాత మహ్‌రమ్, గైర్ మహ్‌రమ్ మధ్య వ్యత్యాసాన్ని పాటించాలి. దీనికి సంబంధించి ఖుర్ఆన్, హదీసుల్లో అనేక ఉపదేశాలు ఉన్నాయి.



12వ అధ్యాయం

# పరదా ఆదేశాలు

పవిత్ర ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది

قُلْ لِّلْمُؤْمِنِيْنَ يَغُضُّوْا مِنْ اَبْصَارِهِمْ وَيَحْفَظُوْا فُرُوْجَهُمْ ۭ ذٰلِكَ اَزْكٰى لَهُمْ ۭ اِنَّ اللّٰهَ خَبِيْرٌۢ بِمَا يَصْنَعُوْنَ ۝ وَقُلْ لِّلْمُؤْمِنٰتِ يَغْضُضْنَ مِنْ اَبْصَارِهِنَّ وَيَحْفَظْنَ فُرُوْجَهُنَّ وَلَا يُبْدِيْنَ زِيْنَتَهُنَّ اِلَّا مَا ظَهَرَ مِنْهَا وَلْيَضْرِبْنَ بِخُمُرِهِنَّ عَلٰى جُيُوْبِهِنَّ ۠ وَلَا يُبْدِيْنَ زِيْنَتَهُنَّ اِلَّا لِبُعُوْلَتِهِنَّ اَوْ اٰبَاۗىِٕهِنَّ اَوْ اٰبَاۗءِ بُعُوْلَتِهِنَّ اَوْ اَبْنَاۗىِٕهِنَّ اَوْ اَبْنَاۗءِ بُعُوْلَتِهِنَّ اَوْ اِخْوَانِهِنَّ اَوْ بَنِيْٓ اِخْوَانِهِنَّ اَوْ بَنِيْٓ اَخَوٰتِهِنَّ اَوْ نِسَاۗىِٕهِنَّ اَوْ مَا مَلَكَتْ اَيْمَانُهُنَّ اَوِ التّٰبِعِيْنَ غَيْرِ اُولِي الْاِرْبَةِ مِنَ الرِّجَالِ اَوِ الطِّفْلِ الَّذِيْنَ لَمْ يَظْهَرُوْا عَلٰي عَوْرٰتِ النِّسَاۗءِ ۠ وَلَا يَضْرِبْنَ بِاَرْجُلِهِنَّ لِيُعْلَمَ مَا يُخْفِيْنَ مِنْ زِيْنَتِهِنَّ ۭ (النور: ۳۰، ۳۱)

"ప్రవక్తా! విశ్వసించిన పురుషులకు తమ చూపులను కాపాడుకోండి అనీ తమ మర్మాంగాలను రక్షించుకోండి అనీ చెప్పు. ఇది వారికి ఎంతో పరిశుద్ధమైన పద్ధతి. వారు చేసే దానిని గురించి అల్లాహ్‌కు బాగా తెలుసు. ప్రవక్తా! విశ్వసించిన మహిళలకు ఇలా చెప్పు, తమ చూపులను కాపాడుకోండి అని, తమ మర్మాంగాలను రక్షించుకోండి అని, తమ అలంకరణను ప్రదర్శించవలదని - దానంతట అదే కనిపించేది తప్ప- తమ వక్షస్థలాలను ఓణీ అంచులతో కప్పుకోవాలని, వారు తమ అలంకరణను వీరి ముందు తప్ప మరెవరి ముందూ ప్రదర్శించకూడదని: భర్త, తండ్రి, భర్తల తండ్రులు, తమ కుమారులు, భర్తల కుమారులు, అన్నదమ్ములు, అన్నదమ్ముల కుమారులు, అక్కా చెల్లెళ్ల కుమారులు తమతో

కలసీ మెలసీ ఉండే స్త్రీలు. తమ స్త్రీ పురుష బానిసలు, వేరే ఏ ఉద్దేశ్యమూ లేని వారి కింద పనిచేసే పురుష సేవకులు. స్త్రీల గుప్త విషయాలను గురించి ఇంకా తెలియని బాలురు. తాము గుప్తంగా ఉంచిన తమ అలంకరణ ప్రజలకు తెలిసేలా వారు తమ కాళ్లను నేలపై కొడుతూ నడవరాదని కూడ వారికి చెప్పు - విశ్వసించిన ప్రజలారా! మీరంతా కలసి అల్లాహ్ వైపునకు మరలి క్షమాభిక్షను వేడుకోండి. మీకు సాఫల్యం కలగవచ్చు." *(అన్నూర్ 24 : 30,31)*

يٰنِسَآءَ النَّبِيِّ لَسْتُنَّ كَاَحَدٍ مِّنَ النِّسَآءِ اِنِ اتَّقَيْتُنَّ فَلَا تَخْضَعْنَ بِالْقَوْلِ فَيَطْمَعَ الَّذِىْ فِىْ قَلْبِهٖ مَرَضٌ وَّقُلْنَ قَوْلًا مَّعْرُوْفًا ۚ وَقَرْنَ فِىْ بُيُوْتِكُنَّ وَلَا تَبَرَّجْنَ تَبَرُّجَ الْجَاهِلِيَّةِ الْاُوْلٰى. (الاحزاب:٣٢،٣٣)

'ఓ ప్రవక్త భార్యలారా! మీరు సాధారణ స్త్రీల వంటి వారు కారు. మీరు అల్లాహ్‌కు భయపడేవారు అయితే, తగ్గు స్వరంతో మాట్లాడకండి, ఎందుకంటే దుష్ట మనస్సు గల వ్యక్తి ఎవడైనా వ్యామోహపడవచ్చు. కాబట్టి స్పష్టంగా, సూటిగా మాట్లాడండి. ఇళ్లల్లోనే ఉండిపోండి. పూర్వపు అజ్ఞాన కాలంలో మాదిరిగా అలంకరణను ప్రదర్శిస్తూ తిరగకండి.'
*(అల్ అహ్‌జాబ్ 33 : 32,33)*

يٰاَيُّهَا النَّبِيُّ قُلْ لِّاَزْوَاجِكَ وَبَنٰتِكَ وَنِسَآءِ الْمُؤْمِنِيْنَ يُدْنِيْنَ عَلَيْهِنَّ مِنْ جَلَابِيْبِهِنَّ ؕ ذٰلِكَ اَدْنٰٓى اَنْ يُّعْرَفْنَ فَلَا يُؤْذَيْنَ ؕ (الاحزاب:٥٩)

' ప్రవక్తా! నీ భార్యలకూ, నీ కూతుళ్లకూ, విశ్వాసుల యొక్క స్త్రీలకూ తమ దుప్పట్ల కొంగులను తమపై వ్రేలాడదీసుకోమని చెప్పు; వారు గుర్తింపబడటానికీ, వేధింపబడకుండా ఉండేందుకూ ఇది ఎంతో సముచితమైన పద్ధతి. అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను.'
*(అల్ అహ్‌జాబ్ 33 : : 59)*

ఈ వాక్యాలను పరిశీలించండి. పురుషుల్ని కేవలం తమ చూపులను కిందికి దించుకోవాలని, అశ్లీలతకు దూరంగా సత్ప్రవర్తన కలిగి ఉండాలని ఆదేశించడం జరిగింది. కాని స్త్రీలకు ఈ రెండు ఆదేశాలతోపాటు మరికొన్ని హితవులు కూడా చేయడం జరిగింది. అంటే నడవడికను పరిరక్షించుకోవడం కోసం చూపుల్ని, మర్మావయవాల్ని రక్షించుకోవడమొక్కటే సరిపోదు. మరికొన్ని అదనపు నియమాలు కూడా అవసరం. ఈ సమగ్రమైన ఉపదేశాలకు దైవప్రవక్త (స), ఆయన అనుచరులు ఇస్లామీయ సమాజంలో ఏవిధంగా ఇంప్లిమెంట్ చేశారో, వారి ఆచరణా విధానం ఈ ఆదేశాల వెలుగులో ఎలా అన్వయమైందో మనం గమనించాల్సిన అవసరం ఉంది.

## చూపులు కిందికి..

మొట్టమొదట స్త్రీ పురుషులిద్దరినీ చూపులు కిందికి దించుకోవాలని ఆదేశించడం జరిగింది. అంటే ఎప్పుడూ నేల చూపులే చూస్తూ ఉండాలని, తలపైకెత్తి చూడవద్దని ఎంతమాత్రం కాదు. దైవాదేశం యొక్క అసలు ఉద్దేశ్యం ఏమిటంటే, హదీసులో చూపుల వ్యభిచారం అని దేన్నయితే చెప్పబడిందో, దానికి దూరంగా ఉండాలి. అపరిచిత స్త్రీల అందచందాలను ఆస్వాదించడం పురుషులకు, పురుషులను ఆకర్షించేవిధంగా ఉండడం స్త్రీలకు ఉపద్రవంగా పరిణమిస్తుంది. నిజానికి ఉపద్రవానికి బీజం ఇక్కడే పడుతుంది. అందుకే మొట్టమొదట ఆ ద్వారాన్నే మూసివేయడం జరిగింది. చూపుల్ని కిందికి దించుకోవడమంటే ఇదే. సాధారణ భాషలో చూపుల్ని కాపాడుకోవడమంటే సరిపోతుంది.

మానవుడు ప్రపంచంలో మనుగడ సాగిస్తున్నంత కాలం (కళ్లు లేక పోతే తప్ప) ప్రతి వస్తువుపై అతని దృష్టిపడడం సహజం. ఏ పురుషుడు ఏ స్త్రీని, ఏ స్త్రీ కూడా ఏ పురుషుడ్నీ చూడకుండా ఉండడమనేది అసంభవం. అందుకే అకస్మాత్తుగా దృష్టిపడితే తప్పులేదని ధర్మశాస్త్ర విద్వాంసులు పేర్కొన్నారు. అయితే అందాన్ని ఆస్వాదించడానికి మళ్లీ మళ్లీ, గుచ్చి గుచ్చి చూడడం మాత్రం నిషిద్ధం. హజ్రత్ జరీర్ (రజి) ఇలా అంటున్నారు.

عن جریرؓ قال سألت رسول اللهﷺ عن نظر الفجاءة
فقال اصرف بصرک. (ابو دائود، باب مايؤمر به من غض البصر)

**"దైవప్రవక్తా! అకస్మాత్తుగా దృష్టిపడితే (పర స్త్రీ పై) ఏం చేయాలి? అని అడిగాను. దానికాయన 'చూపును మరల్చుకో' అని సెలవిచ్చారు.**
హజ్రత్ బురైదా (రజి) ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త (స) సెలవిచ్చారు.

**عن بريدة قال قال رسول اللهﷺ لعلى يا على لاتتبع النظرة النظرة فان لک الاولىٰ وليس لک الأخرة.** (حوالۂ مذکور)

**"అలీ! ఒక సారి చూసిన తరువాత మళ్లీ చూడకు. తొలిచూపు మాఫ్. అంటే దానికి మన్నింపు ఉందికాని మలిచూపుకు అనుమతి లేదు. ధర్మసమ్మతం కాదు."**

**عن النبىﷺ انه قال من نظر الى محاسن أمرأة اجنبية عن شهوة صُبّ فى عينيه الآنکُ يوم القيٰمة.** (تکملۂ فتح القدير)

**'పరస్త్రీల అందచందాలపై ఎవరైతే దృష్టిపెడతారో, అలాంటి వారి కళ్లలో ప్రళయదినాన సీసం కరిగించి పోయడం జరుగుతుంది.**

***(ఫతహుల్ ఖదీర్)***

అయితే కొన్ని సందర్భాల్లో పరస్త్రీలను చూడడం తప్పనిసరి అవుతుంది. ఉదాహరణకు రోగిని వైద్యుడు చూడవచ్చు. సాక్షి, లేక ప్రతివాదిని న్యాయమూర్తి చూడవచ్చు. స్త్రీ ఏదైనా ప్రమాదంలో చిక్కుకున్నప్పుడు, ప్రాణాపాయ స్థితిలో ఉన్నప్పుడు, చూడడమే కాదు, ఆమెను తాకనూవచ్చు. అవసరమైతే ఆమెను ప్రమాదం నుండి రక్షించే క్రమంలో ఆమెను తాకడం, ఎత్తుకొని రావడం ధర్మ సమ్మతం మాత్రమే కాదు, అది విధి కూడా! అయితే పవిత్ర సంకల్పం, చిత్తశుద్ధి ప్రధానం.

ఇదేవిధంగా వివాహం చేసుకోబోయే ముందు అపరిత స్త్రీని చూడడం, నఖశిఖపర్యంతం పరిశీలించడం అవసరం. అంతేకాదు. హదీసుల్లో కూడా నికాహ్ కోసం చూసుకోవాలని ఆదేశించబడింది. ప్రవక్త (స) స్వయంగా స్త్రీని ఈ ఉద్దేశ్యంతో చూశారు కూడా.

**عن المغيرة ابن شعبةؓ انهٗ خطب امرأةً فقال النّبىّﷺ انظر اليها فانه احرى ان يؤدم بينکما.** (ترمذی، باب ماجاء فی النظر الی المخطوبۃ)

ముగీర బిన్ షఅబ (రజి) ఉల్లేఖనం: ఆయన ఒక స్త్రీకి పెళ్లి సందేశం పంపారు. అప్పుడు దైవప్రవక్త (స) నువ్వామెను ఓసారి చూసుకో. ఎందుకంటే పరస్పరం చూసుకోవడం వల్ల ఇద్దరి మధ్య ప్రేమ, సానుకూలత ఏర్పడుతుంది. అన్నారు. (తిర్మిజి)

**عن سهل بن سعدؓ ان امرأة جاءت الى رسول اللهﷺ فقالت يا رسول الله جئت لاهب لک نفسی، فنظر اليها رسول اللهﷺ فصعد النظر اليها.** (بخاری، باب النظرالی المرأة قبل التزويج)

సహెల్ బిన్ సఅద్ (రజి) కథనం : 'ఒక స్త్రీ దైవప్రవక్త (స) వద్దకు వచ్చి, నేను మిమ్మల్ని వివాహం చేసుకోవాలని వచ్చాను. అని చెప్పింది. అప్పుడు ప్రవక్త (స) తలపైకెత్తి ఆమెను చూశారు. (బుఖారి)

**عن ابی هريرة قال كنت عند النبیﷺ فاتاه رجل فاخبره انه تزوج امرأة من الانصار فقال لهٗ رسول اللهﷺ اَنظرتَ اليها؟ قالَ لا، قال فاذهب فانظر اليها فان فی اعين الانصار شيئًا.** (مسلم، باب ندب مَن ارادنكاح المرأة الی ان ينظر الی وجهها)

హజ్రత్ అబూహురైరా (రజి) ఉల్లేఖనం ఇలా ఉంది : 'ఒకసారి నేను ప్రవక్త (స) సన్నిధిలో కూర్చొని ఉండగా, ఒక వ్యక్తి వచ్చి నేను ఒక అన్సార్ మహిళను నికాహ్ చేసుకోలనుకుంటున్నాను.' అని చెప్పాడు. దానికి ప్రవక్త (స) మరి నువ్వామెను చూశావా? అని ప్రశ్నించారు. అతను చూడలేదని చెప్పాడు. అయితే నువ్వామెను ఓ సారి చూసుకో. అన్సార్ల కళ్లలో సాధారణంగా ఏదో ఒక లోపం ఉంటుంది అన్నారు దైవప్రవక్త (స). (ముస్లిం)

عن جابر بن عبد الله قال قال رسول اللهﷺ اذا خطب احدكم المرأة فان استطاع ان ينظر الى ما يدعوه الى نكاحها فليفعل.(ابوداؤد، باب فی الرجل ينظر الى المرأة وهويريد تزويجها)

**జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం ప్రకారం, దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : "మీలో ఎవరైనా వివాహం చేసుకోదలిస్తే సాధ్యమైనంత వరకు ఆ స్త్రీని చూసుకోవాలి. దీనివల్ల ఆమె పట్ల ప్రేమ, సానుకూలత జనించే అవకాశం ఉంది." (అబూదావూద్)**

మనకు తెలిసేదేమిటంటే, స్త్రీలని చూడకుండా అడ్డుకోవడం ప్రధాన ఉద్దేశ్యం కాదు. ఉపద్రవం లేక చెడు ప్రబలకుండా నివారించడమే అసలు ఉద్దేశ్యం. అందుకే చూడాల్సిన అవసరం గాని సామాజిక ప్రయోజనం గాని లేకుండా, పైగా మనోవికారాలను రెచ్చగొట్టే చూపులు చూడకుండా వారించడం జరిగింది. ఈ ఆదేశాలు పురుషులకు ఏవిధంగా వర్తిస్తాయో, అదే విధంగా స్త్రీలకు కూడా వర్తిస్తాయి. ఒక హదీసులో ఉమ్మెసల్మా (రజి)కథనం ఇలా ఉంది : 'ఒకసారి నేను హజ్రత్ మైమూనా (రజిఅన్‌హా) (మరో హదీసులో ఆయెషా (ర) ప్రస్తావన ఉంది) దైవప్రవక్త (స) వద్ద కూర్చొని ఉన్నాం. అంతలో అంధుడైన ఉమ్మె మక్తూమ్ (రజి) అక్కడకు వచ్చారు. అప్పుడు ప్రవక్త (స) మీరు పరదా పాటించండి అన్నారు. అప్పుడు నేను ఈయన అంధుడు కదా? ఆయన మమ్మల్ని చూడలేరు, గుర్తించలేరు అన్నారు. అప్పుడు దైవప్రవక్త (స) మరి మీరు కూడా గుడ్డివారేనా? మీరతన్ని చూడడం లేదా? అని ఎదురు ప్రశ్నించారు. (తిర్మిజి)

అయితే స్త్రీ పురుషుల్ని చూడడంలో, పురుషుడు స్త్రీలను చూడడంలో మానసికపరమైన ఒక సూక్ష్మబేధం ఉంది. పురుషుని స్వభావంలో పురోగమనం ఉంది. ఒక వస్తువు కంటికి ఇంపుగా కనిపిస్తే అతనికది బాగా నచ్చినట్లయితే, దాన్ని పొందే ప్రయత్నంలో చాలా ఫాస్ట్‌గా ఉంటాడు. కాని స్త్రీ నైజంలో పొగబోతు తనం ఉంది. ఆమెలోని ఈ సహజగుణం నిర్వీర్యం కానంతవరకు ఆమె తాను కోరుకున్న వస్తువును హస్తగతం చేసుకొనే సాహసం చెయ్యజాలదు. ఈ వ్యత్యాసాన్ని దృష్టిలో పెట్టుకొనే ధార్మిక విద్వాంసులు పురుషుల విషయంలో చూపించినంత

కాఠిన్యం స్త్రీల విషయంలో చూపించలేదు. హజ్రత్ ఆయిషా (రజిఅన్హా) ఉల్లేఖించిన ఒక హదీసులో, దైవప్రవక్త (స) ఒక పండుగ సందర్భంలో ఆమెగారికి నీగ్రోల వేడుక చూపించారు. అని ఉంది. దీనివల్ల మనకు తెలిసేదేమిటంటే, స్త్రీలు పురుషుల్ని చూడడం పూర్తిగా నిషిద్ధం కాదుగాని, ఒకేచోట కలిసి కూర్చోవడం రాసుకుపూసుకు తిరగడం, గుచ్చిగుచ్చి చూసుకోవడం అభిలషణీయం కాదు.

హజ్రత్ ఉమ్మె సల్మా (రజి)ను పరదా పాటించమని చెప్పిన అంధ అనుచరుడైన హజ్రత్ ఇబ్నెమఖ్తూం (రజి) విషయంలోనే మరో సందర్భాన దైవప్రవక్త (స), ఆయన ఇంట్లో హజ్రత్ ఫాతిమా బిన్తె ఖైస్ (రజి)ను ఇద్దత్ గడపమని ఆదేశించారు. నిజానికి ఆమె మొదట్లో హజ్రత్ ఉమ్మె షరీక్ (రజి) ఇంట్లో ఇద్దత్ గడపాలనుకున్నట్లు ఖాజీ అబూబక్ర్ బిన్ అరబీ తన అహకాముల్ ఖుర్ఆన్‌లో రాశారు.

కాని దైవప్రవక్త (స) ఆ ఇంట్లో ఇద్దత్ గడపడం గురించి ఫాతిమా (రజి)ను వారిస్తూ, 'ఆ ఇంటికి తరచూ జనం వస్తూ పోతూ ఉంటారు. అందుకని నువ్వు ఇబ్నె మక్తూం ఇంట్లో ఉండు. ఎందుకంటే ఆయన అంధుడు. ఆయన ముందు నీవు పరదా లేకుండా కూడా మసలుకోవచ్చు." అని చెప్పారు.

అంటే ప్రమాద అవకాశాలను గణనీయంగా తగ్గించడమే అసలు ఉద్దేశ్యమని దీని ద్వారా మనకు తెలుస్తోంది. ఎక్కడ ఉంటే ప్రమాద అవకాశాలు ఎక్కువగా ఉంటాయో అక్కడ వారించి, ప్రమాదం లేని చోట ఉండమని ఆదేశించడం జరిగింది. ఎందుకంటే ఎట్టి పరిస్థితిలోనూ ఎక్కడో ఒక చోట ఇద్దత్ గడపడం తప్పనిసరికదా! అయితే అవసరం లేనిచోట ఒక స్త్రీని ఉంచి పరపురుషులతో కలిసి కూర్చోవడం, మాట్లాడడం, పరస్పరం చూసుకోవడం లాంటి అవకాశాలు కల్పించడం ఎందుకు? అందుకే దాన్నుండి నిరోధించడం జరిగింది.

చూపుల్ని కిందికి దించుకోవాలన్న హితోపదేశాల వెనుక ఎంతటి సామాజిక ప్రయోజనం దాగి ఉందో, ఈ ఉపదేశంలో ఎంతటి వివేకం నిండి ఉందో ధార్మిక పరిజ్ఞానం ఉన్న వారెవరికైనా ఇట్టే తెలిసిపోతుంది.

## అలంకరణ - దాని పరిధి

చూపుల్ని కిందికి ఉంచుకోమన్న ఆదేశం స్త్రీ పురుషులిద్దరికీ సమానంగా వర్తిస్తుంది. అయితే కొన్ని ఉపదేశాలు కేవలం స్త్రీలకు మాత్రమే ఉద్దేశించబబడ్డాయి. ఒక పరిధికి మించి అలంకరణలు బయటికి ప్రదర్శించకూడదన్నది అందులో

ఒకటి. ఈ ఆదేశం వివరాల్లోకి వెళ్లేముందు, ఇది వరకే చెప్పుకున్న 'సతర్' విషయాన్ని ఒకసారి మననం చేసుకుంటే మంచిది. ముఖం, తల చేతులు తప్ప మిగతా శరీర భాగమంతా స్త్రీలకి సతర్. తండ్రి, బాబాయి, సోదరుడు, కొడుకు ముందు కూడా ఈ సతర్‌ను బహిర్గతపరచడం ధర్మ సమ్మతం కాదు. అంతేకాదు స్త్రీలముందు కూడా ఈభాగాలు బహిర్గతం కాకుండా జాగ్రత్త పడాలి. ఈ వాస్తవాలు దృష్టిలో ఉంచుకొని అలంకరణ ప్రదర్శనకు సంబంధించిన పరిధిని పరిశీలిద్దాం.

1) స్త్రీలు తమ అలంకరణలను భర్త, తండ్రి, మామగారు, కొడుకులు, సవతి కొడుకులు, సోదరులు, సోదరుల కొడుకుల ముందు బహిర్గత పరచవచ్చు.

2) తమ వద్ద పనిచేసే బానిసల ముందు కూడా అలంకరణ ప్రదర్శించడానికి ఆమెకు అనుమతి ఉంది. (ఇతరుల బానిసల ముందు ప్రదర్శించకూడదు)

3) తమ అధీనంలోని స్త్రీ వాంఛలేని పురుషుల ముందుకూడా అలంకరించుకొని తిరగవచ్చు.

4) పవిత్ర ఖుర్ఆన్‌లో చెప్పినట్లుగా, స్త్రీలు తమ అంతరంగ విషయాలు తెలియని బాలుర ముందు కూడా అలంకరించుకొని ఉండవచ్చు.

5) సహచర స్త్రీల ముందు కూడా స్త్రీలు తమ అలంకరణలను ప్రదర్శించవచ్చు. ఖుర్ఆన్‌లో (నిసా) స్త్రీల ముందు అని అనబడలేదు. (నిసాయిహిన్న) 'తమ స్త్రీలు' అన్న పదం వాడబడింది. అంటే, శీలవతులు, తమ సమీప సహచరులు, బంధువులు, తమకు చెందిన స్త్రీలు అని అర్థం. వీరు తప్ప మిగతా అన్ని రకాల స్త్రీల ముందు అతి చనువు, అలంకరణకు దూరంగా ఉండాలి. ఎందుకంటే వీరు ఏదో ఒకరకంగా ప్రమాదానికి కారణం కావచ్చు. సచ్ఛీలురైన ముస్లిం, ముస్లిమేతర స్త్రీలందరితో సన్నిహితంగా ఉండడం, వారి ముందు అలంకరణలు ప్రదర్శించడం ధర్మ సమ్మతమే.

ఈ విధంగా కొన్ని పరిమితులు ఏర్పరచి స్త్రీ జాతి గౌరవ మర్యాదలకు ఏమాత్రం మచ్చరాకుండా అన్ని చర్యలు చేపట్టడం జరిగింది. ఈ పరిమితులను గురించి ఆలోచిస్తే మనకు రెండు విషయలు అర్థమవుతాయి. ఒకటేమిటంటే, ఏ అలంకరణలైతే ప్రదర్శించవచ్చని అనుమతించడం జరిగిందో దానికి సతర్ మినహాయింపు. అంటే నగలు ధరించడం, అందంగా ముస్తాబవ్వడం, కేశాలను అలంకరించుకోవడం, సుర్మా రాసుకోవడం, పౌడర్లు, పర్ఫ్యూమ్‌లు వాడడం,

ఇంతేకాకుండా, స్త్రీత్వానికి అవసరమైన మరికొన్ని చిట్కాలు స్త్రీలు తమ ఇళ్లలోనే చేసుకుంటారు. ఇవన్ని ధర్మసమ్మతమే.

ఇక రెండవ విషయం ఏమిటంటే, ఎవరెవరి ముందు అలంకరణ ప్రదర్శనకు అవకాశముందో ఆ వివరాలన్నీ మనం ఇంతకు ముందే తెలుసుకున్నాం. వారు తప్ప మిగతా పురుషులందరి ముందు స్త్రీలు తమ అలంకారాలను బహిర్గతం చేయకూడదు. అంతేకాదు, ఉన్న అలంకరణల విషయం బహిర్గతమయ్యేలా వాటిని నేలకేసికొడ్తూ నడవవద్దని ఆదేశించడం జరిగింది. అంటే, అన్ని రకాల అవమానాల నుండి, అపనిందల నుండి, దుష్ట చూపులనుండి, దుర్బుద్ధి కలిగిన దుర్మార్గుల నుండి స్త్రీలను సురక్షితంగా గౌరవప్రదంగా, పవిత్రంగా ఉంచడం అసలు ద్దేశ్యం. ఒకవేళ స్త్రీలు బాగా ముస్తాబై, నిండుగా అలంకరించుకొని దుర్బుద్ధి కలిగిన వారి ముందుకు వచ్చినట్లయితే, వంకర బుద్ధి కలవారికి వెదుకుతున్న తీగకాలికి తగిలినట్టుగా ఉంటుంది. వీరు ఎంత పవిత్ర బుద్ధితో ఉన్నప్పటికీ ఆ దుర్మార్గుల్లో పైశాచిక భావనలు బుసలుకొడతాయి. అయితే, బాగా ముస్తాబై బయటికొచ్చే స్త్రీలంతా మంచివాళ్లు కాదని, అలాంటి పురుషులంతా దుర్మార్గులని ఎవరూ అనరు. కాని అతిగా అలంకరించుకొని, స్త్రీలు నిస్సంకోచంగా పురుషులతో రాసుకుపూసుకు తిరగడం వల్ల అనేక చిన్నా, పెద్దా, మానసిక శారీరక కష్టనష్టాలు సంభవించడం లేదని కూడా ఎవరూ అనలేరు. ఈనాడు యూరప్, అమెరికా దేశాల్లో స్త్రీలు తమ సంపాదన, తమ భర్తల సంపాదనలో చాలా వరకు అలంకరణల కోసమే ఖర్చు చేస్తున్నారట. రోజురోజుకూ ఈ ఖర్చులు పెరిగి వారి ఆర్థిక స్థితి తీవ్రంగాప్రభావిత మవుతోందన్న ఆందోళన వ్యక్తమవుతోంది. 1) ఇటీవలి కాలంలో రసాయన వస్తువుల వాణిజ్య ప్రదర్శన ఒకటి జరిగింది. అందులో పాల్గొన్న నిపుణుల ప్రకారం యూరోపు దేశాల్లో స్త్రీలు తమ అలంకరణల కోసం రెండు కోట్ల పౌండ్లు, అమెరికా స్త్రీలు పన్నెండున కోట్ల పౌండ్లు సాలీనా ఖర్చు చేస్తున్నారు. దాదాపు 90 శాతం మంది స్త్రీలు ఏదో ఒక విధంగా మేకప్‌కు అలవాటు పడినవాళ్లే. బజార్లు కార్యాలయాలు, సభలు, సమావేశాలకు అందంగా అలంకరించుకొని, ముస్తాబై వచ్చే స్త్రీలకు ఘనస్వాగతం పలుకుతున్న వారు ప్రేరేపిస్తున్న ఉన్మాదం కాదా ఇది? మహిళల్లో ఇంతటి అలంకార కాంక్ష పెరగడానికి, సునామీలా విజృంభించడానికి కారణం ఏమిటి? పురుషుల ప్రశంసలు పొందడం, వాళ్ల దృష్టిలో నిలిచిపోవడమేనా!

ఇదంతా ఏమిటి? అమాయకత్వమా? కాదు, వారి మనసు మూలల్లో దాగిన విశృంఖల వాంఛలు సహజ స్వభావ పరిధిని అతిక్రమించి విస్తరించాలను కుంటున్నాయి. ఈ కోరికలు తీర్చడానికి మరో వైపు కూడా అలాంటి వాంఛలే సిద్ధంగా ఉన్నాయి. మీరు స్వేచ్ఛా ప్రియులు. ఏమైనా మాట్లాడవచ్చు. ఏమైనా చేయవచ్చు. కాని వాస్తవాలను తిరస్కరించకండి. ఎందుకంటే ఇవి గోప్యంగా లేవు. మన కళ్లముందున్నాయి.. సూర్యునికంటే ప్రకాశవంతమైన ఫలితాల రూపంలో ఉన్నాయి. వీటిని మీరు ఆలోచితంగానో, అనాలోచితంగానో అంగీకరిస్తారు. కాని ఇస్లాం దాన్ని ప్రారంభంలో అడ్డుకోవాలను కుంటుంది. చూస్తుంది. ఎందుకంటే దాని దృష్టి అమాయకంగా ఉనికిలోకొచ్చే అలంకార ప్రదర్శనపై లేదు. సమాజాన్ని ప్రళయ భయంకర తిమిరంలోకి నెట్టడానికి ఉద్దేశపూర్వకంగా విస్తరించే ఫలితాల పైనే ఉంది. అపరిచితుల ముందు అలంకారాన్ని ప్రదర్శిస్తూ తిరిగే స్త్రీలు, కళా విహీనంగా, ప్రళయ దినం నాటి తిమిరంలా ఉంటారు. (తిర్మిజి)

పవిత్ర ఖుర్‌ఆన్‌లో, అపరిచితుల ముందు అలంకార ప్రదర్శన చేయవద్దని వారించబడిన చోటే, వాటంతట అవే కనబడేవైతే ఎలాంటి తప్పులేదు. అని కూడా ఉంది. (ఇల్లా మా జహరమిన్‌హా) ప్రజలు ఈ వెసులుబాటును ఆధారంగా చూపి ప్రయోజనం పొందే ప్రయత్నం చేశారు. కాని ఇబ్బంది ఏమొచ్చిందంటే దీనిద్వారా అనుకున్నంత లాభం పొందే అవకాశం లేకుండా పోయింది. 'మీరు ఉద్దేశ్యపూర్వ కంగా మీ అలంకరణను ఇతరుల ముందు బహిర్గతం చేయకండి.' అని మాత్రమే ధర్మం చెబుతోంది. అయితే దానంతట అదే బయటపడేది, తప్పనిసరిగా తమ ప్రమేయం లేకుండా బయల్పడేదైతే దానికి మీ బాధ్యత లేదు. అంటే విషయం చాలా స్పష్టంగా అర్థమవుతోంది. అలంకరణను ప్రదర్శించడం ఉద్దేశ్యం కాకూడదు. అందాన్ని ఇతరులకు చూపించడం, అదీ వీలుకాకపోతే దాగి ఉన్న ఆభరణాల ధ్వని ద్వారా ఇతరుల దృష్టిని ఆకర్షించడం మీ ఉద్దేశ్యం ఎంతమాత్రం కాకూడదు.ఎట్టి పరిస్థితిలోనూ మీలో అలంకరణను దాచుకొనే భావన మాత్రమే ఉండాలి. అయినప్పటికీ మీ ప్రమేయ లేకుండా, అప్రయత్నంగా ఏదైనా అలంకార ప్రదర్శన జరిగితే దైవం దాన్ని గురించి మిమ్మల్ని ప్రశ్నించడు. మీరు ఏ వస్త్రాల్లో మీ అందాన్ని దాచుకుంటారో అవి ఎలాగూ బహిర్గతం కాకుండా ఉండవు. మీ ఒడ్డూ పొడుగూ దుస్తుల ద్వారా తెలిసిపోతుంది. ఏదో ఒక సందర్భంలో ముఖం, చేతులు తదితర అవయవాలను బహిర్గతం చేయడం తప్పనిసరి అవుతుంది. ఇందులో ఏమాత్రం

తప్పులేదు. ఎందుకంటే మీ ఉద్దేశ్యం బహిర్గతం చేయడం కాదు కాబట్టి. ఇలాంటి సందర్భాల్లో కూడా ఎవరైనా నీచుడు వక్రదృష్టితో చూస్తే చూడనీయండి. వాడి దుష్ట బుద్ధికి తగిన శిక్ష వాడు తప్పకుండా అనుభవిస్తాడు. విలువల కోసం, సమాజం కోసం మీపై మోపబడిన బాధ్యతలను మీరు సాధ్యమైనంత మేర నిర్వర్తించారు. ఇందులో మీ తప్పు ఎంతమాత్రం లేదు. ఇదీ పవిత్ర ఖుర్‌ఆన్‌లోని వాక్యాల అసలు భావం. ఈ విషయంలో వ్యాఖ్యాతల మధ్య ఉన్న భిన్నాభిప్రాయాలను గమనించినట్లయితే, ఎన్ని అభిప్రాయ బేధాలున్నప్పటికీ మేము చెప్పిన భావమే సరైనదని రుజువవుతోంది.

ఇబ్నె మస్‌ఊద్, ఇబ్రాహీం నఖ్‌యీా, హసన్ బస్రీల దృష్టిలో బాహ్య అలంకరణ అంటే అంతరంగ సౌందర్యాన్ని దాచే వస్త్రాలు అని అర్థం. ఉదాహరణకు బురఖా, దుప్పటి వగైరా.

ఇబ్నె అబ్బాస్, ముజాహిద్, ఇబ్నె ఉమర్, అనస్, జహాక్, సయీాద్ బిన్ జబీర్, ఔజాయీా,తోపాటు హనఫీలందరి దృష్టిలో చేతులు, ముఖం అని అర్థం, దీంతోపాటు వీటికి ఉపయోగించబడే వస్తువులన్నీ దీని పరిధిలోకే వస్తాయి. ఉదాహరణకు ఉంగరాలు, కళ్ల కాటుక, సుర్మా వగైరా.

సయీాద్ బిన్ అల్ ముసయ్యిబ్ దృష్టిలో కేవలం ముఖం మాత్రమే మినహాయింపు. హసన్ బస్రీగారి ఒక ఉల్లేఖనం కూడా దీన్ని సమర్థిస్తోంది.

హజ్రత్ ఆయిషా (రజి) మాత్రం ముఖం దాచడం వైపే మొగ్గుచూపారు. ఆమె దృష్టిలో బాహ్య అలంకరణ అంటే చేతులు, చేతిగాజులు, కంకణాలు (కడియాలు) ఉంగరాలు అని అర్థం.

మస్ ఊద్ బిన్ మఖ్‌రమ, ఖతాదా గార్లు అలంకరణతో సహా చేతుల్ని ప్రదర్శించే అనుమతినిచ్చారు. కాని ముఖం విషయంలో మాత్రం వారు ముఖమంతా కాకుండా కళ్ల వరకే అనుమతించారు.

ఈ భిన్నాభిప్రాయాలను గురించి ఆలోచించండి. వ్యాఖ్యాతలందరూ 'ఇల్లా మాజహరమిన్‌హా'ను 'దానంతటదే ప్రదర్శితమయ్యే అలంకరణ, లేక అవసరార్థం బహిర్గతం చేయాల్సివస్తే, చేయడానికి అల్లాహ్ అనుమతించాడు.' అని అర్థం

చేసుకున్నారు. ముఖాన్ని , చేతుల్ని ప్రదర్శించడం, వాటిని ఇతరులు చూసేలా చేయడం వీరిలో ఏ ఒక్కరి ఉద్దేశ్యమూ కాదు. ప్రతి ఒక్కరూ తమ పరిజ్ఞానం, మహిళల అవసరాలను దృష్టిలో ఉంచుకొని ఏ అవసరం మేరకు, దేన్ని ఎంతవరకు బహిర్గతం చేయవచ్చో, లేక ఏ వస్తువు దానంత అదే బహిర్గతమవుతుందో, లేక సాధారణంగా కనబడుతుందో, దాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నించారు. మేము ఏమంటున్నామంటే, 'ఇల్లా మా జహర మిన్‌హా'ను ఇందులో దేనిలోనూ ముడి పెట్టకూడదు. అల్లాహ్, ఆయన ప్రవక్త ఆదేశాలను మనస్ఫూర్తిగా ఆచరించాలన్న తపన కలిగిన ముస్లిం మహిల, ఉపద్రవాల్లో మునిగిపోవడం ఏమాత్రం ఇష్టం లేని స్త్రీ, తన పరిస్థితులు తన అవసరాల ప్రకారం నిర్ణయాలు తీసుకోగలుగుతుంది. ముఖంపై ముసుగు ఉంచుకోవాలా? తొలగించాలా? ఎప్పుడు తీసేయాలి, ఎప్పుడు ఉంచుకోవాలి? ఏమేరకు తొలగించాలి? ఏ మేరకు కప్పి ఉంచుకోవాలి? అన్నది ఆమె స్వతహాగా నిర్ణయించుకోగలుగుతుంది. ఈ విషయంలో ధర్మశాస్త్ర మార్గదర్శకానికి అనుగుణంగా, తమ పరిధులు, అవసరాలను దృష్టిలో ఉంచుకొని స్వతహాగా స్త్రీలే నిర్ణయాలు తీసుకోవాలి గాని, 'ఇలాగే ఉండాలి' అని ఎవరూ ఆంక్షలు విధించలేరు. స్త్రీలు తమ అవసరాలనిమిత్తం బయటికి వెళ్లి పనులు చేసుకోవాల్సిన అగత్యం ఏర్పడినప్పుడు చేతులను, ముఖాన్ని దాచి ఉంచడం సాధ్యం కాదు. అవసరాలకనుగుణంగా ఇలాంటి స్త్రీలకు అనుమతి ఉంది. ఇలాంటి అవసరం లేనివారు మాత్రం కావాలని చేతులు, ముఖం బయటికి ప్రదర్శించడం సరికాదు.

అంటే, కేవలం తమ అందాన్ని ప్రదర్శించడానికి ముఖంపై వస్త్రాన్ని తొలగించడం తప్పు అన్నదే ధర్మ శాస్త్ర ఉద్దేశ్యం. దానంత అదే లేక యాదృచ్ఛికంగా బహిర్గతమైతే తప్పులేదు. అంతేకాక ఏదైనా అవసరం ఏర్పడితే ముఖంపైని వస్త్రాన్ని తొలగించడం ధర్మసమ్మతం కూడా. ఇక, ఈ భిన్నాభిప్రాయాలను పక్కనబెడితే అసలు ముఖానికి సంబంధించిన స్పష్టమైన ఆదేశం ఏమిటన్నది ప్రశ్న. ముఖం చూపించడానికి ధర్మశాస్త్రం సమ్మతిస్తుందా, లేదా? అవసరానికనుగుణంగా ముఖాన్ని బహిర్గతపరిచే అనుమతి ఇవ్వబడిందా? లేక, అపరిచితుల ముందు ముఖాన్ని దాచవలసిన అవసరమే లేదా? ఈ ప్రశ్నలకు సూరె అహ్‌జాబ్‌లో సమాధానం దొరుకుతుంది.

**ముఖానికి సంబంధించిన ఆదేశం**

పైన పేర్కొన్న అహ్‌జాబ్ సూరాలోని ఆయతులు ఇవి :

يٰٓاَيُّهَا النَّبِيُّ قُلْ لِّاَزْوَاجِكَ وَبَنٰتِكَ وَنِسَآءِ الْمُؤْمِنِيْنَ يُدْنِيْنَ عَلَيْهِنَّ مِنْ جَلَابِيْبِهِنَّ ؕ ذٰلِكَ اَدْنٰٓى اَنْ يُّعْرَفْنَ فَلَا يُؤْذَيْنَ ؕ (الاحزاب:۵۹)

**'ప్రవక్తా! నీ భార్యలకూ, నీ కూతుళ్లకూ, విశ్వాసుల యొక్క స్త్రీలకూ తమ దుప్పట్ల కొంగులను తమపై వ్రేలాడతీసుకోమని చెప్పు; వారు గుర్తింపబడటానికీ, వేధింపబడకుండా ఉండేందుకూ ఇది ఎంతో సముచితమైన పద్ధతి. అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను.'**

***(అల్ అహ్‌జాబ్ 33 : 59)***

ఈ ఆయత్ ప్రత్యేకించి ముఖాలను దాయమనే చెబుతోంది. మూలంలో 'జలాబీబ్' అన్న పదం వచ్చింది. 'ఫీల్‌బాబ్'కు బహువచనం జలాబీబ్. దీనర్థం దుప్పటి అని వస్తుంది. 'అద్‌నా' అంటే 'వేలాడదీయడం' అనివస్తుంది. 'యుద్‌నీన అలైహిన్నమిన్ జలాబీ బిహిన్న' అంటే శాబ్దిక అర్థం 'తమపై తమ దుప్పట్ల కొంగులను వేళ్లాడదీయండి.' అని వస్తుంది. మేలి ముసుగు ధరించడమన్నా అర్థం ఇదే. అయితే అసలు ఉద్దేశ్యం సాధారణ భాషలో ముసుగు అని దేన్నంటామో అది మాత్రంకాదు. ముఖాన్ని దాచడం మాత్రమే అసలు ఉద్దేశ్యం. ముసుగా, నిఖాబా, లేక మరొక విధానమా అన్నది ప్రధానం కాదు. ముఖాన్ని దాచడమే అసలు ఉద్దేశ్యం. దీనివల్ల ప్రయోజనం ఏమిటంటే విశ్వాసులైన స్త్రీలు ఈ విధంగా మేలిముసుగు ధరించి బయటికి వెళ్లినప్పుడు, వీరు గౌరవనీయులైనవారిని, నిస్సిగ్గుగా తిరిగే వారు ఎంత మాత్రం కాదని ప్రజలకు ఇట్టే తెలిసిపోతుంది. తద్వారా ఎవరూ వారివైపు కన్నెత్తి చూసే సాహసం చేయలేరు.

ఖుర్‌ఆన్ వ్యాఖ్యాతలందరూ ఈ ఆయతుకు ఏకకంఠంతో ఇదే భాష్యం చెప్పారు. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) తన వ్యాఖ్యానంలో ఇలా అన్నారు. 'దైవం ముస్లిం స్త్రీలకు వారు ఏదైనా అవసరం నిమిత్తం బయటికి వెళ్లవలసివస్తే తలపైనుండి తమ దుప్పట్ల కొంగులను ముఖాలపై వేసుకోవాలని ఆదేశించారు. (తఫ్సీర్ ఇబ్నె జరీర్ 22వ అధ్యాయం 29వ పేజి)

ఇమాం ముహమ్మద్ బిన్ సిరైన్, హజ్రత్ ఉబైదా బిన్ సుఫ్యాన్ అల్‌హారిసీ సుల్ హజ్రమీ గారిని, ఈ ఆదేశాన్ని ఆచరించడమెలా? అని ప్రశ్నించారు. అప్పుడాయన స్వయంగా దుప్పటి కప్పుకొని ఒక్క కన్ను తప్ప నుదురు, ముక్కు, మరో కన్నును కప్పి వేశారు. (తఫ్సీర్ ఇబ్నె జరీర్ మజ్కూర్ ఆధారం అహ్కాముల్ ఖుర్ఆన్ 356 అధ్యాయం 457వ పేజి)

ఈ ఆయతును వ్యాఖ్యానిస్తూ అల్లమా ఇబ్నె జరీర్ తిబ్రీ ఇలా రాస్తున్నారు:

ప్రవక్తా! నీ భార్యలు, కుమార్తెలు, ఇతర విశ్వసించిన స్త్రీలు ఏదైనా పని నిమిత్తం ఇంట్లోంచి బయటికి వెళితే తల, ముఖం కనబడే విధంగా బానిస వస్త్రాల్లాంటివి ధరించవద్దని చెప్పు. వారు తమపై నుండి తమ దుప్పట్ల కొంగులు కప్పుకోవాలి. తద్వారా వారు గౌరవప్రదమైన వారుగా గుర్తించబడతారు. పోకిరి వెధవలెవ్వరూ వాళ్ల జోలికి రారు.' (తఫ్సీర్ ఇబ్నెజరీర్ మజ్కూర్ ఆధారం)

అల్లమా అబూబక్ర్ జస్సాస్ ఇలా రాశారు :

యుక్త వయసు మహిళ అపరిచితుల నుండి తన ముఖాన్ని దాచుకోవాలి. ఇంటినుండి బయటికి వెళ్లేటప్పుడు పరదా ధరించి పవిత్రతను ప్రదర్శించాలి. దీనివల్ల దుష్ట సంకల్పం కలవాళ్లు ఆమెపట్ల ఆశలు పెట్టుకోరు. ఈ ఆయతు ఈ విషయాన్నే రుజువు చేస్తోంది. (అహ్కాముల్ ఖుర్ఆన్ 3వ అధ్యాయం 458వ పేజీ)

అల్లామ నేషాపూరీ తన వ్యాఖ్యాన గ్రంథం గరాయెలుల్ ఖుర్ఆన్‌లో ఇలా రాశారు :-

ఇస్లాం ప్రారంభకాలంలో స్త్రీలు అజ్ఞాన కాలం వారిలాగా చొక్కా దుప్పటి ధరంచి బయలు దేరేవారు. కులీన స్త్రీల వస్త్రధారణ కూడా నిమ్న వర్గం స్త్రీల వస్త్రధారణకు భిన్నంగా ఉండేది కాదు. అప్పుడు వారిని దుప్పట్లను కప్పుకొని తల, ముఖం దాచుకొమ్మని ఆదేశించడం జరిగింది. తద్వారా వీరు గౌరవప్రదమైన స్త్రీలని, బజారు స్త్రీలు కాదని ప్రజలు గుర్తించగలుగుతారు. (తఫ్సీర్ గరాయిబుల్ ఖుర్ఆన్. ఇబ్నె జరీర్ వ్యాఖ్యానం 22వ అధ్యాయం 32వ పేజీ)

ఇమాం రాజీ ఇలా రాశారు :

అజ్ఞాన కాలంలో కులీన స్త్రీలు, బానిసలు పరదా లేకుండానే తిరిగేవారు. దుర్మార్గులు వారి వెనుకబడేవారు. అప్పుడు దైవం గౌరవం కోరుకునే స్త్రీలు దుప్పట్లు

కప్పుకోవాలని ఆదేశించాడు. జాలిక అద్నా... అని ఏదైతే చెప్పబడిందో, దీనికి రెండర్థాలు ఉండే అవకాశముంది. 1) ఆ వస్త్రధారణ ద్వారా వారు గౌరవప్రదమైె స్త్రీ లని గుర్తించబడి, వేధింపులకు దూరంగా ఉంటారు. 2) దీనిద్వారా వీరు చెడ్డవారు కాదు అని తెలిసిపోతుంది. ఎందుకంటే ఏ స్త్రీ అయితే ముఖం దాచుకుంటుందో, (పర పురుషుల దృష్టిపడకుండా) ఆమె దుర్నడత కలిగినది కాజాలదు. 1 ఫుట్‌నోట్ రాయాలి. 225 వ పేజీ..

నిండు వస్త్రధారణతో, పరదా పాటించే స్త్రీలపై ఎలాంటి దుర్మార్గులైనా ఆశలు పెట్టుకోరు.

ఖాజీ బైజావీ ఇలా రాస్తున్నారు :-

'యుద్‌నీన అలైహిన్న మిన్ జలాబీహిన్న..' అంటే, వారు తమ అవసరాల నిమిత్తం బయటికి వెళ్లినప్పుడు వారు తమ దుప్పట్లను ముఖాలపై మరియు శరీరంపై కప్పుకోవాలి. ఇక్కడ 'మిన్' అన్న పదం కోసం వాడబడింది. అంటే దుప్పటికి చెందిన ఒక భాగాన్ని ముఖంపై వేసుకోవాలి. మరో భాగంలో శరీరం కప్పుకోవాలి. అని అర్థం. జాలిక అద్నా అంయ్యు'రఫ్న. అంటే దీనివల్ల మంచివారు చెడ్డవారు మధ్య వ్యత్యాసం తేటతెల్లమవుతుంది అని అర్థం. ఫలాయుజైన్. దుర్నడత కలిగిన వారు వారిని వేధించడానికి సాహసించలేరు. (తఫ్సీర్ బైజావీ 4వ అధ్యాయం 168వ పేజీ)

దీనివల్ల మనకు స్పష్టంగా అర్థమయ్యేదేమిటంటే, ప్రవక్త అనుచరుల కాలం నుండి 8వ శతాబ్దం వరకు ఈ ఆయతుకు ఈ విధంగానే అర్థం చేసుకున్నారు. తరువాత మనం హదీసులపై దృష్టి సారించినట్లయితే ఈ ఆయతు అవతరించిన తరువాత ప్రవక్త కాలంలో సాధారణంగా ముస్లిం స్త్రీలు తమ ముఖాలపై నిఖాబ్ వేసుకోవడం ప్రారంభించారు. ముఖాన్ని కప్పుకోకుండా తిరిగే ఆనవాయితీ ఆగిపోయింది. అబూదావూద్, తిర్మిజీ, మూతా ఇంకా ఇతర హదీసు గ్రంథాల్లో ఇలా ఉంది. ప్రవక్త మహనీయులు, స్త్రీలు ఇహ్రాం స్థితిలో స్త్రీలు ముఖంపై నిఖాబ్ వేసుకోవద్దని, చేతులకు గ్లౌజులు తొడగవద్దని వారించారు. దీనివల్ల స్పష్టంగా రుజువయ్యేదేమిటంటే, ప్రవక్త కాలంలో ముఖానికి ముసుగు ధరించడం, చేతులకు గ్లౌజులు వేసుకోవడం సాధారణమైపోయింది. కాని కేవలం ఇహ్రాం సమయంలో

వేసుకోవద్దని వారించడం జరిగింది. అయితే హజ్ సందర్భంలో ముఖాలను అందరిముందూ ప్రదర్శిస్తూ తిరగమని అర్థం కాదు. అసలు విషయం ఏమిటంటే, ఇహ్రాంలాంటి ఒకానొక దీన స్థితిలో నిఖాబ్ సాధారణ సమయంలోలాగా స్త్రీల వస్త్రధారణలో ఒక భాగం కాకూడదన్నది అసలు ఉద్దేశ్యం. ఎందుకంటే ఇతర హదీసుల్లో, ఇహ్రాం స్థితిలో కూడా ప్రవక్త భర్యలు, ఇతర ముస్లిం స్త్రీలు అపరిచితులకు తమ ముఖాలు కనబడకుండా నిఖాబ్ వేసుకునేవారు. అబూదావూద్‌లో ఇలా ఉంది.

**عن عائشة قالت كان الركبان يمرون بناونحن مع رسول الله ﷺ محرمات فاذا حاذوا بنا سدلت احدانا جلبابها من رأسها على وجهها فاذا جاوزونا كشفناه.** (باب فی المحرمة تغطی وجهها)

హజ్రత్ ఆయిషా (ర.అన్హా) ఇలా అంటున్నారు : మేము దైవప్రవక్త (సఅసం) వెంట ఇహ్రాం స్థితిలో ఉన్నప్పుడు వాహనదారులు మా సమీపాన్నుండి వెళ్లేవారు. వారు ఎదురు పడినప్పుడు మేము మా దుప్పట్లను తలపై నుండి ముఖాలపై వేసుకొనేవాళ్లం. వారు దాటిపోగానే మళ్లీ తీసేసే వాళ్లం.

మూతా ఇమాం మాలిక్‌లో ఇలా ఉంది :-

**عن فاطمة بنت المنذر قالت كنا نخمر وجوهنا و نحن محرمات ونحن مع اسماء بنت ابی بكر الصديقؓ فلا تنكره علينا.** (باب تخمير المحرم وجهه)

ఫాతిమా బిన్తె మన్జర్ (ర) కథనం : మేము ఇహ్రాం స్థితిలో ముఖాలపై వస్త్రం కప్పుకునే వాళ్లం. మా వెంట హజ్రత్ అబూబక్ర్ (ర) కూతరు హజ్రత్ అస్మా (రజి) ఉన్నారు. అయినా ఆమె మమ్మల్ని కప్పుకోవద్దని వారించలేదు.' ఫతహుల్ బారీ, హజ్ అధ్యాయంలో హజ్రత్ ఆయిషా (దిజి) గారి ఒక ఉల్లేఖనం ఇలా ఉంది :-

"స్త్రీలు ఇహ్రాం స్థితిలో తమ దుప్పటిని తలపైనుండి ముఖంపై వేళ్లాడదీసుకోవాలి.'

## నిఖాబ్

పవిత్ర ఖుర్‌ఆన్ వాక్యాలు, వాటి సార్వజనీనత, అనేక మంది వ్యాఖ్యాతల ఏకాభిప్రాయం, ప్రవక్త కాలం నుండీ ఆచరణ- ఇవన్నీ చూసిన తరువాత, ధర్మశాస్త్రంలో ఉన్నటువంటి, అపరిచితులకు కనబడకుండా స్త్రీలు తమ ముఖాన్ని కప్పుకోవాలన్న ఆదేశం, ప్రవక్త కాలంలో ఇది ఆచరణలో ఉండేదన్న వాస్తవాన్ని ఎవరూ తిరస్కరించే సాహసం చేయలేరు. 'నఖాబ్' అన్న పదం లేకపోయినా భావ పరంగా ఖుర్‌ఆన్ గ్రంథమే దీన్ని ప్రతిపాదించింది. ఏ మహావ్యక్తిపై పవిత్ర ఖుర్‌ఆన్ అవతరించిందో, ఆయన గారి కళ్ళముందు ముస్లిం స్త్రీలు నఖాబ్‌ను తమ వస్త్ర ధారణలో తప్పనిసరి భాగంగా చేసుకున్నారు. ఆ కాలంలో కూడా దానిపేరు 'నఖాబ్'గానే ఉండేది.

ఇదే ని'ఖాబ్' ను యూరప్ అత్యంత ప్రమాదకరమైదిగా భావిస్తోంది. నిఖాబ్ ఆలోచనే యూరోపియన్ల గుండెలపై కుంపటిగా పరిణమిస్తోంది. దీన్ని దుర్మార్గానికి దౌర్జన్యానికి ప్రతీకగా భావించడం జరుగుతోంది. తూరుపు దేశాల వెనుకబాటుకు, అజ్ఞానానికి కారణం ఏదైనా ఉందంటే అది పరదాయే అని కూడా దుర్మార్గంగా అనేస్తారు. పశ్చిమ దేశాల ప్రగతి విషయానికి వస్తే ఏమాత్రం ఇంగితం లేకుండా పరదాను త్యజించడమేనని బొంకుతారు. అయితే ఇది ఈనాటిది కాదని, స్వయంగా ఖుర్‌ఆనే ప్రతిపాదించిన, ప్రవక్తల ప్రారంభించాలని విధానమని అర్థమైన తరువాత సిగ్గుతో తలదించుకోవడం తప్ప మాట్లాడడానికి ఇంకేమీ ఉండదు. కేవలం సిగ్గుతో చితికిపోతే సరిపోదు. వేటగాడి బారి నుండి తప్పించుకోడానికి నిప్పుకోడి ఇసుకలో తలదాచుకున్నంత మాత్రాన, వేటగాడి ఉనికి లేకుండా పోదు. మీరు కూడా తలదించుకుంటే, తప్పకుండా మీ తలే వంగిపోతుంది. కాని, ఖుర్‌ఆన్ వాక్యాలు మాత్రం సమసిపోవు. చరిత్ర వాస్తవాలు మరుగున పడిపోవు. అసత్య వాదనలతో తప్పుడు విధానాలతో వాస్తవాలపై పరదా కప్పుదామనుకుంటే సిగ్గుతో బొప్పికట్టిన మచ్చ మరింత వికృతంగా తేటతెల్లమవుతుంది. పాశ్చాత్య వాదాన్ని విశ్వసించి, దాన్ని సిగ్గుతో తలదించుకోవాల్సిన విషయం' అని కూడా ఒప్పుకున్న తరువాత, ఇక ఒకే ఒక్క మార్గముంది. అదేమిటంటే, పరదా, నిఖాబ్, లాంటి నిండైన వస్త్రధారణవైపు మార్గదర్శన చేసే ఇస్లాంకు వీడ్కోలు పలకడమే. మీరు ప్రగతిని కోరుకునే నాగరికులు కదా! అంగాంగ ప్రదర్శనకు అనుమతినివ్వని సంస్కృతి మీకెలా సమ్మతమవుతోంది? సిగ్గు సౌశీలం నైతికత పవిత్రతలను బోధించే, ఇల్లాలిగా

గౌరవ స్థానంలో, ఇంటి మహారాణిగా ఔన్నత్య స్థానంలో ఉండే స్త్రీని ప్రతి ఒక్కరికీ కనువిందు చేసే అంగడి బొమ్మగా అంగీకరించని ధర్మం మీకెలా అంగీకారయోగ్య మవుతుంది? ఇలాంటి మత ధర్మంలో మీకు ప్రగతి ఎక్కడ కనబడుతుంది? ఇలాంటి ధర్మానికి నాగరికతతో పనేంటి? ప్రగతికి, నాగరిక వికాసానికి స్త్రీ కాదుకాదు మేడం గారు బయటికి బయల్దేరే ముందు నఖశిఖ పర్యంతం రకరకాల క్రీములతో, సుగంధ ద్రవ్యాలతో, పెర్‌ఫ్యూమ్, లిప్‌స్టిక్‌లతో అన్ని విధాలుగా గంటల తరబడి అలంకరించుకొని, అన్ని రకాలుగా, ఆకర్షణీయంగా ముస్తాబై బయటికి రావాలి. అవసరమైతే సింగార సామాగ్రి వెంట తెచ్చుకొని అరగంటకోసారి మేకప్‌ను ద్విగుణీకృతం చేసుకోవాలి. ఈ విధంగా సింగార సామ్రాజ్ఞి బయలుదేరితే అందరికళ్లూ ఆమెవైపే.

మేము ఇంతకు ముందే విన్నవించినట్లు, ఇస్లాం, పాశ్చాత్య నాగరికతల మధ్య భూమ్యాకాశాలంత వ్యత్యాసం ఉంది. పాశ్చాత్య దృష్టితో ఇస్లాం ఆజ్ఞలను చూసేవాడు, పూర్తి తప్పుడు విధానంలో ఉన్నాడు. పాశ్చాత్య సమాజంలో భౌతిక ప్రధాన విషయాలు ప్రామాణికమైతే, ఇస్లాం ప్రమాణాలు దానికి పూర్తి భిన్నంగా ఉంటాయి. ఇస్లాం ఏ విషయాలకు ప్రాధాన్యతనిస్తుందో పాశ్చాత్యులు వాటికసలు విలువే ఇవ్వరు. పాశ్చాత్య భావజాలానికి అనుగుణంగా ఉన్నవారికి ఇస్లాంలోని ప్రతి విషయం లోపభూయిష్టంగానే కనబడుతుంది. ఇస్లాం ఆదేశాలను సానుకూల దృష్టితో చూడాలనుకొని కూడా ప్రతికూలతవైపే మొగ్గుచూపుతాడు. ప్రతికూలంగా స్పందించి కూడా వాటిని ఆచరణలో పెట్టలేక పోతారు. ఎందుకంటే ఖుర్‌ఆన్ సున్నత్‌ల స్పష్టమైన వివరణలు అడుగడుగునా అతనికి అవరోధంగా నిలుస్తాయి. ఇలాంటి వారు ఆచరణాత్మక విధానాలపై దృష్టిసారించే ముందు, ఏ లక్ష్య సాధనకు వాటిని అవలంబిస్తున్నారో, దానికవి ఎంతవరకు స్వీకారయోగ్యమో చూసుకోవాలి. ఒకవేళ అవి లక్ష్య సాధనకు అనుకూలంగా లేకపోతే, వాటిని గురించి వాదించడం, చర్చించడం లాంటి అనవసర శ్రమ ఎందుకు? దానికి బదులు ఏ లక్ష్యాన్నైతే వారు తప్పుగా భావిస్తున్నారో, అసలా మతాన్నే వదిలేస్తే సరిపోతుంది గదా. ఒకవేళ దాని లక్ష్యాల పట్ల సదభిప్రాయం ఉన్నట్లయితే దాని కోసం ప్రతిపాదించబడిన ఆచరణాత్మక విధానాలపై మాత్రమే వివాదం ఉంటుంది. అంటే అది సరైనదా కాదా? అన్న విషయంపై దీన్ని సునాయాసంగానే పరిష్కరించుకోవచ్చు. కాని ఈ పద్ధతి కేవలం సజ్జనులు మాత్రమే అవలంబించగలరు. ఇక మిగిలింది కపటు

(మునాఫిక్)లు వీరు దైవ సృష్టితాలన్నింటిలో అత్యంత నీచులు. నోటితో ఒకటి చెప్పడం కడుపులో మరొకటి ఉంచుకోవడం వారి నైజం. ఒక విషయాన్ని విశ్వసిస్తున్నామని ప్రకటించి, దానికి విరుద్ధంగా ఆచరించడం వారి స్వభావం.

నఖాబ్, బుర్ఖాల విషయంలో జరిగే చర్చలు, నడిచే వివాదాలన్నీ ఈ కాపట్యంపైన్నే ఆధారపడి ఉన్నాయి. పరదా విధానం ఇస్లాంకు పూర్వం అజ్ఞాన కాలం నాటిదని ఆనాటి అజ్ఞాన జాతుల వారసత్వం. ప్రవక్త కాలం తరువాత చాలా కాలానికి ముస్లిముల్లో వ్యాపించిందని నిరూపించడానికి బలమైన ప్రయత్నాలు జరిగాయి. స్పష్టమైన ఖుర్ఆన్ ఆయతు, ప్రవక్త కాలం నాటి ఆచరణాత్మక విధానాలు, ప్రవక్త అనుచరుల తరువాతి తాబయీన్ల భాష్యాలకు భిన్నంగా చరిత్ర పేరుతో నిజాలకు మసిబూసే శ్రమ ఎందుకో అర్థం కాదు.

ఎవరైతే ఇస్లామీయ చట్టాల ఉద్దేశ్యాన్ని అర్థం చేసుకుంటారో, వాటిపట్ల కనీస పరిజ్ఞానమైనా (Common Sense) కలిగి ఉంటారో, అలాంటి వారు, స్త్రీల ముఖంపై వస్త్రం లేకుండా బహిరంగంగా తిరగడం ఇస్లామీయ చట్టాల ఉద్దేశ్యానికి విరుద్ధమన్న విషయాన్ని సునాయాసంగా అర్థం చేసుకోగలరు. ఒక మనిషిని మరొకరు ఆకర్షించడంలో ప్రధాన పాత్రపోషించేది ముఖమే. మానవుడి జన్మ సౌందర్యం, మరోరకంగా చెప్పాలంటే మానవుల అందాన్ని బహిరంగంగా ప్రదర్శించేది ముఖమే. అన్నిటికన్నా ఎక్కువగా దృష్టిని ఆకర్షించేది అదే. లైంగిక భావోద్రేకాలను ప్రేరేపించేది, అణిచివేసేది ముఖమే. ఈ విషయాన్ని తెలుసుకోడానికి సైకాలజీ చదవాల్సిన అవసరం లేదు. మనసులోకి తొంగిచూసుకుంటే చాలు. మీ కళ్లను తీర్పు చెప్పమనండి. మీ మనసును సమీక్షించుకోండి. కపటుల విషయాన్ని పక్కనపెట్టండి. ఎందుకంటే కపటులు తమ ఉద్దేశ్యాలకు భిన్నంగా ఉంటే పట్టపగలు సూర్యుని ఉనికిని కూడా నిరాకరిస్తారు. అందుకని నిజాయితీగా ఆలోచిస్తే లైంగిక ఆకర్షణ (Sex Appeal)కు మొత్తం శరీరంలో దైవ ప్రసాదితమైన సహజ సుందర ముఖారవిందానిదే అగ్రస్థానమని అంగీకరించక తప్పదు. ఒక అమ్మాయిని వివాహమాడాలంటే ఏమి చూసి ఒక నిర్ణయానికొస్తారు చెప్పండి? ముఖం తప్ప మిగతా మనిషిని చూడడం ఒక పద్ధతి. కేవలం ముఖం మాత్రమే చూసి మనిషిని చూడకుండా ఉండడం ఒక పద్ధతి. ఈ రెండు పద్ధతుల్లో మీరు దేనికి ప్రాధాన్యత నిస్తారు? నిజం చెప్పండి. మొత్తం మనిషిని చూడడం కన్నా కేవలం ముఖం మాత్రమే

చూసి ఒక అంచనాకు రావడం సరైన విధానం కాదంటారా?

ఈ వాస్తవాన్ని ఒప్పుకున్న తరువాత ఇప్పుడు కాస్త ముందుకు పదండి. ఒక వేళ సమాజంలో లైంగిక విశృంఖలత్వం, అదుపుఅదుపు లేని భావోద్రేకాలను నిలువరించే ఉద్దేశమే లేకపోతే ఒక్క ముఖమే ఎందుకు? పాశ్చాత్య దేశాల్లో ఉన్నట్లుగా వక్షభాగం, పక్కలు, నడుము, తొడలు అన్నీ ప్రదర్శిస్తూ తిరగడానికి అనుమతివ్వచ్చు కదా! ఇలా చేయదలచుకుంటే ఇస్లామీయ చట్టాల్లో పరదాకు సంబంధించి ఇప్పటి వరకూ చర్చించిన పరిధులు సరిహద్దుల అవసరమే లేదు. కాని ఈ ఉపద్రవాన్ని నిలువరించడమే అసలు ఉద్దేశ్యం అయినట్లయితే, చిన్న చిన్న ద్వారాలకు పెద్ద పెద్ద తాళాలు బిగించి, సింహద్వారాన్ని బార్లాతెరిచి ఉంచడం కంటే అవివేకం ఇంకేముంటుంది?

అయితే ఇక్కడ ఒక ప్రశ్న ఉత్పన్నం కావచ్చు. అత్యవసర పరిస్థితుల్లో అవసరాలు తీర్చుకోడానికి ముఖం, చేతులు బహిర్గతం చేయడానికి ఇస్లాం ఎందుకు అనుమతినిచ్చింది? అని కూడా మీరు ప్రశ్నించవచ్చు. దీనికి సమాధానం ఏమిటంటే, ఇస్లాం సిద్ధాంతం ఏదో విపరీత సిద్ధాంతం, చలన రహిత సిద్ధాంతం కానే కాదు. అది ఒకవైపు సంస్కారవంతమైన, నైతిక విలువలను గౌరవిస్తూనే, మరోవైపు మానవుల వాస్తవ అవసరాలకు కూడా గుర్తిస్తుంది. ఈ రెండింటి మధ్య సమతుల్యతను ఏర్పరుస్తుంది. అది అనైతికతను నిర్మూలించాలని కూడా భావిస్తుంది. దాంతోపాటు ఎవరిపైనా సహజ అవసరాలు తీర్చుకోలేనంతగా నిర్బంధాన్నీ విధించదు. ఈ కారణంగానే స్త్రీలను సతర్ విషయంలో ఆదేశించినంత స్పష్టంగా ముఖం, చేతుల విషయంలో ఆజ్ఞాపించలేదు. ఎందుకంటే నిండు వస్త్రధారణ వల్ల నిత్య జీవితంలో, అవసరాలు తీర్చుకోవడంలో ఎలాంటి అవరోధమూ ఎదురుకాదు. కాని ముఖం, చేతులు దాచుకుంటే మాత్రం స్త్రీలు తమ అవసరాల పరిపూర్తిలో ఇబ్బందులు ఎదుర్కోవలసి రావచ్చు. కనుక స్త్రీలు సాధారణ పరిస్థితిలో ముఖంపై పైటలు కప్పుకొని, అవసరాలకనుగుణంగా ఈ అనుమతిని వినియోగించుకునే స్వేచ్ఛను ఇవ్వడం జరిగింది. నిజంగానే ముఖాన్ని బహిర్గతం చేసే అవసరం ఏర్పడితే వారు అలా చేయవచ్చు. కేవలం అలంకారాన్ని ప్రదర్శించే ఉద్దేశ్యం మాత్రం ఉండకూడదు.

మరోవైపు ఉపద్రవం తలెత్తే ప్రమాదాన్ని నివారించడానికి పురుషులు చూపులు

కిందికి ఉంచుకోవాలని ఇస్లాం ఆదేశించింది. దీనివల్ల స్త్రీలు తమ అవసరాల నిమిత్తం ముఖాలపై ముసుగులు లేకుండా పనులు చేసుకుంటున్నప్పుడు వారివైపు గుచ్చిగుచ్చి చూడకుండా ఉండగలుగుతారు.

పరదాకు సంబంధించిన ఈ ఆదేశాలను గురించి ఆలోచించినట్లయితే, ఇస్లామీ పరదా విధానం అజ్ఞానపు ఆచారం కాదు. సహజ అవసరం, నైతిక సూత్రం అన్న విషయం అర్థమవుతుంది. ఇది స్త్రీల సహజ నైజానికి అనుగుణంగా ఉన్నటువంటి ఉత్తమ విధానం. వారు తమ అవసరాలకనుగుణంగా పరదా విధానంలో కల్పించబడిన వెసులుబాటును వినియోగించుకోవచ్చు. ఎందుకంటే, విశ్వాసులకు వారి మనసే ఒక న్యాయమూర్తి.. ప్రవక్త (స) ఇలా ప్రవచించారు. 'ఏది ఉచితమో, ఏది అనుచితమో మీ మనసునడగండి. మనసులో వెగటు అనిపించిన దాన్ని విడిచిపెట్టండి.' ఈ కారణంగానే అజ్ఞానంగానో, అనాలోచితంగానో కళ్ళుమూసుకొని విధేయించడం ఇస్లాంలో కుదరదు. ఇదొక నైతిక శాసనం. దీన్ని విధేయించడంలో అడుగడుగునా వివేకం, ఆలోచన తప్పనిసరి.



## 13వ అధ్యాయం

# ఇంటి నుండి బయటికి వెళ్ళే ఆదేశాలు

వస్త్రధారణ, సతర్ పరిధులు ఏర్పరిచిన తరువాత చివరిగా స్త్రీలకు ఇలా ఆదేశించబడింది.

وَقَرْنَ فِیْ بُیُوْتِکُنَّ وَلَا تَبَرَّجْنَ تَبَرُّجَ الْجَاهِلِیَّةِ الْاُوْلٰی.
(الاحزاب:۳۳)

**'మీరు ఇళ్ళల్లోనే ఉండిపొండి. పూర్వపు అజ్ఞాన కాలంలో మాదిరిగా అలంకరణను ప్రదర్శిస్తూ తిరగకండి.**

**(అల్ అహ్‌జాబ్ : 33-33)**

وَلَا یَضْرِبْنَ بِاَرْجُلِهِنَّ لِیُعْلَمَ مَایُخْفِیْنَ مِنْ زِیْنَتِهِنَّ ط (النور:۳۱)

**'తాము గుప్తంగా ఉంచిన తమ అలంకరణ ప్రజలకు తెలిసేలా వారు తమ కాళ్ళను నేలపై కొడుతూ నడవరాదని కూడా వారికి చెప్పు.'** ***(అన్‌నూర్ 24 : 31)***

فَلَا تَخْضَعْنَ بِالْقَوْلِ فَیَطْمَعَ الَّذِیْ فِیْ قَلْبِهٖ مَرَضٌ. (الاحزاب:۳۲)

**'తగ్గు స్వరంతో మాట్లాడకండి, ఎందుకంటే దుష్ట మనస్సు గల వ్యక్తి ఎవడైనా వ్యామోహపడవచ్చు. కాబట్టి స్పష్టంగా, సూటిగా మాట్లాడండి.'** ***(అల్ అహ్‌జాబ్ 33 : 32)***

ఇక్కడ 'వఖర్‌న' పారాయణంలో కాస్త భిన్నాభిప్రాయం ఉంది. అదేమిటంటే, 'మీరు మీ ఇళ్లలోనే ఆగి ఉండండి అని ఒక అర్థమైతే, మీరు ఇళ్లలో గౌరవంగా, లేక ప్రశాంతంగా ఉండండి. అనేది మరో అర్థం. ఏ అర్థాన్ని తీసుకున్నా మూల విషయానికైతే ఎలాంటి ప్రమాదమూ ఉండదు కాబట్టి రెండూ సరైనవే.

ఇక 'తబర్రుజ్'కు కూడా రెండర్థాలున్నాయి. ఒకటి అలంకార ప్రదర్శన. రెండు నడకలో వయ్యారం ఒలకబోయడం. వగలుపోతూ, ఒళ్లు విరుచుకుంటూ, హోయలు పోతూ నడవడం. ఈ వాక్యంలో ఈ అర్థాలన్నీ ఉన్నాయి. అజ్ఞానకాలం ప్రారంభంలో నేటి ఆధునిక మహిళల్లాగే ఆనాడు కూడా బాగా అలంకరించుకొని, సింగారించుకొని బయల్దేరేవారు. నడక భూమిపై నడుస్తున్నట్లు కాక చూపరుల గుండెలపై అడుగులు పడేలా నడిచేవారు. ప్రఖ్యాత ఖుర్ఆన్ వ్యాఖ్యాత ఖతాద బిన్ అమామ ఇలా అంటున్నారు. కాన తల్హున్న...

ఈ విషయాలు తెలుసుకోడానికి చరిత్ర చెప్పాల్సిన అవసరం లేదు. పాశ్చాత్య మహిళలు నివసించే ఏ చోటుకైనా వెళ్లిచూడండి. పైన చెప్పుకున్న అజ్ఞాన కాలంనాటి కట్టూబొట్టూ, వయ్యారాలు కళ్లముందు కనిపిస్తాయి. దీన్నే ఇస్లాం వారించింది. ఇస్లాం చెప్పేదేమిటంటే మీ అసలు స్థానం గృహసీమే. మీరు మీ ఇళ్లల్లో గౌరవ ప్రదంగా, ప్రశాంత జీవనం గడపడానికే మిమ్మల్ని బయటి వ్యవహారాల నుండి మినహాయించడం జరిగింది. అవసరమైనప్పుడు బయటికి వెళ్లడానికి మీకు అనుమతి ఎలాగూ ఉంది. అయితే బయటికి వెళ్లేముందు మీ గౌరవాన్ని దృష్టిలో ఉంచుకోండి. మీ వస్త్రధారణలో హుందాతనం ఉట్టిపడాలి. నడుస్తూ నడుస్తూ మీ ముఖారవిందాన్ని, చేతుల అందాన్ని ప్రదర్శించకండి. ఇతరులు మీవైపు చూసే విధంగా నడకలో వయ్యారాన్ని ఒలకబోయకండి. కావాలని ఇతరుల ముందు అలంకరణగాని, కంఠధ్వనికాని చేయకండి. అవసరమైతే తప్పక మాట్లాడండి. కాని అవసరం మేర మాత్రమే మాట్లాడండి. ఒగలుపోతూ సౌమ్యంగా లాలిత్యంగా గుసగుసగా మాట్లాడ కండి. ఈ విషయాలను గమనంలో ఉంచుకొని మీరు మీ అవసరాల పరిపూర్తికి ఇంట్లోంచి నిరభ్యంతరంగా బయటికి వెళ్లవచ్చు.

ఇదీ ఖుర్ఆన్ బోధన. ఇప్పుడిక ప్రవక్త (స) ప్రవచనాలపై దృష్టిసారిద్దాం. ఆయనగారి ఉపదేశాలు సమాజంలో స్త్రీలకు ఏ విధానాన్ని ప్రతిపాదించాయో, ఆయన అనుచరులు, వారి స్త్రీలు ఎలా వాటిని ఆచరించారో చూద్దాం.

## అవసరాల పరిపూర్తికి ఇంటి నుండి బయటికి వెళ్లే అనుమతి

హదీసులో ఇలా ఉంది-పరదా ఆజ్ఞ అవతరించక ముందు హజ్రత్ ఉమర్ (రజి), దైవప్రవక్తా! మహిళలకు పరదా పాటింపజేయండి అని అడుగుతుండే వారు. ఒకసారి ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ సౌదా (రజి) రాత్రివేళ ఇంటినుండి బయలు

దేరారు. హజ్రత్ ఉమర్ (రజి) ఆమెను చూసి, సౌదా! నేను నిన్ను గుర్తు పట్టేశాను అని అరిచారు. అంటే ఏదో ఒక విధంగా స్త్రీలు ఇళ్లనుండి బయటికి రావడం ఆగిపోవాలన్నది ఆయన ఉద్దేశ్యం. పరదా ఆదేశాలు అవతరించిన తరువాత హజ్రత్ ఉమర్ (రజి) స్త్రీలు ఇళ్లనుండి అనవసరంగా బయటికి వస్తే ఊరుకునే వారు కాదు. ఈ క్రమంలో మళ్లీ ఒకసారి హజ్రత్ సౌదానే తారసపడ్డారు. హజ్రత్ ఉమర్ ఆమెను మందలించారు. అప్పుడామె ఈ విషయం ప్రవక్త వారికి పిర్యాదు చేశారు. అప్పుడు ప్రవక్త మహనీయులు, అవసరాల పరిపూర్తికి బయటికి వెళ్లే అనుమతి అల్లాహ్ మీకిచ్చాడు' అన్నారు.

అంటే, స్త్రీలు ఇళ్ల నుండి అసలు బయటికే వెళ్లరాదు అన్నది ఖుర్ఆన్ ఉపదేశాల ఉద్దేశ్యం ఎంతమాత్రం కాదు అని దీని ద్వారా మనకు స్పష్టంగా అర్థమవుతోంది. పనులు చేసుకోడానికి, అవసరాలు తీర్చుకోడానికి వారు బయటికి వెళ్లడానికి పూర్తి అనుమతి ఉంది. అయితే ఈ అనుమతి కొన్ని హద్దులు, పరిమితులకు లోబడి ఉందన్న విషయాన్ని అర్థం చేసుకోవాలి. పురుషులతోపాటు కలివిడిగా, ఎక్కడబడితే అక్కడ కలిసి తిరగడానికి స్త్రీల స్వభావం అనుగుణంగా ఉండదు. అందుకే వారి నైజానికనుగుణంగా వారి కార్య పరిధులు నిర్ణయించబడ్డాయి. స్త్రీలందరూ అన్ని కాలాల్లో బయటికి వెళ్లడం, వెళ్లకపోవడం, ఏ సందర్భంలో ఎలా వెళ్లడం అన్నది ప్రత్యేకంగా నిర్ణయించడం కష్టం. కనుక జీవితంలోని సాధారణ పరిస్థితుల్లో స్త్రీలు బయటికి వెళ్లడానికి ఏ విధానాలు నిర్ణయించబడ్డాయో, పరదా హద్దుల్లో ఏ విధంగా మార్పులు చేర్పులకు అవకాశాలున్నాయో దీని ద్వారా ఇస్లాం చట్టాల స్ఫూర్తిని, దాని మొగ్గును అంచనా వేయవచ్చు. ఈ విషయాన్ని అర్థం చేసుకొని వ్యక్తిగత, సామాజిక వ్యవహారాల్లో పరదా హద్దులను సమయం సందర్భాలను బట్టి దానిలోని వెసులుబాటును ప్రతి ఒక్కరూ తెలుసుకోవచ్చు. ఉదాహరణకు కొన్ని విషయాలు ప్రస్తావిస్తున్నాము.

## మస్జిద్‌లో ప్రవేశానికి అనుమతి - పరిధులు

ఇస్లాంలో అన్నిటికన్నా ముఖ్య విధి నమాజ్ అన్న విషయం అందరికీ తెలిసిందే, దీన్ని మస్జిద్‌లో సామూహికంగా నెరవేర్చడానికి ప్రవక్త (స) ప్రాధాన్యత నిచ్చారు. కాని సామూహిక నమాజు విషయంలో పురుషులకు ఏ ఆదేశాలైతే ఇవ్వబడ్డాయో, దానికి పూర్తి భిన్నమైన ఆదేశాలు స్త్రీలకు ఇవ్వబడ్డాయి. మస్జిద్‌లో సామూహికంగా చేసే నమాజు పురుషులకు శ్రేష్టమైన నమాజు ఏకాంతంగా ఇంట్లో

ఒంటరిగా చేసుకున్న నమాజు స్త్రీలకు శ్రేష్ఠం. ఇమాం అహ్మద్, తిబ్రానీ ఉమ్మె హుమైద్ సాదియ ఉల్లేఖనాన్ని ఇలా ఉటంకించారు :-

قالت یا رسول اللّٰہ انی احب الصلٰوۃ معک قال قد علمت صلوتُک فی بیتک خیرلک من صلٰوتک فی حجرتک و صلوتک فی حجرتکِ خیر من صلٰوتک فی دارک و صلٰوتک فی دارک خیر من صلوتک فی مسجد قومک و صلٰوتک فی مسجد قومک خیر من صلٰوتک فی مسجد الجمعۃ.

'దైవ ప్రవక్తా! నేను మీ అనుసరణలో నమాజు చేయాలనుకుంటున్నాను! అని ఉమ్మెహుమైద్ సాదియ (ర.అన్హా) విన్నవించుకున్నారు.. అప్పుడు ప్రవక్త మహనీయులు ఇలా ఉపదేశించారు: 'నీకు నా అనుసరణలో (మస్జిదులో సామూహిక నమాజు) చేయాలన్న కోరిక బలంగా ఉన్న విషయం నాకు తెలుసు. కాని, నువ్వు నీ ఇంటిలోపలి భాగంలో చేసే నమాజు, మధ్య హాల్లో చేసే దానికంటే మేలైనది. మధ్య హాల్లో చేసే నమాజు వరండాలో చేసే నమాజుకంటే మేలైనది. నువ్వు నీ ఇంటి వసారాలో చేసే నమాజు, మీవీధి మస్జిదులో చేసే నమాజుకంటే మేలైనది. అలాగే వీధి మసీదులో చేసే నమాజు నా మస్జిదుకు వచ్చి చేసే నమాజు కంటే ఉత్తమమైనది.' *(కన్జుల్ ఆమాల్, ముస్నదె అహ్మద్ సౌజన్యం)*

ఈ విషయానికి సంబంధించిన మరొక హదీసు అబూదావూద్‌లో ఇబ్నెమస్ఊద్ (రజి) ఉల్లేఖించారు. అందులో ప్రవక్త మహనీయులు ఇలా ఉపదేశించారు.

صلٰوۃ المرأۃ فی بیتھا افضل من صلٰوتھا فِی حجرتھا و صلٰوتھا فی مخدعھا افضل من صلٰوتھا فی بیتھا. (باب ماجاء خروج لنساء لی لمساجد)

'స్త్రీ తన గదిలో నమాజు చేయడం బయటి గదిలో చేయడం కంటే

**మేలైనది. అలాగే తన వ్యక్తిగత గదిలో ఒక మూలన నమాజు చేయడం వేరే గదిలో చేయడం కంటే మేలైనది.'**

చూడండి ఇక్కడ క్రమం పూర్తిగా తిరగబడింది. పురుషులు ఒక మూలన ఏకాంతంగా నమాజు చేయడం అన్నిటికన్నా తక్కువ స్థాయి నమాజుగా పరిగణించబడితే, పెద్ద సమూహంతో కలిసి చేయడం అన్నిటికన్నా శ్రేష్టమైన నమాజుగా చెప్పబడింది. దీనికి భిన్నంగా స్త్రీలు అత్యంత ఏకాంతంగా నమాజు చేయడం అత్యుత్తమ నమాజుగా చెప్పబడింది. ఈ ఏకాంత నమాజు సామూహిక నమాజుకంటే ఆధిక్యం కలది మాత్రమే కాదు, స్వయంగా ప్రవక్త మసీదులో ప్రవక్తల నాయకుడు ముహమ్మద్ ప్రవక్త (స) ఇమామత్‌లో జమాఅత్‌తో నమాజు చేయడం కన్నా శ్రేష్టమైనది. ఈ వ్యత్యాసానికి కారణం ఏమిటి? ధర్మశాస్త్రం స్త్రీలు బయట తిరగడాన్ని అయిష్టంగా పరిగణించడమే కదా.

అయితే, నమాజ్ ఒక పవిత్రమైన ఆరాధన. మస్జిద్ ఒక పవిత్ర స్థలం. ధర్మశాస్త్ర కోవిదులు స్త్రీ పురుషుల స్వేచ్ఛాయుత కలయికను నిరోధించడానికి అధికం, అధమాల వ్యత్యాసాన్ని వివరిస్తూ తమ అభిప్రాయాన్ని వెల్లడించారు. కాని ఇలాంటి పవిత్ర కార్యం కోసం, పవిత్ర స్థలానికి రావద్దని మాత్రం నిరోధించలేదు. హదీసుల్లో స్త్రీలు మసీదులకు రావచ్చన్న అనుమతి ఉంది.

**لاتمنعوا اِماء اللّٰه مساجد اللّٰه اذا استاذنت امرأة احدكم الى المسجد فلايمنعها.** (بخاری و مسلم)

**'అల్లాహ్ సేవికలను ఆయన మస్జిదులకు రాకుండా నిరోధించకండి. మసీదులకు వెళతామని మీ భార్యలు అనుమతికోరితే వారిని వారించకండి.'** ***(బుఖారి, ముస్లిం)***

**لاتمنعوا نساءكم المساجد و بيوتهن خير لهن.** (ابو دائود)

**'మీ భార్యలను మస్జిదులకు వెళ్ళకుండా వారించకండి. అయితే వారికి వారి గృహాలే ఉత్తమ ప్రదేశాలు.'** ***(అబూదావూద్)***

స్త్రీలు మసీదులకు వెళ్లకుండా ధర్మశాస్త్రం వారించదని ఈ ప్రవచనాల ద్వారా మనకు అర్థమవుతోంది. ఎందుకంటే, మస్జిదుకు నమాజుకు వెళ్లడం తప్పేమీ

కాదుగదా, వెళ్లొద్దని నిరోధించడానికి. అయితే మస్జిదుల్లో స్త్రీలు పురుషులు కలిసి పోవడాన్ని కూడా సంస్కారం అనుమతించదన్న విషయాన్ని గమనించాలి. కాబట్టి వారికి అనుమతి అయితే ఉంది కాని, స్త్రీలను మస్జిదులకు పంపండి, లేక వెంట బెట్టుకు రండి అని మాత్రం తాకీదు చేయలేదు. వారు మసీదుకు వెళ్లి నమాజులు చేస్తామంటే మాత్రం వద్దని వారించకండి. అనుమతివ్వండి.

ఇస్లాం ఆత్మను పరిపూర్ణంగా అవగతం చేసుకున్న హజ్రత్ ఉమర్ (రజి)కు ఈ విషయంలో భార్య ఆతిక బిన్తె జైద్‌తో ఎప్పుడూ వాదన జరుగుతూ ఉండేది. ఆమె మసీదుకు వెళ్లడం ఉమర్‌కు ఇష్టం ఉండేదికాదు. కాని ఆమె వెళతానని భీష్మించేది. తను అనుమతి కోరగానే ప్రవక్త హితోపదేశాన్ని శిరసావహిస్తూ ఉమర్(ర) మౌనం పాటించేవారు. అంటే నేను నిన్ను వెళ్లకుండా ఆపలేను. కాని ఇష్టపూర్వకంగా అనుమతి కూడా ఇవ్వలేకపోతున్నాను. అని అర్థం. ఆమె కూడా మాటమీద నిలబడే మనిషే కాబట్టి, 'మీరు స్పష్టంగా వారించనంత వరకూ నేను వెళుతూనే ఉంటాను.' అని ఆమె సమాధానమిచ్చేవారు.

1) ఈ పరిస్థితి ఒక్క ఉమర్ భార్యదేకాదు. ప్రవక్త కాలంలో అత్యధిక శాతం మంది స్త్రీలు సామూహిక నమాజు కోసం మస్జిదులకు వెళుతుండేవారు. ఒక్కోసారి మస్జిదె నబవిలో కేవలం స్త్రీల రెండేసి వరుసలు అయ్యేవని అబూదావూద్ గ్రంథంలో ఉంది.

## మస్జిద్ షరతులు

స్త్రీలు మసీదుకు వెళ్లే అనుమతితోపాటు కొన్ని షరతులు కూడా విధించ బడ్డాయి. వాటిలో మొదటిది ఏమిటంటే వారు పగటి వేళ కాకుండా రాత్రి వేళ మాత్రమే వెళ్లాలి. అంటే ఇషా, ఫజర్ అన్నమాట.

عن ابن عمر قال قال رسول الله ﷺ ائذنوا للنساء بالليل الى المساجد.(٢)

**ఇబ్నె ఉమర్ (రజి) ప్రకారం, దైవప్రవక్త (స) సెలవిచ్చారు : 'స్త్రీలను రాత్రివేళ మస్జిదులకు రానివ్వండి.' *(తిర్మిజి)***

**قال نافع مولى ابن عمر و كان اختصاص الليل بذالک لكونه استر و اخفىٰ.**

**హజ్రత్ ఇబ్నె (ర) ఉమర్ ప్రియశిష్యుడు హజ్రత్ నాఫె (రజి) ఇలా అంటున్నారు :'రాత్రివేళ అని ప్రత్యేకించి చెప్పిన ఉద్దేశ్యం ఏమిటంటే, రాత్రివేళ పరదా పాటించడం చాలా తేలికగా ఉంటుంది. ఖచ్చితంగా పాటించవచ్చు.**

**عن عائشة قالت كان رسول اللهﷺ ليصلي الصبح فينصرف النساء متلففات بمر وطهن مايعرفن من الغلس(!).**

**హజ్రత్ ఆయిషా (రజి) అంటున్నారు 'దైవప్రవక్త ఫజర్ నమాజు ఎప్పుడు చదివేవారంటే, స్త్రీలు నమాజు తరువాత ఓణీలు కప్పుకొని మస్జిదు నుండి తిరిగి వచ్చేటప్పుడు కూడా ఎవరూ గుర్తించేవారు కాదు.' (తిర్మిజి)**

రెండవ నిబంధన ఏమిటంటే, స్త్రీలు మస్జిదులోకి సింగారించుకొని (అలంక రించుకొని) సుగంధ ద్రవ్యాలు పూసుకొని రాకూడదు. హజ్రత్ ఆయిషా (రజి) ఇలా అంటున్నారు. ఒకసారి ప్రవక్త (స) మస్జిదులో కూర్చొని ఉండగా మజీన తెగకు చెందిన ఒక స్త్రీ బాగా అలంకరించుకొని, పొగరుమోతు తనంతో మస్జిద్‌లోకొచ్చింది. అప్పుడు దైవప్రవక్త ఇలా ప్రవచించారు : 'ప్రజలారా! మీ స్త్రీలను బాగా అలంకరించుకొని మస్జిదులకు రాకుండా చూడండి. (ఇబ్నెమాజ) సుగంధ ద్రవ్యాల విషయంలో, మీరు నమాజుకు రావాలనుకున్న రాత్రి మీరు ఏ విధమైన అత్తరు రాసుకోకండి. చాలా సాదా సీదా వస్త్రధారణతో రండి. ఏ స్త్రీ అయితే అత్తరు రాసుకొని వస్తుందో ఆమె నమాజు నెరవేరదు. (మూతా)

మూడవ షరతు ఏమిటంటే, స్త్రీలు జమాతులో (సామూహికంగా నిలిచినప్పుడు) పురుషులతో కలిసి మెలసి గాని, ముందు పంక్తిలోగాని ఉండకూడదు. పురుషుల వెనుక వారు నిలబడాలి. 'పురుషులకు అత్యున్నత స్థానం మొదటి పంక్తిలో ఉంటే, అతి తక్కువ స్థానం వెనుక పంక్తిలో ఉంది. అలాగే స్త్రీలకు అత్యుత్తమ స్థానం వెనుక పంక్తి అయితే, హీనమైన స్థానం మొదటి పంక్తి.'అని చెప్పబడింది.

సామూహిక నమాజుకు సంబంధించి దైవప్రవక్త (స) ఒక పద్ధతి నిర్ణయించారు. స్త్రీలు, పురుషులు పక్కపక్కన నిలబడి నమాజు చేయకూడదు. వారు భార్యాభర్తలైనా, తల్లీ కొడుకులైనా సరే. హజ్రత్ అనస్ (రజి) ఇలా అంటున్నారు : మా అమ్మమ్మ మలైకా (రజి) ప్రవక్త వారిని విందుకు ఆహ్వానించారు. భోజనానంతరం ప్రవక్త (స) నమాజుకు ఉపక్రమించారు. నేను, యతీం (బహుశా ఈయన హజ్రత్ అనస్ సోదరుడు కూడా కావచ్చు) ఆయన (స) వెనుక నిలుచున్నాము. అమ్మమ్మ మలైకా మా వెనుక నిలుచున్నారు. (తిర్మిజి) హజ్రత్ అనస్ గారి మరో ఉల్లేఖనం : 'ప్రవక్త మహనీయులు మా ఇంట్లో నమాజు చేశారు. నేను యతీం ఆయన వెనుక నిలుచున్నాము. మా అమ్మ ఉమ్మె సలీమ్ (రజి) మా వెనుక నిలుచున్నారు. (బుఖారి), అజాన్ అధ్యాయం)

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఉల్లేఖనం : 'ఒకసారి దైవప్రవక్త (స) నమాజు కోసం నిలుచున్నారు. నేను ఆయన పక్కన నిలుచున్నాను : హజ్రత్ ఆయిషా (రజి అన్హా) మా వెనుక నిలుచున్నారు.' (నిసాయి)

నాల్గవ షరతు ఏమిటంటే, స్త్రీలు నమాజులో బిగ్గరగా శబ్దం చేయకూడదు. నమాజులో ఏదైనా విషయమై హెచ్చరించాలంటే, పురుషులు సబ్హానల్లాహ్ అనాలి, స్త్రీలు చేతితో శబ్దం చేయాలన్న పద్ధతిని నిర్ణయించడం జరిగింది. (బుఖారీ)

ఈ విధంగా ఇన్ని హద్దులు ఏర్పరిచిన తరువాత కూడా హరజత్ ఉమర్ (రజి)కు జమాఅత్‌లో స్త్రీ పురుషులు కలిసి మెలిసి తిరిగే అవకాశాలు ఉన్నాయని, ఇది సరికాదని గ్రహించి మస్జిద్‌లో స్త్రీలకు ఒక ద్వారం ప్రత్యేకించారు. పురుషులెవరూ ఆ ద్వారం గుండా రాకపోకలు సాగించకూడదని వారించారు. (అబూదావూద్)

## హజ్ - స్త్రీలు

ఇస్లాంలో మరో సామూహిక విధి హజ్. పురుషులకు లాగానే స్త్రీలకు కూడా ఇది ఫర్జ్. అయితే సాధ్యమైనంత మేర తవాఫ్ సందర్భంలో పురుషులతో కలిసిమెలసి ఉండడాన్ని నిరోధించడం జరిగింది. బుఖారి గ్రంథంలో అలీ ఉల్లేఖనం ఇలా ఉంది. ప్రవక్త కాలంలో స్త్రీలు పురుషులతో కలిసి తవాఫ్ చేసేవారు కాని వారితో రాసుకుపూసుకు చేసేవారు కాదు. ఫతహుల్ బారీ గ్రంథంలో ఇబ్రాహీం నఖయీ ఉల్లేఖనం ఇలా ఉంది. 'తవాఫ్‌లో స్త్రీలు పురుషులు కలిసిపోకుండా హజ్రత్ ఉమర్ నిరోధించారు. ఒకసారి ఒక పురుషుడు స్త్రీల సమూహంలో ఉండగా గమనించి, కొరడా దెబ్బలు కొట్టారు.

మూతాలో ఇలా ఉంది. హ|జత్ అబ్దుల్లాబిన్ ఉమర్ (రజి) భార్యాపిల్లలను ప్రజలు రాకముందే, ఉదయం నమాజు, రమీ చేసుకునేందుకు ముజ్దలిఫ నుండి మినాకు ముందే పంపించేవారు. హ|జత్ అబూబక్ర్ (రజి) కుమార్తె హ|జత్ అస్మా (రజిఅన్హా) ఉదయం చీకటి ముఖాన్నే మినా వెళ్లేవారు. అంటే ప్రవక్త కాలంలో స్త్రీలకు ఆచరణం విధానం ఇలాగే ఉండేది.

## జుమా, ఈద్ నమాజుల్లో స్త్రీలు

జుమా, ఈద్ సమావేశాలకు ఇస్లాంలో ఎంతటి ప్రాముఖ్యం ఉందో ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. వీటి ప్రాముఖ్యతను దృష్టిలో ఉంచుకొని దర్మశాస్త్రం సాధారణ నమాజులకు ఉన్నటువంటి షరతులను సడలించింది. స్త్రీలు జుమా విధినుండి, ఈద్ నమాజుల నుండి మినహాయించబడ్డారు. వారు ఈద్ నమాజుల్లో పాల్గొనడం తప్పనిసరికాదు. అయితే వారు ఇతర షరతులను పాటిస్తూ జమాతులో పాల్గొనదలచుకుంటే పాల్గొనవచ్చు. స్వయంగా దైవప్రవక్త (స) తమ స్త్రీలను ఈద్ నమాజుకు తీసుకు వెళ్లేవారని హదీసుల ద్వారా రుజువవుతోంది.

**عن ام عطية قالت ان رسول اللهﷺ كان يخرج الابكار والعواتق و ذوات الخدور والحيض فى العيدين، فاما الحيض فيعتزلن المصلى ويشهدون دعوة المسلمين.**

(ترمذی، باب خروج النساء فی العیدین)

**ఉమ్మె అతియ (రజిఅన్హా) ఉల్లేఖనం ఇలా ఉంది. 'దైవప్రవక్త (స), పిల్లలు, యువతులు, మహిళలు, బహిష్టు స్త్రీలు అందరినీ ఈద్గాహ్కు తీసుకెళ్లేవారు. నమాజు చేసే స్థితిలో లేనివాళ్లు జమాత్కు దూరంగా ఉండేవారు. దుఆలో మాత్రం పాల్గొనేవారు.'** ***(తిర్మిజి)***

**عن ابن عباسٍ ان النبیﷺ كان يخرج بناته و نسائه فى العيدين.**

(ابن ماجه، باب ماجاء فی خروج النساء فی العیدین)

**ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం 'దైవప్రవక్త (స) తమ కుమార్తెలను, భార్యలను పండుగల్లో వెంటతీసుకు వెళ్లేవారు. (ఇబ్నెమాజ)**

## సమాధుల సందర్శన, జనాజా నమాజు

ముస్లింల జనాజా నమాజులో పాల్గొనడం ధర్మశాస్త్రం ప్రకారం ఫర్జెకిఫాయ. దీనికి సంబంధించిన స్పష్టమైన ఆదేశాలు బహుశా అందరికీ తెలిసే ఉంటాయి. అయితే ఇవి పురుషులకు మాత్రమే. స్త్రీలు జనాజా నమాజులో పాల్గొన కూడదని వారించడం జరిగింది. కాని అంత కఠినంగా నిషేధించబడలేదు. అప్పుడప్పుడూ అనుమతి కూడా ఇవ్వడం జరిగింది. ధర్మశాస్త్ర ఆదేశాల ద్వారా స్పష్టంగా తెలిసేదేమి టంటే, స్త్రీలు జనాజాలో పాల్గొనడం ఎంత మాత్రం అభిలషణీయం కాదు. బుఖారి గ్రంథంలో ఉమ్మె అతియ (రజిఅన్హా) ఉల్లేఖనం ఇలా ఉంది : మమ్మల్ని జనాజాల్లో పాల్గొనవద్దని వారించబడింది. కాని, మరీ అంత కఠినంగా కాదు.

ఇబ్నెమాజ, నిసాయి గ్రంథాల్లో ఇలా ఉంది. దైవప్రవక్త (స) జనాజాలో ఉండగా ఒక స్త్రీ కనిపించింది. హజ్రత్ ఉమర్ (రజి) ఆమెను గద్దించారు. కాని దైవప్రవక్త (స) ఉమర్! ఆమెను వదిలెయ్ (ఏమీ అనకు) అన్నారు. దీనివల్ల మనకు తెలిసేదేమంటే, బహుశా ఆమె మృతునికి చాలా దగ్గరి బంధువు కావచ్చు. బాధను భరించలేక వెంట వచ్చి ఉంటుంది. ప్రవక్త మహనీయులు ఆమె భావోద్వేగాలను గౌరవించి, ఉమర్ (ర) ఆమెను ఏమీ అనకుండా మందలించారు.

సమాధుల సందర్శన విషయం కూడా ఇంతే. స్త్రీలు చాలా సున్నిత మనస్కులు, ప్రేమమూర్తులు. తమ దగ్గరివారి మరణం వారిని కలచి వేస్తుంది. మృతుల పట్ల వారికి ఎక్కువ అనుబంధం ఉంటుంది. వారి భావోద్రేకాలను అణిచివేయడాన్ని ధర్మం ఎంత మాత్రం సమ్మతించదు. అయితే స్త్రీలు అధికంగా సమాధుల వద్దకు పోవడం మాత్రం నిషిద్ధం. తిర్మిజీలో హజ్రత్ అబూహురైరా (రజి) ఉల్లేఖనం ఉంది. ఎక్కువగా సమాధుల వద్దకు వెళ్లే స్త్రీలను ప్రవక్త (స) శాపగ్రస్తులని అభివర్ణించారు. (ఇబ్నెమాజలో కూడా ఇదే విషయం హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) హస్సాన్ బిన్ సాబిత్ (రజి) కూడా ఉల్లేఖించారు.

హజ్రత్ ఆయిషా (రజిఅన్హా) తన సోదరుడు అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబక్ర్ (రజి) సమాధి వద్దకు వెళ్లినప్పుడు, దైవసాక్షి! నీ మరణ సమయాన నేను ఉండి ఉంటే ఇప్పుడు నీ సమాధి వద్దకు వచ్చేదాన్ని కాదు అన్నారు. (తిర్మిజీ)

హజ్రత్ అనస్ (రజి) ఉల్లేఖనం: 'ఒక స్త్రీ సమాధివద్ద కూర్చొని రోదిస్తుండగా చూసి దైవప్రవక్త (స) అల్లాహ్‌కు భయపడు, సహనం వహించు' అన్నారు. (బుఖారి)

ఈ ఆదేశాలను గురించి ఒక్కసారి ఆలోచించండి. నమాజు ఒక పవిత్ర ఆరాధన, మస్జిద్ ఒక పరిశుద్ధ ప్రదేశం. హజ్‌లో మానవుడు అత్యంత పవిత్రమైన ఆలోచనలతో అల్లాహ్ దర్బారులో (సన్నిధి) హాజరవుతాడు. జనాజా, సమాధుల సందర్శనలో ప్రతి ఒక్కరి ముందు మృత్యు భావన ఉంటుంది. బాధలో, ఆవేదనలో హృదయాలు బరువెక్కి ఉంటాయి.

ఇవన్నీ చాలా సున్నితమైన, భావోద్వేగాలతో నిండిన సందర్భాలు. ఈ సమయాల్లో ఎలాంటి మనో వికారాలకూ తావుండదు. ఆలోచనలు చాలా నిర్మలంగా ఉంటాయి. అయినప్పటికీ ఇలాంటి సామూహిక సందర్భాల్లో కూడా స్త్రీ పురుషులు ఎక్కువగా కలిసి మెలిసి మసలుకోవడాన్ని ధర్మవేత్తలు అంతగా ఇష్టపడలేదు. అయినా సందర్భ పవిత్రత, సంకల్పశుద్ధి, స్త్రీల భావోద్రేకాలను గౌరవిస్తూ వారిని ఇంట్లోంచి బయటికి వెళ్లడానికి అనుమతినిచ్చారు. కొన్ని సందర్భాల్లో స్త్రీలను స్వయంగా వెంట తీసుకెళ్లారు కూడా. అయితే పరదా సూత్రాలను మాత్రం ఏమాత్రం సడలనీయలేదు. ఒక్క హజ్ తప్ప మిగతా అన్ని సందర్భాల్లో స్త్రీలు పాల్గొనకపోవడమే మంచిదన్న విషయాన్ని తెలియజేశారు.

ఇంతటి పవిత్రమైన, పరిశుద్ధమైన ఆలోచనలు కలిగిన ధర్మం, స్కూళ్లు, కాలేజీలు, కార్యాలయాలు, కర్మాగారాలు, క్లబ్బులు, పార్కులు సినిమాహాళ్లు, నృత్యశాలలు తదితర ప్రదేశాల్లో స్త్రీ, పురుషుల కలివిడి సంస్కృతిని ప్రోత్సహిస్తుందని ఎవరైనా అనుకుంటే అది అమాయకత్వమే అవుతుంది.

## యుద్ధరంగం - మహిళలు

ఇప్పటివరకు పరదాకు సంబంధించిన కఠినమైన ఆదేశాలను గురించి చదివారు. ఇప్పుడు, అందులో ఏ పరిస్థితుల్లో, ఏ మేరకు వెసులుబాటు ఉందో అది కూడా చూడండి.

ముస్లింలు యుద్ధంలో నిమగ్నమైనప్పుడు, కష్టాల్లో చిక్కుకున్నప్పుడు, జాతి మొత్తం సామూహికంగా రక్షణ చర్యల్లో పాల్గొనకతప్పని పరిస్థితులు ఏర్పడినప్పుడు, ఇస్లాం యుద్ధ రంగంలో సేవలందించమని మహిళలకు అనుమతినిస్తుంది.

నిజానికి స్త్రీ మూర్తిని సృష్టించింది, మాతృప్రేమను పంచడానికే గాని తలలు నరకడానికి, రక్తపాతం సృష్టించడానికి కాదు. ఆమె చేతికి కరవాలమివ్వడమంటే, స్త్రీ సహజ నైజానికి వ్యతిరేకంగా ప్రవర్తించడమన్నమాట. అందుకే మహిళలు స్వీయ

రక్షణ కోసం అవసరమైతే ఆయుధం ఉపయోగించవచ్చున్న అనుమతి ఇచ్చినప్పటికీ, సాధారణ పరిస్థితుల్లో స్త్రీలను సైన్యంలోకి తీసుకోవడం, యుద్ధరంగంలో వినియోగించుకోవడం మాత్రం సరైన విధానం కాదు. ఇది ఇస్లాం సిద్ధాంతాలకు వ్యతిరేకం. యుద్ధరంగంలో సైనికులకు వైద్య సహాయం చేయడం, మంచినీరు అందించడం, శిబిరాల రక్షణ చర్యలు, తదితర పనులు మాత్రమే వారితో చేయించాలని చెప్పింది. ఇలాంటి పరిస్థితుల్లో పరదా ఆంక్షలు సాధ్యమైనంత మేర సడలించబడ్డాయి. యుద్ధరంగంలో సేవలందిస్తున్నప్పుడు కాస్త అటూ ఇటుగా ఈనాడు క్రైస్తవ సన్యాసినిలు ధరించే లాంటి వస్త్రధారణ చేయడంలో తప్పులేదు.

ప్రవక్త సతీమణులతోసహా, ఇతర మహిళలు కూడా దైవప్రవక్త (స) వెంట యుద్ధరంగానికి వెళ్లేవారని, సైనికులకు మంచినీరు, వైద్య సహాయం అందించేవారని అన్ని ప్రామాణిక హదీసుల ద్వారా రూఢీ అవుతోంది. పరదా ఆజ్ఞలు అవతరించిన తరువాత కూడా ఈ విధానం కొనసాగింది. (బుఖారి)

ఉమ్మె సలీంతో పాటు, కొంతమంది అన్సార్ స్త్రీలు దైవప్రవక్త (స) వెంట అనేక యుద్ధాల్లో పాల్గొన్నట్లు తిర్మిజీ గ్రంథంలో ఉంది.

బుఖారీ షరీఫ్‌లో ఇలా ఉంది. : 'ఒక మహిళ ప్రవక్త వారి సన్నిధిలో హాజరై, దైవ ప్రవక్తా! సముద్ర యుద్ధంలో పాల్గొనే వారితోపాటు నేను కూడా వెళ్లాలనుకుంటున్నాను. నాకోసం దుఆ చేయండి! అని అభ్యర్థించింది. అప్పుడు ప్రవక్త మహనీయులు 'అల్లాహుమ్మ అజ్ అల్‌హా మిన్ హుమ్' అని సెలవిచ్చారు.

ఉహుద్ యుద్ధ సమయంలో సైనికులు సొమ్మసిల్లినప్పుడు, హజ్రత్ ఆయిషా (ర.అన్‌హా), ఉమ్మె సలీం (ర.అన్‌హా)లు తమ భుజాలపై నీళ్ల బిందెలు మోస్తూ యుద్ధవీరుల దాహం తీర్చేవారు. హజ్రత్ అనస్ (రజి) ఇలా అంటున్నారు : భుజాన బిందెలతో వడివడిగా నడవడానికి వీలుగా వస్త్రాన్ని పైకి దోపిన కారణంగా వారి కాళ్ల పిక్కల కింది భాగం బయటికి కనిపించేది. (బుఖారి)

ఉమ్మె సులైబ్ (ర.అన్‌హా) అనే మరో మహిళను గురించి స్వయంగా దైవప్రవక్త (స)ఇలా అన్నారని హజ్రత్ ఉమర్ (రజి) చెబుతున్నారు. 'ఉహద్ యుద్ధంలో కుడివైపు, ఎడమవైపు ఎటు చూసినా ప్రాణాలను సైతం లెక్క చేయకుండా నా రక్షణ కోసం ఉమ్మె సుబైత్ కనిపించేది.

ఇదే యుద్ధంలో రుబీ బిన్తె ముఅవ్విజ్‌తో పాటు ఒక స్త్రీల బృందం క్షతగాత్రుల

సేవలో నిమగ్నమై ఉండేది. ఈ మహిళలే గాయపడ్డవారిని భుజాలపై మోస్తూ మదీనాకు తీసుకెళ్ళేవారు. (బుఖారి)

హునైన్ యుద్ధంలో ఉమ్మె సలీం కరవాలం చేతబట్టి ఉండడాన్ని గమనించిన ప్రవక్త (స) ఇది ఎందుకూ? అని ప్రశ్నించారు. 'ఎవరైనా నన్ను సమీపిస్తే వాడ్ని చీల్చి చెండాడడానికి.' అన్నారామె.

ఉమ్మె అతియ్యా ఏడు యుద్ధాల్లో పాల్గొన్నారు. క్యాంపు సంరక్షణ, సిపాయిలకు భోజన ఏర్పాట్లు చేయడం, క్షతగాత్రులు, వ్యాధిగ్రస్తులను పరామర్శించడం లాంటి బాధ్యతలను ఆమె నిర్వహించేవారు. (ఇబ్నెమాజ)

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఉల్లేఖనంలో ఉంది. 'ఈ విధంగా యుద్ధరంగంలో సేవలందించే స్త్రీలకు యుద్ధ సొత్తులో నుండి బహుమతులు ఇవ్వబడేవి.' (ముస్లిం)

అంటే, ఇస్లామీయ పరదా విధానం ఒక మంచి కార్యం కోసం, మానవ సహజ అవసరాలకనుగుణంగా మార్పు చెందని అజ్ఞాన ఆచారం ఎంతమాత్రం కాదు. అని దీనివల్ల మనకు అర్థమవుతోంది. నిజంగానే అవసరం ఏర్పడితే, మరోమార్గం లేకపోతే పరదా ఆంక్షలు సడలించడంలో ఎలాంటి అభ్యంతరం లేదు. ముఖమూ, చేతులేకాదు, అవసరమైతే సతర్ పరిధిలోకొచ్చే కొన్ని భాగాలు బయల్పడినా అభ్యంతరం లేదు. అయితే అవసరం తీరిపోగానే పరదా యధాతథంగా పాటించవలసి ఉంటుంది. పరదా విధానం ఏ విధంగా మూఢాచారం కాదో, అదేవిధంగా అవసరార్థం కల్పించబడిన వెసులుబాటు కూడా మితిమీరిన స్వేచ్ఛకోసం కాదు. ఈ విషయంలో ముస్లిం మహిళలను, యూరోపియన్ మహిళలకు ఒక మౌలికమైన వ్యత్యాసం ఉంది. యుద్ధ అవసరాల కోసం యూరోపియన్ స్త్రీలు తమ హద్దులనుండి బయటికి వెళితే, ఇక యుద్ధం ముగిసిన తరువాత మళ్లీ తమ పరిధుల్లోకి రావడానికి వారు నిరాకరిస్తారు.

# ముగింపు

ఇదీ అసలు సిసలైన మధ్యేమార్గ విధానం! ఈ నైతిక, భౌతిక, శాంతి సంతృప్తుల ప్రగతి కోసం ప్రపంచం ఆశగా, ఆబగా ఎదురుచూస్తోంది. ముందే విన్నవించు కున్నట్లు, ప్రపంచం వేల సంవత్సరాలుగా సమాజంలో స్త్రీస్థానాన్ని మానవ ప్రపం

చంలో సింహభాగమైన-స్త్రీ స్థానాన్ని నిర్ణయించడంలో ఘోరంగా విఫలమై, ఇంకా ఆటుపోట్లు ఎదుర్కొంటూనే ఉంది. అతివాద, మితవాద గందరగోళాల మధ్య స్త్రీ జాతి తీవ్రమైన నష్టాన్ని చవిచూసింది. అధ్యయనాలు, పరిశీలనలు, అనుభవాలే దీనికి ప్రత్యక్ష సాక్ష్యం. ఈ గందరగోళాల క్రమంలో మానవ అవసరాలకు అనుగుణ మైన, సహజసిద్ధ మధ్యేమార్గాన్ని ఇస్లాం ప్రతిపాదించింది. కాని విచారకరమైన విషయం ఏమిటంటే అనేక అవరోధాలు, ఆటంకాలు పుట్టుకొచ్చాయి. దీని వల్ల ప్రజలకు రుజుమార్గాన్ని అర్థం చేసుకోవడం, దాన్ని గౌరవించడం బహుకష్టమై పోయింది.

ఈ అవరోధాలన్నిటిలో ప్రధానమైనది, నేటి ఆధునిక మానవునికి అంటుకున్న పచ్చకామెర్ల వ్యాధి. పాశ్చాత్య వ్యామోహంలో కూరుకుపోయిన వారికి ఈ వ్యాధి ఇంకా భయంకరంగా ముదిరిపోయింది. నేను వాడుతున్న కఠిన పదజాలంపై సోదరులెవరికైనా బాధ కలిగితే మన్నించండి. కాని యదార్థాన్ని వెల్లడి చేయడంలో ఎలాంటి ఆటంకాలూ ఉండకూడదు కదా. అందుకే ఉన్నది ఉన్నట్లు కుండ బద్దలు కొట్టవలసి వస్తోంది.

వాస్తవం ఏమిటంటే, ఇస్లాంకు సంబంధించిన ఏ ఆజ్ఞ అయినా, ఏ ఆదేశమైనా శాస్త్రీయ నిరూపణలకు భిన్నంగా లేదు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, సమస్త శాస్త్రీయ విజ్ఞానమంతా ఇస్లామే. అయితే దీన్ని చూడాలంటే నిర్మలమైన దృష్టి, నిష్కల్మషమైన హృదయం కావాలి. ఎందుకంటే ప్రతి వస్తువునూ దాని అసలు రంగు, రూపులో చూడాలంటే, వాస్తవాన్ని వాస్తవంగా అంగీకరించాలంటే ఇది అత్యంత అవసరం. ఈ గుణం గనక లేకపోతే ఎంత విద్య ఉన్నా నిరుపయోగమే, అనవసరమే. వక్ర దృష్టితో, సంకుచిత దృష్టితో దేన్ని చూసినా అది వక్రంగానే, సంకుచితంగానే కనిపిస్తుంది. ఒకవేళ నిజ జ్ఞానం తన అసలు రూపంలో లోపలికి ప్రవేశించినా, సంకుచిత మనసు, వక్ర స్వభావం దాన్ని అణిచివేస్తుంది. అది వాస్తవాలను, తనకు అనుకూలంగా మారి పొమ్మని కోరుతుంది. లొంగని పక్షంలో వాస్తవాన్ని వాస్తవంగా అంగీకరిచకుండా నిర్లక్ష్యం వహిస్తూ తన మనోవాంఛల దాస్యంలోనే లీనమైపోతుంది. మానవుడు గనక ఈ రుగ్మతకు లోనైతే ఇక జ్ఞానం, అనుభవం, అధ్యయనం, పరిశోధన ఏదీ అతణ్ని దారికి తీసుకురాలేవు. మార్గం చూపలేవు. ఇలాంటి వ్యాధి సోకినవాడు ఇస్లాంకు సంబంధించిన ఎలాంటి హితోపదేశాన్నీ అర్థం చేసుకోవడం అసంభవం. ఎందుకంటే ఇస్లాం ఒక సహజధర్మం.

ఈ పచ్చకామెర్ల వ్యాధితో బాధపడుతున్న కారణంగానే పాశ్చాత్య ప్రపంచానికి ఇస్లాంను అర్థం చేసుకోవడం చాలా కష్టమై పోయింది. నిజానికి పాశ్చాత్య ప్రపంచం వద్ద ఉన్న విజ్ఞానమంతా 'ఇస్లామే' కాని వారి కళ్లకు మాత్రం రంగు అంటుకుంది. ఈ రంగు భయంకరమైన పచ్చకామెర్ల వ్యాధిగా మారి ఆధునిక పాశ్చాత్య మేధావి వర్గ దృష్టిని కబళించింది. దీని కారణంగా వారికి కూడా వాస్తవ జ్ఞానంతో సరైన ఫలితాలు రాబట్టడానికి, జీవన సమస్యల్ని సహజ దృష్టితో చూడడానికి ఆటంకం ఏర్పడుతోంది. వీరిలో ముస్లింలూ ఉండవచ్చు. ఇస్లాం ధర్మంపై వారికి విశ్వాసం కూడా ఉండవచ్చు. ఇస్లామ్ స్వచ్ఛమైన, సత్యధర్మమని కూడా వారు నమ్మవచ్చు. కొంతమేర విధేయత కూడా చూపవచ్చు. కాని పాపం ఈ అమాయక చక్రవర్తుల కళ్లకు సోకిన కామెర్ల వ్యాధి కారణంగా వారు చూసేదంతా అల్లాహ్ రంగుకు భిన్నంగా కనిపిస్తుంది.

వాస్తవాలను అర్థం చేసుకోవడంలో అవరోధంగా ఉన్న మరో కారణం ఏమిటంటే, సాధారణంగా, ప్రజలు ఇస్లాంకు సంబంధించిన ఏదైనా సమస్యను గురించి ఆలోచిస్తున్నప్పుడు స్థూలంగా మొత్తం వ్యవస్థపై దృష్టి సారించరు. దీంతో ఆ సమస్య వ్యవస్థ నుండి వేరైపోతుంది. వ్యవస్థనుండి వేరు చేసి ఎంచుకున్న సమస్యను చర్చకు పెట్టడం వల్ల ఆ సమస్య వివేక రహితంగా కనిపిస్తుంది. రకరకాల అనుమానాలు రేకెత్తించడం జరుగుతుంది. 'వడ్డీ' వ్యవహారంలో ఇదే జరిగింది. వడ్డీని ఇస్లామీయ సామాజిక సూత్రాలనుండి ఆర్థిక వ్యవస్థ నుండి వేరు చేసి చూడడం వల్ల అనేక లోపాలు అందులో కనిపించాయి. గొప్ప గొప్ప పండితులకు సైతం షరీయత్ లక్ష్యాలకు భిన్నంగా అందులో సంస్కరణలు అవసరమన్న భావన కలిగింది. బానిసత్వం, బహుభార్యత్వం, దాంపత్య హక్కులు ఇంకా ఇలాంటి అనేక విషయాల్లో ఈ మౌలిక తప్పిదం పునరావృతం అయింది. పరదా సమస్య కూడా దీనికి మినహాయింపు కాదు. మీరు ఏదైనా ఒక నిర్మాణాన్ని పూర్తిగా కాకుండా, ఒక భాగాన్ని, లేక స్థంభాన్ని చూస్తే ఏమనిపిస్తుంది? అనవసరంగా దీన్ని ఇక్కడ ఎందుకు పెట్టారా అని ఆశ్చర్యం కలుగుతుంది. దాని ఏర్పాటులో మీకు ఎలాంటి ఔచిత్యం కనిపించదు. ఇంజనీరు నిర్మాణంలో సమతుల్యత కోసం, తద్వారా పటిష్టంగా ఉండడం కోసం దాన్ని ఏర్పాటు చేశారేమోనన్న ఆలోచనేరాదు. దాన్ని కూల్చివేస్తే పూర్తి నిర్మాణమే నేలమట్టమై పోతుందన్న విషయమే బుర్రకు తట్టదు. ఖచ్చితంగా ఇదే సూత్రం పరదాకూ వర్తిస్తుంది. సామాజిక వ్యవస్థ సమతుల్యతకు, దాని పటిష్టతకు నిర్మాణంలో

ఒక భాగంగా ఏర్పాటు చేసిన పరదాను ఆ వ్యవస్థ నుండి వేరుచేసి చూస్తే దానితో అనుసంధానమై ఉన్న ఔచిత్యం మనకు కనబడకుండాపోతుంది. మానవ సమాజంలో స్త్రీ పురుషుల మధ్య ఈ వ్యత్యాసం, ఈ హద్దులు ఎందుకు ఏర్పరచడం జరిగిందో అర్థమేకాదు. పిల్లర్‌ల ఏర్పాటును సరిగా అర్థం చేసుకోవాలంటే, మొత్తం నిర్మాణాన్ని నిశితంగా చూడడం తప్పనిసరి.

ఇస్లాంలో పరదాకు సంబంధించిన వాస్తవాలు ఇప్పుడు మీముందున్నాయి. సామాజిక వ్యవస్థ పరిరక్షణ కోసం ఏర్పాటు చేసిన పరదా నియమాలూ మీరు చూస్తున్నారు. దీనితో సంబంధం కలిగి ఉన్న అన్ని విభాగాల పరిరక్షణ, సమతుల్యతను దృష్టిలో ఉంచుకొని, పరదాను ఏర్పాటు చేయడం జరిగింది అవన్నీ మీ ముందున్నాయి. ఈ మొత్తం సామాజిక వ్యవస్థ ఏ నిరూపిత సాక్ష్యాధారాలు, వాస్తవాలపై నిలబడి ఉందో అవి కూడా మీ దృష్టికి దూరంగా లేవు. ఇవన్నీ కళ్లారా చూస్తున్న మీరు ఇందులో లోపం ఎక్కడుందో, దోషం ఎక్కడుందో నిజాయితీగా చెప్పండి. ఎక్కడైనా రవ్వంతైనా అన్యాయం ఇందులో కనిపిస్తోందా మీకు? ఏ విషయంలో అయినా సరే, బుద్ధిజ్ఞానాల ఆధారంగానైనా సంస్కరణల గురించి మాట్లాడే అవకాశం ఉందా? ఎంతమాత్రం లేదు. భూమ్యాకాశాలు ఏ న్యాయం పునాదులపై నిలబడి ఉన్నాయో, సృష్టి వ్యవస్థలో ఎలాంటి క్రమశిక్షణ ఉందో, సూర్యచంద్రాదుల భ్రమణంలో అణువంతైనా గందరగోళం లేకుండా ఎంతటి సమతుల్యతను మీరు చూస్తున్నారో, ఖచ్చితంగా అదే విధానం, అదే న్యాయం, అదే సమతుల్యత ఈ సామాజిక వ్యవస్థలో కూడా ఉందని నేను ఘంటాపథంగా చెప్పగలను. అతివాద మితవాదాలైనా, గందరగోళమైనా, ఏక పక్ష విధానాలైనా మానవులు చేజేతులా చేసుకుంటున్నదే తప్పు, దానికి ఈ వ్యవస్థతో సంబంధమేలేదు. ఇందులో సంస్కరణలు ప్రతిపాదించడం మానవ శక్తికి మించిన పని. మానవులు అతి తెలివివల్లనో, అల్ప బుద్ధితోనో ఒకవేళ ఇందులో మార్పులు చేర్పులకు ప్రయత్నించి సంస్కరణలు చేయదలిస్తే, అందులోని న్యాయబద్ధతను, సమతుల్యతను దెబ్బతీయడం తప్ప మరేమీ చేయలేరు.

విచారకరమైన విషయం ఏమిటంటే, యూరప్, అమెరికా, రష్యా, జపాన్ తదితర దేశాల్లో ఉంటున్న మానవ సోదరులకు నా గొంతును వినిపించలేకపోతున్నందుకు నేనెంతో విచారిస్తున్నాను. నిజానికి వారు ఒక సరైన, న్యాయబద్ధమైన సామాజిక వ్యవస్థను గురించి తెలియకపోవడం వల్ల తమ జీవితాలను నాశనం చేసుకుంటున్నారు. అంతేకాదు, ప్రపంచ వ్యాప్తంగా ఇతర జాతుల వినాశనానికీ కారణమవు

తున్నారు. వారి జీవితాలను సన్మార్గపథం వైపు మళ్లించే దిక్సూచిని, వారి హృదయాలను పవిత్రం పరిశుద్ధం చేసే జీవజలాన్ని నేను వారికి అందించగలిగితే ఎంత బాగుండును! అయితే నా దేశంలోని హిందూ, సిక్కు, క్రైస్తవ, పారశీలు మాత్రం నా భాషను, భావాన్ని అర్థం చేసుకోగలుగుతున్నారు. చారిత్రక రాజకీయపరమైన కారణాల వల్ల వారి మనసుల్లో ఇస్లాం పట్ల, ముస్లింల పట్ల తలెత్తిన అపోహలను దూరం చేయడానికి నేను వారిని ఆహ్వానిస్తున్నాను. తద్వారా వారి హృదయాలు సంస్కరించబడి కేవలం న్యాయప్రేమికులుగా, యదార్థాన్ని యదార్థంగా అంగీకరించే వారుగా ఇస్లామ్‌లోని సామాజిక వ్యవస్థను దర్శించమని కోరుతున్నాను. ఈ గ్రంథంలో ఎలాంటి హెచ్చుతగ్గులు లేకుండా ఉన్నదున్నట్లు చర్చిబడిన ఇస్లామీయ సామాజిక వ్యవస్థతో పాశ్చాత్య సామాజిక వ్యవస్థను పోల్చి చూడమని అభ్యర్థిస్తున్నాను. ఇక చివరిగా, నాకోసమో, మరెవరికోసమో కాకుండా, స్వయంగా మీ మంచి కోసం, మీ మేలు కోసం, మీ ప్రయోజనం కోసం నిజమైన సాఫల్యం ఎందులో ఉందో నిర్ణయించుకోవలసిందిగా సవినయంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

ఇకపోతే ఈ సందర్భంగా మార్గవిహీనులైన నా ముస్లిం సోదరులకు కూడా కొన్ని విషయాలు చెప్పదలచుకున్నాను.

కొంతమంది అభ్యుదయ ముస్లిం మేధావి సోదరులు ఈ విషయాలన్నిటినీ అంగీకరిస్తారు. వారు చెప్పేదేమిటంటే, ఇస్లామీయ చట్టాల్లో మారుతున్న కాలానికనుగుణంగా మార్పులు చేర్పులు చేసుకునే వెసులుబాటు ఉందన్న విషయాన్ని బహుశా మీరు కూడా వ్యతిరేకించకపోవచ్చు. కనుక ఈ వెసులు బాటును సద్వినియోగం చేసుకొని ప్రయోజనం పొందాలన్నదే మా కోరిక. ప్రస్తుత కాలపరిస్థితులు పరదా విషయంలో సంస్కరణలు కోరుతున్నాయన్నది వాస్తవం. అందుకని ముస్లిం స్త్రీలు పాఠశాలలు, కళాశాలలకు వెళ్లి ఉన్నత విద్యను అభ్యసించాలి. దేశప్రగతి కోసం, సామాజిక, ఆర్థిక, రాజకీయ సమస్యలను అర్థం చేసుకొని, వాటిని పరిష్కరించే స్థాయికి ఎదగాలి. దేశ ప్రగతిలో పాలుపంచుకోగలగాలి. ఇలా కానట్లయితే ముస్లింలు జీవన పోరాటంలో మిగతా జాతుల కంటే వెనుకబడిపోవాల్సి రావచ్చు. దేశరాజకీయ రంగంలో స్త్రీలకు ఇవ్వబడుతున్న హక్కులను వినియోగించుకుంటూ, వాటి ద్వారా ప్రయోజనం పొందే శక్తి సామర్థ్యాలు ముస్లిం స్త్రీలలో జనించకపోతే, పరదా ఆంక్షల కారణంగా ప్రయోజనం పొందలేక పోయినట్లయితే, దేశ రాజకీయ చిత్రపటంలో ముస్లింల పాత్ర కనుమరుగైపోతుంది. ఇస్లాం దేశాల్లో ప్రగతి సాధించిన జాతులు

అంటే టర్కీ, ఇరాన్‌లు కూడా కాలమాన పరిస్థితులను చూసి ఇస్లామీయ పరదాను సంక్షిప్తం చేసివేశాయి. సంక్షిప్తం అన్న పదం కేవలం వాదనకోసమే ఉపయోగించబడింది. నిజానికి అక్కడ మొత్తానికే తిరస్కరించడం జరిగింది. దీనివల్ల కేవలం కొన్ని సందర్భాల్లోనే చెప్పుకోదగిన లాభాలు సమకూరాయి. మనం కూడా వారి అడుగుజాడల్లో నడుచుకున్నట్లయితే వచ్చే నష్టమేమిటి?' ఇదీ కొంతమంది అభ్యుదయవాద ముస్లిం సోదరుల వాదన.

ఈ విషయాలన్నింటినీ మేము యధాతథంగా అంగీకరిస్తున్నాం. అంతేకాదు వీటికి ఇంకా పదిరెట్లు అదనంగా కలుపుకున్నా మాకు అభ్యంతరం లేదు. అయితే ఇందులో ఏ ఒక్క విషయం ఆధారంగానూ ఇస్లామీయ చట్టాల్లో మార్పులు చేర్పులు ధర్మసమ్మతం కాదు. ఇప్పటిదాకా ఏకరువు పెట్టిన వాటిలో ఏ ఒక్కదానికీ ఇస్లామీయ పరదా వ్యవస్థ ఆటంకం, అవరోధం కానే కాదు. నిజానికి ఇలాంటి ప్రమాదాలన్నిటికీ కారణం స్వయంకృతాపరాధమే. ఉదాహరణకు మీరు తెలిసీ కావాలని, అహంకారంతోనో లేక బలహీన స్థితిలో గత్యంతరం లేకనో ఒక అనారోగ్యకరమైన, కలుషిత వాతావరణంలో ఉంటున్నారు. అక్కడ ఆరోగ్య పరిరక్షణ సూత్రాలను ఆచరించడం మీకు ఇబ్బంది కరంగా మారింది. పైగా కలుషిత వాతావరణంలో, అలాంటి ప్రజల మధ్య దుర్గంధాన్ని ఆహ్వానించకుండా జీవించడమే కష్టతరమవుతోంది. ఇలాంటి పరిస్థితిలో ఆరోగ్య పరిరక్షణ చట్టాల్లో మార్పులు చేయడమనే సమస్యే తలెత్తదు. ఎందుకంటే లోపం ఉన్నది చట్టాల్లో కాదు, దాన్ని సద్వినియోగం చేసుకోలేకపోతున్న మీలో.

ఒకవేళ మీరు ఆ చట్టాలు గనక సరైనవని నమ్ముతున్నట్లయితే, మీరు ఉంటున్నటువంటి వాతావరణాన్ని ఎదిరించి, దాన్ని పవిత్రం పరిశుద్ధం చేయడం మీ విధి. ఎదుర్కొనే సాహసం గనక లేకపోతే, మీ బలహీనత కారణంగా మీరు ఆ వాతావరణంతో రాజీ పడిపోతే, రాజీపడి, ఆ కాలుష్యంలో మీరూ మునిగితేలండి. అంతేకాని మీకోసం, మనో వాంఛలకోసం ఆరోగ్య చట్టాల్లో మార్పులు తీసుకురావడం మాత్రం కుదరదు. అయితే మీరు గనక ఒకవేళ ఈ చట్టాలు మంచివి కావని అనుకుంటున్నట్లయితే, వాటి కాలుష్యంతో మీ స్వభావం మమేకమైపోతే మీరు మీకు నచ్చిన విధంగా చట్టాలు రూపొందించుకోండి. పవిత్రమైన, పరిశుద్ధమైన,

ఆరోగ్యకరమైన చట్టాల్లో మాత్రం దుర్గంధాన్ని, అపవిత్రతను ఇష్టపడేవారి కోరికలకు అనుగుణంగా మార్పులు చేర్పులు చేయడం ఎంతమాత్రం కుదరదు.

అయితే, అన్ని చట్టాలకు లాగానే ఇస్లామీయ చట్టాల్లో కూడా పరిస్థితుల కనుగుణంగా సంస్కరణలు చేసుకోడానికి అవకాశం ఉందనడంలో సందేహం లేదు. కాని అన్ని చట్టాలకు లాగానే ఇందులో కూడా, సంస్కరణల నిర్ణయిం తీసుకోడానికి గల కారణాలను ఇస్లామీయ దృష్టి కోణంతో, ఇస్లామీయ స్ఫూర్తితో చూడవలసిన అవసరం ఉంది. ఏదో భిన్న దృష్టితో పరిస్థితులను చూడడం, సంస్కరణల కరవాలం తీసుకొని రక్షణ చట్టాలపై దాడి చేస్తామనడం 'సంస్కరణ' అన్న అర్థానికే వ్యతిరేకం. ఇది నేరుగా మెల్లను సరిచేయాలనుకొని చూపును హరించడం లాంటిదే. ఎలాంటి పరిస్థితులను ఇస్లామేతర దృష్టికోణంతో చూసి, ఇస్లాం చట్టాల్లో మార్పులు కోరడం జరుగుతుందో, వాటిని ఇస్లామీయ దృష్టితో చూసినట్లయితే, ఇలాంటి పరిస్థితిలో మార్పులు కాదు గదా, వాటిని మరింత పటిష్టంగా అమలు చేయాలన్న అవసరాన్ని తప్పకుండా గుర్తించవలసి ఉంటుంది.

ఇస్లామీయ సామాజిక చట్టాల అసలు ఉద్దేశ్యం, దాంపత్య సంబంధ విధానాల పరిరక్షణ, లైంగిక విశృంఖలత్వాన్ని అరికట్టడం, అశ్లీల ఉద్యమాలను రూపుమాపడం అని మేము లోపలి పేరాల్లో ఇంతకుముందే తెలియజేశాము. ఈ ఉద్దేశ్య పరిపూర్తికి ధర్మవేత్తలు, మూడు విధానాలను అవలంబించారు. ఒకటి నైతిక సంస్కరణ, రెండు శిక్షాస్మృతి,, మూడు వస్త్రధారణ. ఈ మూడు స్తంభాల ఆధారంతోనే ఈ నిర్మాణం నిలబడి ఉంది. ఇవి పటిష్టంగా ఉంటేనే ఈ నిర్మాణం పటిష్టంగా ఉంటుంది. ఇవి బలహీనపడితే కట్టడం కూలిపోతుంది. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొని మన దేశంలోని ప్రస్తుత స్థితిగతులపై ఒకసారి దృష్టిసారిద్దాం. ఈ మూడు స్తంభాల పరిస్థితి ఎలా ఉందో పరిశీలిద్దాం.

మొట్టమొదట మనం నైతిక స్థితిగతులను తీసుకుందాం. మనం ఈ దేశంలో ఉంటున్నాం. మనం ఈ దేశ మూలవాసులం. ఇక్కడి అత్యధిక శాతం జనాభా కేవలం మన తప్పిదాల మూలంగానే ఈనాటి వరకు ఇస్లాంకు దూరంగా ఉన్నారు. ఈ దేశం ఇస్లామేతర పాలకుల చేతుల్లో ఉంది. ఇక్కడ ఒక ముస్లిమేతర సంస్కృతి పెనుతుఫానులా విజృంభిస్తూ పోతోంది. అనేక అనాగరిక, అమానవీయ దురాచా

రాలు వాతావరణంలో కమ్ముకున్నాయి. ఇవన్నీ నలువైపులనుండీ మనల్ని చుట్టు ముట్టాయి. అసభ్యం, అశ్లీలమనే ఊహలకే కొన్నేళ్ల క్రితం ఒళ్లుజలదరించేది. భయంతో రోమాలు నిక్కబొడుచుకునేవి. కాని ఈనాడు అశ్లీలత చాలా సాధారణమై పోయింది. దైనందిన వ్యవహారాల్లో ఒక భాగమైపోయింది. మనమే కాదు మన పిల్లలు కూడా టీవీల్లో, వార్తా పత్రికల్లో అశ్లీల అసభ్య దృశ్యాలు చూస్తున్న పరిస్థితి. వృద్ధులు, మహిళలు, యువకులు అందరూ సినిమాపై వీక్షణకు అలవాటు పడిపోయారు. అశ్లీలం, అసభ్యత, విశృంఖల ప్రేమ, హింసను ప్రోత్సహించే సీరియల్స్‌కు కొదవలేకుండా పోయింది. తండ్రీ కొడుకులు, అన్నదమ్ములు, తల్లీకూతుళ్లు అందరూ కలిసి కూర్చొని అసభ్య, అశ్లీల, పరమ చండాల దృశ్యాలను ఎలాంటి జంకూగొంకూ లేకుండా నిస్సిగ్గుగా చూస్తున్నారు. ద్వందార్థంతో కూడిన బూతు పాటలు గృహాల్లో, దుకాణాల్లో, వాహనాల్లో మార్మోగిపోతున్నాయి. పాశ్చాత్య వ్యామోహంలో పడిన ఉన్నత వర్గాలకు చెందిన స్త్రీలు కురచ దుస్తులు ధరించి ఒళ్లంతా చూపిస్తూ బహిరంగంగా సంచరిస్తున్నారు. అయినా దానికందరూ అలవాటు పడ్డట్లే కనిపిస్తోంది. ఎలాంటి బెరుకూ, సిగ్గు వ్యక్తం కావడం లేదు. పాశ్చాత్య విద్యావిధానంతో ప్రబలుతున్నటువంటి అనైతిక భావన, నికాహ్‌ను ఒక అనవసర ఆచారంగా, వ్యభిచారాన్ని ఒక కాలక్షేపంగా, స్త్రీ పురుషుల కలివిడి సంస్కృతిని శుభపరిణామంగా, విడాకులు ఒక క్రీడగా, దాంపత్య బాధ్యతలను భరించరాని బంధనంగా, భర్త విధేయతను ఒకరికి బానిసత్వం చేసినట్లుగా, భార్యగా ఉండడమంటే కష్టాల్లో కూరుకుపోయినట్లుగా, ప్రియురాలిగా ఉండడమంటే స్వర్గలోకాల్లో విహరిస్తున్నట్లుగా తయారు చేసింది.

ఇలాంటి వాతావరణ ప్రభావం సమాజంపై, జాతిపై ఏవిధంగా పడుతుందో గమనించండి. ఈ సమాజంలో పరస్త్రీని చూడకుండా చూపుల్ని పక్కకు తిప్పుకునే భావన ఎక్కడైనా ఉందా? లక్షల్లో ఒక్కడైనా ఇలాంటి వాడు కనిపిస్తున్నాడా? పరస్త్రీ అందాల్ని ఆస్వాదించకుండా చూపును మరల్చుకునే వ్యక్తుల్ని ఎంతమందిని చూపించ గలరు? నోరు, కళ్ల వ్యభిచారం బహిరంగంగా జరగడం లేదా? మీ స్త్రీలు అజ్ఞానంతో పాశ్చాత్య వ్యామోహంలో కొట్టుకుపోవడం లేదా? మితిమీరిన అలంకరణలు చేసుకో వడం లేదా? దైవ ప్రవక్త (స) ప్రవచనాలకు విరుద్ధమైన వస్త్రధారణను మీ మహిళలు

అవలంబించడం లేదా? భర్త ముందు తప్ప మరెవరి ముందూ చేయ నటువంటి వస్త్రధారణను మీ స్త్రీలు అన్నదమ్ములు, తండ్రీ ముందు చేయడంలేదా? మీ సమాజంలో అశ్లీల కథలు, సంఘటనలు వినడం, చెప్పుకోవడం జరగడం లేదా? మీ సమావేశాల్లో ప్రజలు తమ చీకటి కార్యకలాపాలను గురించి చెప్పడానికి ఏమైనా సిగ్గుపడుతున్నారా? లేదే..ఇలాంటి పరిస్థితుల్లో పవిత్రత, పరిశుద్ధత, నైతికతల పటిష్ట స్తంభం ఇంకెక్కడ ఉన్నట్లు? ఇస్లామీయ సమాజ చట్టాల రాజప్రాసాదం దేని ఆధారంపై నిలబడి ఉందో, అదే లేకపోతే, ఇక నిర్మాణం ఎలా ఉంటుంది? ఇస్లామీయ అభిమానం, ఆత్మగౌరవం ఏ స్థాయిలో మంటగలసి పోతోందంటే, ముస్లిం స్త్రీలు ముస్లింలకు కాకుండా, కాఫిర్‌ల అధర్మ కార్యకలాపాలకు ఉపయోగపడుతున్నారు. ఆంగ్లేయ దేశాల్లో కాదు, ముస్లిం దేశాల్లో సైతం ఈ విధమైనటువంటి సంఘటనలు వెలుగు చూశాయి.

ఇలాంటి సంఘటనలు చూసినప్పుడు గాని, విన్నప్పుడు గాని ముస్లింల భావోద్రేకాల్లో ఎలాంటి మార్పు రావడం లేదు. వారి నరాల్లో రక్తం మరగడంలేదు. ఈ విధంగా అభిమానాన్ని, ఆత్మగౌరవాన్ని తాకట్టు పెడుతున్న ముస్లింలు కూడా ఉన్నారు. ఎంత దౌర్భాగ్యం!

ఇక, రెండవ విషయానికి వద్దాం. భారత దేశం మొత్తంలో ఇస్లామీయ శిక్షా స్మృతి, చట్టాలు నామరూపాల్లేకుండా పొయ్యాయి. వ్యభిచార శిక్ష ముస్లిం దేశాల్లోనూ, బ్రిటిష్, ఇండియాలోనూ అమలు కాదు. అంతేకాదు దేశంలో ఇప్పుడు అమలవు తున్నచట్టాలు వ్యభిచారాన్ని అసలు నేరంగానే పరిగణించవు. ఆత్మాభిమానమున్న ఆడ పిల్లలను ఏ తుంటరి వెధవైనా వేధిస్తే, వాడి బారి నుండి మీ కోడళ్లు, మీ కూతుళ్ల గౌరవాన్ని కాపాడుకునే మార్గం కూడా ఏదీలేదు.

ఒక మైనర్ యువతితో ఎవరైనా ఆమె అంగీకారంతో అక్రమ సంబంధం ఏర్పరచుకుంటే మీరు మీ చట్టం ద్వారా అతణ్ని ఏవిధంగానూ శిక్షించలేరు. అలాగే ఒక స్త్రీ బహిరంగంగా అశ్లీల కార్యకలాపాలకు పాల్పడితే, ఆమెను ఆ దుశ్చర్యనుండి ఆపడానికీ మీ వద్ద ఎలాంటి ఆయుధమూ లేదు. అంగీకారం లేని నిర్బంధ అత్యాచారం మాత్రమే చట్టం దృష్టిలో నేరం. కాని న్యాయవాద వృత్తిలో ఉన్న ఎవరి నైనా అడగండి మీరు. అత్యాచారాన్ని నిరూపించడం ఎంత కష్టమో. అలాగే వివాహిత

స్త్రీని తీసుకొని వెళ్లి పోవడం కూడా నేరమే. కాని ఈ చట్టాలను గురించి తెలిసిన వాళ్లను అడిగి చూడండి. ఒకవేళ వివాహిత తన ఇష్టంతో ఎవరితోనైనా లేచిపోయిన పక్షంలో మీ చట్టాలు ఏం చెబుతున్నాయో విచారించండి.

కాస్త ఆలోచించండి! ప్రస్తుతం ఈ రెండు స్తంభాలు కూలిపొయ్యాయి. ఇప్పుడు మీ సామాజిక వ్యవస్థ పూర్తి నిర్మాణం ఒకే ఒక్క స్తంభంపై ఆధారపడి ఉంది. మీరు ఉన్న ఆ ఒక్క ఆధారాన్ని కూడా కూలదోయాలనుకుంటున్నారా? ఒకవైపు పరదాను అలక్ష్యం చేయడం వల్ల ఉత్పన్నమైన నష్టాలున్నాయి. అవన్నీ ఇంతకుముందే తెలుసుకున్నాం. మరోవైపు పరదాను మొత్తానికే రూపుమాపడం వల్ల సంభవించే నైతిక, సామాజిక సంపూర్ణ వినాశనం ఉంది. ఈ రెండింటినీ పోల్చిచూడండి. రెండింటిలోనూ కష్టాలున్నాయి. కాని దేన్నో ఒక దాన్ని స్వీకరించవలసిందే. స్వయంగా మీ మనసునే తీర్పు చెప్పమనండి. ఈ రెండింటిలో కొద్దిపాటి నష్టం కలిగించేదేదో చెప్పమని మీ మనసునే అడగండి.

కనుక, గుడ్డికన్నా, మెల్లనయం అనే నిర్ధారణకు వచ్చినట్లయితే, భారత దేశంలో పరదా సంస్కరణ కాదు, దాన్ని మరింత పటిష్టవంతం చేయాల్సిన అవసరం ఉందనంటాను నేను. ఎందుకంటే, మీ సామాజిక వ్యవస్థకు రక్షణ కవచంగా ఉన్న రెండు మూలస్తంభాలు పడిపొయ్యాయి. ఇప్పుడు పూర్తి నిర్మాణం ఒకే ఒక్క స్తంభంపై ఆధారపడి ఉంది. మీరు సామాజిక, ఆర్థిక, రాజకీయ సమస్యలను పరిష్కరించాల్సి ఉంది. కాబట్టి ప్రశాంత చిత్తంతో ఆలోచించండి. ఇస్లామీ హద్దుల పరిధిలో వాటి పరిష్కార మార్గాలు అనేకం మీకు స్ఫురిస్తాయి. అంతేగాని మిగిలిన ఈ ఒక్క ఆధారం ఇప్పటికే చాలావరకు డ్యామేజ్ అయి ఉంది. దాన్ని ఇంకా బలహీన పరచకండి. ఇందులో ఏదో మార్పు తేవాలనుకునే ముందు మీరు గణనీయ మైన శక్తిని కూడగట్టుకోవాలి. ఒకవేళ ముస్లిం స్త్రీ నిఖాబ్ లేకుండా ఉన్నప్పుడు, ఆమెను గుచ్చి గుచ్చి చూసే కళ్లు రెండుంటే, ఆ కనుగుడ్లు పీకివెయ్యడానికి యాభై చేతులు సిద్ధంగా ఉండాలి. ఏమంటారు?

